# కార్మికుల గురించి నీకేమి తెలియును?

అనువాదం:
పోతుకూచి సాంబశివరావు



పబ్లిషర్సు: అద్దేపల్లి అండ్ కో
సరస్వతీ పవర్ ప్రెస్
రాజమహేంద్రవరము

# KĀRMIKULA GURINCHI NEEKĒMI THELIYUNU ?

(What Do You Know About Labor ?)

by
JAMES MYERS and HARRY W. LAIDLER



Translated by
POTHUKUCHI SAMBASIVA RAO

First Edition - December 1962 - Price 3-00





Publishers: ADDEPALLY & Co.
SARASWATHI POWER PRESS
RAJAHMUNDRY (A. P.) India

# ముन్నుడి.

మన దేశభాషల్లో కార్మికుల గురించిన సారస్వతం చాల తక్కువ. కార్మికుల జీవితం, కార్యకలాపాలు, ఆశయాలు, అరంచేసుకోటానికి ఇట్టి సారస్వతం ఎంతైనా అవసరం......

మైర్స్ లెయిడ్లర్ గ్రంథానికి ఇది అనువాదం... అమెరికన్ కార్మికుల జీవనవిధానాన్ని సమగ్రంగా చిత్రించటానికి ఈ పుస్తకంలో ప్రయత్నం జరిగింది. నేటి ప్రపంచంలో రెండు సిద్ధాంతాలు ఉన్నవి. అవి కమ్యూనిజం, ప్రజాస్వామ్యం. మనదేశం ప్రజాస్వామ్య జీవనమార్గాన్ని ఆమోదించింది. అమెరికాలో ప్రభుత్వమూ, కార్మిక సంఘాలు కూడా ప్రజాస్వామ్య పంథానేఅనుసరిస్తున్నవి కాబట్టి వాటినుంచి మనం నేర్చుకో వలసింది చాల ఉన్నది.

ఇతర దేశాలలో వలెనే అమెరికాలోకూడా కార్మికులు తమ హక్కుల రక్షణకూ సమాజంలో తమ గౌరవ ప్రతిపత్తి కోసం అభివృద్ధి సాధించటానికి ఎన్నో కష్టాలను ఎదుర్కొన వలసి వచ్చింది. తత్ఫలితంగా వారు తమ పరిస్థితులను చాల మెరుగు పరచుకో గలిగారు.

ఈపుస్తకంలో అనేక అంశాలు ప్రత్యేక శ్రద్ధతో పరిశీలించ దగినవి ఉన్నవి. పారిశ్రామిక ప్రగతితోపాటు కార్మికుల ఆర్థిక స్థితిగతులు మెరుగయ్యే కొలదీ కార్మికులలో విద్యావ్యాప్తికే ఇతర సంక్షేమ కార్యకలాపాల అభివృద్ధికి, శీలాన్ని పెంపొందించటానికి కార్మిక సంఘాలు ప్రయత్నిస్తున్నవి. కార్మికుడు కూడా ఆదర్శ పౌరుడుగా రూపొందటం ఈసంఘాల లక్ష్యం.

పరిశ్రమల యాజమాన్యంలో కార్మికులుకూడా పాల్గొంటున్నారు. పారిశ్రామిక ప్రగతిలో కార్మికులు గొప్పభూమిక నిర్వహిస్తున్నారని పారిశ్రామికులు నిర్ద్వంద్వంగా అంగీకరిస్తున్నారు. పరిశ్రమలు కేవలం యజమానులు, కార్మికుల లాభాల ఆర్జనకు మాత్రమే కాదనీ; ప్రజలందరి -పయోజనం కోసమనే సూత్రం అమలు జరుపబడుతున్నది. యాజమాన్యం పజాస్వామికం చేయబడు తున్నది.

అమెరికా కార్మిక సంస్థలు సహాకారోద్యమాన్ని విస్తృత ప్రాతిపదికపై అభివృద్ధి పరచుకోవటం హర్షించదగిన పరిణామం. కమ్యూనిజం, కాపిటలిజాల ఒత్తిడినుంచి బయట పడటానికి అనువైన ప్రజాస్వామిక మార్గమిది. సహకారోద్యమం ప్రజాస్వామ్యానికి ప్రాణప్రదమనే సత్యాన్ని అమెరికా కార్మిక సంఘాలు ఋజువు చేస్తున్నవి.

ప్రజాస్వామ్యంలో సమానత్వం ఒక ముఖ్యాంశం. పౌరులందరూ సమానులు; పౌరులమధ్య సాంఘిక, రాజకీయ వ్యత్యాసాలంటూ ఉండ కూడదు. ఇట్టి సమానత్వాన్ని అమెరికా చిరకాలంగా అంగీకరిస్తున్నది. అక్కడ నీగ్రోలకు తెల్లవారికి మధ్య విచక్షణ ఉన్నా కార్మిక సంఘాలు అట్టి విచక్షణను రూపు మాపటానికి కృతనిశ్చయంతో కృషి చేస్తున్నవి. వారి నిశ్చితార్థం ఈడేరుతున్నది కూడా. ఆవిధంగా అమెరికా కార్మిక సంఘాలు మానవజాతికి గొప్పసేవ చేస్తున్నవి.

ఈపుస్తకంలో మరొక ఆసక్తికర అంశం కార్మికులలో ధార్మిక చింత నశించిపోకుండా చేయటానికి మతబోధకులు వారితో కలిసి పని చేయటం. ఈమత బోధకులు కూడా కార్మికులుగానే ఉంటూ ఇతర కార్మికులతో కలసి మెలసి పనిచేస్తూ నైతిక విలువలను తోటి కార్మికులకు బోధిస్తూ వారికి నిజమైన మార్గదర్శకులవుతారు. ఇది గమనార్హమైన విషయం.

వివిధదేశాల కార్మిక సంఘాలను, కార్మికులపట్ల ప్రభుత్వం, ప్రజల వైఖరులను తెలుసుకోవటం ఎంతైనా అవసరం. ఈపుస్తకంలో వివరించ బడిన ప్రపంచంలోని ఒక ప్రముఖ ప్రజాస్వామ్య దేశపు కార్మిక వర్గపు జీవన విధానం నుంచి పాఠకులు ఎంతో గ్రహించగలరని ఆశిస్తున్నాను.

ఇండియా ప్రభుత్వ ప్లానింగు,
ఎంప్లాయ్‌మెంటు మంత్రి కార్యాలయం
న్యూఢిల్లీ

గుల్జారీలాల్ నందా

---

గమనిక :– ఈపుస్తకం గుజరాతీ అనువాదానికి శ్రీ గుల్జారీలాల్ నందా వ్రాసిన పీఠికలోని ముఖ్యభాగాలివి.

# కార్మికుల గురించి నీ కేమి తెలియును?

# విషయసూచిక

# ముందుమాట

అమెరికను కార్మిక సమాఖ్య, పారిశ్రామికసంస్థల కాంగ్రెసు, ఈ మధ్యనే కలిసిపోయి ప్రపంచంలోకల్లా ఒకేఒక పెద్దకార్మికసమాఖ్యగా ఏర్పడడం అమెరికా కార్మికఉద్యమంలో ప్రత్యేకసంచలనం కలిగించింది. ఈదేశంలో కార్మిక సర్వాధికారమనే భయముందా? లేక పారిశ్రామిక శాంతియందు నిర్మాణాత్మకమైన పరిణామాలకు మనం సహేతుకముగా ఎదురుచూడగలమా? అనే ప్రశ్న ఉదయిస్తోంది.

కార్మికసంఘాలకు సంబంధించినంతవరకు ముఖ్యంగా వాటిచరిత్ర, తత్వం, కార్యక్రమాలగురించి, ఇప్పటిదాకా దొరకగల తాజాసమాచారం సంపాదించడం, నేటికార్మికులకు, యజమానులకు, ప్రభుత్వోద్యోగులకే కాకుండా ప్రజలకుకూడా చాలాఅవసరం. సమ్మెలు జరగడానికి కారణాలు, వాటి నివారణకు వీలైన పరిస్థితులు ఎటువంటివి? కార్మిక సంఘాలు తమ ఒడంబడికలు అమలుజరుపుతున్నాయా? వారి ఆందోళనకు పరిమితిఎంత? దీనికి నివారణోపాయాలు ఏమిటి?

వాగ్దానంచేయబడిన సాలుసరి వేతనం యొక్క మంచిచెడులేవి? టాఫ్టుహార్ట్లేచట్టము కార్మికఉద్యమంపై చూపుప్రభావఫలితాలేమిటి? ఎక్కువ ఉత్పత్తి, నిపుణత సాధించడానికి కార్మికసంఘాలు యజమానులతో ఎంతవరకు సహకరిస్తారు? అమెరికా కార్మికఉద్యమం కమ్యూనిస్టులతో ఏవిధంగా ప్రవర్తించింది? పారిశ్రామికరంగంలో పౌరసంబంధమైనహక్కులు, జాతిసమానత్వం, కార్మికుల విద్యావిధానం, సంక్షేమ నిధులు, ప్రజాస్వామిక యాజమాన్యం మొదలైనవాటిమాట ఏమిటి? ప్రపంచశాంతికి, అంతర్జాతీయ అవగాహనకు, కార్మికులు ఒకసాధనగా శక్తిగా ఉపయోగిస్తారా? కార్మికసంబంధాలలో, ఆర్థికసంబంధాలలో మతంయొక్క స్థానం ఏమిటి?

చాలాసంవత్సరాల పరిశీలనతర్వాత కార్మికనాయకులతో, యజమానులతో ఎక్కువ పరిచయంపొందిది, పారిశ్రామికసంబంధాలలో మొట్టమొదటి పరిశీలన, స్వీయ అనుభూతులద్వారా రచయితలు ఈగ్రంథంలో కార్మికఉద్యమంయొక్క అన్నిదృక్పథాలు - దాని బలాబలాలు సమీక్షించడానికి పూనుకున్నారు. ఈ పుస్తకం ప్రజలకు ఎక్కువగా అర్థమయేపద్ధతిలో ఉపయోగకరంగా ఉంటుందని, అమెరికన్ప్రజాస్వామ్య ఆశయాలకనుగుణంగా ఉండగల్గునని, శాంతియుత నిర్మాణాత్మక పురోగమనానికి వివిధసాధనాలు సూచించగలదని ఆశిస్తున్నాము.

జె. యం.

హెచ్. డబ్లు. ఎల్.



# పరిచయం.

చరిత్రలో మునుపటికంటె నేడు ప్రజాస్వామ్యంలోని కార్మికులు ఎక్కువ స్వేచ్ఛ అనుభవిస్తున్నారు. పురాతనకాలంలో బానిసత్వసంస్థ పేరున యజమానులు కార్మికులను ఆస్తిగాపొందియుండేవారు. ఆబానిస లైన కార్మికులు చేసే ఉత్పత్తి నిర్ణీతకాలమానమునకు సరిపోకపోతే వారిపై ఆ యజమానులు మృత్యుశిక్షకూడా విధించేవారు.

మధ్యయుగంలోని బానిసత్వవిధానంలో సామాన్యకార్మికులు కొంచెం ఎక్కువ స్వేచ్ఛ పొందగల్గినప్పటికీ, భూమిని అంటిపెట్టుకుని బ్రతక వలసివచ్చేది. కార్మికులవేతనం వస్తురూపంలోనే వుండేది. ఉదాహరణ: వడ్లు, ఉన్ని, ఉండటానికి గుడిసె యివ్వబడేవి. కార్మికునకు అన్యాయం జరిగినపుడు యజమాని న్యాయదాతగా తీర్పుయిచ్చే కోర్టుకు కార్మికుడు బద్ధుడైయుండవలసివచ్చుట అన్నిటికంటె అన్యాయంగా ఉండేది. మధ్య యుగంలో సంఘాలుగా ఏర్పడిన నిపుణులైన వ్యవసాయకార్మికులు ఉండే వారు. వారు వారిపనిముట్లు పరపతితో ఎంతో స్వేచ్ఛ, గౌరవం పొందు తూండేవారు. కాని చాలామంది సామాన్యకార్మికులు సేవాబద్ధులై బ్రతికేవారు.

పారిశ్రామికవిప్లవం, యంత్రయుగం ఆవిర్భవించాక సామాన్యకార్మి కులు స్వేచ్ఛవిషయంలో నిశ్చితమైన కొన్నిలాభాలు పొందేరు. వారి వేతనాలు ధనరూపంలో యివ్వబడు తున్నాయి. ప్రజాస్వామ్యంలో తమకు యిష్టమయిన వారిదగ్గర పనిచేసేహక్కు, రాజకీయ, పౌరసమా నత్వాలు, కార్మికులు అనుభవిస్తున్నారు. కాని సంఘటితంకాని పారి శ్రామికసంస్థలలో ప్రజాస్వామ్యంలోని కొన్నిలాభాలు యింకా కార్మి కులు పొందటంలేదు.

ఆధునిక యజమానులు చాలామంది కార్మికులతో న్యాయంగా ఉదా రంగా ప్రవర్తిస్తున్నారు. తమ కార్మికులు సంఘంగా ఏర్పడటం కొంత మంది యజమానులకు బాధాకరంగావుంది. కాని చాలా ఎక్కువ

మందిమాత్రం ప్రజాస్వామ్యసూత్రాలు గుర్తించగల్గుతున్నారు. కార్మిక సంబంధాలరంగమందు ప్రతినిధుల పరిపాలన, సంఘాలల్లో తాము ఎన్నుకున్న ప్రతినిధులద్వారా కార్మికుల అభిప్రాయాలు గౌరవించడం, వారు పనిచేయటానికి అనువైన పరిస్థితులు నిర్ణయించడం మొదలైనహక్కులు కార్మికుల కిచ్చుటకు యజమానులు సుముఖులుగా వున్నారు.

మంచి షరతులతో కూడిన పితృవాత్సల్యము (Paternalism) కూడా ప్రజాస్వామ్య మనిపించుకోదు. ఒకసారి డా॥ ఆల్వా డబ్లు మైలర్ సాంఘికమతరంగములందు ప్రారంభనాయకుడు, ఒకనమూనా మిల్లుగ్రామం చూడటం తటస్థించింది, తాను కార్మికులకు చాలా మంచి వసతి గృహాలిచ్చి, విలాసాలకు, కళాసాలకు, ఉచితంగా సౌకర్యాలు కలగచేసి, పూలతోటలు పెంచుకోడానికి విత్తనాలుయిచ్చి ఎంత ఔదార్యం చూపిస్తున్నది యజమాని తెలియజేశాడు. "కార్మికుల ప్రతీ కాంపౌండులో పెటూనియస్ పువ్వులు అందంగా వికసిస్తున్నాయేమిటి" అని అడిగారు మైలరు. "అ పువ్వులంటే నాకిష్టం. అందువల్ల ప్రతీకార్మికుడు తన దొడ్లో ఆ పువ్వుల వృక్షాలు నాటుతున్నాడు" అన్నాడు యజమాని. అంటే కార్మికుడు యజమాని యిష్టప్రకారమే యింట్లోకూడా నడుచుకుంటున్నాడన్నమాట. అటువంటి పితృవాత్సల్యం ప్రజాస్వామ్యం కానేరదు.

తమ జీవనపరిస్థితులు, పనిచేసే పరిస్థితులు, గురించి కార్మికులు ఏమి చెప్పుదురనే ప్రశ్న ఉదయిస్తుంది. ఈపరిస్థితులు వారి స్వేచ్ఛ, జీవితము, ఆనందము, ప్రభావితం చేస్తాయి. ముఖ్యంగా పనిలోంచి అన్యాయంగా తీసివేయువిషయంలో తగురక్షణ, భద్రత, కలిగించుటవల్లనే వారిజీవితం ఆనందకరంగా స్వేచ్ఛాయుతంగా ఉండగలదు. పనిలోంచి అన్యాయంగా తొలగించుటన్నది వేతనంమీద ఆధారపడేవ్యక్తి జీవితంలో జీవన్మరణసమస్య. ఉద్యోగసంక్రమితరోగములనుంచి, ప్రమాదాలనుంచి తగురక్షణలు, కార్మికునికి లభించాలి. కార్మికుడు రోజూ పనిచేసేకాలము, వేతనాలమొత్తం న్యాయంగా ఉండాలి. కార్మికునిజీతమే అతని కుటుంబంయొక్క నివాసపరిస్థితులు నిర్ణయిస్తుంది. అవి నీతికి మూలమై అన్యాయానికి మూలకందమై తనపిల్లలను పాడుచేయు మురికిపేటలలో నివసించడమా, లేక ఇంతకంటె మెరుగైన వాతావరణంలో బ్రతకడమా అనేది.

ముఖ్యం. అతని పిల్లలకు ఎటువంటిబట్ట, ఎటువంటి విద్య యివ్వగల్గునది అతనివేతనమే నిర్ణయిస్తుంది. కార్మికజాతి వినయవిధేయతలు ప్రజాస్వామ్యంలో ముఖ్యమైతే దానికి ప్రతిఫలంగా తమకుటుంబ క్షేమం గురించిన విషయాలలో కార్మికుల మాటకు విలువయివ్వాలి.

కార్మికుల సంబంధాలవిషయంలో ప్రజాస్వామ్యపద్ధతి ముఖ్యావశ్యకం. ఎందుకంటే పురాతన ఆర్థిక వ్యవస్థలోని వ్యవసాయకార్మికులవలె, నేటి కార్మికులవద్ద పనిముట్లులేవు. అమెరికాదేశంలో పదిమందిలో ఏడ్గురు వ్యవసాయదారులకు స్వంతభూము లున్నాయి. అనేక కర్మాగారాలతో కూడిన పారిశ్రామికవ్యవస్థకు అధిపతులు పరోక్షమూలధన యజమానులు **(absentee Stock holders).** అందువలన కర్మాగారాలలో ఎక్కువగా కనిపించే కార్మికులకు పరిశ్రమలలో ఒక్క తమ ఉద్యోగాలు తప్ప ఏవిధమైన ఆస్తిహక్కులు లేవు.

శాసనాలద్వారా, నైతికప్రబంధాలద్వారా, ఒక సంస్లిష్టమైనపద్ధతివల్ల ప్రజల వ్యక్తిగత ఆస్తిహక్కులు రక్షింపబడుతున్నాయి. కాని వేతనం పద్ధతివల్ల వృత్తిలోని ఆస్తిహక్కులకై కార్మికుడు పొందే శాసనసంబంధములైన వాగ్దానాలు కొద్దిమాత్రమే. కాని రోజుకూలి అయినా, గంట కూలిఅయినా యజమాని యివ్వవలసినబాధ్యత నిర్దుష్టపరచబడింది. ఆ రోజుకుగాని, ఆగంటకుకాని ఏర్పడిన ఒడంబడిక రద్దుకాగానే కార్మికునకు అతనివృత్తిలో యింకేవిధమైన న్యాయానుసారమైన హక్కులు లేవు. జీతం పూర్తిగాయిచ్చేసి కార్మికుని పనినుండి తొలగించవచ్చు. అటువంటి సమయంలో అతనికి కోర్టులద్వారా ఎటువంటి రక్షణలేదు. కార్మికులకు వారికుటుంబాలకు రోజుకూలి, గంటకూలి అంటే ఏమిటో పెట్టుబడిదారులకు, వ్యవసాయదారులకు, మధ్యతరగతులకు సంబంధించి జీతాలమీద ఆధారపడే ఉద్యోగులకు అర్థంకావడంకష్టం. ఆస్తిహక్కుల నిర్మూలనం వల్ల యజమానులకన్న పారిశ్రామికకార్మికులే తమకు భద్రతారాహిత్యము కల్గునని ఎక్కువగా భయపడవలసివుంది. కార్మికుని వుద్యోగములో యింకా ఎక్కువ హక్కులు ఉండాలని అతని జీవనోపాధియొక్క ముఖ్య ఆధారాలకు ఎక్కువ భద్రతఉండాలని విరివిగా సాగింపబడిన సమ్మెలు నైతికంగా ధృవపరిచాయి.

యజమానులతో సరిగా నడుచుకొనుటలో కార్మికజనం సంఘటితపడ వలెనన్నది ప్రాథమికన్యాయం. ఎందుకంటే యజమానులు, తమ కార్పొరేషన్లలో, పారిశ్రామికసంస్థలలో, స్థాపననుంచీ సంఘటితపడిఉన్నారు. కార్మికులు స్వేచ్ఛగా ఎన్నుకొన్న ప్రతినిధులద్వారా, యజమానులు సంప్రదింపులుజరిపి నిర్ణయాలు తీసుకుంటారు. ఉద్యోగంకాని, ఉద్యోగంలో మంచి పరిస్థితులుగాని కోరేకార్మికుడు కార్పొరేషనుయొక్క పెట్టుబడిదారు నొకనిని కలుసుకున్నట్లైతే, ఆకార్మికుణ్ణి ఆకార్పొరేషను మేనేజరువద్దకు ఆయన పంపుతారు. కాని మేనేజరు యజమానుల ప్రతినిధి అవడంచే కార్మికునికోర్కెలకు న్యాయం జరగదు.

యజమానులుచేయు నిర్లక్ష్యపూరితమైన అన్యాయాలకు, ప్రజాస్వామ్యరీతిలోని కార్మికసంబంధాలే రక్షణఅని యజమానులుసైతం ఒప్పుకుంటారు. లాంగ్ ఐలెండు రైలురోడ్డుకు సంబంధించిన అధ్యక్షుడు కీర్తిశేషుడు బాల్డ్విన్ ఒకప్పుడు దయాపూరితమైన పితృవాత్సల్యంలోని లోపాలు గుర్తించి ప్రస్తావిస్తూ "అధికారంకలిగిన ఏ మనిషికూడా దాస్యంచేసేవారిపై నైతికంగా మంచివాడు కాలేడు. తన ఉద్యోగం యొక్క అవసరాలు, భావాలు, కోరికలు, సరిగా పరిశీలించి అర్థంచేసుకుని, అవగాహనచేసుకోగలశక్తి అతనికుండదు" అన్నారు. ఈకారణం వల్ల కార్మికులు సంఘాలుగా ఏర్పడి సంఘటితమగుట ఆయనకు సంతోషదాయక మయ్యింది. దాస్యం, భయం మొదలైనభావాలు లేకుండా సంఘంగా ఏర్పడిన కార్మికులందరూ యజమానిని సమిష్టిగా కలుసుకుని, అతనికి తెలియకుండా తమకుజరిగే అన్యాయంనుంచికూడా యజమానిని సంరక్షించగల్గుతారు.

తమకార్మికుల ప్రతినిధులతో సంప్రదించి ఎక్కువకాలం వ్యయపరిచి, వారి వేతనాలు, పనిచేయుకాలం, జీవనపరిస్థితులుగూర్చి బేరమాడడం నిజంగా యజమానులకాలం, ఓర్పు మొదలైనవాటిపై అధికమైన మరొకబరువు అని భావించవచ్చు. యజమాని తనంతతానే యీ విషయాలు నిర్ణయించుకోవడం చాలా సుఖంగా, త్వరితంగా జరుగుతుంది. కాని యజమానులు చాలామంది కార్మికసంఘాలు గుర్తించటంలేదు. న్యాయప్రవర్తనకలయజమానులు బాల్డ్విన్ పరిశీలనతో ఏకీభవిస్తారు. ప్రజా

స్వామ్యసమానత్వపద్ధతిలో వారు తమ కార్మికులతో సంప్రదించడానికి సంతోషిస్తారు.

ఇతరులు ప్రజాజీవితాలమీద తమకున్న పూర్తి అధికారాలు వదులుకొనుటకు సాధారణంగా యిష్టపడరు. కాని కార్మికులు సంఘటితశక్తిచే బలవంతపెట్టినపుడు అధికారం వదులుకోకతప్పదు.

క్రమక్రమంగా కార్మికసంబంధాలలో ప్రజాస్వామ్యపద్ధతి, పరిశ్రమలో వీలైనంత ఎక్కువనిపుణతకు మూలంకాగలదు. రాజకీయ, పారిశ్రామిక, నిరంకుశత్వపద్ధతికి సాధారణంగా రెండురకాలైన సహజమానసికపరివర్తనాలు స్పష్టంగా కన్పడుతున్నాయి. నిరంకుశత్వం అధీనంలో బ్రతుకువారు తమ నోళ్లుమూసుకుని చెప్పినపనిచేయుటయో లేదా తిరగబడుటయో చేయుదురు. ఈనిరంకుశపద్ధతి కార్మికులలో బానిసత్వంగాని, విప్లవపంథాగాని కలిగిన మనస్తత్వం ప్రబలంచేస్తుంది. ఇందులో ఏదీ కూడా కార్మికుని నిపుణతపెంచదు. దాస్యముచకులోబడిన కార్మికులలో నిర్లక్ష్యం పెరుగుతుంది. ఏదోకాలక్షేపానికన్నట్లు పనిచేస్తారు. ఉత్పత్తిలో అనంతమైన వస్తునిరుపయోగమునకు మూలకారకులౌతారు. విప్లవ మనస్తత్వంకలిగిన కార్మికులు లోలోపల కోపంగా ఉంటారు. పరిశ్రమ నాశానికి పూనుకుని సంస్థతో వేరుపడి ఎదురించడానికి అవకాశంకొరకై వేచిఉంటారు.

యజమానులు దాస్యంలోఉన్న కార్మికులలోని యీరెండు మనస్తత్వాలగురించి ఫిర్యాదుచేయడంకంటె లేదా ఆకార్మికులపై కోపం వహించి తీసివేయుటకంటె ఉత్తమమైనపద్ధతి. వారి మనస్తత్వాల మూలకారణం గుర్తించి ఆకారణాలు తొలగించడమే. పారిశ్రామికపౌరుడుగా కార్మికునకు ఆత్మగౌరవం, క్రొత్తపరపతితోకూడిన హోదా, యజమాని యివ్వగల్గినప్పుడు, కార్మికునిలో దాస్య, విప్లవ మనస్తత్వాలు రెండూ నిర్మూలనమౌతాయి. కార్మికులలో పనిలో ఆసక్తి, నిపుణత పెంపొందుతాయి. ప్రజాస్వామ్యరీత్యా బాధ్యతలు, హక్కులు, అనుభవించగల కార్మికులే అటువంటిశక్తి కలిగిఉంటారు. రాజకీయప్రజాస్వామ్యంలో శాశ్వతత్వమూ, పురోగమనం, సాధించుటకు మనజాతీయజీవితమంతా పూర్తిగా ప్రజాస్వామ్యంకావాలి. మనపారిశ్రామిక ఆర్థికపద్ధతులు, మన రాజకీయసంస్థలు ఈ మూలసూత్రం పాటించాలి. ప్రభుత్వంయొక్క ఒకే

ఒక నైతికస్వరూపం ప్రజాస్వామ్యం వ్యక్తియొక్క అనంతమైన విలువలనే, నైతికమతసంబంధభావన ఆధారంగా యీ ప్రజాస్వామ్యం ఏర్పడింది. మానవుడి సంపూర్ణపరిణతికి అనువైన వాతావరణం యిది కలిగించగలదు. వ్యక్తులందరూ నిర్ణయాలద్వారా బాధ్యతలు వహించడంలో, నైతికవైజ్ఞానిక అభివృద్ధియందు ఆత్మశక్తి, హోదా, ఆత్మగౌరవం, యుక్తాయుక్త విచక్షణ, బలం, స్థిరత్వం మొదలైనవి పెంపొందించుకొనుటలో ప్రజాస్వామ్యం దోహదమిస్తుంది. కాలక్రమంలో పితృవాత్సల్యం, ఫాసిజం, కమ్యూనిజం మొదలగువాటికంటె రాజకీయ పారిశ్రామిక ప్రజాస్వామ్యమే, స్వతంత్రులైనవ్యక్తుల వివేకం, విధేయత, మూలస్తంభాలుగా చేసుకుని ప్రభుత్వంయొక్క సుస్థిరనైపుణ్యస్వరూపం కాగలదు.



౧

# 1800-1937 లో అమెరికాలోని కార్మికుల కథ

అమెరికా సాంఘికజీవితంలో శ్రామికసంఘాల ఉద్యమం అందరిచే ఆమోదింపబడిన నిత్యవ్యవహారం. కొన్ని దశాబ్దాల తీవ్రపోరాటం సాగించిన పిదప, నేటి మన ఆర్థిక, రాజకీయ, సాంఘిక జీవితంలో సమిష్టికార్మిక సంఘం చాలా శక్తివంతమైన అంశమని మిత్రులు, శత్రువులు అందరూ ఒప్పుకున్నదే.

ఎల్లప్పుడూ యిది నిజమని చెప్పవక్కర్లేదు. పురాతనకాలంలో చాలా కొద్ది కార్మికసంఘాలుండేవి. జనాభాలో చాలమంది వ్యవసాయదారులుగా గృహబానిసలుగా చేతిపనికార్మికులుగా ఉండేవారు. నగరసరాసరి కార్మికుడు మొదట పని నేర్చుకొనేవాడు; తరువాత కొద్దికాలంలో తనంతతానే యజమానిగా మారేవాడు. చాలాకొద్దిమంది కార్మికులుకూడా వర్గచైతన్యం పెంపొందించుకొనలేకపోయారు. ఎవరూ కార్మిక సంఘ ఉద్యమంగురించి ఆలోచించుకోలేదు.

## సంఘటిత కార్మికులకు మొదటి ప్రతిఘటనలు.

ఎవరైనా పనివాడు ఎక్కువ వేతనం పొందడానికి ప్రయత్నిస్తే లేదా తనతోటివారిని కూడ కట్టుకుని, సంస్థద్వారా తన్ను బాగుపరచుకునే ప్రయత్నంచేస్తేనో శాసనం అతనిప్రయత్నాలు ఎదిరించేది. మధ్యయుగాలలో అభివృద్ధిచెందిన ఆంగ్లేయుల సామాన్య న్యాయశాస్త్రంలోని కుట్ర సిద్ధాంతము అమెరికను న్యాయశాస్త్రము కూడా పూర్తిగా జీర్ణించుకుంది.

ఈ సిద్ధాంతంలో రెండు ముఖ్యోద్దేశాలు ఉన్నాయి. మొదటిది వేతనమునందలి అధికభాగము పరిమితి, శాసనము నిర్ణయించగలదు. మూడవ ఎడ్వర్డుకాలమునుంచి, ఆవిధముగా వేతనాలు నిర్ణయించు శాసనాలున్నాయి. రెండవది, కార్మికులు పనిచేయుశక్తికిమించి వారిచేత పని చేయించబడేది. బ్లాక్ డెత్ కాలంలో ఇంగ్లండులో మొదటిసారిగా యీ భావము శాసనాలుగా రూపొందించబడింది. ఈశాసనం 1349 లో కార్మికుల చట్టము (Statute of Labourers) గా ఆమోదించబడినది.

పనిచేయువానిని తనవృత్తిలోకి ఒక నిర్ణీత లేక సర్కారి వేతనానికి బలవంతముగా పనిచేయించు నియమము, పైరెండు పురాతనభావాల ప్రభావమువలన సృష్టించబడినది. అందువలన వేతనాలు బలవంతంగా పెంచుటకు కార్మికులు సమ్మెచేసినపుడు, వారు నేరమైనకుట్ర చేసినట్లు దోషు లగుదురు.

పందొమ్మిదవశతాబ్దంలో అమెరికారాష్ట్రాలలో అనేక సార్లు యీసిద్ధాంతాలు సంఘటితమువ ప్రయత్నించే కార్మికులకు అన్వయించబడ్డాయి.

1806 లో "కామన్‌వెల్తు వెర్సస్ పుల్లిస్" అనే ప్రసిద్ధమైన ఫిలడల్ఫియాలోని కేసులో, అనేకమంది చెప్పులుకుట్టుకునేవాళ్లు, వేతనాలు పెంచుటకు సంఘటితమైనందుకు అరెస్టు చేయబడిరి. అప్పుడు న్యాయస్థానము యీ విధముగా తీర్పుయిచ్చింది. "మునుపు ఆపనివాళ్లు, తోటివారు అదేవృత్తిలో ఏ ధరలకు, రేట్లకు పనిచేసేవారో, ఆధరలు, రేట్లు వారికి సంతృప్తి కలిగించలేదు. అన్యాయంగా, బలవంతంగా, మునుపటి తమ రేట్లు పెంచాలని కుట్రపన్నుటతో....తమపనికి అన్యాయంగ పెద్ద మొత్తాలు సంపాదించాలనే ప్రయత్నంతో, వారందరుకలిసి, కుట్రపన్ని సమిష్టిగా ఏర్పడి, శాసనధిక్కారంతో కొన్ని ప్రత్యేక పెద్దవేతనము రేట్లకుగాని పనిచేయమని ఏకీభావముతో కలిసిపోయారు... ....మునుపు అమలులోవున్నధరలు, మునుపు వారికిచ్చే ధరలుకంటె ఎంతో ఎక్కువ కావలెననిరి....తిమయజమానులకు నష్టము, కష్టము, ఏహ్యాభావము కలిగించిరి... అదీకాకుండా కామన్‌వెల్తు పౌరులకే నష్టము కలిగించిరి....అదే వృత్తిలోవున్న తదితరపనివాళ్ళకుకూడా మితిమీరిన హాని కలిగించిరి.....

అసలు కేసుఏమిటి ? (ఈదావాలో రికార్డరు లెవీ ప్రశ్నించారు) పనివాళ్ళ సమిష్టిసంఘం రెండువిధాలుగా పరిశీలించవచ్చు. ఒకటి తాము లాభముపొందుట—మరొకటి తాము సంఘంలో జేరనివారికి హానికలిగించుట. న్యాయశాసనం యీరెంటినికూడా హర్షించదు. ఈ నియమము స్పష్టంగా ఉన్నప్పుడు, దీనిని మనం పాటించాలి. అది ఏ సూత్రముల మీద నిర్మించబడినదనునది ఆలోచించవలసిన విషయంకాదు."

చివరకు రిపోర్టరు యీవిధముగా తీర్పుయిచ్చినట్లు తెలుస్తోంది. "వేతనాలు హెచ్చించుకునేనేరము ప్రతివాదిపైన మోపబడింది."

## శ్రామిక సంఘతత్వం ప్రారంభం

పరిశ్రమలు, ఫ్యాక్టరీలనిర్మాణం పెరిగిపోకొలది, పనివారంతా సమిష్టిగా కలిసి సంఘటితమగుట అత్యావశ్యకమైపోయింది. ముఖ్యంగా నిర్దాక్షిణ్యంగా తమ్ము వాడుకొనుటను న్యాయశాస్త్రాన్ని ఎదిరించి, నివారించవలసివచ్చింది. వ్యక్తియైన కార్మికునికి పెద్ద ఆర్థికవసతులుమీద ఆధారపడిన ఫ్యాక్టరీ యజమానికి, లేక కార్పొరేషనకు, మధ్య ఏవిధంగా బేరమాడి శక్తికి సమానత్వము లేదన్నది వారు గుర్తించారు. సంఘటిత ప్రవర్తనవల్లనే దేని మీదనైనా వారు సమానహోదాలో బేరమాడకల్గెడివారు. అందువల్ల వారు సంఘటిత పడజొచ్చిరి. చరిత్రలో ఒక ముఖ్యసంఘటన కనిపిస్తుంది. ఫిలడల్ఫియా ముద్రాపకులు 1786 లో వారమునకు 6 డాలర్లు కనీసవేతనమునకు సమ్మెచేసిరి. ఆరుసంవత్సరాల తర్వాత చెప్పులు కుట్టువారు ఈ నగరంలోనే మొట్టమొదటి కార్మికసంఘంగా ఏర్పడుట జరిగింది.

పందొమ్మిదవ శతాబ్దంలో మొదటి రెండుదశాబ్దాలలో చెల్లాచెదురుగా కార్మికసంఘాలు ఏర్పడ్డాయి. ఈదేశంలో 1827 వరకు కార్మిక ఉద్యమం అన్నది కనిపించలేదని చెప్పవచ్చు. ఈ సంవత్సరంలో మొట్టమొదటి సారిగా వివిధవృత్తులలోని పనివారు కలిసిపోయి ఒక కేంద్రకార్మిక సంస్థగా ఏర్పడ్డారు. దానికి ఫిలడల్ఫియా సంస్థల యంత్రకారుల సంఘం అనిపేరు. [Machine Union or Trade Association of Philadelchia] వడ్రంగులు, తాపీపనివారు, ముద్రాపకులు, అద్దాలపనివారు కల స్థానికసంఘాలు ఈ సంస్థలో కలిసిపోయాయి. దీని తరువాతనే న్యూయార్కు, బోస్టన్ లలోనూ తదితర నగరాలలోనూ యితర కేంద్రసంస్థలు ఉదయించాయి. 1830 దశాబ్దంలో జాతీయసంఘాలు ఏర్పడడం ప్రారంభమైంది.

ఆరోజులలో ఏర్పడిన సంఘాలు తమ ఆర్థిక రాజకీయ వ్యవస్థల నాధారంగా తమహక్కులకై పోరాడాయి. ఎక్కువ వేతనము, తక్కువకాలము పనిచేయుటయే వారికి ప్రధానంకాదు. కార్మికుల పిల్లలకు ఉచితవిద్య, వోటుచేసేహక్కు, పదిగంటలకు మించనిపని, పిల్లలచే పనిచేయించకుండుట, దుకాణములలో ధారాళమైన వెలుగు గాలివచ్చు పరిస్థితులు

సృష్టించుట మొదలగువాటికై వారు పోరాడుచుండిరి. ఈ లక్ష్యసిద్ధికై స్థానికంగా అనేక కార్మికసంఘాలు ఏర్పడ్డాయి. 1827–1830 దశాబ్దాలలో కార్మికులకు చెప్పుకోదగిన కొన్నివిజయాలు లభించాయి. కాని 1837 లో ఒక తీవ్రమైన ఆర్థికమాంద్యము ఏర్పడి, దేశాన్ని బాధపెట్టింది. కర్మాగారాలు మూసివేయబడ్డాయి. కార్మికులకు సరైనపని దొరకలేదు. సంఘాల కోశాగారాలు ఖాళీ అయినాయి. స్థానిక, నగరసంస్థలు, జాతీయ సంఘాలు రూపులేకుండా నశించిపోయాయి.

## ఆదర్శ ప్రయోగాలు.

తర్వాతదశాబ్దంలో కార్మికకార్యవర్గసభ్యులు చాలామంది తమ ఆర్థిక సమస్యల పరిష్కారానికి ఆకాలమునాటి ఆదర్శప్రయోగాలకై నిరీక్షించారు. బ్రిటిషుపారిశ్రామికవేత్త రాబర్టు ఓవెన్ ఇతర ఫ్రెంచిసోషలిస్టులు, తదితరులు స్థాపించిన సహకార వలస సంఘాలలో సభ్యులై వాటిని బలపరిచారు.

ఈ వలససంఘాలలో చాలాకొద్దివి మాత్రమే పనిచేసి బ్రతికాయి. కార్మికుల అభివృద్ధికి ఏర్పడిన యితర ఆర్థికపథకాలు అపజయంపొందాయి. 1850 దశాబ్దంలో చాలమంది కార్మికులు శ్రామికసంఘాల ఉద్యమం బలపరచి ప్రోత్సహించారు. ఆరోజుల్లో రైలురోడ్లనిర్మాణము, కాలిఫోర్నియాలో దొరికిన బంగారుగనులు, పారిశ్రామికాభివృద్ధి, యిటువంటి శ్రామికఉద్యమమును బలపరచినవి. 1857 నాటి అంతర్యుద్ధము ముందటి ఆర్థికమాంద్యం వరకు సంఘటిత కార్మికసంఘాలు పురోభివృద్ధి పొందుచునే వున్నాయి.

## జాతీయ కార్మిక సంఘము

దేశవ్యాప్తమైన జాతీయ క్రయవిక్రయము పెరగడంలో కార్మికులు స్థానికంగానే కాక, జాతీయ దృక్పథంతో దేశం అంతటికీ కార్మిక సంఘాలు సంఘటితపరచారు. 1866 లో, యుద్ధమైనాక జాతీయకార్మిక సంఘం ఏర్పడింది. కార్మికసంఘాల సమాఖ్యకూడాఉన్నా అది అంత బలంగాలేదు. మరికొన్ని సంస్కరణ సంఘములుకూడా ఉదయించాయి. ఈరోజు మనం అర్థంచేసుకునే శ్రామికఉద్యమంకు తగిన కార్యక్రమము

ఆనాడు అజాతీయ కార్మికసంఘం రూపొందించలేక పోయింది. ఎనిమిది గంటలకాలము పనిమాత్రమే ఉండాలన్న ప్రచారానికి తోడుగా సహకారసంస్థలు, శాసనరీత్యా సంస్కరణలు కావాలన్న విషయంపై ఎక్కువ శ్రద్ధ చూపారు. ఈసంస్థల పాలన చాలా అసంతృప్తికరంగా ఉంది. లోలోపల అంతర్వివాదాలతో నిండి మరో ఆరుసంవత్సరాల తర్వాత యిది మాసిపోయింది.

## నైట్సు ఆఫ్ లేబరు (కార్మిక శూరులు)

1869 లో ఏర్పడిన మరొక కార్మికసంస్థపేరు నైట్సు ఆఫ్ లేబరు, ఫిలడల్ఫియాలోని దర్జీవారు యీసంస్థ ఏర్పరిచినప్పుడు, చాలమంది కార్మికులు భయపడ్డారు. ఈ సంఘఉద్యమం తమ ఉద్యోగముల భర్తరఫుకు నల్లజాతితో చేరుటకు దారితీయునని శంకించిరి. అందువలన 'నైట్సు' ఒక నిర్ణయానికి వచ్చారు. సభ్యులందరూ రహస్యంగా క్లబ్బుల్లో గాని, లేదా సభ్యులయిళ్ళల్లోగాని కలుసుకొని సంప్రదింపులు కొనసాగించారు. ఆనాటి సమాజంలో తమ బలం పెంపొందింపచేసుకోడానికి తమ స్థానికసంఘాలలో, వ్యవసాయదారులను, దుకాణదారులను, వివిధవృత్తుల వారిని, అనేక చేతిపనులలో బ్రతుకువారినికూడా చేర్చుకుని కూడగట్టుకొనిరి. సహకారసంస్థలలో, కార్మికరాజకీయాలలో వారంతా ఉత్సాహంగా పనిచేసారు. సమాజంలో సంచలనం కలిగించి, అనేకచోట్ల, అన్యాయంచేసే యజమానులను ధిక్కరించి బహిష్కరణలు, సమ్మెలు జరిపారు. 1870 దశాబ్దం ఆఖరి కాలంలో నైట్సు ఆఫ్ లేబరు తమ రహస్యవిధానం విడనాడారు. 1880 దశాబ్దంలో పారిశ్రామికాభివృద్ధి ఉత్తేజిత మౌతున్నప్పుడు, ఆదేశములో అంతవరకు కనీ వినని పెద్ద పారిశ్రామికసమ్మెలలో పాల్గొన్నారు. జైంటుయూనియన్ పసిఫిక్, గోల్డు రైలురోడ్డు పద్ధతులను ధిక్కరించిన సమ్మెలు వీరుచేసినవే. (ఈసంఘం నిర్వహించి అమలు జరిపింది) అన్న ముఖ్యసిద్ధాంతాలు కార్మికుల శ్రమకు తగుగౌరవం ఉండాలి, కార్మికులంతా ఒక తరగతిగా ఐక్యత కలిగి ఉండాలి. 'నైట్సు' నిపుణులు, నిపుణులు కాని స్త్రీపురుష కార్మికుల నందరినీ తమలో కలుపుకొనిరి.

1886 లో నైట్సు ఆఫ్ లేబరు తన అత్యుత్తమ ఉన్నతస్థానము అందు కొంది. దానిసభ్యత్వం ఏడులక్షలను మించింది. ఆసంవత్సరం తర్వాత దానిసభ్యత్వము త్వరితంగా పడిపోయింది. 1893 లో దానిసభ్యత్వం 70 వేలకు పడిపోయింది. దీనికి అనేక కారణాలున్నాయి. సరైన నాయకత్వం లేకపోవడం, అనేక వినాశనకరమైన సమ్మెలు, స్థానికసంఘాలలో వివిధ రకాలైన వారిని, పనివారిని, పనివారుకానివారిని చేర్చుకోవడం, హే మార్కెటుఅలజడి, 1886 లో చికాగోలో బాంబుప్రేలుడులపైని ముఖ్య మైన ప్రజాభిప్రాయం. వీటన్నిటికంటెమించి, 'అమెరికను కార్మిక సమాఖ్య' అను పోటీసంస్థ ఏర్పడడంవల్ల నైట్సు ఆఫ్ లేబరు క్రమంగా తనబలం, పరపతి కోల్పోయింది.

## అమెరికను కార్మిక సమాఖ్య (ఎ. యఫ్. యల్.) ఆఫ్ లేబరు

## American Federation of Labour

అమెరికా, కెనడా రాష్ట్రాలలోని సంఘటిత కార్మికసంఘాల సమాఖ్యగా 1881 లో అమెరికను కార్మికసమాఖ్య ఏర్పడినది. ఒకటియిదుసంవత్స రాలు, శాసనవిధానానికి సంబంధించిన విఫలకార్యక్రమాల తర్వాత 1886 లో యీసంస్థ పునర్నిర్మించబడింది. ఈసంస్థ స్థాపననుంచి 1924 వరకు ఒక్కసంవత్సరము మినహా దీని అధ్యక్షుడు శామ్యూల్ గోంపర్సు. ఈయన 1924 లోనే చనిపోయారు. నైట్సు ఆఫ్ లేబరు చేసిన పొరపాటు లన్నీ యీసంస్థ దూరంచేయాలని ఈయన కృషిచేశారు. మొదటిసంవత్స రాలలో నిపుణులైన కార్మికులకు జాతీయసంఘాలు ఏర్పాటుచేయడం తోను, ఈకార్మికులకు మెరుగైన జీవన పరిస్థితులు ముఖ్యంగా ఉమ్మడిబేరం, సమ్మెలద్వారా లభించేటట్లు ఈయన తీవ్రతరకృషి సల్పారు. సంఘాల బలం పెంచడానికి బలవత్తరమైన కోశాగారాలు ఉండడం అవసరమని ఉద్ఘాటించారు. అప్పుడే సంస్థలకార్యక్రమాలు విజయమయి, సమ్మెలు నెగ్గి, సభ్యులకు సరైనసేవ చేయవచ్చునని ఆయన విశ్వాసం. అయితే యీయన స్వతంత్రరాజకీయపార్టీలు కార్మికసంఘాలు సంఘటితపరచ డాన్ని వ్యతిరేకించారు. కార్మికులను తమ స్నేహితులైన పార్టీలకు తగు బహుమతియిచ్చి, శత్రువులైనవారిని తగువిధంగా శిక్షించవలసిందని హెచ్చ

రించారు. కార్మికులకు విరుద్ధమైన శాసనాలు ప్రతిఘటించుటకు, కార్మిక ప్రతినిధుల నీయిన వాషింగ్‌టన్‌కు పంపారు.

నూటమ్నైపైఎనిమిదివేల సభ్యత్వంతో 1886 లో యీసమాఖ్య ప్రారంభింపబడింది. ఆతరువాత దశాబ్దంలో ఈసంస్థ చావుబ్రతుకుల మధ్య తీవ్రపోరాటం సాగించింది. రెండు ఉక్కు కార్ఖానాల సమ్మెలలో ఈ సమాఖ్య అపజయము పొందింది. కంపెనీయజమానులు ఈసమాఖ్యను అతి బలవత్తరంగా ఎదుర్కొన్నారు. 1893 లో ఉద్భవించిన ఆర్థికమస్థితి దీనిని బలహీనపరిచింది. పైగా లోలోపలి అంతర్వివాదాలు, రేడికల్ యుద్యమంలోని లోపాలు యీసమాఖ్యకు ఎదురుచుక్కలయినాయి. 1894 నాటికి యీసమాఖ్య సభ్యత్వము 275 వేలవరకుమాత్రమే పెరిగింది.

## 'పుల్ మెన్ సమ్మె'

1890 దశాబ్దికాలంలో, అమెరికను ఫెడరేషను ఆఫ్ లేబరు కు అనుబంధించకుండా రైల్వేకార్మికులు, ఇతరసంస్థలలోనివారు సంఘటితపడి సంఘాలుగా ఏర్పడ్డారు. రైల్వేరంగంలో అత్యున్నతమైనసమ్మె ఒకటి అమెరికను రైల్వేయూనియన్ పుల్‌మెన్‌కంపెనీని ఎదుర్కొన్నది. ఈ సమ్మెకు అంతిరతింగా పనిచేసిన చైతన్యపురుషుడు యూజీవిక్టడెబ్సు. సమ్మె ప్రారంభించగానే అమెరికారాష్ట్రప్రభుత్వము పుల్‌మెన్‌కంపెనీ ఆస్తిని రక్షించుటకు పటాలను పంపింది. ఈపటాలను పోరాటంవల్ల, తీవ్రమైన ప్రభుత్వఉత్తర్వులవలన, డెబ్సును కోర్టును ధిక్కరించిన నేరముపై అరెస్టుచేయుటవలన, ఈసమ్మె విఫలమైపోయింది. క్రమముగా అమెరికను రైల్వేయూనియను కూడా ఈ అఘాతిముతో నశించిపోయింది.

## ప్రథమ ప్రపంచ సంగ్రామమునకు పూర్వభాగము

1890 దశాబ్దంలో దేశంలో ఏర్పడిన సుసంపన్నతవలన, కార్మిక ఉద్యమం క్రమంగా పురోగమించసాగింది. అర్థమిలియను సభ్యత్వమునుంచి రెండు మిలియనులకుమించిన సభ్యత్వంతో అమెరికను కార్మికసమాఖ్య అందరుకార్మికులను సంఘటితపరుచుకున్నది. ఈకాలములోజరిగిన ముఖ్య కార్మిక ఉద్యమసంఘటన పెన్సిల్వేనియా బొగ్గుకార్మికులుచేసిన సమ్మె. ఇది ఒకనెలకాలము సాగింది. ఈసమ్మె ముఖ్యోద్దేశములు (1) తొమ్మిది

గంటలకాలముమాత్రమే పనిచేయుట, (2) తమసంఘాన్ని గుర్తించుట. ఈసమ్మెను ఆపుచేయడానికి థియ్యోడార్ రూజ్‌వెల్ట్ కలుగచేసుకొన వలసివచ్చింది. బొగ్గుపరిశ్రమ అంతటితో ఒక ఒడంబడిక ఈసమ్మెవలన కార్మికులు పొందగలిగిరి.

అమెరికా ప్రథమప్రపంచ సంగ్రామములోజేరిన కాలము ముఖ్యంగా 1904 నుంచి 1917 వరకు, కార్మికఉద్యమం మరింత బలవత్తరమై తమ సభ్యత్వము రెండునుంచి మూడు మిలియనుల సభ్యులవరకు పెంచుకున్నది. పైగా కట్టడవృత్తులు బలపరచడం, స్త్రీపురుషుల వస్త్రపరిశ్రమలలో కట్టుదిట్టమైన సంఘాలు రూపొందించి పెంపొందించుట, ఆతర్వాత 1909, 1910 సంవత్సరాలలో కర్మాగారముల సంక్షేమపరిస్థితుల విషయంలో జరిగిన సమ్మెలు, కూడా యీకార్మిక ఉద్యమాన్ని బలపరిచినవి.

## ఇండస్ట్రియల్ వర్కర్సు ఆఫ్ ది వరల్డు (ప్రపంచ పారిశ్రామికులు)

ఈకాలంలోనే 1905 లో ఇండస్ట్రియల్ వర్కర్సు ఆఫ్ ది వరల్డు స్థాపించబడినది. ఈసంఘంలో నిపుణులుకాని కార్మికులు, కొద్దినిపుణత కల్గిన కార్మికులు చేర్చబడిరి. ఆ తర్వాత కొద్దిసంవత్సరాలు ఈసంస్థ పసిఫిక్ తీరంలోని కలపకోయువారిని, తూర్పుతీరంలోని వస్త్రంమిల్లుల లోని కార్మికులను, పశ్చిమంలోని గనికార్మికులను, చెల్లాచెదురుగాతిరుగు వ్యవసాయకార్మికులను సంఘటితపరుచుటకు తీవ్రమైన కృషిసల్పిరి. ఈ సంస్థలోని సభ్యులకు "వాబ్లీస్" అనే ప్రసిద్ధమైన పేరుకలదు. యుద్ధ కాలమందు, అంతకుముందు ఈసంస్థ అనేకసార్లు వాగ్యుద్ధములకు ఆలవాల మైంది. విలియమ్ డి. హేవుడ్, తదితరనాయకులు ఘ్రించి సిండికలిజం సూత్రాలు ప్రవచించిరి. యుద్ధము ప్రారంభమైనాక చాలమంది నాయకులు క్రిమినల్ సిండికలిజం అవలంబించినారనే సూత్రంపై అరెస్టుచేయబడ్డారు.

ప్రభుత్వం చేసిన ప్రాసెక్యూషను వలన, లోపభూయిష్టమైన పరిపాలనా పద్ధతులవలన, సంఘసభ్యుల బీదఱికంవలన, ఇండస్ట్రియల్ వగ్కర్సు ఆఫ్ ది వరల్డు, తీవ్రమైన కార్యక్రమాలు మానుకొని అడుగున పడిపోయింది.

## ప్రథమ ప్రపంచ సంగ్రామం — ఫలితాలు

ప్రథమ ప్రపంచ సంగ్రామకాలంలో ఉద్యోగాలు హెచ్చుగా దొరుకుతూండేవి. రైల్వేసంఘాలు, అమెరికను కార్మికసమాఖ్యలయొక్క సహకారం అందరు యజమానులు, అన్ని ప్రభుత్వశాఖలు కూడా అర్థించాయి. కార్మికసంస్థలు 1920 లో చాలా అభివృద్ధిపొందడం సంఘాలవల్ల వాటి సభ్యత్వము అయిదు మిలియనులకుపైగా పెరిగిపోయింది. ఈ కాలంలో కార్మికులను నిర్వహించు కమిటీలు ఎన్నోవందలు ఏర్పాటైనాయి. ఇవి కార్మికుల ఉత్పత్తిని పెంచుటకు ప్రయత్నించాయి. పారిశ్రామిక ప్రజాస్వామ్యం అరచేతిలో ఉందని అందరూ ప్రకటించారు. యుద్ధం ముగిసిన తక్షణమే, పరిశ్రమలో ఏర్పడిన ధరల తగ్గుదల అవకాశము యజమానులు వినియోగించుకొన్నారు. అమెరికను ప్రణాళిక పేరన, కార్మికసంఘాలను ధిక్కరిస్తూ తీవ్రపోరాటం ప్రారంభించారు. బలవత్తరమైన సంఘాలు బ్రతికినా కొత్తగాఏర్పడిన సంఘములు యుద్ధకాలములో పొందే లాభములు నిలబెట్టుకొనుటకు చేసిన నిరాశాపూరిత పోరాటములో చాలవరకు నశించిపోయాయి.

తాత్కాలికంగా ఏర్పడిన ఆ కష్టదశ, యజమాని కార్మికులమీద చేసిన ఎదురుదాడులు గుర్తించి చాల కార్మికసంఘాలు తీవ్రమైన రాజకీయ చర్యలకు దారితీసాయి. రైల్వేసంఘాలు, ఇతర అభ్యుదయ కార్మికసంఘాలు ఒక లీగ్ గా ఏర్పడి ఒక అభ్యుదయకరమైన రాజకీయచర్యకు పూనుకొన్నాయి. 1924 లో జరిగిన ఎన్నికలలో రాబర్టు లాఫాలేట్ ను అభ్యుదయపార్టీ ప్రతినిధిగా అమెరికను ఫెడరేషను ఆఫ్ లేబరు కార్యవర్గం నిర్ణయించింది. ఈ కాలంలో చాలా కార్మికసంఘాలు కార్మికబ్యాంకులు, సమిష్టిసహకారసంఘాలు స్థాపించి విద్యావిషయిక, పరిశోధక కార్యక్రమాలు విరివిగా సాగించాయి. చాలా రైల్వేసంఘాలు రైల్వేలను జాతీయం చెయ్యవలసినదని ఆందోళన జరిపాయి.

1920 దశాబ్దకాలంలో ఉద్యోగాలు పెరిగినపుడు, కొత్త పెట్టుబడి విధానము ఆర్థికమాంద్యం సమస్యలు పరిష్కరించినదన్న ఆనాటి వ్యాపారస్థుల అభిప్రాయంతో కార్మికులు ఏకీభవించారు. కంపెనీల అదుపులో ఉన్న సంఘాలు, యజమానులు కలిగించే సంక్షేమకర సదుపాయాలు పని

వారికి ఎంతో రక్షణ కల్గిస్తున్నదని భావించారు. కొన్ని సంవత్సరాల క్రితం వ్యాపారస్థులు కార్మికసంఘాలపై అవలంబించే ఒత్తిడి విధానాలు చాలా మంది యింకా జ్ఞాపకం పెట్టుకున్నారు. తత్ఫలితంగా, కార్మికసంఘ కార్యనిర్వాహకులు, ఎక్కువమందిని సంఘాలలో సభ్యులుగా చేర్చలేక పోయారు. అందువల్ల సభ్యత్వము క్రమముగా క్షీణించింది.

## ది రైల్వే లేబరు - నారిస్ - లా గార్డియా చట్టములు.

కార్మికుల సంబంధాల విషయంలో 1920 దశాబ్దకాలంలో ఒక ముఖ్య విషయము జరిగినది. అది రైల్వే లేబరుచట్టము అమలులోకి వచ్చుట. ఈ శాసనం ద్వారా కార్మికులు ఏ ఒడంబడికల్లో చేరినా సంఘాలలో చేరుటకు మునుపుఉండే నిషేధం తొలగించబడింది. కార్మికులను యీ విధముగా నిషేధించే ఒడంబడికలను "యెల్లో డాగ్ కాంట్రాక్ట్సు" అంటారు. ఉద్యోగాలలో సంఘాలుగా ఏర్పడు స్వేచ్ఛ పై ప్రతిబంధకాలను ఈ శాసనం తొలగించింది.

రైల్వే లేబరుచట్టం తర్వాత, 1932 లో నారిస్-లాగార్డియా శాసనం అమలులోకి వచ్చింది. ఈ శాసనం రిపబికన్ అధ్యక్షుడి ఆధ్వర్యంలో ఆమోదించబడింది. ఆ సమయంలో కాంగ్రెసులో చీలికలు ఏర్పడ్డాయి. ఫెడరల్ కోర్టులు కార్మికవివాదాలలో గుత్తగాయిచ్చే ఆజ్ఞలను యీ చట్టం నిషేధించింది. ఈ చట్టంయొక్క ముఖ్యోద్దేశము యిది. "ప్రస్తుత ఆర్థిక పరిస్థితులలో ప్రభుత్వం యిచ్చిన అధికారంలో యజమానులు కార్పొరేషనులుగా, తదితర పారిశ్రామిక సంస్థలుగాను సమిష్టిగా ఏర్పడుటకు అనుమతించబడినపుడు, సమిష్టిగాలేని వ్యక్తిగత కార్మికుడు, తన ఒడంబడిక స్వేచ్ఛ, అనుభవించుటలో, తన సేవాస్వేచ్ఛను రక్షించుకొనుటలో, ఉద్యోగమునందు తన కనుకూలమైన షరతులు పొందుటలో నిస్సహాయుడగుచున్నాడు. ఈ పరిస్థితులలో కార్మికునకు సంఘంగా ఏర్పడుటకు పూర్తి స్వేచ్ఛ యీయవలెను. తానంతట తాను సంఘాలు నిర్మించడానికి తనకు నచ్చిన ప్రతినిధులను ఎన్నుకొని, వారిని తన పక్షాన తన ఉద్యోగ షరతులు నిర్ణయించుట కార్మికునకు హక్కు ఉండవలెను. అటువంటి ప్రతినిధులను ఎన్నుకొన్నప్పుడు యజమానులు ఏ విధంగానూ కలగచేసు

కొనరాదు. [illegible] తదితర సమిష్టి కార్యక్రమాలైనటువంటివి, ఉమ్మడి బేరము, పరస్పరసహాయం, పరస్పరరక్షణ, మున్నగువాటిలో కూడా యజమాని కార్మికుని విషయంలో కలుగచేసుకోరాదు.

ఈ చట్టం కార్మికుల కార్యక్రమాలు కొన్ని ఫెడరల్ న్యాయ స్థానాలు అదుపులో పెట్టలేకపోయాయి. నిషేధించాయి. కార్మిక వివాదాలలో అనుజ్ఞ లిచ్చేటప్పుడు కార్మికులు అవలంబించవలసిన ఒక నిర్దిష్ట పద్ధతికూడా నిర్ణయించినది.

## న్యూడీల్ ప్రకారము కార్మికులు

ఫ్రాంక్లిన్ డి రూజ్వెల్టు న్యూడీల్ ప్రకారము, 1933 లో అమలులోకి వచ్చిన నేషనల్ ఇండస్ట్రియల్ రికవరీ చట్టమునుయొక్క 7 (a) సెక్షను క్రింద ఉద్యోగులు సమిష్టిగా ఏర్పడి ఉమ్మడిగా తాము ఎన్నుకున్న ప్రతినిధుల ద్వారా సంప్రదింపులు జరపే హక్కు పొందారు. ఈ చట్టంద్వారా దేశవ్యాప్తమైన కార్మిక సంఘనిర్మాణ ఉద్యమమునకు మంచి దోహదము కల్గినది.

## 1936 లో నేషనల్ లేబరు రిలేషన్సు చట్టం

పైనచెప్పిన చటూ వాతావరణంలో అమలులోకి వచ్చిన మరొక చట్టము, 1936 లో అమోదించబడిన నేషనల్ లేబరు రిలేషన్సుచట్టము. దీనికి మరొక ప్రసిద్ధనామం "వేగ్నర్ యాక్టు". నారిస్ - లాగార్డియా చట్టముకంటె ఒక అడుగు ముందుకు వేసింది. యీ 'వేగ్నర్ యాక్టు' సమిష్టిగా ఏర్పడుటకు పూర్తిస్వేచ్ఛ ఒడంబడిక జరుపుకొనుటకు పూర్తి స్వాంత్రము లేని ఉద్యోగులకు, సమిష్టి కార్పొరేషన్సుగా మరి తదితర సంస్థలుగా ఏర్పడే హక్కు ఉన్న యజమానులకు మధ్య ఉన్న తారతమ్యాలను యీ చట్టం తొలగించింది.

ఈ చట్టంద్వారా మూడువిషయాలు స్పష్టపరచబడ్డాయి. ఉద్యోగులు తమంతతాము ఏ సంఘమైనా ఏర్పాటు చేసుకొనుటకు ఒక పద్ధతి నిర్దిష్టపరచబడింది. లేబరు రిలేషన్సుబోర్డు (కార్మిక సంబంధముల మండలి) అను దానిని ఏజన్సీగా స్థాపించింది. ప్రతినిధిఎన్నికలు పర్యవేక్షించుట

అన్యాయమైన కార్మికపద్ధతులపై అంక్షలు విధించుట ఈ యుండలి ముఖ్య చర్చలు.

1937 ఏప్రిల్ 12వ తారీఖున, అమెరికా రాష్ట్రాల సుప్రీంకోర్టు యీ శాసనం రాజ్యాంగ విరుద్ధమని ప్రకటించింది. అప్పటినుంచి, 1947 లో టాఫ్ హార్ట్లే చట్టము అమలు జరుపబడినప్పటి వరకు, "వేగ్నర్ యాక్టు" మాత్రమే కార్మికసంఘాల నిర్మాణానికి సుముఖ వాతావరణము కల్పించింది. పెద్ద ఉత్పత్తిగల పరిశ్రమలలో కార్మికులు సంఘటితమగుటకే యీ చట్టంప్రాతిపదికగా ఉండింది. సంఘాలుగాఏర్పడే హక్కులు చట్టబద్ధమై యున్నందువల్ల పురాతన కాలంనుంచి కోటలుకట్టుకున్న సంఘవ్యతిరేకత, తీవ్రమైన సంఘనిర్మాణ కార్యక్రమములు పురోగమించక ముందే, నేలకూలినది.

## 2. సంఘటిత కార్మికజనం కథ 1937-'56.

1930 దశాబ్ద కాలం ప్రథమదశల్లో కార్మికసంఘాల నిర్మాణము విరివిగా జరుగు తున్నప్పుడు మోటారు, ఉక్కు మొదలైన సామూహిక పరిశ్రమలలో కార్మికులను చేర్పించే యీ సంఘాలు కార్మికులను వృత్తి పనివారిసంఘాలుగా సమిష్టీకరించడం కష్టమని, కార్మికుల నందరినీ ఒకే సంఘంగా ఏర్పరిచినచో వారి అవసరాలు తీర్చవచ్చని, వాదించాయి. ఈ అభిప్రాయమే చివరకు పారిశ్రామికసంస్థ కమిటీ ఒకటి (Congress of Industrial organisation) ఏర్పడుటకు కారణమైంది. ఫెడరల్ కౌన్సిల్ ఆఫ్ చర్చ్స్ యొక్క పరిశోధకశాఖ తయారుచేసిన యీ క్రింది నివేదికద్వారా పారిశ్రామికసంస్థ కమిటీ, ఆపిదప పారిశ్రామికసంస్థల కాంగ్రెసు ఏర్పడుటకు దారితీసిన సంఘటనలు వివరించగలము.

1934 లో అమెరికను కార్మికసమాఖ్య సమావేశము, సామూహిక ఉత్పత్తిపరిశ్రమలను సంఘటిత పరచవలెనను కోరికపై ఇనుప, ఉక్కు

పరిశ్రమలలో సంఘనిర్మాణఉద్యమం ప్రారంభించమని, మోటారు, సిమెంటు, అల్యూమినియమ్ మొదలగు యితర సామూహిక పరిశ్రమలలో ఏర్పడిన జాతీయ, అంతర్జాతీయ సంఘాలకు అధికారపత్రములు యివ్వమని కార్యవర్గాన్ని ఆదేశించింది. అయితే ఈ కార్యవర్గం ఈ పరిశ్రమలలో ఉన్న వృత్తిపనివారి సంఘాల హక్కులు రక్షించే బాధ్యత కలిగియున్నది.

ఈవిధానమువల్ల నిజమైన పారిశ్రామిక సంఘాలు ఏర్పడుతాయని సాధారణముగా భావించబడింది. పారిశ్రామికసంఘ నాయకులు అపరిమిత అధికారంతో అధికారపత్రాలు తమ సంస్థలకు యివ్వవలసినదని కోరారు. అమెరికన్ కార్మికసమాఖ్య రాజ్యాంగంవల్ల కార్యవర్గానికే పరిమిత అధికార మున్నదన్న విషయం వృత్తిసంఘాల అధికారాలు హక్కులు తోసి వేయలేదన్న విషయం వీరు గుర్తించలేకపోయారు.

మోటారు కార్మికులకు మాత్రమే పరిమితమైన అధికారపత్రము యివ్వబడిందని, ఇనుప, ఉక్కు పరిశ్రమలలో ఏవిధమైన సంఘనిర్మాణము జరుగలేదని 1935 లో ఈ సమావేశం జరిగినపుడు పారిశ్రామిక సంఘ నాయకులు గుర్తించారు. పారిశ్రామిక సంఘ నిర్మాణానికనుకూలురైన వారు పారిశ్రామిక సంఘాలు అపరిమిత అధికారపత్రాలు కలిగిఉంచవలె ననే విధాన ముండవలెనని కోరారు. ఉదాహరణకు యునైటెడ్ గని కార్మికుల సంఘము గనులలో చుట్టుప్రక్కలఉన్న కార్మికులనందరినీ చేర్చు హక్కుకలిగిఉంది. సంఘటితము కాని కార్మికులను సంఘటిత పరచవలసిన ఆవశ్యకత ఆధారంగా వీరు ఆ విధానం కోరారు. సామూహిక ఉత్పత్తి పరిశ్రమలలో కార్మికులను విడగొట్టుటకు వృత్తిసంఘాల కనుమతియిస్తే వారిని మరొకవిధముగా సంఘటితపరచడం అసంభవమని వీరు అభిప్రాయం వెలిబుచ్చారు.

పారిశ్రామిక సంఘనిర్మాణ వాదుల కోరిక అపజయముపొందింది. వోటింగులో వ్యతిరేకంగా 18,024 వోట్లు, అనుకూలంగా 10,933 వోట్లు వచ్చాయి. ప్రతీవోటుకు 100 మంది సభ్యులు ప్రాతినిధ్యము వహించారు. 10,933 వోట్లు వేసిన సంస్థలలో పారిశ్రామిక సంఘాలే కాక వృత్తి పనివారిసంఘాలు, అనుబంధసంస్థలు, కేంద్రసమాఖ్యలు, రాష్ట్ర సమాఖ్యలు, 'సిటీ సెంట్రల్సు' అనబడే స్థానికసంస్థల సమాఖ్యలు

వున్నాయి. ఈ వోటుకు ప్రాతినిధ్యం వహించిన సంస్థలలో 1,10,000 సభ్యత్వం వుందని అమెరికన్ కార్మిక సమాఖ్యస భ్యత్వంలో 36 వ శాతం ఉంటుందని అంచనా వేయబడింది. దీనివలన వృత్తిపనివారి సంఘాల కంటె పారిశ్రామిక సంఘాలే ఎక్కువ ప్రయోజనకారిగా యుండు నన్నది బహువ్యాప్తమైన జనాభిప్రాయంగా సూచింపబడినది.

1935 నవంబరు 10 వ తారీఖున ఎనిమిది పేరుమోసిన సంఘాల ప్రతి నిధులు కలసి పారిశ్రామిక సంస్థకమిటీగా ఏర్పడిరి. సామూహిక ఉత్పత్తి పరిశ్రమలలో సంఘటితము కానివారిని సంఘటిత పరచడమే దీని ఉద్దేశ్యము. వీరందరిని అమెరికను కార్మికసమాఖ్యలోకి తీసుకురావాలని వీరి ఆశయం. వృత్తిసంఘాలు బలంగాఉన్న పరిశ్రమల్లో చొచ్చుకో వలెనని వీరి ఉద్దేశ్యం కానట్లు స్పష్ట పరచబడింది. కాని పారిశ్రామిక సంఘాలు ఏర్పడినతర్వాత వృత్తిసంఘాలు వీటిని నాశనంచేయ ప్రయ త్నించరాదని వీరి అభిప్రాయం. ముఖ్యంగా వృత్తిపనివారి సంఘాలు పారిశ్రామిక కార్మికులను సంఘటితపరచలేని పరిశ్రమలలో వారి ప్రయ త్నములన్నీ ఉత్తి కాగితము మీది ప్రయత్నములైన చోట్లమాత్రము వీరి అభిప్రాయము అమలు జరుపవలసిందని వీరి ఉద్దేశ్యం.

1936 జనవరిలో పారిశ్రామిక సంస్థకమిటీ అమెరికను కార్మికసమాఖ్య యొక్క అధిపత్యానికి ఒక సవాలని కార్యవర్గము ప్రకటించినది. ఈ కమిటీ నిర్మాణంలో ఉద్దేశ్యములో ద్వంద్వపరిపాలన కలిగి యుండుటచే దీనిని తక్షణం రూపుమాపవలసిందని కోరబడింది. కాని పారిశ్రామికసంస్థ కమిటీ ఈ అభిప్రాయాన్ని వ్యతిరేకించింది. తమవల్ల సంస్థకు ద్వంద్వ స్వరూపము రాదని, అధికార పత్రాలు తా నివ్వటం లేదని పారిశ్రామిక సంఘాల నిర్మాణముతోపాటు వృత్తిపనివారి సంఘాల నిర్మాణముకూడా శాసనబద్ధమని తాము అమెరికా దేశంలో కార్మిక ఉద్యమం అభివృద్ధి చేయుటకే ధనం వెచ్చించగలంకాని స్వీయ అభివృద్ధికి పనిచేయమని పారి శ్రామికసంస్థకమిటీ తమ అభిప్రాయం వెలిబుచ్చింది.

ఈ భేదాభిప్రాయాలు పెరిగి 1936 ఆగష్టులో అమెరికను కార్మిక సమాఖ్య కార్యవర్గము, పారిశ్రామికసంస్థ కమిటీలో ఉన్న పదిసంఘాలను తన సభ్యత్వమునుంచి తొలగించింది. అక్టోబరు నెలలో జరిగే సదస్సు వీరికి ప్రాతినిధ్యం లేకుండా చేసింది. ఎన్నోరాయబారాలు సాగినా, వీరి

విభేదాలు పెరిగిపోయాయి. కారణం, పారిశ్రామిక సంస్థ కమిటీ మోటారు, ఉక్కు, రబ్బరు, వస్త్రములు, అల్యూమినియం తదితర పరిశ్రమలలో విజయము సాధించింది. శాంతికై సాగిన ప్రతిపాదనలన్నీ విఫలమై పోయాయి. ఈ రెండు సంఘాలు ఒకరికొకరు తమతమ రంగములపై దాడులు సాగించారు. అందువల్ల వారిమధ్య మనస్పర్థలు పెరిగిపోయాయి. 1938 జనవరిలో మూడు సంఘాలు, 1938 ఏప్రిల్‌లో ఆరు సంఘాలు అమెరికను కార్మికసమాఖ్య కార్యవర్గము తమ సభ్యత్వమునుంచి రద్దుచేసినది. కారణము అవి పారిశ్రామికసంస్థ కమిటీతో సంబంధము కలిగియుండుటలేదు. రాష్ట్రస్థానిక సమాఖ్యలకుకూడా అటువంటి సంఘాలు తొలగించమని ఉత్తర్వులు జారీచేసింది. ఆ సంవత్సరములోనే పారిశ్రామిక సంస్థకమిటీ తన పేరు పారిశ్రామికసంస్థ కాంగ్రెసుగా మార్చుకొన్నది. జాతీయ అంతర్జాతీయ కార్మికసంఘంగా తన్ను రూపొందించుకొంటూ ఒక రాజ్యాంగ చట్టంకూడా ఏర్పరచుకున్నది.

కార్మిక ఉద్యమంలో చీలిక చాలా కలవరము కలిగించింది. కొన్ని పరిశ్రమల విభాగాలు స్తంభించిపోయాయి. సంఘాలు గుర్తించుదామనే యజమానులకు కొంతవరకు అనేక కష్టాలు కలిగి సంఘర్షణపూరితమైన పరిస్థితులు ఏర్పడ్డాయి. నేషనల్ లేబరు రిలేషన్సుబోర్డు పనులుకూడా సంశ్లిష్టమై పోయాయి. రెండు సంస్థల తీర్మానాలు వీరికి సరిపడలేదు. రాజకీయ అంతర్జాతీయ రంగాలయందు సంఘర్షణాపూరిత కార్యక్రమాలు కార్మికులు ప్రదర్శించసాగిరి. కార్మిక ఉద్యమానికి స్నేహితులైనవారు ఈ పార్టీవివాదాలలో తలదూర్చుటకు జంకి దూరమైపోయారు.

కొన్ని ప్రత్యేకపరిస్థితుల ప్రభావంవల్ల ఈ ఉద్యమంలోని చీలిక సంఘాల సభ్యత్వంలో తగ్గుదలమాత్రం కలిగించలేదు. పైగా సభ్యత్వం బాగా పెరిగింది. దీనికి మూడు కారణాలు చెప్పవచ్చు. ఆకాలంలో వ్యాపారం బాగా సాగుట, నేషనల్ లేబరు రిలేషన్సు చట్టముయొక్క ప్రభావము, పురాతన వృత్తిపనివారి సంఘముల ఉత్సాహము. అమెరికను కార్మికసమాఖ్య సంఘాల ఉత్తేజము. పారిశ్రామిక సంస్థకమిటీయొక్క సంఘటిత ఉద్యమం. 1950 దశాబ్దం ప్రథమదశలో పారిశ్రామిక వృత్తి పనివారి సంఘాల సభ్యత్వం ఆర్థిక మాంద్యం నాటి మొదటి దినాలలో కంటె అయిదురెట్లు అభివృద్ధి చెందింది.

## టాఫ్ట్ హార్ట్లే చట్టము

పందొమ్మిదివందల నలభై మొదటిసంవత్సరాలలో, వేగ్ నర్ చట్టమును ఎదుర్కొంటూ యజమానులు ఒక అలజడి లేవదీసారు. యజమానులకు వ్యతిరేకంగా ఆ చట్టము కొంత పక్షపాతము చూపిందని వారివాదన. 1947 సంవత్సరంలో కాంగ్రెస్ రెండు శాసనసభలకు రిపబ్లికనులు అధిక సంఖ్యలో ఎన్నిక కావడంవల్ల "వేగ్ నర్" చట్టానికి అనుబంధంగా టాఫ్ట్ హార్ట్లే చట్టం అమలులోకి వచ్చింది. అధికారరీత్యా దీనినే లేబర్ మేనేజిమెంటు రిలేషన్సుచట్టము, 1947 అంటారు.

## కార్మిక యజమానుల సంబంధ చట్టము

టాఫ్ట్ హార్ట్లే చట్టము ప్రకారం చాలవరకు వేగ్ నర్ చట్టములోని విభాగాలు ఆమోదింపబడ్డాయి. ముఖ్యంగా అన్యాయపూరితమైన యజమానుల చర్యలను నిషేధించింది. అయితే సంఘాలకు వ్యతిరేకంగా కొన్ని యజమానుల చర్యలకు శాసనాధికారం యిచ్చింది. ఈ రెండుచట్టములందు ఉద్యోగులు స్వయంగా సంఘటితపడుటకు, తాము ఎన్నుకున్న ప్రతినిధులద్వారా ఉమ్మడిబేరం సాగించుకునే హక్కుతో యజమానులు కలగచేసికొనకుండ నిర్ణయించబడింది. ఉద్యోగులు సంఘాలకు అనుబంధమైనందుకు, తత్సంబంధ కార్యక్రమాలు నడుపుతున్నందుకు లేదా కార్మిక యజమానుల సంబంధములచట్టం ప్రకారం నిర్ణయించబడిన కొన్నిపద్ధతులు అవలంబించినందున, ఏవిధమైన విచక్షణ చూపకూడదని యజమానులను కట్టుచేసారు. ఆర్థిక, తదితర ఒత్తిడులతో కార్మికసంఘాలపై అధికారం చలాయించకుండా యజమానులు నిషేధించబడ్డారు. ఆయా పారిశ్రామిక విభాగాలలోని యజమానులు సమిష్టిగా కార్మికప్రతినిధులతో బేరము సాగించవలసిందని నిర్దేశింపబడింది.

వేగ్ నర్ చట్టములోవలెకాక, టాఫ్ట్ హార్ట్లే చట్టములోకూడ కార్మిక సంఘాలు యజమానులకు వ్యతిరేకంగా అన్యాయపూరితమైన చర్యలు చేయకుండ తోటి కార్మికులకు అన్యాయం జరగకుండాను నిబంధనలున్నవి. ఇతరవిధాలుగా రక్షణకలిగిన ఉద్యోగులైన సూపర్ వైజర్లు,

గార్డులు, చౌకీదారులు, కార్మిక సంఘాల్లో సభ్యులు కావడం సంఘం సభ్యత్వం స్వీకరించేహక్కులు నియమిత పరచడమైంది.

వేగ్నర్ చట్టముక్రింద, జాతీయకార్మిక యజమానులమండలి ప్రాసిక్యూటర్ గాను, జడ్జిగానుకూడా వ్యవహరించుచున్నదని తీవ్ర విమర్శకు గురియైనది. టాఫ్ట్ హార్ట్లే చట్టము నిర్మించినవారు ఈలోపము పరిష్కరించుటకు ఒక జనరల్ కౌన్సెలును సృష్టించి ఆయనకు నేరముమోపు అధికారములిచ్చి, బోర్డుకు తీర్పుఅధికారము లిచ్చిరి.

ఫిర్యాదులు చేయుటకు పూర్తివిచక్షణ ఆ సలహాదారునకు (కౌన్సెలు) యివ్వడమైంది. బోర్డుయొక్క ప్రాంతీయ ఆఫీసుల పరిపాలనాబాధ్యత పూర్తిగా అతని హస్తగతం చేయబడింది.

టాఫ్ట్ హార్ట్లే చట్టము, సమ్మెలు చేయుటకు 60 రోజుల నోటీసు యివ్వవలెనని స్పష్టపరిచింది. జాతీయ అత్యావశ్యకత లక్షణము కల్గిన సమ్మెలను 80 రోజులవరకు కోర్టు ఆజ్ఞతో నిరోధించవచ్చునని యీ చట్టము ప్రకటించింది. ఎక్కువ వేతనముకొరకుగాని, మరి ఏవిధమైన యితర ఆర్థిక లాభముకొరకుగాని జరుపబడిన సమ్మెలో పాల్గొనినవారు అన్యాయమైన కార్మికచర్యలు నిరోధించిన ఉద్యోగులువలెగాక తమ పదవులలో యితరులు నియమింపబడినచో ఆ పదవులు తిరిగిపొందేహక్కు పోగొట్టుకుందురు. కార్మికసంఘాలు అప్రధానమైన అలజడులలో నిమగ్నమైనచో అటువంటి నేరంలో బలం కనిపించినపుడు జనరల్ కౌన్సెల్ ఆ సమ్మె ఆపుటకు కోర్టును అనుమతి కోరగలడు. యజమానులు కూడా అటువంటి కార్మికసంఘములపై దావా వేయుటకు అధికారము కల్గియున్నారు. కార్మిక సంఘాలు కనుక తమ ఆర్థిక స్తోమత ఆఫీసర్లు కమ్యూనిస్టేతర [affidavits] ప్రమాణ వాఙ్మూలములు, తదితర రాజ్యాంగ నియమాల గురించి సమాచారము సేకరించి యుంచనప్పుడు, చట్టము ప్రకారము యీ సంఘాలు జాతీయ కార్మిక యజమానుల సంబంధ మండలి సహాయము, ఏవిధముగాను పొందుటకు అర్హులు కారు. ఫెడరల్ ఆఫీసుకు ఎన్నికకై నిలుచు నే వ్యక్తులకు ప్రచార విరాళాలిచ్చేపద్ధతి యీ చట్టము నిషేధించినది.

## టాఫ్ట్ హార్ట్లే చట్టము యొక్క విభజన.

కార్మిక ప్రతినిధులు, కార్మిక సంబంధములు పరిశీలించే విద్యార్థులు యీ చట్టము గురించి యీ దిగువ విమర్శలు చేసారు.

1. అత్యావశ్యకత కల్గిన వివాదాలపై ఆజ్ఞలు, అత్యవసర వివాదాలందు 80 దినముల నాపే ఆజ్ఞ అనవసర ఆలస్యము కలుగచేయునే కాని ఏ ఒడంబడికకు అనుకూలము చేయదని మరో 80 రోజులవరకు శాసనం ద్వారా యజమానికి అనుకూలంగా వివాదాస్పదమైన తగవులు పరిష్కరింపబడినట్లేనని ఫెడరల్ కన్సీలియేషను అండ్ మీడియేషను సర్వీసు డైరక్టరు అభిప్రాయపడిరి.

### అంగశ్ఛ మూత అంక్ష

ఈ అంక్ష కార్మికుల సంఘముల స్త్రీ పురుషులు కూలిపని చేసుకొనునపుడు అనేకపరిశ్రమలకు సంఘాలకు హాని కలిగించింది. ముఖ్యంగా కట్టడాలు, సముద్ర సంబంధ పరిశ్రమలయందు, వినోద పరిశ్రమలయందు యీ హాని సంభవించింది. యజమాని కార్మికుడు సహేతుకంగా ఒడంబడికకు రావలసిన వేదిక వీటిలో ఎక్కువ కనిపిస్తుంది.

### అప్రధానమైన ఆంక్షలు

ఈ ఆలజడులపై అంక్ష విధించుట కార్మికులకు అన్యాయమని, యీ చట్టం సృష్టించినవారిలో ఒకడు రాబర్టు ఎ. టాఫ్ట్ తనమరణము ముందే స్పష్టపరిచేరు.

"యజమానుల వాక్స్వాతంత్ర్యము" సెక్షన్ 8 (C) క్రింద వాక్స్వాతంత్రము సవరణ, అర్థము చాలా పెద్దది. సంఘముల గురించి యజమానులు ఏ అసహ్యాకరమైన ప్రకటనలైనా చేయడంవల్ల ఉద్యోగుల చర్యలపై ఒత్తిడి కలిగించే ఫలితాలు సృష్టించగలరు.

### ఆర్థిక సమ్మెదారులకు హోదాభంగము

వేతనాలు, కాలం, పనిచేయు షరతులు, వీటికై సమ్మెచేయు కార్మికుని "ఆర్థిక సమ్మె దారుడం"టారు. ఇతను సమ్మెచేసే కాలంలో మరొకనిని పనిలో నియమిస్తే సమ్మెదారుడి ఉద్యోగం పోతుంది. దీనివల్ల సమ్మె విరమించుట తప్పనిసరి అవుతుంది.

## కార్మికులపై నష్టం దావాలు

జాతీయ వివాదాలల్లో యీ దావాల్లఅంశ సంఘముపై అన్యాయమైన బరువు. కార్మిక యజమానుల సంబంధములందు యిదొకి అడవి పోరాటంగా తయారవుతుంది. పారిశ్రామిక శాంతికి యిది ఉపకరించదు.

## కొన్ని తరగతుల కార్మికులను విడదీయుట.

ఈ చట్టం రక్షణ క్రింద వ్యవసాయ కార్మికులు, ఫోర్ మెన్ మున్నగు వారిని కూడా చేర్చటం భావ్యం.

## అధికారమును చీల్చుట

బోర్డుకు జనరల్ కౌన్సెలుకు మధ్య అధికారము విడదీయుట అనేక ఘర్షణలకు, ఆలస్యమునకు, నిపుణతలేని పరిపాలనకు దారితీయునని నమ్మబడింది.

## పనిచేసే హక్కు శాసనములు

చట్టమునందలి 14 [b] సెక్షనుపై అసమ్మతి తెలియచేయబడింది. సంఘముల వ్యతిరేకతకు భద్రతయిచ్చు శాసనాలు అందులో ఆమోదింపబడినాయి. దీనిని బలపర్చువారు ఈ శాసనాలను పనిచేసే హక్కుశాసనాలని పేరుపెట్టారు. రాష్ట్రశాసనాలు జాతీయ శాసనాలతో సంఘర్షణాపూరిత మైనపుడు దానిని అదుపులో పెట్టుకోవాలనన్న సూత్రముసే కృణీకరించింది.

## నేషనల్ లేబర్ రిలేషన్సుబోర్డు నిర్వచనాలు.

1954, 1955 ప్రాంతాలలో కార్మిక సంఘాలు, నేషనల్ లేబర్ రిలేషన్సుబోర్డు యిచ్చిన శాసన నిర్వచనాలు ధిక్కరించాయి. రాష్ట్రముల మధ్య పరస్పర సంబంధములుగల పరిశ్రమలలో ముఖ్యముగా చిల్లరదుకాణములు, పవర్ స్టేషన్లు, టెలివిజన్ రేడియో స్టేషన్లు, వార్తాపత్రికలు, సేవాతత్పరతగల్గిన కంపెనీలు మొదలగు వాటిలో పనిచేయు కార్మికులకు యీ శాసనం వర్తించదను తీర్పులు సంఘాలు ధిక్కరించాయి.

## ఉమ్మడి బేరంలో కలగజేసికొనుట

కార్మిక సంబంధములు పరిశీలించేవారు చాలమంది యీ చట్టంలో ఉమ్మడి బేరములందు, మానవ సంబంధముల తీర్పులు, నిర్వచనములందు

కోర్టులు, పీడర్లు మితిమీర్రి కలగజేసికొనడంవల్ల ప్రజాస్వామ్య పద్ధతులు సన్నగిలినవని విచారము వెలిబుచ్చారు.

## ట్రూమను పరిపాలనలో కార్మికసంఘాలు.

1947 లో ప్రెసిడెంటు ట్రూమన్ వీటోతో అమలులోకివచ్చిన టాప్ట్ హార్ట్లే చట్టము, ఆర్థిక రంగములో కార్మిక కార్యక్రమములు చాలవరకు అణచుటచే రాజకీయ రంగంలో మితిమీరిన సందడి ఏర్పడినది. రాజకీయ చర్యలకై అమెరికను కార్మిక సమాఖ్య ఒక లేబర్ లీగ్ను స్థాపించినది. పారిశ్రామిక సంస్థ కమిటీ రాజకీయ చర్య కమిటీ ఒకటి ఏర్పరిచింది. 1948 లో ట్రూమన్ తిరిగి ఎన్నో ప్రతిబంధకాలడ్డునని ఎన్నిక కావడం యీ కార్మిక వర్గాల ఉత్సాహమైన కార్యక్రమాల వల్లనే అని చెప్పుదురు.

1940 చివరి సంవత్సరాలలో కమ్యూనిస్టుల అదుపులోఉన్న కార్మిక సంఘాలు పారిశ్రామిక సంస్థ కమిటీనుంచి తొలగించ బడినాయి. సాంఘిక శాసనాలు, కనీసం వేతనము సాంఘిక ఇన్స్యూరేన్సు మొదలైన కార్య క్రమములు బలపరచుటకు కార్మిక సంఘాలు ఎన్నో శాసనసభా యుద్ధాలు జరిపాయి. ఈ సంవత్సరాలలోనే ఎన్నో సంఘాలు తమ సంఘ సంక్షేమ కార్యక్రమాలు పెంచనున్నాయి. విద్యావిషయ కార్యక్రమములు కూడా హెచ్చించి అంతర్జాతీయ పరిస్థితిపై అత్యంత శ్రద్ధచూపిరి. అంతర్జాతీయ రంగంలో అమెరికను కార్మిక సమాఖ్య మరియు పారిశ్రామిక సంస్థ కమిటీలు అత్యంత సన్నిహిత పరస్పర సంబంధాలు పెంపొందించుకుని అంతర్జాతీయ స్వతంత్ర వృత్తి సంఘాల సమాఖ్యలో సభ్యులుగా చేరాయి.

## సంఘీభావము.

పారిశ్రామిక సంస్థ కమిటీ మరియు అమెరికను కార్మిక సమాఖ్య 1952 లో అడ్లాయ్ స్టీవెన్సన్ను డెమోక్రటిక్ అభ్యర్థిగా బలపరచాయి. మొట్టమొదటిసారిగా అమెరికను కార్మిక సమాఖ్య సమావేశము అధికార పూర్వకంగా అధ్యక్ష అభ్యర్థిని బలపరిచాయి. ఐసెన్హోవర్ పరి పాలనాధికారము పొందిన కొద్దిదినముల తర్వాత ఎక్కువగా గౌరవింప బడి అమెరికను కార్మిక సమాఖ్య అధ్యక్షుడు విలియమ్ గ్రీన్ జనరంజక

డైన పారిశ్రామిక సంస్థ కమిటీ అధ్యక్షుడు ఫిలిప్ ముర్రే చనిపోయారు. వారికి వారసులుగా నిపుణులై శక్తివంతులైన మరి యిద్దరు అధ్యక్షులు జార్జిమీనా, వాల్టర్ పి. రూథర్ నాయకులుగా ఎన్నికైయ్యారు.

ట్రూమన్ రాజ్య పరిపాలన తర్వాత కార్మిక సంఘములపై చీటికి మాటికి జరిగిన దాడులు, నూతన కార్మిక నాయకులు రంగములో ప్రవేశించుట జాతీయ అంతర్జాతీయ సమస్యలపై అమెరికను కార్మిక సమాఖ్య మరియు పారిశ్రామిక సంస్థ కమిటీ చూపే జయప్రదమైన సహకారము 1950 దశాబ్దం ప్రథమ దశలలో ఈ రెండు పెద్దకార్మిక సమాఖ్యలు కలిసి పోడానికి ఉత్సాహకరమైన పరిస్థితి ఏర్పడింది.

1953 లో అమెరికను కార్మిక సమాఖ్య మరియు పారిశ్రామిక సంస్థ కమిటీ కలిసి ఒక సంయుక్త కమిటీ ఏర్పడింది. ఈ రెండు సంస్థల ప్రతినిధులు అందులో వున్నారు. వారికి ఈ రెండు సమాఖ్యలు ఏవిధంగా కలిపేయాలో అన్నది పరిశీలించుటకు అధికార మీయబడింది.

## దాడి మానే ఒడంబడిక

1953 జూన్‌లో యీ ఐక్య కమిటీ ఒక నివేదిక సమర్పించింది. అందులో ఈ రెండు సమాఖ్యలు దాడి చేసుకొనుట మానాలని వాటికి అనుబంధమైన కార్మిక సంఘాలు దీని ననుసరించ వలెనని కోరడమైంది. ఈ రెండు సమాఖ్యలు ఈ నివేదికను అంగీకరించాయి. 1953 డిసెంబరు 16వ తేదీన ఇటువంటి ఒడంబడిక వారు ఒప్పుకొన్నారు. మరొక అర్థ సంవత్సరము గడిచాక, 1954 జూన్ 9 వ తారీఖున ఈ ఒడంబడిక 65 అమెరికను కార్మిక సమాఖ్య సంఘాలు 29 పారిశ్రామిక సంస్థ కమిటీ సంఘములు ఆమోదించాయి. తరువాత పెరిగిన సంఘాలుకూడా దీనికి అంగీకరించాయి. అమెరికను కార్మిక సమాఖ్య అధ్యక్షుడు జార్జి మీనీ పారిశ్రామిక సంస్థ కమిటీ అధ్యక్షుడు వాల్టర్ పి. రూథర్ చేసిన ఒక సంయుక్త ప్రకటనలో పరస్పరం దాడి చేసుకునే ఒడంబడిక అక్షరాలా పాటించాలని ఈ సంయుక్త కమిటీ ఈ రెండు సమాఖ్యల కలయికకు దోహద పరిచి ఈ రెంటి సమస్యలన్నీ కలిపి పరిష్కారము చేయగల దని ఆశాభావం వెలిబుచ్చారు.

ఒకరిపై మరొకరు దాడి చేయకూడదనే యీ ఒడంబడిక బాగా పని చేసింది. 1954 అక్టోబరు 14 వ తేదీన వాషింగ్టన్‌లో ఐక్యకమిటీ కలుసుకుని ఈ సమాఖ్యలు కలిపే ప్రణాళికలు తయారుచేసింది. ఈ సమావేశం పూర్తయ్యాక ఐక్య కమిటీ ఒక సర్వాంగీకారమైన ప్రకటనలో ఈ కలయిక వల్ల శ్రామికసంఘాల కేంద్రం ఒకేఒకటి అమెరికాలో ఉండగలదని చెప్పారు. అమెరికా కార్మిక సమాఖ్య పారిశ్రామిక సంస్థ కమిటీ అధ్యక్షులకు వివరాలతో కూడిన తదితర ఐక్య పథకాలు తయారుచేయుటకు అవసరమైన ఉపసంఘములు నియమించే అధికారమే యివ్వబడింది.

1954 లో ఈ ఐక్య కమిటీ చేసిన పురోగమనము ఈ రెండు సంస్థల సమావేశాలు ఆమోదముద్ర వేసి అభినందించాయి. ఈ రెండు సమాఖ్యలు కలిసిపోవుటకు నిశ్చయింపబడింది.

## ఐ క్య ఒ డం బ డి క

1955 ఫిబ్రవరి 8, 9 తేదీలలో ఈ రెండు కార్మిక సంస్థల ప్రతినిధులు ఫ్లోరిడాలో మియామిబీచ్‌లో కలుసుకుని ఐక్య ఒడంబడిక తయారుచేసారు. అనుబంధమైన జాతీయ అంతర్జాతీయ సంఘాల స్వతంత్ర సంపూర్ణతను భద్రపరచాలని వృత్తి సంఘ ఉద్యమములో పారిశ్రామిక వృత్తి సంఘాలు రెండు అవసరమని ఈ ఒడంబడికలో అంగీకరించబడింది. ఈ ఐక్య సమాఖ్యలో జాతి, రంగు, పుట్టుక మొదలగు విచక్షణ లేకుండా కార్మికులందరూ ఈ సమాఖ్య వల్ల కలిగే లాభాలన్నీ పొందగలందులకు ఒప్పుకొనడమైంది. ఈ ఐక్య సమాఖ్య అమెరికను శ్రామిక సంఘోద్యమాన్ని అన్ని దుష్ప్రభావాలనుంచి కమ్యూనిస్టు ఏజెంట్ల దుష్ప్రవర్తనల నుంచి ప్రజాస్వామ్య సూత్రములపై ఆధారపడే ప్రజాస్వామ్య పద్ధతి శ్రామిక సంఘోద్యమమునకు ఎదురాడే అన్ని వర్గాలనుంచి రక్షించవలెనని నిర్ణయింపబడింది. పారిశ్రామిక అనుబంధ సంఘములన్ని చేరగలిగే ఒక పారిశ్రామిక సంఘశాఖ ఈ సమాఖ్య అధీనంలో స్థాపించబడింది.

ఈ ఒడంబడిక ఫిబ్రవరిలో అమెరికను కార్మిక సమాఖ్య పారిశ్రామిక సంస్థ కమిటీల సంయుక్త కార్యవర్గాలచే ఆమోదింప బడింది. ఈ ఆమోదించడంలో పారిశ్రామిక సంస్థ కమిటీ కొన్ని సూత్రాలు పునరుద్ఘాటించింది. అనుబంధ కార్మిక సంఘాల సంపూర్ణత్వము గుర్తించి దానికి

బాధ్యత వహించుట పారిశ్రామిక సంఘ సభ్యత్వంలో సమానత్వం కలిగి యుండుట కళియు ఇచ్చుట రాజ్యాంగ వాగ్దానాలు నిలబెట్టుకొనుట జాతి వివక్షణ ఒకరిపై మరొకరు దాడిచేయుట కమ్యూనిస్టులు తదితర నియంతృత్వశక్తులలోనికి రానీయకుండుట వినాశకరమైన తదితర దుష్ప్రభావాలు దూరంచేయుట మొదలైనవి ముఖ్యమని పారిశ్రామిక సంస్థ కమిటీ అభిప్రాయము వెలిబుచ్చింది.

## ఐక్య సమావేశము

1955, మే, 2వ తేదీన ఐక్య కమిటీ ఐక్య సమాఖ్యకు నూత్న రాజ్యాంగము రూపొందించినది. కొన్ని దినాల తర్వాత ఈ రెండు సంస్థల సమాఖ్యలు దీనిని ఆమోదించినవి. డిసెంబరు 2, 4 తేదీలలో ఈ రెండు సమాఖ్యలు న్యూయార్కులో కలుసుకుని తమ సంస్థలను ఎత్తివేసినారు. డిసెంబరు 5, 1955 లో ఈ రెండు సంస్థలు అమెరికను కార్మిక సమాఖ్య పారిశ్రామిక సంస్థ కమిటీ పూర్తి నామధేయాలతో 15 మిలియనుల సభ్యత్వంలో కలిసిపోయి ఐక్య సమాఖ్య స్థాపనచేసిరి.

## "ఎ. యఫ్. ఎల్ – సి. ఐ. ఓ" నియమావళి.

నియమావళిలోని పీఠికలో ఈ సంస్థ ఏర్పడుటనుగూర్చి ఒక ప్రకటన ఉంది. ముఖ్యంగా సంఘ సభ్యులు, తర్వాత కార్మికులందరి క్షేమంకొరకు అమెరికా దేశంలోని ప్రజలు, ప్రపంచంలోని అందరి కొరకు యీ సంస్థ ఏర్పడినదని ప్రకటన సారాంశము.

పీఠిక ప్రకటన ఈ దిగువ విధముగా ఉంది. అమెరికను కార్మిక సమాఖ్య మరియు పారిశ్రామిక సంస్థ కమిటీ రెండునూ కలిపి ఏర్పరిచిన సమాఖ్య స్థాపన అమెరికా దేశంలోని కార్మిక ప్రజల ఆశలు, ఆశయాలకు ఒక వాక్చిత్రము.

ఈ ఆశలు ఆశయాల సాఫల్యానికి తమ రాజ్యాంగ పరిపాలన పరిమితిలోని ప్రజాస్వామ్య పద్ధతుల ద్వారాను మా సంస్థల ఆచార సంప్రదాయాల కనుగుణంగాను సాధింతుము.

ఉమ్మడి బేరం సాగించునపుడు సమాజములో పౌరసంబంధమైన బాధ్యతలు హక్కులు అనుభవించునపుడు అమెరికా దేశంలోని ప్రజ లందరి యిష్టాయిష్టములు బాధ్యతాయుతముగా మన్నింతుము.

కార్మిక స్త్రీ పురుషులు ప్రతిష్ఠమైన సంస్థగా ఉండుటకు మేము ప్రమాణము స్వీకరింతుము. వారికి న్యాయమైన హక్కుల్ని లభించేటట్లు గుర్తింపుకు ప్రయత్నింతుము. జీవన సదుపాయములు, పనిచేసేవసతులు ఎక్కువ ప్రమాణములలో యుండునట్లు కృషిచేయుదుము. మన ప్రజాస్వామ్య సంఘమునకు పునాది అయిన ప్రాథమిక స్వాతంత్రములు జీవితాభివృద్ధికి బలపరుచు పద్ధతులు అన్వేషించుదుము.

మానవాత్మను బానిసగా చేయునట్టియు మనదేశములోని ప్రజాస్వామ్య సంస్థల నణగద్రొక్కునట్టియు శక్తులతో పోరాడుదుము.

మానవుడు వ్యక్తిగా హోదాపొందునట్లు అతని పరపతికై కృషి సల్పుదుము.

పురాతన సంప్రదాయాలకు కృతజ్ఞతలు తెల్పుతూ భవిష్యత్తు సవాలును ఎదుర్కొన గలిగేశక్తి కలదనే విశ్వాసంతో ఈ నియమావళిని ప్రకటించుచున్నాము.

ఈ నియమావళి సదస్సు సంపూర్ణ అధికారయుత పరిపాలనా సనూఖ్యగా తయారు చేసింది. పూర్వం అమెరికను కార్మిక సమాఖ్య మరియు పారిశ్రామిక సంస్థ కమిటీ సంవత్సరాని కొకసారి కల్సుకొనునట్లుగాక యీ సమావేశం రెండు సంవత్సరముల కొకసారి కనుసుకొనవలయునని నిర్ణయించబడింది. కొన్ని సంప్రదాయాలకు అనుకూలంగా ఒక అధ్యక్షుడు కార్యదర్శి మరియు కోశాధికారి, ఇరవైఏడుగురు ఉపాధ్యక్షులు గల కార్యవర్గము యీ సమాఖ్య వ్యవహారములు పరిపాలించును. ఈ కార్యవర్గము మరియొక్క కార్యవర్గ కమిటీని నియమించును. ఆకమిటీలో అధ్యక్షులు, కార్యదర్శి—కోశాధికారియు, మరి ఆర్గురు ఉపాధ్యక్షు లుందురు. వీరు రెండు నెలల కొకసారి కలుసుకుని అధ్యక్షునితోనో, కార్యదర్శితోనో ముఖ్యవిధానాలుగూర్చి చర్చించుదురు.

జాతీయ అంతర్జాతీయ సంఘాల ముఖ్యమైన ఆఫీసర్లను ప్రతీ వ్యాపారం పారిశ్రామికశాఖకు సంబంధించిన వారని కలిపి విధానాలు నిర్ణయించుటకు ఈ రెండు సంస్థల సదస్సు కలుసుకొనే లోపుగా ఒక ప్రత్యేక మండలి సంవత్సరమున కొకసారి కలుసుకొనును. కార్యవర్గం కౌన్సిల్ కాని కార్యవర్గం ఆఫీసర్లుకాని సూచించిన విధాన సమస్యలు గురించి నిర్ణయాలు చేయును.

దీని కనుగుణంగా అనేక శాఖలు ఏర్పడ్డాయి. వీటిలో పారిశ్రామిక సంఘ శాఖకు వాల్టర్ . రూథర్ డైరెక్టరుగాను; జేమ్సు బి. కేరీ కార్యదర్శి-కోశాధికారిగా ఎన్నికైరి. కట్టడాలు; నిర్మాణాల వృత్తులు లోహ వృత్తులు, యూనియన్ లేబెల్, సేవావృత్తులు, రైల్వే ఉద్యోగులశాఖలు; అదనంగా శాసనములు, పౌరహక్కులు, రాజకీయ విద్య నైతిక సాధనలు, అంతర్జాతీయ వ్యవహారాలు, విద్య, సాంఘిక భద్రత, ఆర్థిక విధానము, సమాజ సేవాశాఖలు, గృహనిర్మాణము, పరిశోధన, పౌరసంబంధములు, భద్రతాయుత వృత్తి, ఆరోగ్యము, ప్రవీణుల విషయాలు మొదలగు వాటిపై 14 కమిటీలు ఏర్పడ్డాయి.

ఈ సమాఖ్యను ఆర్థికంగా పటిష్ఠం చేయుటకు తలఒకటికి పన్ను నెలకు నాల్గుసెంట్లు చొప్పున జాతీయ అంతర్జాతీయ కమిటీ సభ్యుల నుంచి, నిర్వాహక కమిటీ సభ్యులనుంచి వసూలు చేయబడుతుంది. స్థానిక సంస్థలుకూడా నెలవారీగా తమ పన్నులు కట్టుదురు.

## ఐక్యత ఫలితాలు.

దేశములోను, విదేశాలలోను అమెరికను కార్మిక సమాఖ్య మరియు పారిశ్రామిక సంస్థ కమిటీ ఐక్యత కార్మిక ఉద్యమమును, ప్రజాస్వామ్య శక్తులను బలపరుచునని సమావేశములో అందరూ ఆశాభావము వెల్లడించారు. ఈ ఐక్య కార్మిక ఉద్యమానికి అధ్యక్షుడుగా ఎన్నికైన జార్జిమీనీ "నేటి కాలములో యిది వృత్తి సంఘ తత్వములో ఒక ముఖ్యమైన పరిణామము" అని అన్నారు. ఉపాధ్యక్షుడిగా ఎన్నికైన వాల్టర్ రూథర్ "అమెరికను కార్మిక ఉద్యమము చరిత్రలో ఒక బ్రహ్మాండమైన అధ్యాయముయొక్క ద్వారమువద్ద నున్నా"మని అన్నారు.

కన్వెన్షనులో తీసుకొబడిన చర్యలు ఒక పెద్ద; ఎంతో ప్రభావ సమన్వితమైన ఒక కార్మిక సమాఖ్య స్థానం యీ ప్రజాస్వామ్య ప్రపంచంలో ఫలించింది. ఈ క్రింద నుదహరించిన ఆరు ప్రముఖమైన పద్ధతులలో అమెరికను కార్మిక ఉద్యమం బలపడింది.

1. అమెరికా కార్మిక సమాఖ్య పారిశ్రామిక సంస్థ కమిటీల మధ్య గత ఇరవై సంవత్సరాలలో నాయకులమధ్య, ప్రముఖ వ్యక్తులమధ్య ఏర్పడిన సంఘర్షణ, ఎదురుదాడులు, దీనితో ఉపసంహరించబడినాయి.

2. మునుపటి రెండు పోటీ సమాఖ్యలు అధికారమేమిటనే సంఘర్షణకు యజమాని బలియగుట మానింది.

3. ముఖ్యంగా నేత, రసాయన పరిశ్రమలలో సంఘటితముకాని కార్మికులను, "వైట్ కాలర్" కార్మికులను సంఘటితపరుచుటకు చేయు ఉద్యమమునకు మరింతశక్తినిచ్చే పునాది ఏర్పడినది. 1956 ఫిబ్రవరిలో జరిగిన కార్యవర్గ సమావేశమందు "శ్రామికసంఘాల అభివృద్ధికి సంఘటితపరచవలసిన కార్మికులు మిలియన్లలో ఉండటం అపూర్వమైన ఒక బలమని" జార్జిమీనీ ప్రకటించారు. ఆర్థిక సంబంధమైన ఒక కమిటీని, సంస్థల ఆధిపత్య సమస్య నిర్ణయం చేయుటకు మరొక కమిటీని కౌన్సిలు ఏర్పరిచింది. ఈ రాజ్యాంగ బద్ధమైన సమావేశంలో యీ కార్మికుల సంఘటిత ఉద్యమానికి 4 మిలియనుల డాలర్లు యిస్తానని పారిశ్రామికసంస్థ కమిటీ వాగ్దాన మొనర్చింది. రాబోయే సంవత్సరాలలో కార్మికుల సభ్యత్వం మరి రెండురెట్లు పెరగగలదని పారిశ్రామిక సంస్థ కమిటీ ఆశపడింది. నేత, మరి తదితర పరిశ్రమలలోని వందలకొలది కార్మికులు తమ కార్యక్రమాలు యీ సమాఖ్య ఏర్పడిన పిదప సన్నగిలినవని గుర్తించారు.

4. కార్మిక సాంఘిక శాసనముల విషయములలో యీ ఐక్య కార్మిక ఉద్యమము శ్రామిక సంఘాల కృషికి బలము చేకూర్చింది. సాంఘికాభివృద్ధికి అనుకూలురైన స్త్రీ పురుషుల ఎన్నిక విషయంలో వీరి సంఘటిత శక్తి కొంత ప్రాధాన్యం కలిగించింది.

5. విద్యావిషయక సమాజ సమస్యలలో ముఖ్యంగా నగర, రాష్ట్ర, కేంద్ర అంతర్జాతీయంగా సంబంధించిన వాటిలో కూడా — కార్మికులు ఎక్కువగా పాల్గొనుటకు అవకాశ మేర్పడింది. కారణమేమన కార్మిక సైన్యమునకు సంబంధించిన దేదీ స్థానిక, జాతీయ, అంతర్జాతీయ సమస్యలకు సంబంధించి యుండదు.

6. లంచగొండితనము, జాతివిచక్షణ, స్థానికంగాను, బయట కమ్యూనిస్టు ప్రభావంతో పోరాడటానికి సంఘములందు, బయట కూడా కార్మికులు యీ ఐక్య సమాఖ్యవల్ల బలపడ్డారు. ఈ విషయంలో ముఖ్యంగా నైతిక సాధనాలు, పౌరహక్కులు, అంతర్జాతీయ విషయాలు,

పైఏర్పాటుచేసిన బలవత్తరమైన కమిటీలు క్రమక్రమాభివృద్ధికి తోడ్పడ్డాయి.

## అపరిష్కృత సమస్యలు.

ఈ ఐక్య సమాఖ్యవల్ల కార్మికుల వ్యవహారంలో సంపూర్ణంగా పరిష్కృతము కాలేదు.

సంఘటిత పరచవలసిన కార్మికులలో మూడువంతులలో రెండువంతులు సంఘటితపడలేదు. సంఘటిత పరిచే ఉద్యమంలో ముఖ్యంగా దక్షిణమందు వైట్–కాలర్ పారిశ్రామిక కార్మికులయందు ప్రబలమైన ఎదురు శక్తులు కార్మికులను చుట్టుముట్టాయి.

మంచి శక్తివంతమైన సంఘాలైన యునైటెడ్ మైన్ వర్కర్సు పనిచేస్తున్న రైలురోడ్డు బ్రదర్ రోడ్డు సంఘాలలో చాలవరకు యీ ఐక్య సమాఖ్యకు బయటనే వుండిపోయాయి. ఈ ఐక్యసమాఖ్యలో విడిగా రెండు మూడు సంస్థలలో సభ్యత్వమున్న కార్మికసంఘాలు కూడా ఉన్నాయి. ఇటువంటి సభ్యత్వం కార్మిక ఉద్యమ పురోగమనాన్ని తీవ్రంగా అడ్డుకొంటుంది.

గలాటా, లంచగొండితనం యింకా సాగుతూనేవున్నాయి. తక్కినవాటి కంటె నిర్మాణవృత్తులలో టీమ్‌స్టర్స్ యూనియన్‌యందు తక్కువ తరగతిలో యివి సాగుతున్నాయి. 1953 లో బహిష్కరింపబడిన అంతర్జాతీయ లాంగ్ షోర్ మెన్సు యసోసియేషనుకు, టీమ్‌స్టర్సుకు మధ్య వారి సంబంధాలు వివాదాస్పదములుగా యున్నాయి.

కార్మిక ఉద్యమంలో కమ్యూనిస్టులు సంఖ్యలో తగ్గినప్పటికి చాలా స్వతంత్ర సంఘాలలో ఎక్కువ గలాటా చేసేవారు. ముఖ్యంగా విద్యుచ్ఛక్తి పరిశ్రమలో యిది జరుగుతోంది. అధ్యక్షుడు జేమ్సు బి. కారే నడిపే అంతర్జాతీయ ఎలక్ట్రిక్ కార్మికుల సంఘం ఐక్య సమాఖ్యకు అనుబంధమైంది. దీనితో స్వతంత్ర యునైటెడ్ ఎలక్ట్రిక్, రేడియో, మెకానిక్ కార్మికులు అధికారానికై పోటీ పడుతున్నారు.

అంతర్జాతీయ వ్యవహారాలలో కార్మిక యజమాని సహకారం సామాజిక సంబంధములు, పిద్య, సంక్షేమ సేవాపద్ధతులు, విద్య, రాజకీయ చర్య మొదలగువాటియందు ఈ ఐక్య సమాఖ్యకు ఎన్నో బ్రహ్మాండమైన సమ

స్యలు ఎదురు నిలుచున్నాయి. వీటిలో చాలా విషయములలో అనుసరించ వలసిన విధానాలలో అనేకమైన అభిప్రాయభేదాలువున్నాయి.

## ఎ. యఫ్. యల్. సి. ఐ. ఓ. సంస్థ సర్వాధికారముగ్గల సంస్థా?

దేశానికి హాని కలుగచేయు ఒకపెద్ద సర్వాధికారతనం యీ ఐక్య సమాఖ్య పొందగలదనే భయము కొందరు వెలిబుచ్చారు. జాతీయ జీవనంలో కార్మికుల రాజకీయ ఆర్థిక ప్రభావం యీ ఐక్య సమాఖ్య తెలపరిచినా అది నిజంగా సర్వాధికారం పొందడం అన్నదానికి చాలా దూరంగానే వుంది.

మొదటిది: 48 మిలియనుల సంఘటిత కార్మికులలో 60 మొదలు 70 మిలియనుల కార్మిక జనంలో యీ ఐక్య సమాఖ్య సభ్యత్వం 15 మిలియనులు మాత్రమే. ఇది కార్మికుల సర్వాధికారమని అభిప్రాయపడుటకు ఏ ఆస్కారం లేదు.

రెండవది; ఈ ఐక్య సమాఖ్య రాజ్యాంగ నియమావళి ప్రకారము ఏ అనుబంధ సంఘాలైనా సమ్మె చేయుటకు అనుమతించుటకు అధికార మీయబడలేదు. ఈ అధికారము 141 జాతీయ అంతర్జాతీయ సంఘాలందు వారి 60,000 స్థానిక సంఘాలందు ఆ స్థానిక సంఘాలు సంప్రదించు 100 మంది కార్మిక యజమానుల ఒడంబడికలందు యిమడ్చ బడిఉంది. ఈ ఐక్య సమాఖ్య సంఘాలలో ఒక విశిష్టమైన అధికార వికేంద్రీకరణ ఉంది.

## అమెరికను కార్మిక నాయకులు.

అమెరికా దేశంలోని యీ సంఘటిత కార్మిక ఉద్యమం సాంఘిక ఆర్థిక రాజకీయ పరిస్థితుల ప్రభావం వల్లనే కాక కార్మిక ఉద్యమం నడిపించిన ప్రఖ్యాత పురుషుల ప్రభావం వలకూడా రూపొందింది. ముఖ్యముగా సామ్యూల్ గోంపర్సు; ఈయన సిగరెట్లు తయారీ చేయువాడు. 1881 నుంచి అమెరికను కార్మిక సమాఖ్యకు అధ్యక్షుడు. ఒక్క సంవత్సరము తప్పించి 1924 దాకా నలభై సంllలు అధ్యక్షుడుగా వున్నాడు. 1924 నుంచి 53 వరకు అధ్యక్షుడు విలియమ్‌గ్రీన్. పారిశ్రామిక సంస్థ కమిటీకి మొదటి, రెండవ అధ్యక్షులు, గనికార్మికులైన జాన్ యల్. లూయీస్; ఫిలిప్ ముర్రే. జార్జి మీనీ వాల్టర్ పి. రూథర్

సీసపుపనివారు మోటారు కార్మికులు.. వీరిద్దరు అమెరికను కార్మిక సమాఖ్య పారిశ్రామిక సంస్థకమిటీ సంస్థలకు వరుసగా చివరి అధ్యక్షులు, ఐక్య కార్మిక ఉద్యమానికి ముఖ్య నిర్మాతలు.

ఐక్య సమాఖ్యకు, మీనీ అధ్యక్షుడుగాను, రూథర్ ఉపాధ్యక్షుడుగాను, పెద్ద పారిశ్రామికసంఘశాఖకు డైరెక్టరుగాను ఎన్నికైరి. ఐక్య మోటారు కార్మికులకు 'అధ్యక్షుడుగాకూడా రూథర్ ఉండవచ్చునని అనుమతించ బడింది. వారి చిన్నతనంనుంచి, వీరిద్దరు కార్మిక ఉద్యమానికి చాలా సన్నిహితంగా పనిచేశారు.

## జార్జి మీనీ

1894 ఆగష్టు 16వ తేదీన జార్జి మీనీ న్యూయార్కు నగరంలో జన్మించారు. ఇతను సీసపుపనివాని కొడుకు. నగరములోని స్కూళ్ళకు వెళ్ళి చదువుకున్నాక 1910 లో సీసపువ్యాపారంలో పని నేర్చుకొనుటకు చేరారు. అయిదు సంవత్సరముల తర్వాత సీసపు పనివాడుగా స్థిర పడ్డారు. సకాలంలో సీసపుపనివాళ్ళ సంఘంలో ఈయన చాలా చైతన్య వంతంగా పనిచేశారు. ఆయన 28వ సంవత్సరములో స్థానిక సంఘానికి వ్యాపార ప్రతినిధిగా ఎన్నికైనారు. ఈ సంఘానికి సేవచేస్తుండగా ఆయన, నిర్మాణాత్మక కృషికి ఎంతో పేరుపొంది గౌరవనీయు లయ్యారు. 1934 లో ఆర్థిక మాంద్యం రోజుల్లో న్యూయార్కు రాష్ట్ర కార్మిక సమాఖ్యకు అధ్యక్షుడుగా ఎన్నికయ్యారు.

రాష్ట్ర సమాఖ్యలలో పెద్దదైన యీ సమాఖ్యకు నాయకుడు కావడంచే ముఖ్యంగా కార్మిక శాసన సంబంధమైన రంగములందుండుటచే ఫ్రాంక్ మారిసను చనిపోయినాక అమెరికను కార్మిక సమాఖ్య కార్యదర్శి, కోశాధి కారిగా ఎన్నికై 1940 లో పదవి స్వీకరించారు. అధ్యక్షుడు విలియమ్ గ్రీన్ అనారోగ్య కారణాలవల్ల కార్యదర్శి మీనీ సమాఖ్యలో అధికతర బాధ్యతలు వహించారు. 1952 లో గ్రీన్ చనిపోవడంతో మీనీ ఏక గ్రీవంగా ఎ. యఫ్. ఎల్ కు అధ్యక్షులయ్యారు. అధికారంలోనికి రాగానే మీనీ చేసిన మొట్టమొదటిపని వాల్టర్ రూథర్‌తో సంప్రదించి అమెరికను కార్మిక సమాఖ్య, పారిశ్రామిక సంస్థ కమిటీల ఐక్యతకు వీలుందునా అన్నది పరిశీలించారు. ఈ సమాఖ్యకు ఏ ప్రతిబంధకం లేకుండా ఆయన

ప్రయత్నించారు. అమెరికన్ కార్మిక సమాఖ్యలో ఉంచేగొండి శక్తులం నిర్మూలించడానికి, కమ్యూనిజంను ప్రతిపక్షం బలవత్తరం చేయటానికి, అంతర్జాతీయ రంగరిలో కార్మికుల పాత్రను బలపరచేడానికి మీనీ ప్రత్యేక కృషి చేశారు. ఈ ఐక్య సమాఖ్య ఏర్పడినప్పుడు మీనీ అందరి ఆమోదంతో అధ్యక్షుడుగా ఎన్నికయ్యారు.

పరిపాలనా దక్షుడుగా శక్తివంతమైన వక్తగా తన దృక్పథంలో మీనీ మితవాదిగా సంచరించాడు. తనస్నేహితులకు తాను ఒక సీసపుపనివాడి ననే చెప్పును కాని తానొక మేధావి నని చెప్పడు. ఆర్థిక సాంఘిక రాజకీయ అంతర్జాతీయ విషయాలలో తనకున్న అపూర్వ విజ్ఞానంతో ముఖ్య సమస్యలను కూలంకషంగా అర్థంచేసుకునే శక్తితో, తన చుట్టూ ఉన్నవారిని ముగ్ధులను చేశారు.

## వాల్టర్ పి. రూథర్

పశ్చిమ వర్జీనియాలో వీలింగ్‌లో సెప్టెంబరు 11, 1907 సంవత్సరంలో మీనీకి 13 ఏండ్లు చిన్నగా వాల్టర్ రూథర్ జన్మించారు. ఈయన తండ్రి వాలెంటైను రూథర్. వాలెంటైను సారాయివండు పనివాడు. కార్మిక కార్యక్రమాలలో చైతన్యవంతంగా పనిచేసి 1923 లో ఓహియో వేలీ ట్రేడ్సు అండ్ లేబరు ఎస్సెంబ్లీకి అధ్యక్షుడయ్యారు. ఈయన, తీవ్రమైన సోషలిస్టు యూజీనివి డెబ్సు, స్నేహితులు. వాల్టర్ అయిదుగురు పుత్రులలో ఒకరు. మరోయిద్దరు అన్నదమ్ములు విక్టర్ మరియు రాయ్, కార్మిక ఉద్యమంలో చాలా చైతన్యవంతులయ్యారు. వీరి తండ్రి వీరి విద్యావిషయంలో ఎక్కువ శ్రద్ధాభక్తులు చూపారు. ముఖ్యంగా ఆది వారంసాయంకాలాలు ఆనాటి సాంఘిక సమస్యలపై వాగ్వివాదాలు, చర్చలు ఏర్పాటు చేసేవాడు.

వీలింగులోని హైస్కూలును, వాల్టర్ తన మూడవ సంవత్సరములో వదిలివేసి కుటుంబానికి సహాయకారిగా ఉన్నారు. మూడు సంవత్సరాలు పని నేర్చుకొను పనిముట్లు తయారీవానిగా గడిపేరు. ఆదివారం పని చేయరాదని నిగళనగా ఒక సంఘాన్ని తయారుచేయుటచే ఉద్యోగం నుండి తొలగింపబడ్డాడు. తర్వాత డెట్రాయిట్‌కు ఉద్యోగం కోసం వెళ్ళారు. అక్కడ బ్రిగ్సులోను, ఫోర్డువద్ద ఉద్యోగాలుపొంది, రాత్రి

పాఠములు వేలే విశ్వవిద్యాలయములో చదువుకొంటూ హైస్కూలు చదువు తిరిగి ప్రారంభించారు. ఇక్కడ ఆయన సాంఘిక సమస్యల క్లబ్ ఒకటి సంఘటితపరచారు. పారిశ్రామిక ప్రజాస్వామ్యలీగ్ నకు యిది ఒక శాఖ. డెట్రాయిట్‌లో అనేక కార్మిక ప్రజాస్వామ్య పోరాటాలలో చేరేరు. 1932 నార్మన్ థామస్ స్థలాలలో అధ్యక్షుడుగా ప్రసంగించేరు.

1933 లో కార్మికోద్యమ కార్యక్రమాలపేర ఫోర్డు సంస్థలో ఉద్యోగము నుంచి తొలగింపబడ్డారు ఈయన. ఈయన తమ్ముడు విక్టర్ ఆర్థిక కష్టాల నెదుర్కొంటూ ప్రపంచయాత్ర చేయ నిశ్చయించారు. యూరోపుఅంతా సైకిలు మీద తిరిగారు. గ్రేటుబ్రిటను నుంచి రష్యా వరకు యంత్ర దుకాణములందు, మోటారు కార్ఖానాలందు, బొగ్గుగనుల లోను పనిచేశారు. భారతదేశం, జపాను పర్యటించారు. 1935 లో మోటారు పరిశ్రమలో చేరుటకు తిరిగి డెట్రాయిట్ కు వచ్చారు.

మోటారు పరిశ్రమలో త్వరలో రూథర్ నాయకు డయ్యారు. స్థానిక సంస్థకు అధ్యక్షుడయ్యారు. డెట్రాయిట్, ఫ్లింట్ పనిమాను సమ్మెలందు ప్రముఖ పాత్ర వహించారు. ఫోర్డును సంఘటితపరిచే 1937 యుద్యమములో ఈయన ముఖ్య స్థానము వహించారు. ఫోర్డురక్షకులచే తీవ్రమైన బాధలకు గురిఅయ్యారు. 1946 లో పారిశ్రామిక సంస్థ కమిటీకి సంబంధించిన ఐక్య మోటారుకార్మికుల సంస్థకు అధ్యక్షుడయ్యాడు. కొంతకాలం ముందట ఉపాధ్యక్షులుగా యున్నారు. సంస్థలో కమ్యూనిస్టులలోను వారి అనుయాయులతోనూ తీవ్రపోరాటం సాగించారు. 1953 లో ఫిలిప్ ముర్రే చనిపోవడం వల్ల పారిశ్రామిక సంస్థ కమిటీకి యీయన అధ్యక్షుడుగా ఎన్నుకోబడ్డారు. తర్వాత అమెరికను కార్మిక సమాఖ్య పారిశ్రామిక సంస్థ కమిటీ ఐక్యసమాఖ్య రూపొందుటకు మీనీతో సహకరించి కృషిచేశారు. అనంతమైన శక్తివంతుడు, విశాలమైన సాంఘిక దృక్పథము కలవాడు. ధైర్యంగా సునిశితంగా ఆలోచించగలమనిషి రూథర్. ఈయన కార్మిక నాయకత్వమునకే కొత్తరకమైన ప్రతిభావంత విజ్ఞానము, సంఘటితపరిపాలనాశక్తి అందిచ్చేరు. ఈయన లక్షణాలు ఒక్క కార్మిక ఉద్యమమునందే గాక, జాతీయజీవనమునందు కూడా ఒక ప్రత్యేకముద్ర వేశాయి.

# 3. శ్రామిక సంఘాల నిర్మాణము - విధులు.

అమెరికా శ్రామికసంఘ ఉద్యమం మొదటి దశలనుంచి సాధించిన గొప్ప విజయాలు గూర్చి గతపుటలలో చర్చించ బడింది. శ్రామిక సంఘోద్యమం నేరమైనకుట్రగా చూడబడే రోజులనుంచి 20వ శతాబ్దము మధ్యభాగములో సంఘటిత శ్రామిక సంఘోద్యమం మన సాంఘిక ఆర్థిక నిర్మాణంలో నిత్యమైన ముఖ్యమైన భాగంగా ప్రజాస్వామ్య జీవితంలో శక్తివంతమైనదిగా పరిగణింపబడే వరకు చర్చించాము.

## సంఘ సభ్యత్వం

20వ శతాబ్దంలోని 50వ దశాబ్దంకాలంలో ఈ ఉద్యమంలో 17 మొదలు 18 మిలియనుల సభ్యులుండిరి. ఈ సభ్యులలో ఒక మిలియనుకు పైగా అమెరికా రాష్ట్రములు బయట, ముఖ్యంగా కెనడాలో నివసించు చుండిరి. ఈ సంఘ సభ్యత్వం 199 జాతీయ, అంతర్జాతీయ సంఘము లందు విభజించబడింది. అంతర్జాతీయ అన్నపదానికి అర్థము, ఆసంఘాల సభ్యులు, శాఖలు అమెరికాలోనే కాక, కెనడాలోకూడా ఉన్నవని చెప్పవచ్చును. అమెరికను కార్మిక సమాఖ్య పారిశ్రామిక సంస్థ కమిటీ లలో లీనమైన 141 అంతర్జాతీయ సంఘాలలో 15 మిలియనుల సభ్యు లుండిరి.

## స్వతంత్ర సంఘాలు

మూడుమిలియనుల సభ్యత్వంతో అమెరికను కార్మికసమాఖ్య పారి శ్రామిక సంస్థ కమిటీలకు బయటఉన్న సంఘాలలో అమెరికాలోని యునైటెడ్ గనికార్మికులు 30వ శాతమువరకు ఉండెదరు. అమెరికను కార్మికసమాఖ్య ఈ గనికార్మికులసంస్థ జాన్. యల్. లూయిస్ నాయకత్వమున 30వ దశాబ్దంవరకు ఎక్కువ ప్రభావముకలిగి యుండెడిది. 1935లో యీ గనికార్మికుల సంస్థను సమాఖ్యనుంచి దూరంచేసి పారి శ్రామిక సంస్థ కమిటీలో కలిపెను. ఆ రోజుల్లో లూయీ పారిశ్రామిక

సంస్థ కమిటీ అధ్యక్షుడుగా ఉండి, చాలా కష్టదశలో దాన్ని నడిపిస్తూ ఉక్కు, మోటారు తదితర పరిశ్రమలను సంఘటితపరుచుచుండేవారు. 1942 లో గనికార్మికులసంస్థ పారిశ్రామిక సంస్థంకమిటీని విడిచిపెట్టి పోయినది. కారణము ఫ్రాంక్లిన్ డి. రూజ్వెల్టును బలపరుచుట విషయంలో కొన్ని భేదాభిప్రాయాలు ఉద్భవించాయి. తర్వాత ఆ గని కార్మికులసంస్థ అమెరికను కార్మికసమాఖ్యలో చేరినా 1947 లో తిరిగి బయటికి వచ్చేసింది.

అమెరికను కార్మిక సమాఖ్య పారిశ్రామిక సంస్థకమిటీలతో అనుబంధముగాలేని మరికొన్ని సంఘాలు రెండవవర్గంలో నాల్గుశక్తివంతమైన రైల్వేసంఘాలు పేర్కొనవచ్చు— అవి బ్రదర్‌హుడ్ ఆఫ్ లోకోమోటివ్ ఇంజనీర్లు బ్రదర్‌హుడ్ ఆఫ్ లోకోమోటివ్ ఫైర్‌మెన్ మరియు ఇంజిన్ మేన్; బ్రదర్‌హుడ్ ఆఫ్ రైల్‌రోడ్డు ట్రెయిన్‌మెన్; ది ఆర్డరు ఆఫ్ రైల్వే కండక్టర్సు: వీటి మొత్తము సభ్యత్వం 400,000 సభ్యులు ఈనాల్గు రైల్వే సంఘాలలో కొందరు అధ్యక్షులు, అమెరికను కార్మిక సమాఖ్య, పారిశ్రామికసంస్థకమిటీతో అనుబంధముగుటకు కొన్ని చర్చలు జరిపారు. కాని 1956 వేసవిలో లోకోమోటివ్ ఫైర్‌మెన్, ఇంజిన్‌మెను యీ ఐక్యసమాఖ్యలో చేరారు.

మూడవవర్గము కమ్యూనిస్టుల ప్రాబల్యమున్నదని 1949, 50 లలో పారిశ్రామికసంస్థకమిటీనుంచి బహిష్కరింపబడిన స్వతంత్ర అంతర్జాతీయ సంస్థలు. 30 వ దశాబ్దంలో పారిశ్రామిక సంస్థకమిటీ ప్రారంభించిన పెద్ద సంఘటిత ఉద్యమంరోజుల్లో, చాలామంది కమ్యూనిస్టులు, వారి పారిశ్రామికసంస్థ కమిటీకి అనుయాయులు, వాటి అనుబంధసంస్థలకు నాయకులైయ్యారు. తర్వాత చాలా సంఘాలలో ప్రముఖ పాత్రలు వహించారు ఉద్యోగంలో ఉన్నప్పుడు. కమ్యూనిస్టుపార్టీ ఆజ్ఞలు వారు పాలించారు. కమ్యూనిస్టు సిద్ధాంతాలను. విధానాలను బలపరుచుటకు తమ సంఘం యొక్క పదవులను ఉపయోగించుకొన్నారు. చాలా విషయాలలో వారు కమ్యూనిస్టులు కానివారిని బలపరచారు. కాని అందులోనిఅర్థం ఆ నాయకులు ఎన్నికైనాక వారిపరివారంగా కమ్యూనిస్టులనే నియోగించవలెనని కమ్యూనిస్టుల కార్యక్రమాలు, వారి ఉద్యమాలు బలపరచాలని చెప్పవచ్చును.

మోటారు కార్మికులు, మరి తదితర పెద్దసంస్థలు కమ్యూనిస్టులను అధికారముగల పదవులనుంచి తొలగించవలెనని పెద్ద ఆజడిప్రారంభించారు. 1949, 50 లలో పారిశ్రామిక సంస్థకమిటీ తన సంస్థనుంచి కమ్యూనిస్టుల ప్రాబల్యం ఎక్కువగా ఉన్నదన్న కారణంచే 850,000 నుంచి 900,000 వరకు సభ్యత్వమున్న 11 సంస్థలను బహిష్కరించింది. ఆ పదకొండు సంస్థలలో రెండు పూర్తిగా చెల్లాచెదరై విడిపోయాయి. నాల్గు కమ్యూనిస్టుల అదుపులోఉన్న సంఘాలలో చేరాయి. ఒకటిమాత్రము బొచ్చుపనివారిసంఘం, అమెరికను కార్మిక సమాఖ్యయొక్క మాంసం కోసేవారి సంఘంలో భాగమైపోయి తననాయకత్వంలో తీవ్రమైన మార్పు తెచ్చుకుంది. 1955 లో ఒక్క నాల్గుసంఘాలు మాత్రమే చైతన్యవంతంగా యుండేవి. అవి; అమెరికాలోని ఎలక్ట్రికల్, రేడియో, మెషిను కార్మికులసంస్థ. (ఇది అన్నిటికంటె చాలా పెద్దది) గని, మిల్లు, ధాతు, ద్రావకుల అంతర్జాతీయ సంఘం, అంతర్జాతీయ లాంగ్ షోర్ మెను మరియు గిడ్డంగి పనివాళ్ళ సంఘము, (పశ్చిమతీరంలో) అమెరికను కమ్యూనికేషన్సు యసోసియేషన్; ఈనాల్గు సంస్థల సభ్యత్వం బహిష్కరణలు జరిగినపుడు ఏర్పడిన ఆ పదకొండుసంస్థల సభ్యత్వంలో మూడవ వంతు ఉంది.

ఇదేగాక కంపెనీ సంఘములనబడేవి, సంఘ తత్వవాదులనుంచి దూరమై స్వతంత్రంగా వృత్తులలోనున్న పనివారు యింకా స్వతంత్ర సంఘాలలో ఉండిరి. ఈ సంఘాలు, సమాఖ్యలుగా పనిచేసే మూడు ముఖ్యసంస్థలకు సంబంధించి యున్నాయి. ది కాన్ ఫెడరేటెడ్ యూనియన్సు ఆఫ్ అమెరికా; అమెరికాలోని ఇంజనీర్ల శాస్త్రజ్ఞులు; జాతీయ స్వతంత్ర యూనియన్ కౌన్సిలు.

లేబర్ గణితముకు సంబంధించిన యునైటెడ్ స్టేట్సు బ్యూరో 1955 లో 57 జాతీయ, అంతర్జాతీయ సంఘములు అమెరికను కార్మిక సమాఖ్య పారిశ్రామిక సంస్థకమిటీలతో అనుబంధముకాకుండా ఉన్నవని, వాటి మొత్తం సభ్యత్వం 1,80,000 ఉన్నదని లెక్క యిచ్చినది.

ఈ వివిధవర్గాలకు సంబంధించకుండా, ఒక ప్రదేశానికి ఒక యజమాని అందులోను ఒక కార్యాలయమునకు సంబంధించిన సిబ్బందికి, సంబంధించినదిగాను ఉన్న సంఘాలుగా చాలా ఉండేవి.

## వృత్తిపనివారిసంఘాలు – పారిశ్రామిక సంఘాలు

సాధారణంగా దేశంలోని సంఘాలు అమెరికను కార్మిక సమాఖ్య పారిశ్రామికసంస్థకమిటీలకు సంబంధించినా, స్వతంత్రంగాయున్నా, వృత్తి, పారిశ్రామిక సంఘాలుగ విభజింపవచ్చు ఒకేవృత్తిలో వివిధ తెగలకు సంబంధించిఉన్న కార్మికులను కలిగిన సంఘాలను వృత్తిపనివారి సంఘాలని అనవచ్చు. ఉదాహరణ: వడ్రంగులు, యంత్రకార్మికులు, సీసపు పనివాళ్లు, అచ్చుపోయువారు. మొదటిరోజులలో అటువంటి కార్మికులతోనే మిగిలినసంస్థలు ఏర్పరుచుటకు అనుకూలంగా యుండేవి. కారణం చిన్నచిన్న దుకాణాలు, వస్తువులు తయారీచేయు దుకాణాలు దీనికి సరిపోయినట్లు ప్రత్యేకంగా ఒకే నిపుణతకలిగిన పనివారిని ఉద్యోగంలో ఉంచేవారు. లోహాలు పోతపోయుస్థలము, పోతపోయువారినీ యంత్రాల దుకాణము, యంత్రములు బాగుచేయువారిని మాత్రమే పనిలో ఉంచుకొనుచుండెను.

సామూహిక ఉత్పత్తి ఫ్యాక్టరీలు అభివృద్ధి చెందుటతో, ఏవిధమైన వృత్తికాని నిపుణతకాని లేని కొన్నివేల కార్మికులతోపాటు అన్ని రకాల నిపుణులైన పనివారు ఒకేవాసముక్రింద కలిసారు. ఈమార్పువల్ల పరిశ్రమలో చెల్లాచెదరుగావున్న నిపుణులైన పనివారిని సంఘంగా చేయుట చాలాకష్టమైపోయింది. ఈవృత్తిసంఘంలో చేరుటకు అర్హులు కాని ఎన్నో మిలియన్ల కార్మికులు యీసంఘాల బయటనే వుండవలసి వచ్చింది.

యంత్రాల ఉత్పత్తిరాగానే (వృత్తినిపుణత)ను వరించింది. యంత్రం మీద పనిచేయువానిని వృత్తిలో నిపుణత పొందవలసినవానికి యివ్వవలసిన సంవత్సరాల శిక్షణకంటె తక్కువకాలంలో తర్ఫీదు చెయ్యవచ్చు.

పారిశ్రామిక సంఘం క్రమముగా యీపరిస్థితిని సరిదిద్దుటకు ఉద్భవించింది. ఈ సంఘంలో, అందరు ఫ్యాక్టరీపనివాళ్ళు నిపుణులైనా కాకపోయినా, సామాన్య పాటకజనంతో పాటు సభ్యులు కావచ్చు. ఇటువంటి కార్మికసంఘటిత రూపము పారిశ్రామిక సంస్థ కమిటీ ఉద్యమం ఫలితం కాదని ప్రత్యేకం చెప్పనక్కర్లేదు. అమెరికను కార్మిక సమాఖ్యలో

అంతర్భాగంగా మారుతున్న పారిశ్రామిక పరిస్థితుల కనుగుణంగా యిది బయలుదేరింది.

1890 నాటినుంచి అమెరికాలోని యునైటెడ్ గనికార్మికులు మొదటి నుంచి పారిశ్రామిక సంఘంగానే పనిచేశారు. స్త్రీపురుషుల వస్త్రాలు కుట్టువారిసంఘాలు, కాగితపుపనివారు, సారాయివండువారు తదితరులు అమెరికను కార్మిక సమాఖ్యలో పారిశ్రామికసంఘాలుగానే వ్యవహరించారు. పారిశ్రామికసంస్థకమిటీ అమెరికను కార్మిక సమాఖ్యకు యీ సమయమునందు ఏడుమిలియనుల కార్మికులకు ప్రాతినిధ్యము వహించు సంఘాలు పారిశ్రామిక రూపముధరించిన సంస్థలు జేరగలిగే పారిశ్రామిక సంస్థశాఖలో జేరాయి.

నిపుణులైన కార్మికులకు అనుగుణంగానే వృత్తిసంఘాలు నడిచాయి. అమెరికను కార్మికసమాఖ్య, పారిశ్రామికసంస్థకమిటీ రాజ్యాంగనియమావళి ప్రకారం రెండురకాల సంఘాలు ఈరంగంలో చాలా ముఖ్యపాత్ర వహిస్తాయని నమ్మబడింది.

## సంఘ సభ్యత్వం హెచ్చించుట.

ఇంచుమించు 199 అంతర్జాతీయ సంఘాలున్నా సగం సభ్యత్వము దగ్గరగా 13 సంఘాలలోనే ఉంది. ఆరు సంఘాలు ఒక్కొక్కదానిలో 500,000 సభ్యులు చొప్పున మొత్తము 6 మిలియనుల సభ్యత్వము కలిగియున్నవి. ఇది మొత్తము సభ్యత్వములో మూడవవంతు. చిన్న అంతర్జాతీయ సంస్థలు, ఒకవంద. ఒక్కొక్కదానిలో 25,000 సభ్యత్వానికి తక్కువగా మొత్తము సభ్యత్వంలో 5 వ శాతంలో గాని కలిగిలేవు. ఈ 199 అంతర్జాతీయ సంస్థలతో 77,000 స్థానిక సంఘాలకు సంబంధమున్నది.

## సంఘ మహాసభ.

అంతర్జాతీయ సంఘమునందు విధానములు నిర్ణయించు అధిష్ఠానవర్గము సంఘ మహాసభయే. 1955 లో అంతర్జాతీయ సంస్థలలో అధికభాగము (199 లో 114 కార్మిక బ్యూరో లెక్కల ప్రకారము) రెండు లేక

తక్కువ సంవత్సరాల కొకసారి తమసభలు జర్పుకొన్నవి. 71 సంఘాలు ఎక్కువగా రెండు సంవత్సరాల వ్యవధిలో సభలు జరుపుకున్నాయి. 61 సంఘాలు మాత్రమే మూడు లేక ఎక్కువ సంవత్సరముల వ్యవధి తీసుకున్నాయి.

పన్నెండు సంఘాలు మాత్రమే సభలు జరుపుకొనుటకు ఏవిధమైన సంప్రదాయాలు పాటించలేదు.

## ప్రవీణులు, ప్రత్యేక నిపుణులు.

తమ పరిశోధన, విద్య, సంక్షేమము, న్యాయ, పౌరసంబంధ కార్య క్రమములు నడిపించుటకు సంఘాలు ఎక్కువగా నిపుణుల సేవ అభిల షిస్తున్నాయి. ఇంచుమించు ఒకవంద అంతర్జాతీయ సంస్థలు పరిశోధనకు డైరెక్టర్లను, ఉద్యోగులను నియమించుచున్నవి. ఇంచుమించు ఒక ఎనభై సంఘాలకు పైగా విద్యాడైరెక్టర్లను నియమించుకున్నారు. రాష్ట్రసమాఖ్యలు, స్థానికసంఘాలు కూడా ఆ విధంగానే విద్యాడైరెక్టర్లను నియమించాయి.

ఈ మధ్యకాలములో ఉమ్మడి బేరమునకు చేయు సాంఘిక, ఇన్సూ రెన్సు కార్యక్రమాల త్వరిత అభివృద్ధివల్ల సంఘాలకు అధికతర బాధ్య తలు కలిగాయి. ఈ పనికి ప్రత్యేక ప్రవీణులను నియమించారు. దేశంలో అన్నిభాగాలలో ప్రచురితమగు కార్మికపత్రికలలో ఎక్కువమంది పటుత్వ మైనవారు ఉండిరి. అంతర్జాతీయ స్త్రీవస్త్రులపనివాళ్ళ సంఘం, మరియు తదితరసంస్థలు, ఇంజనీరింగుశాఖలు కూడా స్థాపించినవి. దీనివల్ల యజ మానుల ప్రావీణ్యము పెంచుట, రాజకీయచర్యలలో అంతర్జాతీయ సంబం ధములలో కూడా మెరుగుతెచ్చుట, వీరిభావము.

ప్రతీరాష్ట్రంలో అమెరికను కార్మిక సమాఖ్య పారిశ్రామిక సంస్థ కమిటీకి సంబంధించిన అంతర్జాతీయ సంఘాలు, స్థానికసంఘాలు రాష్ట్ర సమాఖ్య సంబంధించి ప్రతీనగరములో ఒక కేంద్ర కార్మిక కౌన్సిలుకు సంబంధించియుంటాయి. నగర, రాష్ట్ర సంస్థలు, తమతమ శాసన సభలలో సరైన కార్మిక ప్రాతినిధ్యం వహించడానికి మామూలు ప్రజా నీకంలో కార్మికుల అవసరాలు ఎక్కువగా అభివృద్ధిపొందేలా తమ కాలం వ్యయంచేస్తాయి.

## సంక్షేమ కార్యక్రమాలు.

గత దశాబ్దంలో విరామ, సంక్షేమ కార్యక్రమములు ఎన్నో విధముల పెరిగిపోయాయి. ఒకసంఘంతర్వాత మరొకసంఘం తమ ఒడంబడికలో యజమాని తప్పక విరాళములు యిచ్చునట్లు ముఖ్యంగా ముసలితనపు పెన్షనులకు, ఆరోగ్యసేవకు, సెలవుదిన భత్యాలకు, కొన్ని సంక్షేమ నిధులు ఏర్పాటుచేస్తున్నాయి. సంఘాలు ఆరోగ్యకేంద్రములు స్థాపించాయి. ఆస్పత్రులు, విరామకేంద్రములు, కేంపులు కట్టించి నడుపించాయి. రోగనివారణ విషయంలో పరిశోధనలు జరిపించాయి. సమాజాన్ని తమ కార్మికుల ఆరోగ్యము, సంక్షేమదృష్ట్యా అభివృద్ధి పరచు అన్నిసంస్థలకు అనేకవిధాల విరాళాలిచ్చింది.

ఇదేగ్రంథంలో ముందు ప్రకరణములలో విద్య, సాంఘిక, రాజకీయ చర్యలు, పౌరస్వేచ్ఛ, అంతర్జాతీయ సంబంధాలు గురించిన కార్యక్రమాలు చర్చించబడతాయి.

# 4. సంఘం ఒడంబడికలు; దైనిక సంబంధాలు

సంఘాలు, యజమానుల మధ్యనున్న దైనిక సంబంధాలు, సంఘ ఒడంబడికలు, వారిద్దరిమధ్య సహకారం అర్థిస్తూ సక్రమంగా ఫిర్యాదులను సరిదిద్దుటకు స్థాపింపబడిన యంత్రాంగంగూర్చి యిప్పుడు పరిశీలిద్దాం.

## సంఘ ఒడంబడికలలో; పార్టీలు

కొన్నిసంఘాలలో సంఘాలకు బదులు జాతీయ లేక అంతర్జాతీయ సంఘాలు ఒడంబడికలపై సంతకం చేస్తారు. అనేక నగరాలలో మరి కొన్ని ఒడంబడికలపై, అంతర్జాతీయ సంస్థలు, సంయుక్త మండలులు కలిసి సంతకం చేస్తారు. మరికొన్ని ఒడంబడికలపై, స్థానిక సంఘాలు సంతకము

చేస్తాయి. యజమానితరఫున వ్యక్తిగతంగా యజమానికాని, యజమానుల సంఘముకాని లేదా దేశంలోని ఆయాతరగతుల పూర్తిపరిశ్రమసంస్థగాని సంతకం చేస్తారు. ఉదాహరణ: మోటారు పరిశ్రమలో అంతర్జాతీయ సంఘమైన యునైటెడ్ మోటారు కార్మికుల సంఘం వ్యక్తిగత మోటారు కార్పొరేషన్లు, ఫోర్డు, జనరల్ మోటారు, క్రిస్లర్ మొదలగువాటి మధ్య ఒడంబడికలు తయారయాయి. స్త్రీల దుస్తులు తయారుచేయు రంగమునందు చిన్నచిన్న కంపెనీలు చాలా ఉండటంచే యజమానుల తరఫున ఒడంబడికపై సంతకము చేసేవారు. తయారీచేసేవా సంఘం న్యూయార్కునగరంలో మాత్రం సంయుక్తమండలి అంతర్జాతీయ, సంఘం కలిసి కార్మికుల తరఫున సంతకం చేస్తారు.

గనిపరిశ్రమలలో యునైటెడ్ అమెరికా గనికార్మికుల సంఘం మట్టి తైలమును సంబంధించిన, కలప బొగ్గుకు సంబంధించిన సంఘాలతో జాతీయ ఒడంబడికలు చేసుకొని వాటిని ప్రాంతీయంగా స్థానికంగా అనుగుణంగా వుండేట్లు నిర్దుష్ట పరుచుకొంటారు. న్యూయార్కునగరంలో అంతర్జాతీయ ఎలక్ట్రిక్ వర్కర్సుసంఘం విషయంలో స్థానికసంస్థకు, స్థానిక కంట్రాక్టరుకు మధ్య ఒడంబడికలు జరుగుతాయి. కాని రైల్వేలలో సంక్లిష్టమైన పద్ధతిఫుంచి అందులో రైల్ బోర్డు ఉద్యోగులను పూర్తిగా సంబంధించని వారితో కూడిన పదిహేను సంఘములు వివిధ రకాల కార్మికులతో కూడినట్టివి, రైల్ రోడ్డు కంపెనీల ప్రాంతీయ పెద్దసంఘాలతో సంప్రతింపులు జరుపుతుంది.

ఒడంబడికలలో అనేకచోట్ల మొటమొదట ఒకప్రకటన వుంటుంది. అందులో యజమాని ఆసంఘాన్ని తనతో ఆరంగానికి సంబంధించిన అధిక భాగం కార్మికులకు ప్రాతినిధ్యము వహిస్తూన్నశాఖగా గుర్తిస్తాడు.

## ఒడంబడికల పరస్పరత్వము.

ఒడంబడికప్రకటనలో ఆయా పార్టీలు తమను ఏవిధంగా పరస్పర లాభదాయకంగా ఉన్నదీ వాటి కారణాలు తరుచు చెప్పబడుతాయి. 1955-58 లో నేషనల్ డ్రెస్ మాన్యుఫాక్చరర్సు అసోసియేషన్ (న్యూయార్కునగరం), ఇంటర్నేషనల్ లేడీస్ గార్మెంట్ వర్కర్సు

సంఘము, మరియు దుస్తుల్లపనివారి సంయుక్తమండలి మధ్యజరిగిన ఒడం బడికలో యీక్రింది కారణాలు వున్నాయి.

"ఆయాపార్టీలు, యజమానులు, ఉద్యోగులు, సహకారపద్ధతులవల్ల పరిశ్రమను పటిష్టం చేయగల్గుటవల్ల యాజమాన్యంలో నిపుణత కలగ చేయుటవల్ల, ఇందులో అభివృద్ధికి పథకాలు వేయగల్గుటవల్లను, ఉత్పత్తి విభాగాలు అభ్యుదయంతో నడిపించి ఉత్సాహపర్చగల్గుటవల్లను, కార్మికులకు ఉద్యోగం నిత్యమూ ఉండేటట్లు, న్యాయమైన జీవనవేత నము లభించేటట్లు, తగిన సాంవత్సరిక సంపాదన ఉండేటట్లు, కార్మికులకు న్యాయమైన షరతులు దొరకేటట్లు, వివిధ పరిస్థితులను కల్గచేయుటవల్ల ఆయాపార్టీల మధ్య ఏర్పడు వివాదములు న్యాయంగా శాంతియుతంగా పరిష్కారం చేయగల్గి విరామములిడు ఉద్యోగములుండు పద్ధతులకు అవ కాశము కల్గించుటవల్ల అమితలాభము పొందగలరు....అందువలన ఆయా పార్టీలు యీ విధంగా ఒప్పుకొంటున్నారు."

1955 ఒడంబడిక పీఠికలో జనరల్ మోటార్సు కార్పొరేషను కొన్ని సాధారణ కారణాలు యీక్రిందివిధముగా పేర్కొన్నది.

జనరల్ మోటార్సు కార్పొరేషను యాజమాన్యం, కార్మికుల సహ కారం లేనిదే నడచుట కష్టమని అదేవిధంగా యజమానుల సహకారం లేనిదే కార్మికులు నడచుట యింక వీలుపడదని గుర్తించింది. ఇద్దరూ ఒకే వ్యాపారంలో ఉన్నారుకనుక ఆ వ్యాపారాభివృద్ధి అందరికీ ముఖ్యమే. వస్తువుయొక్క గుణము, ధర అందరికి సంతృప్తికరముగా ఆకర్షణీయంగా ఉండి వ్యాపారం ఎల్లకాలం విజయవంతంగా ఉండే లక్ష్యంకై యిద్దరూ పనిచేయవలసిన అగత్యము ఏర్పడుతోంది.

యజమానుల, ఉద్యోగుల ప్రాథమిక అగత్యాలు ఒకటేనని జనరల్ మోటార్సువారి అభిప్రాయం. ఈసంబంధమునందు అనేకవిషయాలలో వివిధ అభిప్రాయాలు యజమానులు, ఉద్యోగులు ప్రకటించవచ్చు. ఈ అభిప్రాయభేదాలు శాంతియుతంగా సంతృప్తికరముగా నిజమైన ఓర్పుతో కూడిన కృషివల్ల రెండుపార్టీలు ఎందుకు సందిద్దుకోకూడదన్న అంశంపై జనరల్ మోటార్సువారు దృఢాభిప్రాయం కలిగియున్నారు.

## ఒడంబడికలోని విషయాలు.

వేతనాలు, కాలాలు, ఉత్పత్తి ప్రమాణములు, పనిచేర్చుకొనువారు, సెలవురోజులు, దుకాణకమిటీలు, ఎక్కువసర్వీసు, హక్కులు, భద్రత, ఆరోగ్యము, ఉద్యోగములకు సంబంధించిన రక్షణలు, పెన్షను తదితర సంబంధమైన లాభాలు, సంక్షేమనిధులు, ఫిర్యాదులు, కూలికిపిల్చుట, కాల్పులుజరుపుట, పనిమానివేయుట, ఒడంబడికకాలము మొదలగు విషయములపై అయా పార్టీలు రెండూ ఏవిధముగా ఒప్పుకున్నది ఒడంబడికలో తెలుస్తుంది.

ఇంటర్నేషనల్ లేడీస్ గార్మెంటు వర్కర్సు సంఘం ఒడంబడికలోని మరొక ప్రత్యేకాంశం "తయారుచేయువారి వర్గము సహకార సంస్థల అభివృద్ధి ఉద్యమము నడపవలెనని, తమ దుకాణములలో హెచ్చు డిగ్రీ నిపుణతను స్థాపించవలెనని, న్యూయార్కుబజారులో ఉత్పత్తి పరిమాణం పెంచే లక్ష్యం కలిగియుండవలెనని, తద్వారా వస్తువుగుణము విలువను పెంచి కొనుగోలుదారునకు ఉన్నతమైన విలువలు అందివ్వవలెనని అందులోవుంది. అదేవిధంగా నేషనల్ డ్రెస్ మాన్యుఫాక్చరర్సు అసోసియేషన్‌లోని ప్రతీసభ్యుడు తనదుకాణము నైపుణ్యంతో సక్రమ పద్ధతిలో నడపుకొనవలెనని పనివానికి తగినంత హెచ్చుకాలము ఉద్యోగములభించునట్లు తనఉత్పత్తి పథకాలు నిర్మించుకోవలెనని కూడా అందులో ఉద్ఘాటించబడింది.

## ఫిర్యాదులు పరిష్కరించుట.

ఒడంబడికలపై సంతకముచేయడం ప్రజాదృష్టి ఊహా యిట్టే ఆకర్షిస్తుంది. కాని దైనికముగా దానిని అమలుపరుచు విషయాలకు తగు ప్రచారం లేకపోయుటచే అవి సరిగా అర్థంకావు. ఒకపరిశీలకుడివాఖ్య యీవిధంగావుంది. (కార్మికసంబంధాలలో, మామూలు ఒడంబడిక సంప్రదింపులు గృహములోని బంధువులకు ఎదురుగాజరిగే ఒక పెండ్లివంటిది. అయా పార్టీలను, శుభాశీస్సులతో శుభోద్దేశ్యములతో తమవ్యాపారము సాగించుటకు ఉద్యుక్తులను చేస్తుంది. ఈ ఉద్యుక్తతయొక్క కాలపరి

మాణము నిత్యమూ జరిగే దైనిక సవాకారము, పరిష్కారమువిూద ఆధారపడియుండును.

వివిధ ఒడంబడికలలో వివిధరకాల ఫిర్యాదుల నిర్వాహకపద్ధతులు అమర్చబడి వున్నాయి. పైనచెప్పిన ఇంటర్నేషనల్ లేడీస్ గార్మెంటు వర్కర్సు ఒడంబడికలో ఫిర్యాదుచేయువాడు తనఫిర్యాదుపత్రము వ్రాత మూలంగా అసోసియేషను మేనేజరుకు, సంఘం మేనేజరుకు లేదా దుకాణములోనివారి ప్రతినిధులకు యివ్వాలి. యజమానులు, సంఘము ప్రతినిధులు కలిసి ఒక తీర్పుయిస్తే అది ఆఫిర్యాదుచేయువాడు ఒప్పుకొని తీరాలి. లేకపోతే ఆవిషయం ఒక నిష్పాక్షిక అధ్యక్షునికి వదిలివేయబడుతుంది. అతనితీర్పు అన్నివిధాల తుదితీర్పుగా భావించబడుతుంది.

యునైటెడ్ మోటారు వర్కర్సు సంఘంలో ఫిర్యాదులు మొదట ఫోర్‌మెనులు, తర్వాత దుకాణం సూపరెంటెండెంట్లు ఆతర్వాత డైరక్టరు, పిదప కంపెనీ అధికారులు, అవసరమైతే మధ్యవర్తి పరిశీలించుచుదురు.

మేనేజరు ఫిర్యాదులు గురించి ఏవిధంగా జాగ్రత్తపడవలసింది వాటిని సరిదిద్దుటకు ఎటువంటి దృక్పథం అవలంబించవలసింది మొదలగువాటి ప్రాముఖ్యత క్రమక్రమంగా అన్నిసంఘాలు గుర్తిస్తున్నాయి. ఈపని యొక్క ప్రాధాన్యతగుర్తించి అమెరికను కార్మిక సమాఖ్య పారిశ్రామిక సంస్థకమిటీ ఐక్యసమాఖ్య ఏర్పాటుకాకముందె పారిశ్రామికసంస్థ మిటీలా యీ మేనేజర్లకు ఫిర్యాదులను స్వీకరించి పరిశీలించుపద్ధతిపై అనేక ఉపదేశాలు మేనేజర్లకు యిచ్చేంతవరకు పనిచేసింది. అందులో కొన్ని సిఫారసులు యీవిధంగా ఉన్నాయి.

"నీఒడంబడికచదువుము. తనఒడంబడిక తెలియని మేనేజరు దిక్సూచి లేని నావికాప్రయాణికునివంటివాడు."

"నీశాఖను సరిగా పరిశీలించుము. ఆశాఖలోని ఉద్యోగాలు నీకు బాగా తెలియాలి. ఉదాహరణ: యంత్రాలు, జీతాలస్కేళ్ళు మొదలగునవి"

"సహాయంకోరు ప్రతీకోరికను సానుభూతితో పరిశీలించి చర్యతీసుకోవాలి. నీవు ఫోర్‌మెనుతో సంప్రదించగలిగే నీతోటి ఉద్యోగుల న్యాయసమ్మతమైన కష్టానికి బాధ్యత వహించనటువంటి కంపెనీ ఫిర్యాదుకు ఉన్న భేదము సరిగానీవు చెప్పగల్గియుండాలి."

"ఫిర్యాదు సిద్ధకష్టముకాదని నీవు నమ్మినట్లైతే దానిని పరిశీలించవద్దు. ఒడంబడికలోని విషయాలు చదువుటలో కాని, నిర్వచించుటలో కాని చేయువ్యక్తిగత పొరపాట్లు న్యాయసమ్మతమైన కష్టాలు కాజాలవు."

"నీవు ఫోర్‌మెనును చూసేముందు, ఒకసారి ఆగి, ఆలోచించు. నిన్ను నువ్వు ప్రశ్నించుకో. (1) నేను అన్నివిషయాలు నిజంగా కార్మికునినుంచి పొందితినా. (2) తక్కిన సమాచారమంతా నావద్దఉన్నదా ? (3) ఒడంబడిక నేను ఒకసారి పరీక్షించానా. (4) కార్మికునకు కేసుగురించి విపులంగా చెప్పానా. (5) మనస్సు ప్రశాంతంగా, నిర్మలంగా, పటిష్ఠంగా ఉందా? అప్పుడే నువ్వు ఫోర్ మెనువద్దకు పోవచ్చును. నువ్వు ఒక కష్టమునుగురించి వాదించునపుడు, ఫోర్ మనును నువ్వేవిధమైన అనుగ్రహము కోరటము లేదు. అతనికి తలవంచవలసిన అగత్యంలేదు. అదీకాక నువ్వు భుజంపై ఏదో పెద్ద బాధ్యతపెట్టుకున్నట్లు ప్రవర్తించిన ఫోర్ మను వద్దనుంచి ఏవిధమైన సహకారం పొందలేవు."

"ఫోర్ మనుకనుక ఆకష్టాలలో వ్యాపారం చేయదల్చుకున్నట్లైతే నువ్వొకటితీసుకో నేనొకటితీసుకుంటానన్న పద్ధతిలో–నువ్వుదానిని ప్రతిఘటించుము. ఈకష్టాలలో వ్యాపారం చేయుటవలన అందుకు సంబంధించిన కార్మికులకు న్యాయముజరగదు. ప్రతీకష్టం ఆయా కేసునుబట్టి పరిష్కరించుము."

"ఫోర్ మెను నిన్ను పిచ్చివానినిగా చేయుచో నీఉద్రేకము అదుపులో పెట్టుకో పిచ్చిగామారిన వ్యక్తులు చాలా కొద్దిమందిమాత్రమే సరిగా ఆలోచించగలరు."

"అపథ్యమైన దదుపులుమాత్రము చేయకు. పనిమనుషులు పనినుంచి వెళ్ళిపోవుదురన్నచో, నువ్వు అబద్ధంచెబుతున్నట్లు అనిపిస్తుంది. ఈ కష్టాలపై చాలఒడంబడికలు సమ్మెలు చేయుటకు సమ్మతించవు. ఏవిధమైన సమ్మెగాని అవలంబించవలసినప్పుడు, ఎదురుగా ఉన్నకష్టముగూర్చి అమలులోఉన్న పద్ధతులన్నీ జరపాలి."

"ఫోర్ మనును నీవుచెప్పినకష్టముపై తక్షణము ఒక జవాబుయిమ్మని అడుగుము; లేదా జవాబుకు ఒక నిర్ణీతకాలము గడువు అడుగుము. ఒకసారి ఫోర్ మెను నీకష్టముగూర్చి ఏకీభవించనపుడు, దాన్నిగురించి ఎక్కువ తర్జనభర్జనచేయకు."

"ఫోర్ మన్ కనుక నీకు సంతృప్తికరంగా కష్టం తొలగించేనపుడు, ఆకష్టం తొలగించుపద్ధతులలో తరువాత ప్రయత్నము నువ్వు అమలుజరుపు. ఈ కష్టాలు తొలగించుపద్ధతి ఒకటి విశిష్టమైనది యీక్రిందివిధంగా వుంది.

"ప్రథమచర్య: కార్మికుడు, మేనేజరు, ఫోరుమన్ వద్దకు వెళ్ళుట, ద్వితీయచర్య: సంఘము యొక్క కమిటీ మరియు ప్లాంటు సూపరింటెండెంటు లేదా పెర్సనల్ డైరక్టరు ఆఫిర్యాదును పరిశీలించుట. తృతీయచర్య: అంతర్జాతీయసంస్థ ప్రతినిధి నొకరిని సంఘమునకు సహాయము చెయ్యమని కోరుట. ఉన్నతాధికారులు యాజమాన్యములో ప్రాతినిధ్యము వహింతురు. చతుర్థచర్య: మధ్యవర్తిత్వము.

"సాధారణంగా మధ్యవర్తిని, కంపెనీ, కార్మికులసంఘము పరస్పర ఒడంబడికతో ఎన్నుకొంటారు. వారు ఒప్పుకొనకపోతే బయటివారెవరైనా నియమిస్తారు. మొట్టమొదటిసారి మధ్యవర్తి వినేటప్పుడు, యజమానుల కార్మికుల ప్రతినిధులు తమకేసుగురించి విపులీకరిస్తారు. ఇది మామూలుపద్ధతినే జరుగుతుంది. మధ్యవర్తి, వారు చెప్పుకొన్న కష్టముపై తీర్పు యిచ్చినప్పుడు, ఉభయపార్టీలు అంగీకరించి తీరవలెను. ఆయన తీర్పు అన్నివిధాల తుదితీర్పు. దీనిని కోర్టులు అమలులోకి తేగలవు."

ఆఫిర్యాదులు సరిదిద్దునపుడు సంఘప్రతినిధులు సాధారణంగా యీ సిఫార్సులు పూర్తిగా అవలంబించరనునది స్పష్టంగా చెప్పవచ్చు కాని సంఘాల విధానంమాత్రం స్పష్టంగా ఉంటుంది.

ఇటువంటి విచిత్రమైన సంఘయంత్రాంగం అమలుజరుపుటవలన, ప్రజాస్వామ్యపద్ధతిలో యజమానులు కార్మికుల మధ్య సంఘర్షణలు సరిదిద్దబడతాయి. అందువల్ల యజమానుల, మధ్యవర్తిత్వ నిరంకుశపద్ధతులను అనుసరించనక్కర్లేదు. అటువంటి నిరంకుశపద్ధతులలో కార్మికులకు ఏవిధమైన, వాక్బలము ఉండదు. పైగా కార్మికులవల్ల నిర్హేతుక ఉద్రేకపూరితమైన విప్లవములవల్ల లేనిపోని సమ్మెలు, కొట్లాటలు, ఉద్రిక్తత, స్పర్ధలు కలుగగలవు. వీటన్నిటిని ప్రజాస్వామ్యపద్ధతులద్వారా దూరము చేయవచ్చు.

సాధారణంగా సమ్మెలు, లాకౌట్లు వీలైనంత తక్కువగా ఉంచగల్గుతూ, ఎవరికి ఏ అన్యాయం జరగకుండా చూడవలెనన్న శాసనాలకై పరుగెత్తకుండా, సమన్వయపద్ధతులు ఎక్కువగా, దేశంలో, రాష్ట్రి

పరంగా స్థానికంగా అవలంబించాలి. విజయవంతమైన సమన్వయము పారిశ్రామిక వివాదాల్ల దడుపుల ప్రథమదిశల్లోనే జరుపగలమనే సత్యం గుర్తించాలి.

## వివాదము వేడెక్కనీకూడదు.

పరిస్థితి వేడెక్కకపోతే దానిని చల్లార్చప్రయత్నించడం అనవసరం. సమ్మెలు, లాకౌట్లు, దూరముచేయగల్గడం ద్వారానే చాలా విజయం సాధించవచ్చు. అనేకసంఘాలు ఒడంబడికలలో ఏర్పరచబడిన నిష్పాక్షిక మధ్యవర్తిత్వయంత్రాంగం ఉపయోగించుటవలన, నగరము రాష్ట్రము, కేంద్రప్రభుత్వము, స్వతంత్రసంస్థలు ఏర్పరచిన మధ్యవర్తిత్వము సమన్వయం రాయబారమువలన యివి పొందగలము. ఒకసంఘము ఒడంబడిక పూర్తిఅయినపుడు, యజమానులు, సంఘముమధ్య మరొక ఒడంబడిక కుదరనపుడు, మళ్ళీ క్రొత్తఒడంబడికను దిగేదాకా, పాతఒడంబడిక షరతులు అవలంబించినచో సమ్మెను దూరంచేయవచ్చును. పాతఒడంబడిక ఆఖరయిపోయినప్పటినుంచి పాతఒడంబడిక షరతులు మళ్ళీ అమలులోకి వస్తాయి. ఈ ఏర్పాటువల్ల కార్మికులలో ఎక్కువ బాధ, పరిశ్రమకు ఎక్కువనష్టము కల్గకుండా చూడవచ్చు.

## "దిఛెకాఫ్"

కొన్నిఒడంబడికలలో యజమానులు సంఘసభ్యుల జీతములనుంచి వారి సభ్యత్వరుసుములు తగ్గించి, తిన్నగా సంఘము కోశాగారమునకు పంపు "ఛెకాఫ్" పద్ధతులుకూడా ఉన్నాయి. టాఫ్ట్ హార్ట్లే చట్టం ప్రకారం కార్మికుడు వ్రాతమూలకంగా అట్లుచేయవచ్చని యిచ్చినప్పుడే అతని తనమునుంచి ఆసభ్యత్వరుసుము తగ్గించబడును.

ఈ ఛెకాఫ్పద్ధతి మొదట గనికార్మికులకు, టీమ్స్టర్సుకు, మరికొన్ని సంఘములకుమాత్రమే అమలుజరుపబడుచుండెను. ఈనాడు యీపద్ధతి, యునైటెడ్ ఆటోమొబైల్ పనివారిసంఘమునకు, ఆటోమొబైల్ కంపెనీలకు మధ్యజరుగు అన్ని ఒడంబడికలలోనూ వుంది. ఇదేవిధంగా పన్నులు, ఇంటిఅద్దె, డాక్టరుఫీజు, ప్రభుత్వబాండ్లు, తదితర వసూళ్ళకై అనేక కంపెనీలు తమజీతపు రిజిస్టర్లలో "ఛెకాఫ్" పద్ధతి అవలంబించుచున్నారు.

సంఘతత్వవాదులు, పరిశీలకులు, శ్రామికసంఘ ఉద్యమములో దీని స్థానము విలువగురించి భేధాభిప్రాయాలు కలిగివున్నారు. చాలచోట్ల, 'చెకాఫ్' వాడుకవల్ల అధికారులమధ్యనే విభేదాలు ఏర్పడ్డాయి. ముఖ్యంగా సభ్యత్వానికి సంఘమందలి నాయకులు అత్యధికసేవ చేయకుండా దూరంచేయుట, సంఘవ్యవహారాలలో సంఘసభ్యత్వము తక్కువ చైతన్యవంతముగా చేయుటలో ఈ విభేదాలు ఏర్పడ్డాయి. చాలామంది యజమానులు యీ 'చెకాఫ్'లు ఒడంబడికలు ఉండవలెనన్నదానికి సుముఖులుగా ఉండిరి. కారణమేమన దానిఫలితం కార్మికులకు సంఘ ఆఫీసర్లతో సంబంధాలు పోయేవి.

అదేకాక, మరొకవిధంగా సంఘాలు పెద్ద సంస్థలుగామారినపుడు, వారిసభ్యత్వం అనేకచోట్ల చెల్లాచెదురైపోయి సభ్యత్వరుసుములు సేకరించుట చాలాఖర్చుకల్గించి, కాలము వ్యయముచేయవలసివచ్చేది. అందువలన ఈ పెద్దపనినుంచి కొంచెంతప్పుకున్నట్లయితే వారు తమశక్తులన్నీ విద్య, విరామం, ఆరోగ్యం, సంక్షేమం మున్నగు యితర నిర్మాణాత్మక సేవలలో ఎక్కువ వినియోగించవచ్చని అభిప్రాయపడ్డారు. యునైటెడ్ మోటారు కార్మికుల సంఘమునందు, యీ ప్రత్యేక సేవాసదుపాయాలు విరివిగా వుండుటచే చాలామంచి సంఘసభ్యులు కార్మికుల సంస్థతో సన్నిహితంగావుండేలా అది సేవచేస్తోంది.

## సంఘసభ్యత్వరుసుము మొత్తము లు

సంఘము, యజమానులమధ్య ఒడంబడికలో తమసభ్యులనుంచి తాము వసూలుచేయు మొత్తముగురించి ప్రస్తావనలేదు. ప్రతిరుసుములు, తదితర మొత్తాలు సంఘములు మొత్తము ఎంతవసూలు చేయవలయుననునది చాలాకాలంనుంచి వివాదాస్పదమైపోయింది. కొన్నిసంఘాలలో వసూలుచేయబడే హెచ్చుమొత్తాలు పరిశీలనకువచ్చాయి. ఇది చాలాసంఘాలలో వసూలుచేయు మొత్తములకంటె కొంత వైచిత్ర్యముకల్గి యున్నదని భావింపబడింది.

బాహ్యమైన పరిశీలనవల్ల యిదినిజంకాదని తెలిసింది. 1955 లో నేషనల్ ఇండస్ట్రియల్ కాన్ఫెరెన్సుబోర్డు చేసిన పరిశీలనలో, చాలా సంఘాలు తమ ప్రవేశరుసుములు 2 మొదలు 5 డాలర్లవరకు నిర్ణయించి

నట్లు తెలుస్తుంది. ఏడు సంఘాలు తమ నియమావళిలో యిటువంటి ప్రవేశరుసుమును వ్యతిరేకించాయి. మరికొన్నిసంఘాలు 65 సెంట్లు మాత్రమే వసూలుచేసాయి. మరికొన్ని నిపుణుల కార్మికులసంఘాలు 250 డాలర్లవరకుకూడా వసూలుచేసాయి.

ఈపరిశీలనద్వారా చివరకు తేలింది, పరిశోధించబడిన 194 సంఘాలలో మొత్తంమ్మీద 17,500,000 సభ్యత్వంకల్గినవాటిలో సరాసరి సంవత్సరమునకు 26. 14 డాలర్లు, అంటే నెలకు సుమారు 2 డాలర్లకుపైగా వసూలుచేయబడినట్లు తెలుస్తున్నది. ఈవసూలు వారానికి 50 సెంట్లు అవుతాయి. అంటే సరాసరి ఫ్యాక్టరీవేతనం 78.69 డాలర్ల వేతనంలో ఒకటవ శాతంలో 6/10 వ వంతు అవుతుంది. అన్నిటికంటె ఎక్కువ వసూలు విమానచోదకులనుంచి నెలకు 25 డాలర్ల చొప్పున వసూలు చేయబడింది. వీరిసంవత్సరజీతము 19,000 డాలర్లు అంటే వారిజీతంలో 1½ శాతము వసూలుచేయబడుచుండెను.

ఈవసూళ్ళలో సగము, అంటే అమెరికారాష్ట్రం కెనడాలలో వసూలైన మొత్తము 228,000, యీ డాలర్ల సొమ్ము స్థానికసంఘాల ఖర్చులకు అంతకు సమానమైంది అంతర్జాతీయ సంఘాలకు వెచ్చించబడింది. సాధారణ అలవాటుప్రకారము, ఉద్యోగంలో లేని నిరుద్యోగకార్మికులు తమరుసుములు కట్టనక్కర్లేదు. ప్రజాస్వామ్యసంఘాలలో, అధిక సంఖ్య ఒప్పుకుంటేకాని, వసూళ్లు ఎక్కువచేయుటకు వీలులేదు. ఒక్కొక్కసారి అటువంటి సమావేశాలకు, జాతీయసంస్థల ఆమోదం పొందవలసియుండెను. చాలా శ్రామికసంఘసంస్థలలో సభ్యులే తమరుసుములు పెంచేనిర్ణయశక్తి కల్గినవారన్న సంగతి గుర్తిస్తే, అటువంటి ప్రతిపాదనలు గురించిన సంఘచర్చలు ఎవరూ వినవలసిన అగత్యంలేదు.

## ప్రభుత్వ ఉద్యోగులు.

కార్మికసంఘాలలో ప్రభుత్వోద్యోగ్యులు ఉండటం అటువంటి ఉద్యోగులుకల్గిన శ్రామికసంఘాల యజమానులతో చేయు ఒడంబడికలు ఏస్వరూపములో ఉండాలి అనే సమస్య మితిమీరిన ప్రాముఖ్యం పొందుతుంది. పోస్టాఫీసులు, ప్రజలచే నడపబడే యంత్రాగారాలు, స్కూల్లు, నావికా

ప్రదేశాలు, ప్రజాప్రభుత్వాధికార సంస్థలు మొదలగువాటిలోని ప్రభుత్వోద్యోగులు చాలామంది కార్మికసంఘాలకు సంబంధించినవారే. వారి జీతాలు, పనిచేయుపరిస్థితులు, కాంగ్రెసుచే నిర్ణయింపబడి, పౌరఅధికారశాఖలచే పర్యవేక్షించబడే అనేక కేసులలో ఉమ్మడిబేరమనునది అక్షరాలా లభించదు. వ్యక్తిగతవిచక్షణ, అన్యాయంగా ఉద్యోగంనుంచి తొలగించడం మొదలగువాటినుంచి సంఘాలు నిజంగా రక్షణయిస్తున్నాయి. పునర్విభజనకు ప్రత్యేకంగా కొన్నికేసులు పరిశీలించుటవల్ల యీసంఘాలు, వ్యక్తులకు, వర్గములకు తమజీతములనుంచి అడ్వాన్సులు యిప్పించగలిగే ఏర్పాటు చేయగల్గుతున్నాయి. తమసభ్యులు పనిచేసే వృత్తులయొక్క ప్రమాణాలు పురోభివృద్ధిచేయుటకు దోహదమిస్తున్నాయి. సంఘాలు, ప్రచారంద్వారా, వోటర్లలో సానుభూతిని సంపాదించియు, పనివారిజీతాలు, పనిచేయుపరిస్థితులు అభివృద్ధిచేయుటలో శాసనసభలపై తమ ప్రత్యేకప్రభావము చూపగల్గుతున్నాయి. అయితే హేచ్‌చట్టము పౌరసేవనియమావళి, తదితరములద్వారా ప్రభుత్వోద్యోగులు రాజకీయ కార్యక్రమాలనుండి బహిష్కరింపబడ్డారు.

దరఖాస్తుపెట్టుహక్కులు – సంస్థనిర్మాణము.

ప్రభుత్వోద్యోగులు ఇతరులవలెనే తమ సరైనజీతములు, పనిచేయు పరిస్థితులకొరకు పోరాడవలసివచ్చింది. కొన్ని రోజులలో దరఖాస్తులు గాని, విషయనివేదనకాని కాంగ్రెసుకు, వారికమిటీలను చేయరాదని ప్రభుత్వోద్యోగులనుకట్టుబాటులోఉంచారు. ఇటువంటికాలంలోనే అమెరికన్ ఫెడరేషన్ ఆఫ్ లేబరు సహాయంతో 1912 లో లోయడ్‌లా హేలెట్ చట్టము అమలుపరచబడింది. ఈచట్టంలో రెండు ముఖ్యవిభాగాలున్నాయి. మొదటిది, అందరుప్రభుత్వోద్యోగులకు తమదరఖాస్తులు, తప్పనిపరిస్థితుల సమాచారంలు కాంగ్రెసుకుకాని, దానికమిటీలకుగాని సూటిగా నివేదించు హక్కు యివ్వబడింది. రెండవది, అందరు పోస్టలు పనివారు ఏ సంస్థలోనైనా చేరవచ్చును. కాని అది ఏ బయటిసంస్థతో కాని అనబంధము కలిగియుండరాదు. ముఖ్యంగా అట్టి బయటిసంస్థ సమ్మెలుచేయుటకు ప్రోత్సహించినపుడు అమెరికారాష్ట్రాలకు వ్యతిరేకంగా సమ్మెచేయు ఉద్యమంకు సహాయము చేయునపుడు, పైరెండవ

విభాగం సాధారణంగా పోస్టలు పనివారికి అన్వయించినా అందరి కేంద్ర ప్రభుత్వోద్యోగులకు యిది వర్తిస్తుండేది. అమెరికా కార్మిక సమాఖ్య పారిశ్రామిక సంస్థకమిటీ తమ సభ్యులైన సంఘాలను సమ్మె చేయుమని నిర్బంధించవు. కనుక (ఆవిషయం ఆయా సంఘాల స్వంతతీర్మానానికి వదిలివేయబడింది). ప్రభుత్వోద్యోగులుకల్గిన అనేకసంఘాలు యీ ఐక్య సమాఖ్యకు అనుబంధమైపోయాయి.

కేంద్రప్రభుత్వోద్యోగులే కలిగిన చాలా సంఘాలు తమ నియమావళిలో సమ్మె చేయకూడదనునది వ్రాసియుంచుకొన్నారు. కట్టడములలో పనిచేయు వారు, ఓడకార్మికులు, ముద్రాపకులు, తదితరులు, ప్రభుత్వేతర పరిశ్రమ లలో పనిచేయువారితో కూడిన పెద్ద అంతర్జాతీయసంస్థలు యిటువంటి నియమము కలిగిలేవు. అయితే 1947 టాఫ్టుహార్లీచట్టములోని 305 సెక్షను ప్రకారము అందరు ప్రభుత్వోద్యోగులు సమ్మెచేయరాదని ప్రకటించ బడింది. ఆ ప్రకటన యునైటెడ్ రాష్ట్రములలో కాని, దాని ఏజన్సీలలో గాని అంటే ప్రభుత్వ కార్పొరేషన్లువంటివాటిలోగాని, పనిచేయువ్యక్తి సమ్మెలో పాల్గొనుట న్యాయవిరుద్ధము. అమెరికా యునైటెడ్ రాష్ట్రము లచేగాని, వారి ఏజన్సీచేగాని యివ్వబడిన ఉద్యోగముకల వ్యక్తి సమ్మె చేసినచో తక్షణము ఉద్యోగమునుంచి తొలగించబడును. తన ఉద్యోగ ప్రతిపత్తి పోగొట్టుకొనును. మరో మూడుసంవత్సరములవరకు యునైటెడ్ స్టేట్సుగాని, వారిఏజన్సీఏదియుకాని అతనిని ఉద్యోగములోనికి తీసు కొనవు."

1903 లో అధ్యక్షుడు థియొడోర్ రూజ్ వెల్టు కేంద్ర ఉద్యోగుల గురించి చేసిన ఒక నోకో–జీడ్ షాప్, నోయూనియన్ షాప్ విధానములు; ప్రకారము, కూలికి తీసుకునిమనిషి సంఘసభ్యుడై యుండవలెను. యూని యన్ షాప్ విధానంప్రకారం సంఘసభ్యుడు కానివానిని యజమాని పనిలోకి తీసుకొనవచ్చును. ఉద్యోగమివ్వగనే పనివాడు నిర్ణయించబడిన 30 లేక 60 దినములలో కూలికి కుదిరినాక, చేరవలెను. విధాన ప్రకటన వల్ల కార్మికసంస్థలో సభ్యత్వమున్నా లేకపోయినా ఏవ్యక్తికిగాని ఉద్యో గం నిరాకరించరాదు. ఏవిధంగానూ విచక్షణ చూపరాదు. పారిశ్రామి కులు అయిష్టపడే సంఘతత్వములోని రెండు ముఖ్యాంశాలు ప్రభుత్వమే

తన ఉద్యోగులకు నిరాకరించుట కొంత అసమంజసంగా ఉంటుంది. కాని ఒక్క విషయముమాత్రము దీనికి బలముకూర్చదు. అది : ప్రభుత్వోద్యోగులు శాసనపద్ధతులు, ఒత్తుడులద్వారా తమ పనిచేయుపరిస్థితులు, జీతములగురించి కొంత క్లేశనివారణ పొందగలరు. కాని అదికూడా చాలా నెమ్మదిగా తగినంతగాకాదు. ఇటువంటి కష్టనివారణ ప్రైవేటు పారిశ్రామిక రంగంలోని ఉద్యోగులకు లభించదు. అట్లు లభించుటకు వారు ప్రభుత్వనియమావళికి అనుగుణంగా మొగ్గుటయో లేక ప్రభుత్వ యాజమాన్యంక్రిందకు వచ్చుటయో జరగాలి. బహుశా చాలామంది యజమానులు సమ్మెలు, దుకాణాలు సంఘాలు, మూసివేయుట యిష్టపడుదురేకాని కార్మికులను రాజకీయ చర్చలవరకు పోనిచ్చుటను హర్షించరు.

## ప్రభుత్వము ఎప్పుడూ ధర్మముగా ప్రవర్తించునా ?

పురాతన సంప్రదాయాల ప్రకారం ప్రభుత్వోద్యోగులుచేయు ఏ సమ్మెనైనా ప్రభుత్వముకు వ్యతిరేకమని ప్రభుత్వాధికారులు భావించుచుండిరని మనము ఒప్పుకోవచ్చు. అధికారుల మనస్తత్వం చంచలమై అనేక అపోహలకు ఆలవాలము. ప్రభుత్వం దాని ఉద్యోగులు సర్వకాలములందు రైటుగానే ప్రవర్తిస్తున్నారనే భావము విషయములో ప్రభుత్వపరిపాలకుడు కొంచెం జాగరూకతకలిగి యుండాలి. ప్రభుత్వోద్యోగులు, ఉమ్మడిబేరము నిష్పాక్షిక మధ్యవర్తిత్వము అనే ప్రజాస్వామ్యహక్కులు ఇతర ప్రైవేటు పరిశ్రమలలో ప్రభుత్వం గట్టిగా అమలుపరుస్తున్నట్లు కోరరనుకోడం పొరపాటు.

ఈవిషయమే చాలా ఆకర్షణీయమైనది. దీనిని వివిధశాఖలలో క్షుణ్ణంగా పరిశీలించి దీనికి వ్యాయముచేయుట కష్టము. ప్రభుత్వవేతనముల పట్టికలో అభివృద్ధి, స్థానికపరిపాలన, ప్రభుత్వ యాజమాన్యపు సంక్షేమపథకాలలో అభివృద్ధి, తదితర సాహసకార్యాలలో పనిచేయు ప్రభుత్వోద్యోగుల పరిస్థితులు చాలాతక్కువ స్థాయిలో ఉన్నందున ఈవిషయం పరిశీలనదృష్ట్యా ఎక్కువ ప్రాముఖ్యత పొందుతున్నది.

ప్రైవేటు పరిశ్రమలోని కార్మిక సంబంధాలందువలె ఉన్నతస్థాయిలో చర్చించుటవలన అదృశ్యహక్కులు పొందే పరిష్కారం లభించదు. ఉద్యో

గుల, యజమానుల హక్కులను గౌరవిస్తూ సంఘం, యాజమాన్యంమధ్య నిపుణతను సహకారం పెంపొందించి నిర్మాణాత్మక ప్రయోగాలద్వారా యీపరిష్కారం సాధించవచ్చు. టెన్నెసీవేలీ అథారిటీ, అటువంటి నిర్మాణాత్మకప్రదర్శని ఒకటి చేయుచున్నది. అందుకు మునుపు స్థాపింపబడిన సంఘములతో పరస్పర సహకారపద్ధతులు ఉపయోగించుచున్నది. ప్రభుత్వోద్యోగులు ప్రైవేటు యజమానులు ఈప్రయోగములు పరిశీలించుట అవసరము.

ప్రభుత్వోద్యోగుల విషయంలో పైనచెప్పిన నియమావళిగాక వాల్ష్ హీలే పబ్లిక్ కాంట్రాక్ట్సుయాక్టు ప్రభుత్వంపనినిచేయు ప్రైవేటుకంట్రాక్టర్ల వద్ద పనిచేయు ఉద్యోగులవిషయంలో కొన్ని షరతులు నిర్ణయించివుంది. ముఖ్యంగా అప్పుడు అమలులోఉన్న వేతనాలు యివ్వవలసిందని ప్రైవేటు సంస్థలలో పనిచేయుఉద్యోగులు ప్రభుత్వకంట్రాక్టులపై పనిచేయునపుడు మామూలుపరిస్థితులలో వారు సమ్మెచేయవచ్చు. యూనియన్‌షాప్‌కు సంబంధించిన నియమావళిఅంతా రాష్ట్రాలమధ్య వ్యాపారాలలో పని చేయు ఉద్యోగులకువలెనే వీరికి కూడా అన్వయించబడుతుంది.

## ఇరుపక్షాలు న్యాయంగా సంచరించాలి.

సంఘాలతరఫున న్యాయంగా సంచరించడానికి, నిపుణత పెంపొందుటకు సహకారమిచ్చుట, ప్రైవేటు పబ్లిక్ పారిశ్రామికరంగాలలో యివి అనుసరించుట, సంఘోద్యమమునకు మంచి ప్రచారరూపంగా చెప్పవచ్చు. ఇదివరకే సంఘటితమైన పరిశ్రమలలోచేయు అన్యాయపు అలవాట్లు బైటపడితే, క్రొత్తపరిశ్రమలలో సంఘాలు నిర్మించుట చాలా కష్టమై కుంటుపడిపోతుంది. ఉద్యోగసమస్యలు సరిదిద్దుకొనుటలో చికాకు, ఆలస్యాలు అసందర్భరీతులు, సంఘటిత యంత్రాగారాలపై అన్యాయమైన ఎక్కువ బరువుమోపి పోటీదారులను సరిగా సంఘటితపరచలేకుండుట, సంప్రదింపుల సభలు సరిదిద్దుకోవడాలు, మొదలైనవాటికి యజమానులుకోరే కోర్కెలు సకాలములో గుర్తించక నాయకులు సంఘటితకార్మికజనాన్ని విస్మరించడం, సంఘాలమధ్య సంఘర్షణలు; ఇవి మరియితరవిధాల సంఘ నాయకులు శ్రామిక సంఘఉద్యమములో మంచిపద్ధతులు అవలంబించక

పోవుటచే సంఘటిత కార్మిక జనంకు హానికలుగుతుంది. ఇదేవిమర్శ యజమానులు, యజమానులసంఘాలపైకూడ చేయవచ్చును. ఇద్దరూ (యజమానులు, కార్మికులు) గుర్తించుకోవలసిన దేమన, న్యాయంగా సంచరించి సక్రమమైన పద్ధతులు అవలంబించినపుడే వారిలక్ష్యాలకు సహాయముకలిగి సిద్ధిపొందుతుంది.

సంఘప్రతినిధులు యజమానుల దైనికసంబంధాలలో న్యాయభావన, ఇచ్చిపుచ్చుకొనే మనస్తత్వము యిద్దరికీ జీవితాన్ని ఆమోదకరంగా చేయగలదు. అటువంటి పరిస్థితులలో ఒకరు మరొకరిని వత్తిడిపెట్టకుండుట నేర్చుకొంటారు. మానవ సంబంధములున్నచోట యిది నిజమవుతుంది. ఎందువలనంటే అచ్చటవర్గాలు, దేశాలు, కుటుంబము లేక వ్యక్తులు, శాంతియుతముగా బ్రతుకుటకు ప్రయత్నిస్తారు. బాధ్యతాయుతనిర్దుష్టమైన సంబంధాలకొరకు రెండుపక్షాలు హేతుపూర్వకంగా పరిదిద్దుకొనుట నేర్చుకోవాలి.

## 5. సమ్మెలు : వాటిని నివారించు మార్గము.

యజమానులతో సంప్రదింపులు జరుపు సమయంలో కార్మికజనం సమ్మెలేకుండా పరస్పర సంతృప్తికరమైన ఒడంబడిక పొందగలమని ఎప్పుడూ ఆశిస్తారు. అయినా కొన్ని కావలసిన లక్ష్యాలు సిద్ధించుకొనుటకు సమ్మెకు పూనుకొనుటకూడా జరగవచ్చు. ప్రజాదృష్టిలో కార్మికసంఘాలు సమ్మెచేయటమే సంఘటిత కార్మికులు ఆదరణ పొందకుండుటకు ముఖ్యకారణమనిపిస్తుంది. ఇటువంటి మనోభావన యుద్ధకాలంలో ఎక్కువగాయున్నా మామూలుకాలంలోకూడా ఉంటుంది. పారిశ్రామిక వివాదకాలంలో అమాయకమైన ప్రజ ఎంతబాధ, చికాకు పొందుదురో సంపాదకీయములు, కార్టూన్లు చెపుతూనేవున్నాయి. చెడ్డపరిస్థితులు భరిస్తూ, అసలు విషయాల వివరాలు తెలుసుకోకుండా స్వార్థపూరితమైన నిర్లక్ష్యంతో

ఉన్న ప్రజను అస్తమానూ కనిపిస్తున్నంత అమాయకులు అనికూడా అనలేము.

## చాలా ఒడంబడికలు, సమ్మెలు లేకుండానే జరిగినవి.

వార్తాపత్రికలు చాలవరకు సమ్మెలగురించి, వాటి తీవ్రతగురించి, సత్య దూరమైన సమాచారం ప్రజలకు అందిస్తున్నదనునది చెప్పకతప్పదు. ఈ తప్పుడుసమాచారానికి కారణం వార్తాపత్రికల పాక్షిక దృక్పథం పూర్తిగాకాదు. కాని సమ్మెలకాలంలో ఉగ్రత పెద్దవార్తగా స్వీకరింప బడుతుంది. సమ్మెలులేకుండా జరిగినకార్మికుల సమస్యల దిద్దుబాట్లు, వార్తలుకాకుండా పోతున్నాయి. సంఘాలు యజమానులతో సమ రసంగా నడుచుకుంటున్నప్పుడు అది పత్రికలలో ఒకవార్తగా రాదు. ఏ ఒకరోజైనా కర్మాగారాలలోని అలజడిలేని కార్మికసంఘాల జాబితా పత్రికలు ప్రచురింపదలచిన, పత్రికలలో యింక ఆరోజు ఏవార్తకు స్థలము ఉండదు. సమ్మెలవిషయంలో సంఘటితకార్మికుల రికార్డు దృక్పథము మొదలగు సత్యాలు ప్రజలు తెలుసుకొని స్పష్టముగా అర్థంచేసుకోవలసిన ఆవశ్యకత ఎంతోవుంది

ఉదాహరణకు 1954 – 1955 సంవత్సరములలో—

(1) 70,000 సంఘాల ఒడంబడికలలో 95 వ శాతము సమ్మెలేకుండానే సంప్రదింపులద్వారానే జరిగాయి.

(2) సమ్మెలవల్ల పనిచేసేకాలంలో చాలా కొద్దికాలంమాత్రమే నష్టమైంది. 1955 లో, యీ నష్టపోయినకాలం, పనిచేసేకాలంలో ఒక శాతంలో నాల్గోవంతు మాత్రమే. 1946 లో ఒక్కసంవత్సరములోనే ఈమధ్య పనిచేసేకాలంలో ఒకటి, శాతముగా కన్పిస్తున్నది. కొన్ని పెద్దసమ్మెల వల్లనేయీకాలం నష్టమైంది. ఉదాహరణకు 1954 లో తూర్పుతీరంలో జరగినసమ్మె మొత్తము నష్టమైనకాలంలో 15 వ శాతానికి బాధ్యత వహించివుంది.

## సమ్మెల కారణాలు.

అమెరికా రాష్ట్రాలలో అనేక విభాగాలలో జరిగిన సమ్మెల కార ణాలు పరిశోధించిన తర్వాత గ్రంథకర్తలు అనేక సంవత్సరాల అను భూతులవల్ల చేసిన అనేక సూచనలు న్యాయమైన వనిపిస్తున్నాయి.

ప్రథమంగా సంఘాలు ప్రజాదృష్టిలో సమ్మెలవల్ల కలిగే నిందలో అన్యాయమైన భాగం పొందుతున్నారు. ఉదాహరణకు కార్మికుల పరిస్థితులలో మెరుగుకోసం జరిగే సమ్మెలవిషయంలో సాధారణంగా యజమాని భీష్మించుకుని కూర్చుంటాడు. సంఘమును పని మాన్పించినంతవరకు ఊరుకోనును.

రెండవది: అలజడివల్ల కాకపోయినా, అసంతృప్తికరమైన పని, పరిస్థితులవల్ల సాధారణంగా సమ్మెలు జరుగుతాయి.

మొత్తంమీద ఏదీకూడా మామూలుగా సునాయాసంగా తీసుకోక, సమ్మెలవెనుక ఏమున్నది పరిశోధించి నాయకత్వంవెనుక ఏమున్నది పరిశీలించి, వేతనాలతో పనిచేయుకాలం, గృహవసతులలో సంఘటితమగు హక్కుల విషయంలో ఎక్కువగా త్వరితముగా పనిచేయు పద్ధతులలో తదితర నిర్దుష్టపరతులలో లోపభూయిష్టమైన కారణాలు, అన్వేషించాలి.

కొన్నిసంవత్సరాల పూర్వం దక్షిణమున నేతపరిశ్రమ సమ్మెలలో, సంఘటితముగాని కార్మికులతోకూడి మిల్లులు ఒకటి తర్వాత ఒకటి సమ్మెలు చేశాయి, పనిచేసేకాలముపెరిగి, పనిలో వేగము హెచ్చుటవల్ల అసంతృప్తి వారిలో పెరుగుటయే దానికికారణము. ఎక్కువసార్లు సమ్మెలు జరిగాక సమ్మెదారుల కోరికపై సంఘనాయకులువచ్చి వారిని సంఘాలుగా చేసేవారు.

ఈ సమ్మెదారుల వర్గాన్నొకదానిని గ్రంథకర్తలలో ఒకరు ప్రశ్నించగా వారు పనివేగం భరించలేకపోయారని ప్రకటించారు. పారిశ్రామిక ఇంజనీర్లను వారు "మినిట్ మెన్" అని పోల్చారు. వారు కాలమునుబట్టి పనిచేయించేపద్ధతులకు స్టాప్‌గడియారాలు వాడేవారు. సహజమైన హాస్యధోరణిలో వారు యీరీతిగా వేళాకోళం చేశారు. "ఈ మినిట్ మెన్‌లో ఒకరు చనిపోతే అతన్ని శ్మశానానికి ఆర్గురు తీసుకుపోయారు. అది అతనికి యిష్టంలేక తన శవపేటికలో లేచికూర్చుని గట్టిగా అరిచేడు. ఈపని చేయడానికి నల్గురు మనుషులు చాలా ఎక్కువ" అని.

## సత్యాలు తెలుసుకోవలసిన అవసరము.

ప్రతీ సమ్మెపరిస్థితి సమయంలో ప్రజలుకనుక పారిశ్రామిక కార్మికుల సంవత్సరాదాయమెంతో కనుక్కొనుటకు కొంచెం కష్టపడితే వారికి

కొంత సహాయకారి కాగలదు. వేతనాల విషయంలో న్యాయమైన తీర్పులుపొందుటకు గంటకాలము పేరుమీద యివ్వబడ్డ హెచ్చు వేతనాలద్వారా అపార్థం చేసుకొనరాదు. ఏవ్యక్తికూడా గంటవేతనాలమీద బ్రతకలేదు. సంవత్సరం అతనికి ఎంత పనిదొరుకుతున్నది ప్రశ్న. సాంవత్సరికసరాసరి ఆర్జనవేతనాల నిర్ణయములో తీర్పుకు సరైన ప్రాతిపదిక. మంత్రివర్గాలు, తదితరపౌరులు యజమానిని ప్రశ్నించినప్పుడు ఫ్యాక్టరీని, పర్యవేక్షించినప్పుడు యీ ముఖ్యవిషయాలపై తగినంత సమాచారము తీసుకోరు. పూర్తిసమాచారము కావాలను వర్గాలు యజమానిని చాలా సన్నిహితంగా ప్రశ్నించి సంఘాల కార్యాలయములకువెళ్ళి వారినికూడా అవే ప్రశ్నలువేసి, చివరకు శాస్త్రీ లేక కేంద్ర కార్మికశాఖల సమాచారంతో పోల్చి చూచుకోవాలి. ఈవిధంగా వ్యక్తిగతంగా యజమానులను కార్మికులు కలుసుకొనే అవకాశం లేనప్పుడు పౌరులు పూర్తిగా వార్తాపత్రికల సమాచారంమీద ఆధారపడకుండా కార్మిక పత్రికలు స్వతంత్ర పత్రికలు కూడాచదివి ఒకదృక్పథంనుంచిగాక అన్నివిధాల పరిస్థితిని అవగాహనచేసుకొన ప్రయత్నించవలెను.

మధ్యతరగతి ప్రజలు ముఖ్యంగా పైహంశములు దృష్టిలోపెట్టుకొనాలి. ఏలన వారితో సాధారణంగా దగ్గరగాఉండువారు, బాగా వేతనాలు సంపాదించు సీసపుపనివాళ్ళు, వడ్రంగులు తదితర గృహసంబంధమైన బాగులుచేయువారు మాత్రమే. కటడాల పనులకు సంబంధించిన సంఘవేతనీయులు, పరిశ్రమకంతకూ ప్రాతినిధ్యము వహించని వారని గుర్తుంచుకోవాలి. ఈ వేతనాలకూ, వ్యవసాయ, నేత పనివారల వేతనాలకూ సహస్రం తేడావుంది.

సంఘాలు నిర్ణయించు వేతనాలు అందరినీ సమానస్థాయిలో వుంచునని, వ్యక్తిగతంగా ఎక్కువ ఉత్పత్తిచేయగల ప్రోత్సాహం లభించదని వాదించువారికి సమాధానంకూడా వుంది. యజమానులు ఎవరికైనా హెచ్చువేతనం ఈయదలచిన సంఘాలకు అభ్యంతరంలేదు. కాని నిర్ణయింపబడిన, ఒప్పందమైన వేతనముమాత్రమే పనివారికి కనీసముగా యుండాలని సంఘనాయకులంటారు. సంఘములు నిర్ణయించువేతనం బాగా ఎక్కువగాయుండుటచే చాలాకొద్దియజమానులు ఈ విధంగా జీతము హెచ్చించుట విధానము అవలంబించగలమని చెప్పతారు.

అయినా సంఘము ఇప్పటికున్న జీతములు, పనినిబట్టి యిచ్చునప్పుడు, గంటలనుబట్టి నిర్ణయించునప్పుడు, ఉత్పత్తి పెంపకమునకు బోనసు యిచ్చునప్పుడు యిటువంటి ప్రతిబంధకం అనవసరం. ఈ పద్ధతులు బొగ్గుగనులలోనూ, స్త్రీ పురుషుల దుస్తులతయారీ పరిశ్రమలలోనూ, కొన్ని నేత పనుల మిల్లులలోనూ, తదితర పరిశ్రమలలో కొన్ని విభాగాలలోనూ అమలులో ఉన్నాయి.

పారిశ్రామిక అశాంతి ప్రబలినపుడు ప్రతీ తెలివైన పౌరుడు, కార్మికులు ఎందుకు అసంతృప్తి చెందుతున్నారో దానికి కారణమైన పరిస్థితులు, తెలుసుకోవాలి కాని అన్నిసమ్మెలను విచక్షణలేకుండా అలజడిదారుల సమ్మెలగాను నిందించరాదు. కార్మికులను మద్దత్తుచేయువారు కూడా యీ సలహాపాటించాలి. మెరిసేదంతా బంగారంకాదు. అధికార వివాదాలు, అలజడులు, సహేతుకంగాని కోరికలు జాగ్రత్తగా అర్థంచేసుకోవాలి.

తక్కువకాలం పనికి ఎక్కువ వేతనాన్ని యిచ్చే పనిని తక్కువచేయు పద్ధతులవల్ల కార్మికులు తాము ఉద్యోగాలు ఊడునను భయంకల్గియుండుట మొదలగునవి జాగ్రత్తగా పరిశీలించుట ముఖ్యము. తమవృత్తిలోని చాలమందిజనం నిరుద్యోగులైనపుడు వారి జీవనోపాధియే దెబ్బతిన్నపుడు జనం నిస్పృహచెందుదురు.

నిర్మాణ వృత్తులలో బాగా ఉత్పత్తిపని ఉన్నప్పుడుకూడా కార్మిక సంఘాలు తమ రక్షణలు వదలుకొనుటకు యిష్టపడరు. కారణం తాము మళ్ళీవానిని పొందుట కష్టమని భయము. కొన్ని పనివారి వృత్తిసంఘాలలో అమలులోఉన్న కొన్ని కృత్రిమ నిర్బంధాలు, మధ్యవర్తిత్వ నియమావళి మాత్రము కార్మికసంఘాల పై దృక్పథానికి వర్తించరాదు.

కఠినమైన తీర్పు కొంతవరకు తగ్గగలదు. యజమానులు ఉత్పత్తి విధానాలలో ధరలు హెచ్చుగానుండుటకు నిర్బంధపద్ధతులు అవలంబిస్తున్నారని, వ్యవసాయరంగంలో ప్రభుత్వము యిటువంటి పద్ధతులే ప్రోత్సహించిందని తెలుసుకుని కార్మికులపై యున్న నిర్బంధపద్ధతులపై యజమానులు వాదిస్తున్నారు: ఈవిధానాలన్నీ మన ఆర్థికక్షామంవల్ల నేర్చుకున్న పద్ధతులు. ఇవి ఎక్కువగా బహుశా మార్పుచెందవు. ఎక్కువ ప్రయోజనంకొరకు అత్యధిక ఉత్పత్తికై కొన్ని మంచిపద్ధతులు దేశంలో వ్యాప్తమైనప్పుడు దానితోపాటు కొనుగోలుశక్తి పంపకంలో అవసరమైన మార్పులు జరిగినపుడు ఆర్థికపరిస్థితి కొంత మెరుగవుతుంది.

## సమ్మెలు — సంఘటిత కార్మికులు

సంఘటితమైన కార్మికులలో, సంఘటితముకాని కార్మికులలో, ఎందుకు తరుచు సమ్మెలు జరుగునో తెలుసుకొనే సిద్ధాంతనిర్ణయానికి సమ్మెలు పెంచు తదితర అస్థిరమైన అంశాలు అనగా పెరిగే వ్యాపారక్రమము, పెరిగే ధరలు, గలాటాలు, దేశ ఆర్థిక పరిస్థితిలో పారిశ్రామికాభివృద్ధి కాలం, రాజకీయ పరిస్థితులు, దృష్టిలో ఉంచుకోవాలి. నిజంగా కార్మికులు సంఘాలుగా ఏర్పడకముందే యజమానులు యిటువంటి సంఘాలు స్థాపించడానికి వ్యతిరేకించినపుడే ఎన్నో సమ్మెలుండేవి. సంఘాలు స్థాపించబడిన తర్వాత సమ్మెలు తగ్గాయి.

దీనికి అనేక కారణాలున్నాయి. పారిశ్రామిక అశాంతి తొలగించడానికి కొన్ని పరిష్కారాలు చేయటానికి యజమానులు ఆ అశాంతి ఉందని గుర్తించాలి. కార్మికులు నిర్భయంగా స్వతంత్రంగా తమ భావాలు వ్యక్తంచేయు పరిస్థితులు లేనపుడు యజమానికి వారి భావాలు తెలుసుకొనుట చాలా కష్టమైపోతుంది.

ఈ గ్రంథకర్తలలో ఒకరు ఒకఫ్యాక్టరీలో డైరక్టరుగా ఉండుటచే యీ విషయంలో చాలా విజ్ఞానవంతమైన అనుభూతులు పొందగలిగేరు. స్టోర్ మెన్‌ను, కార్మికులను, రికార్డులను ఆయన పరిశోధించారు. కార్మికులకు చాలాతక్కువ వేతనాలు లభించుచున్నవని ఆయన నిశ్చయించి మిల్లు మేనేజరుతో పరిస్థితి సరిదిద్ద ప్రయత్నించేరు. మేనేజరు దానికి ఒప్పుకోక కార్మికులు చాలా సోమరిపోతులుగా ఉన్నారని, అయినా యిటికలు పేర్చడం నీకేమి తెలుసని గ్రంథకర్తనే హేళనచేసేడు. క్రైస్తవులగుడిలో బోధకుడిగాఉండే గ్రంథకర్త దాన్ని విడిచి మిల్లు ఉద్యోగానికి వచ్చుటచే కార్మికుల సరైనస్థితిగతులు ఆయనకు బాగా తెలియవు. "ఈ విషయంగురించి నాతో మాట్లాడేముందు నువ్వుపోయి కొన్నియిటుకలు పుర్తించెయ్యి" అన్నాడు మేనేజరు. గ్రంథకర్త నిజంగా కార్మికులతో పనిచేయుటకు వెళ్ళారు. దినం ఆఖరులో కార్మికులజీతం చాలాతక్కువని తన అభిప్రాయం వెలిబుచ్చేరు. కాని మునుపు ఆవిషయం గురించి భావించిన దానికంటె కొంచెం తేడాగా ఆలోచించారు. ఫోర్

మెన్ పునరాలోచించుకున్ని ఒకగోడభాగం పడగొట్టాక కార్మికుల సందరినీ తమముందున్న ఇటుకలను ఏర్చి వాటిపైఉండే సిమెంటు తీసి శుభ్రం చెయ్యమని బోధించాడు. ఫోర్ మెన్ వెళ్ళిపోగానే, ఒకకార్మికుడు పడిపోయిన గోడచుట్టుతిరిగి శుభ్రమయిన మంచియిటుకలు ఏరి, కుప్పకూర్చి వేశాడు. కార్మికులు వందలలెక్కపై వేతనాలు పొందుటవల్ల యీ శుభ్రమైన యిటుకలు ఏరుతున్నవ్యక్తికి యిట్టే మంచివేతనాలు లభించాయి. ఇటువంటి వాని జీతము చాలా మంచిజీతమని యిటువంటివారు మంచి కార్మికులని, తక్కినవారలు గ్రంథకర్తతోసహా సోమరిపోతులని మేనేజరు అన్నమాటలు గ్రంథకర్త జ్ఞప్తికి అర్థము చేసుకొనెను.

## కార్మికుల ఆలోచనలు అర్థము చేసుకొనుట

తర్వాత ఫోర్ మెన్ తిరిగివచ్చెను. ఈ గ్రంథకర్త సరిగా పనిచేయడని మధ్యాహ్నమంతా ఫోర్ మెన్ నిలుచుని గ్రంథకర్తపనిచేయుట పరీక్షించెను. గ్రంథకర్త అన్ని అభిమానములు భరిస్తూ పనిచేసేరు. ఫోర్ మెన్ ఎదురుగా వుండి పర్యవేక్షణచేస్తూ త్వరితగతి పనిచేయుమని ఒత్తిడించుట కార్మికులు యిష్టపడరని గ్రంథకర్త ఎక్కడో చదివేరు. కాని ఆ త్వరితగతి పని అంటే ఏమిటో అప్పుడు అతను అనుభవించినంతగా మునుపు అనుభవించలేదు. స్వయంగా వేదాంతధోరణిలో శాంతి కాముడైనప్పటికి గ్రంథకర్తకు ఒక యిటుక ఫోర్ మెన్ మొహంమీద ఎందుకు విసరకూడదా అనిపించింది. అసలు విషయం ఏమిటంటే సాధారణంగా కార్మికులకుతప్ప వారు ఎలా బాధపడుతున్నదీ, ఆలోచిస్తున్నదీ ఇతరులకు తెలియదు. శాస్త్రీయ యాజమాన్యమును కార్మికులు ఎలా ఆలోచిస్తున్నదీ ముఖ్యంగా తెలుసుకుని తగిన దిద్దుబాటులు చేసుకోవాలి. సంఘాల ఫిర్యాదులు తమకువచ్చునని భయపడే యజమానులను తల్చుకుంటే ఒకబోయిలరు గృహమునకు ఒకప్పుడు వచ్చిన ఒకవృద్ధవనిత జ్ఞప్తికి వస్తుంది. బోయిలరు భద్రతా మూత పెద్దశబ్దంతో ఊడినపుడు ఆమె చాలా భయపడింది. భద్రతా మూత విడివడి బోయిలరుప్రేలుడును తప్పించినందుకు ఆమె నిజంగా సంతోషించవలసియుండెను.

సంఘము అటువంటి భద్రతామూత. ఇది సాధారణముగా ఆవిరిని వదిలివేసి ఇంతకంటె ప్రమాదకరమైన ప్రేలుడువంటి కార్మికుల అసంతృప్తికర

మైన పరిస్థితులగూర్చి చెప్పి, వాటికి ఏవిధమైన శాంతియుత పరిష్కార మార్గములు చూపవలెనో తెలియజేస్తుంది.

దక్షిణంలో ఒకమిల్లు యజమాని తన కార్మికులు సంఘటితముకానప్పుడు సమ్మెచేయుట చూచి నిర్ఘాంతపోయాడు. కార్మికులు తన్నుగురించి ఏమను కుంటున్నారో అతనికి తెలుసుకునే సదుపాయములులేవు. గ్రంథకర్తల దృష్టిలో కొన్ని కంపెనీల సంఘాలున్నాయి. అవి చాలా చిన్నఫిర్యాదులను మాత్రమే కంపెనీయజమానులతో చర్చించవచ్చు. పెద్దఫిర్యాదులు చర్చించ రాదు. అందువల్లకూడ సమ్మెలు జరిగాయి.

తెలివైన మేనేజరు మంచి కార్మికసంఘానికి సదా స్వాగతము యిస్తాడు. ఆ సంఘంలో ఏ లోపములున్నా తానుమాత్రం వారి ఆలోచనలు తెలుసు కుంటూ ఉండుటయే మేనేజరు తన ముఖ్యకర్తవ్యంగా భావిస్తాడు.

## సమ్మె నివారించుటకు, సంఘటితశక్తి ఉపయోగం.

యజమాని ఒకసారి కార్మికులుసంఘాలుగా ఏర్పడేహక్కును గుర్తిస్తే ఆ ఒడంబడిక కాలంలో ఫిర్యాదులు ఏ యంత్రాంగం ద్వారా సరిదిద్దు కోవాలోనన్న అంశం యిమిడ్చి ఒడంబడికలపై తాము సంతకాలను తీసుకునే ఒడంబడికకాలంలో యజమాని లాకౌట్‌ను చేయకూడదనియు, కార్మికులు సమ్మెలు చేయరాదనియుకూడా ఒకషరతు విధించబడింది. ఇద్దరూకూడా వివాదాలు శాంతియుతంగా సరిదిద్దుకోడానికి ప్రజా స్వామ్యయంత్రాంగాన్నే వాడుకోవాలనికూడా నిర్ణయించబడెను.

1937 లో సంఘటితశక్తి పూర్తిగా కార్మికులలో ఉన్నప్పుడు, అది సమ్మెలనివారణకు ఒకరక్షణ కాగలదని తెలిసింది. మోటారు పరిశ్రమలో పారిశ్రామిక సంస్థకమిటీ సమ్మెలవల్ల బహువ్యాప్తంగా గందరగోళం జరిగి నప్పుడు, యజమానులు సంఘాలనిర్మాణాన్ని ప్రతిఘటించుచున్నప్పుడు, ఒక సి. ఐ. ఓ. సంఘం ఎమాల్గమేటెడ్ క్లోదింగ్ వర్కర్సు యజమాను లతో 140,000 కార్మికులకు మంచిషరతులు విధించిన మరొక ఒడంబడికకు సంప్రదింపులు ప్రశాంతంగా, విజయవంతముగా, మిల్లులో ఒక్కచక్రం కూడా ఆపకుండా సాగాయి. 1937 లో చర్చలకేంద్రకౌన్సిలుయొక్క కార్మిక ఆదివారసందేశంలో యీవిధంగాఉంది. "దేశంలో చాలా పరి శ్రమలు చాలాకాలంనుంచి స్థాపించబడివున్నాయి. సంఘటిత కార్మికులు,

సంఘటితయజమానుల, మధ్య సమన్వయసంబంధాలు పెంపొందించ గలదను నది ఇదివరకే ప్రదర్శించబడింది. వారి ఒడంబడికల కాలములో లాకౌట్లు, సమ్మెలకు దారితీయకుండా వారి విభేదాలు సరిదిద్దుకోవచ్చని తెలిసినది.”

## స మ్మె ల స మ యా లు.

వ్యాపారము తల్లక్రిందులైనప్పుడు తరుచుగా సమ్మెలు జరుగుతాయి. వ్యాపారము మందంగా నడుస్తున్నప్పుడు కార్మికుల వేతనాలు తగ్గుతాయి. ఒక్కొక్కసారి కొద్దికాలపుపని తీసుకోవలిసి యుంటుంది. మరొక్కసారి పూర్తిగా నిరుద్యోగులయే అవకాశముకూడా వుంది. ఎక్కువ జీతానికి కాని, మెరుగుపరిస్థితులకొరకు కాని కోరికలు కోరదగునంతగా చాలా ఉద్యోగాలుండవు. వ్యాపారం మందంగా నున్నప్పుడు కంపెనీలు బాహ్యంగా అభివృద్ధి చెందుతున్నట్లు, వాటాదారులకు ఎక్కువ లాభాలు పంచిపెడుతున్నట్లు కార్మికులు తెలుసుకొంటారు. ఆదేసమయంలో కార్మికులు తమ కుటుంబ ఆదాయ వ్యయ జాబితాలలో ధరలపెరుగుదల బాధ అనుభవిస్తారు. తత్కారణంగా; ఎక్కువ వేతనాలు కావాలని అలజడి చెలరేగుతుంది. సంఘటిత పరిశ్రమలలో యీ వేతనవృద్ధి సంప్రదింపుల ద్వారా సాధిస్తారు. సంఘటితముకాని పరిశ్రమలలో యజమానులు తమంతి తాము వేతనాలు పెంచి కార్మికుల పెరుగుతున్న జీవనఖర్చులను సరిదిద్దకపోయినచో, కార్మికులతో న్యాయంగా లాభాలు పంచుకోకపోయినచో సమ్మెలు జరుగుతాయి. ఎక్కువ వేతనాలు యిమ్మని కోరి కార్మికులు సాధారణంగా ఉమ్మడి బేరపు ఒడంబడికలలో వ్యక్తంచేయుదురు. పరిశ్రమల ఉత్పత్తిలో తగినంత న్యాయమైనవాటా పొందుటకు కార్మికులు యీపద్ధతి చాలాకాలంనుంచి ఉపయోగించుచున్నారు.

## శా ం తి యు త స మ్మె లు.

సమ్మెలు శాంతియుతంగా జరుపవచ్చు. ఉద్రిక్తత, ఒత్తిడిలేకుండా చాలా సమ్మెలు శాంతియుతంగా జరుపబడెను. అసంతృప్తికరమైన పరిస్థితులలో ఉమ్మడిగా పనిచేయమని నిరాకరించుటద్వారా, తగు ప్రచారం ప్రజాసానుభూతి పొందుటద్వారా, యంత్రాగారముఖద్వ శాంతియుతంగా పికెటింగ్ జరుపుటద్వారా, యజమానిమీద ఆర్థిక ఒత్తిడిద్వారా, కంపె

తన ఉత్పత్తిని ప్రారంభించాలని అతను ఆసక్తి చూపుతున్నపుడు నగర, రాష్ట్ర, కేంద్ర ఆఫీసర్ల చర్చ లేక నగరపౌరుల కమిటీలు స్నేహపూర్వకంగా కలుగచేసుకోవడం ద్వారా సమ్మెల పరిష్కరించవచ్చు. చాలా సమ్మెలు ఆవిధంగా, ప్రజలలో అలజడి, పెద్ద అభిప్రాయాలు కలుగచేయకుండా పరిష్కరింపబడ్డాయి. సంఘంయొక్క చర్యకు తగు హేతుపూర్వకమైన బలములేనపుడు, శాంతియుతమైన పికెటింగుకూడా యజమానికి అన్యాయం చేయటమవుతుంది. యజమానికూడా యిదే పద్ధతి అవలంబించి ఎదురుపికెటింగు చేయించవచ్చు. తన పరిస్థితిని సంకేతముల ద్వారా ప్రజలకు సరిగా తెలియజేయవచ్చు.

పికెటింగు సమస్యలో మరొక భాగమేమంటే, ఒకసంఘం నిర్ణయించు పికెటింగుగీతను తదితర సంఘాలన్నీ ఆమోదించనప్పుడు సమస్యఏర్పడును. కార్మిక ఉద్యమమునకు చాలా సంఘటితశక్తి కావాలి. ఒకొక్కసారి న్యాయమైన సమ్మెలు నష్టపోవుటకు కారణం, సంఘాలమధ్య తగు పరస్పర విధేయత లేకపోవుటయే. ఒక సమ్మెను ప్రారంభించినపుడు, పికెట్ లైనును ఆమోదింపవలసిన యితర సంఘములతో సంప్రదింపులు ముందుగా జరపాలి. లేదా బ్రిటిషువారి ఆచారము ప్రకారము, యీ వివాదమును యజమానులు, సంఘముయొక్క నాయకులు ఉన్న ఒక కమిటీకి సమన్వయము కోసం సూచించాలి. ఆకమిటీసభ్యులు మాత్రము ఆ పరిశ్రమకు సంబంధించినవారై యుండరాదు. ఏకారణంవల్లకూడా ఏ సంఘము పని మానరాదని ఒడంబడికలో ఉన్నప్పుడు ఏ సంఘముకాని ఆ నియమము ఎదిరించరాదు. ఈ విషయంలో ఒక పికెట్‌లైనును దాటుటకు నిరాకరించిన ఒడంబడికను ఉల్లంఘించినట్లుగానే భావింపబడుతుంది.

## అహింసాయుత ప్రతిఘటన.

గాంధీపద్ధతి (ప్రకారం)లో శాంతియుత ప్రతిఘటనల విషయంలో కొన్ని ప్రయోగాలు జరిగినాయి. రీడింగ్, పెన్సిల్వేనియాలలో ఫ్యాక్టరీ ద్వారాలవద్ద రోడ్డుప్రక్క కాలిబాటలపై మేజోళ్ళ పనివారు పడుకుంటారు. దానివల్ల సమ్మెచేయనివారు వారి మీదుంచి నడిచి ఫ్యాక్టరీలోకి వెళ్ళవలసియున్నది. కొన్నిసంవత్సరాలక్రితం ఐ. డబ్ల్యు. డబ్ల్యు. కొన్ని బ్లాకుల వరకు వీధులలో నిలుచుని, ఏవిధమైన హర్షధ్వానాలు చేయకుండుటవే

ప్రెసిడెంటు విల్సనునుంచి కోరిన దర్శనము లభించినది. చాలాసమ్మెలలో ఎమాల్గమేటెడ్ క్లోడింగ్ కార్మికులు మోటారు ట్రక్కులమీందు పడుకొని వస్తువుల రవానా ఆపివేయ ప్రయత్నించిరి. "వెన్ లేబర్ ఆర్గనైజేషన్" అని తనగ్రంథంలో రాబర్టుబ్రూక్సు ఒకపద్ధతిని వర్ణించేడు. దానిప్రకారము, టోలేడోలోని మోటారు సమ్మెలో, సమ్మెదారులందరు ఆజ్ఞలను ప్రతిఘటించి తమంతతామే అరెస్టయి పోలీసువేగన్లలో, జైళ్ళ కెక్కి తొడతొక్కిడిగా నిండిపోయిరి. తమంతతాము బాధపడుటచే, సమ్మెదారులు ప్రజల సానుభూతిపొందగలరు. కాని ఆపనిలో వారు చాలా శిక్షణ చూపి తిమ్ముతాము ఒక పద్ధతిలో అదుపులో ఉంచుకోవాలి. అటువంటి ప్రదర్శనలు దాడులుగా కాకుండా చూచుకోవాలి.

## ఉద్రిక్త హింసకు కారణాలు.

శాంతియుతంగా కలుసుకొనుటకు, వాక్స్వాతంత్ర్యము కలిగియుండుటకు, స్థానిక అధికారులు వారి పౌరహక్కులు నిరాకరించినపుడు ఇది సాధారణంగా దక్షిణప్రాంతంలో కూడా జరుగుతుంది. స్థానికపోలీసులు, కంపెనీ రక్షకులు శిక్షణలేకుండా ఉద్రిక్తులైనపుడు, సమ్మెదారులు సమ్మె చేయనివారిపై వ్యక్తిగతంగా హింసాకాంక్షకు పూనుకున్నప్పుడు, గుంపులుగా పికెటింగ్ చేస్తూ ఏ మనిషినీ యంత్రాగారములోనికి రానీకుండా ఉంచినపుడు సమ్మె చాలాకాలముసాగి, కార్మికులు, భార్యాబిడ్డలు ఆకలితో బాధపడుతున్నప్పుడు, మనుషులు నిస్పృహాహీనులైనపుడు; సంఘనాయకుల కంపెనీయిచ్చిన యిండ్లనుంచి బయటకుగెంటి అన్యాయంగా అరెస్టుచేసి, జైళ్ళలో పెట్టినపుడు; సమ్మెదారులను ఎదుర్కొనుటకు విషవాయువు, తుపాకులు వాడినపుడు; కంపెనీ ఉద్యోగమిచ్చిన గూఢచారులు సంఘనాయకులుగామారి, సమ్మెదారులలోచేరి, కార్మికులను రెచ్చగొట్టి ప్రజలలో వారిపై చెడ్డ అభిప్రాయం ఏర్పర్చుటకు హింసాకాండను పురిగొల్పినపుడు; స్పర్థ, అసహ్యాము, ప్రజారంగంలో అలజడి ఏర్పడును. ఇటువంటి పారిశ్రామిక అలజడులు జరిగినప్పుడు విచిత్రమైన ప్రేలుడులు జరిగినపుడు, సమ్మెచేసి నగరంపై బాంబులు ఇటుకలు విసిరినపుడు, అటువంటి అల్లరినాయకులు అటువంటి పనిచేస్తున్నప్పుడు పట్టు

కున్నగాని, అటువంటిపనులు కంపెనీ నియోగించిన గూఢచారులుచేసేరో లేక సమ్మెదారులు చేసేరో చెప్పుట కష్టం.

చిరకాలము స్పర్థ, నిర్లక్ష్యము, నిపుణత లేని కార్మికజనం యంత్రాగారాల్లో పనిచేసే స్థితి ఏర్పడి, సమ్మెదారులకు పూర్తి అపజయముకలిగే పరిస్థితి వాటివలన కలుగును. సంఘమునకు యిది ఒకొక్కసారి పూర్తివిజయముకూడా చేకూర్చును. దానివల్ల నాయకులు విజయగర్వముతో నడుచుటకూడా కలదు. లేదా సమ్మె ఒక సమావేశ సందర్భంలో పరిష్కరింపబడగలదు. ఇదేవిధంగా మొదటే పరిష్కారము జరిగిన, అన్నికష్టాలు, నష్టాలు సమ్మెవల్ల కల్గకుండా యుభయపార్టీలు సుఖముగానే యుండేవారు.

## పని మాని కూర్చునే సమ్మెలు.

1939 లో ఫాన్‌స్టీల్ తీర్పులో అమెరికా సుప్రీంకోర్టు; పనిమాని కూర్చునే సమ్మెలు అన్యాయమని ప్రకటించకముందే, వీటితీవ్రత చాలావరకు తగ్గిపోయింది. ఈ విషయము తక్షణము పరిశీలించవలసినసంగతి. దీన్నిగురించి రెండుమూడు పరిశీలనలు చేయవచ్చును.

1937 లో మొట్టమొదటిసారిగా పనిమాని కూర్చునేసమ్మెలు చాలా పెరిగిపోయినప్పటికి, సి. ఐ. ఓ. సంఘములలో ముఖ్యంగా మునుపటి అమెరికా కార్మికచరిత్రలో యివి ఎక్కువగా తెలియవు. చికాగో న్యూయార్కులలో దుస్తులపనివారు సంఘాలుగా ఏర్పడకముందే పనిమానివేయడం ఈదేశంలో యీ సమ్మెలకు పురాతన ఆచారమైపోయింది. తమ యంత్రములముందు పనివారు తమకష్టములకు నిరసనగా యజమానులతో ఏదో పరిష్కారము పొందాలన్న సంకల్పంతో, ఊరికే సోమరిగా కూర్చునేవారు. జనరల్ ఎలక్ట్రిక్ కంపెనీయొక్క 1906 ప్రాంతంలో సెనెక్టడీ యంత్రాగారంలో పనిమానికూర్చునే సమ్మె మొదటగా జరిగినది. 1935 లో అప్పుడు ఎ. యఫ్. యల్. సంఘంగాఉన్న యునైటెడ్ రబ్బరు కార్మికులు ఒకరాత్రి పని మాని కూర్చునే సమ్మె చేశారు. 1937 లో ఇటువంటి పనిమానికూర్చునేసమ్మెలు జాతీయనాయకులు ప్రత్యేకము పరిశీలించి నడిపే విధానంగాకాకుండా కార్మికులు తమంతతాము హఠాత్తుగాచేసే పద్ధతిగా మారిపోయింది. నిజంగా, పనిమానికూర్చునే సమ్మెచేసేవిధానం మానివేసి బాగుండునని, బాధ్యతాయుతమైన నాయకుల

అనుకున్నారు. ఈ పద్ధతి రెండువైపుల పదునున్నకత్తిలాంటిది. సంఘమునకే ముప్పు తేగలదు. క్రమశిక్షణ ప్రజాస్వామ్యసంఘపద్ధతులు అతిక్రమించే, చాలా కొద్దిమంది పనివారుకూడా సులభంగా అధికారయుతంగా పనిమానికూర్చునే సమ్మెలు చేయగల్గుతారు.

శాసనము క్రమశిక్షణ.

30 వ దశాబ్దకాలంలో పనిమానికూర్చునేసమ్మెలు తీవ్రతదాల్చినపుడు, అమెరికావారి విచిత్ర మనస్తత్వం విశదమైనది. వారిదృష్టిలో శాసనంలో క్రమశిక్షణయుండుట ఒక చిత్రము. పనిమానికూర్చునేసమ్మెలు, మరి తదితర అన్యాయమైనసమ్మెలను విమర్శించువారు నేషనల్ లేబర్ రికిమన్సు శాసనమునకు ప్రతిఘటనము బహిరంగంగా ఆమోదము ప్రకటించి సమ్మెదారులమీద బహిరంగంగా జరుగు హింస, గుంపు దోమ్మీని కూడా ఉత్సాహపరిచిరి. తూర్పునగరము మేయరు తనప్రకటనలో 'కార్మికులు సంఘటితపడి సమ్మెచేసుకొనుట కభ్యంతరములేదు కాని, బయటి కార్మికనాయకు లెవరినీ నగరములోనికి రానీయ'ననెను. రాజ్యాంగయుత పౌరహక్కుల ఉల్లంఘనలు క్షమించబడెను. శాంతికాముకులైన ఆఫీసర్లు చేసిన ఉల్లంఘనలుకూడా క్షమించబడెను. తనశాసనములు తానే గౌరవించే కాలము అమెరికాలో రావాలంటే యింకా చాలాకాలము పట్టును. ప్రజాక్షేమముదృష్ట్యా సంఘర్షణలో ఉన్న అన్నిపార్టీలపై అనాగరిక ఒత్తిడిపద్ధతులు వదిలివేయడం అత్యవసరం.

ఒకదేశంలోకాని, ఒకనగరంలోకాని ఉన్న కార్మికులుసమ్మెచేయు పద్ధతి కొన్నిసార్లు జరిగినదికాని, కార్మికుల పక్షంలో చివరకు అది విఫలమయినది. దీనికికారణము ఆవిధమైన మొత్తముసమ్మె సమాజ, జాతి, కార్యక్రమములలో పూర్తిస్తంభన కలగజేసి ప్రభుత్వమును సవాలు చేయును. అటువంటప్పుడు నిజమైన విప్లవంద్వారా ప్రభుత్వమునే స్వాధీనపరుచుకోవడం కార్మికులు సాగించకపోతే కార్మికులను, పోలీసు, సైన్యము, న్యాయచట్టమునకు సంబంధించిన అధికారశక్తులు చుట్టుముట్టును. అప్పుడు కార్మికులు లొంగిపోక తప్పదు.

ఎ. యఫ్. యల్; సి. ఐ. ఓ. కు సానుభూతిసమ్మెలుకాని, మొత్తం సమ్మెలుకాని సాగించుటకు అధికారము లేదనుసంగతి గమనించాలి.

ప్రతీ అంతర్జాతీయసంస్థకు స్వయంగా సర్వాధికారములు కలిగి యున్నది. అన్నివిషయములు తనంతతానే నిర్ణయించుకోవలసి యున్నది. ఒకసమ్మె చేయాలని నిర్ణయము తీసుకొనుటకుముందు, సంఘములో అనుసరింపబడే మంచిపద్ధతి ఏమిటంటే సమ్మెలుచేయవలసిన అధికభాగము యొక్క రహస్యవోటు తీసుకొందురు.

## పనిలోచేరు ఉద్యమములు

సంఘములు గుర్తింపుకు జరిగే సమ్మెలసమయములలో, యజమానులు, వార్తాపత్రికలు, రేడియో, వార్తాహరులు, ప్రాథమికసమస్యను మరిచిపోవుదురు. సమ్మెచేయదలచినవారు సమ్మెచేసేహక్కు, పనిచేయదలచినవారు పనిచేసేహక్కు కలిగిఉండవలెనని నినాదములు వెలువడును. అసలు ముఖ్యవిషయము యీ నినాదములలో మరుగుపడిపోవును. పనిచేసేహక్కు, సమ్మెచేసేహక్కు కాదసలువిషయము. ఉమ్మడిబేరం ఒడంబడికలతో ప్రజాస్వామ్యరక్షణలతో పనిచేసేహక్కు ఉండాలి. ఈ కోరిక కంపెనీ తిరస్కరించినపుడు, పనిచేసే యుద్యమములు కార్మికుల నిజమైనకోర్కెలు తెలియజేయవు.

సమ్మెసమయములలో 'పనిలోచేరు ఉద్యమములు బాహ్యంగా పౌరసంబంధమైన మంచి ఉద్యమములైనను, వాటిని సాధారణముగా యజమానికాని, కంపెనీమద్దత్తుచేయు సంఘముకాని, కార్మికులలోఉన్న కంపెనీగూఢచారులుకాని, సమాజంలోఉన్న కంపెనీస్నేహితులుగాని, రెచ్చగొట్టుదురు. పనిలోచేరు, ఉద్యమమునకు ఒక సిద్ధాంతవాదము "మొహాక్ వేలీఫార్ములా" అని యివ్వబడింది. అమెరికను ఫెడరేషన్ ఆఫ్ లేబరు సమ్మెచేసినపుడు, రెమింగ్టన్‌రాండుకంపెనీ యీ సిద్ధాంతమును సృష్టించింది. ఈసూత్రము లిటిల్‌స్టీల్ సమ్మెలో, తదితర ప్రాంతములలో విరివిగా వాడబడినది.

## కార్మికులకు సంఘము కావలెనన్నది ఎలా తెలుసుకోడం?

కొన్నిచోట్ల సంఘము గుర్తింపబడకపోయినను కార్మికులు పనిలో చేరవలెననియున్నట్లు యజమానినమ్మును. సానుభూతిపరులైనవారు, న్యాయబద్ధంగా నడుచువారుఅయిన యజమానులుకూడా సంఘటితము

కార్మికులు ఏమనుకుంటున్నారో తెలుసుకోవడం కష్టం. కార్మికులు, యజమాని తమవద్దనుంచి ఏమి వినదల్చుకున్నదీ, చెప్పడానికి ప్రయత్నించడం సహజము. నిష్పాక్షిక కర్తృత్వమైన ప్రభుత్వమందిటువంటి దానిచేనడప బడిన రహస్యవోటింగుద్వారా కార్మికకోరికలు నిర్ణయించవచ్చును. కొన్ని పరిస్థితులలో నేషనల్ లేబర్ రిలేషన్సుబోర్డు పర్యవేక్షణలో అటువంటి ఎన్నికలు జరిగితీరవలెనని టాఫ్ట్ హార్ట్లేచట్టము నిర్ణయించియున్నది.

## సమ్మెయొక్క అనర్థములు - వాటిని వారించుట

ఇరుపక్షముల హింసాకాండజరుగుతూ, చీలికలు, స్పర్థలు, అపార్థములు, వారివెనుకఉన్న సమాజాలలో సృష్టినూ, చాలాకాలం సాగిన సమ్మెలు చాలా అశుభవాతావరణం ప్రదర్శించును. అందులో కార్మికులు, ప్రభుత్వోద్యోగులు, పౌరనాయకులు, పోలీసులు, ఏమీతెలియనివారు, స్వార్థపరులైనప్రజలు అందరూకూడా నేరము పంచుకోవలసియుండును. ఉన్నతదృక్పథములు అవలంబించిన, కార్మికులచే సమ్మెలు, యజమానులచే లాకౌట్లుకూడా మాన్పించవచ్చు.

## పారిశ్రామికవ్యాప్త ఒడంబడికలు

ఆల్. డి. లాపేహేమ్, సాన్‌ఫ్రాన్సిస్కోలో పారిశ్రామికసంస్థ అధ్యక్షుడు చేసిన ప్రకటనలుకొన్ని ఉత్సాహపూరితముగా వున్నవి. అందులో యజమానులు, సంఘములు విచ్ఛిన్నము చేయుటకొరకుగాక, యజమాని, ఉద్యోగులమధ్య మంచిసమరసపరిస్థితులు స్థాపించుటకు నిజంగా కృషి చేస్తూ, పారిశ్రామికవ్యాప్త ఒడంబడికలు సృష్టించడానికి యజమానులు కృషిచేయవలెనని, 1938 లో ఆయన ఉదాటించెను. ఆయన ఇంకా అన్నారు. ఉమ్మడిబేరము సూత్రము యింక ఉపయోగించదని, యజమానులు దూరదృష్టికలిగి, మారేపరిస్థితులకు అనుగుణంగ వారు మసులుకోవాలని నేను నమ్ముతున్నాను.

అందరియజమానుల, కార్మికులమధ్య, అటువంటి పారిశ్రామికవ్యాప్త ఒడింబడికలు పొందగలిగినప్పుడు, ఎక్కువ పారిశ్రామిక పటిష్ఠత ఏర్పడి సమ్మెలు చాలాతక్కువ జరుగుతాయి. (ధర్మకర్తృత్వ వ్యతిరేకశాసనములను భంగపరచకుండా) న్యాయమైన పోటీపరిస్థితులు పతిష్ఠించే.

యజమానులయొక్క ముఖ్యసమస్య. ఉత్పత్తిఖర్చులలో వేతనములు చాలా పెద్దఅంశము. మొత్తముమీద వేతనములస్కేళ్ళు పతిష్ఠముచేయుటకు, పారిశ్రామిక యజమానులకు ఈపోటీ బాధలులేకుండా సమస్య పరిష్కారముచేయుటకు, పారిశ్రామికవ్యాప్త ఒడంబడికలు న్యాయబద్ధమైన శక్తివంతమైన పద్ధతి. ఇటువంటి పారిశ్రామికవ్యాప్త ఒడంబడికలలో, అందరు యజమానులు చేయునట్లు, మంచివేతనాలు, పరిస్థితులు, యిచ్చే యజమానుల సంఘాలు ఎంతో అమూల్యమైన సేవచేయును. ఏలనన, మంచియజమానులకు వ్యతిరేకంగా పోటీచేస్తూ నిత్యమూ వేతనములు తగ్గించాలని ప్రయత్నించే నీతినిజాయితీలేని యజమానుల దుష్టపద్ధతులను సంఘములు నివారించును.

ఈసందర్భంలో, సంఘములుచేసే సేవవిషయంలో ఈశతాబ్దం మొదటి సంవత్సరాలలో ప్రసిద్ధికెక్కిన మంత్రిసంస్కర్త అయిన డా॥ ఛార్లెస్ పెూచ్ పార్క్‌హర్ట్స్ అసావస్యపూరితమైన వాక్కు జ్ఞప్తికివచ్చును. బైబిలుకీర్తనలలో ఒకవాక్యము మార్చిచదివితే ఏమనిషీ వెంటబడనప్పుడు దుష్టులు పారిపోవుదురు. ఏమనిషైన వెంటబడినప్పుడు అతడు ఆకాలము సద్వినియోగము చేసుకొనును.

## ప్రభుత్వ ఖర్చులలో పొదుపు

పారిశ్రామికవ్యాప్తంగా కార్మికసంఘాలు ఉపయుక్తముగాయున్నప్పుడు పన్నులుచెల్లించేవారు తక్కువపన్నులు చెల్లించి పొదుపుచేసుకోగలరు. తక్కువస్థాయికి దిగజారి కార్మికుల పరిస్థితులు నడుస్తున్నప్పుడు, రాష్ట్ర, కేంద్రప్రభుత్వములు పరిశ్రమలను సక్రమంగా నడుపును. అటువంటప్పుడు ప్రభుత్వపరిపాలనలోని యంత్రాంగము, విరివిగాఉండి ప్రభుత్వఇన్స్‌పెక్టర్లు, చాలాఅవసరమైన పన్నులు చెల్లించేవారికి మితిమీరిన బరువగును. సంఘాలు ఉత్కృష్టంగా సమీకరించబడిన పరిశ్రమలలో అటువంటి ప్రభుత్వనియమావళి అవసరముండదు. సంఘములు పరిశ్రమలలో, పోలీసులు ప్రభుత్వానికి చేయునంతసేవచేయును. సంఘసభ్యులు సంతోషపూర్వకంగా ఖర్చులు భరించుదురు.

యజమానుల సంఘాలు, కార్మికసంఘాలు మధ్యఏర్పడు పారిశ్రామికవ్యాప్త ఒడంబడికలు మరికొన్ని అసుఖమైన పద్ధతులు తొలగించును

ఉదాహరణకు స్నేహితులైన యజమానుల సహకారసంస్థలను నిర్బంధ పెట్టి ఎక్కువవేతనములుపొంది, ఈ వేతనముల రెట్లను ఇతర యజమాను లపైలాగే మీటలుగా సంఘములు ఉపయోగించుదురు. ఈపద్ధతి స్నేహ పూర్వకమైన యజమానిని అతనిపోటీదారులతో అనర్థములు కలుగచేయు ననుట స్పష్టము.

పారిశ్రామికవ్యాప్త ఒడంబడికలు లేనప్పుడు, ముఖ్యంగా కొన్ని భౌగోళిక ప్రదేశములుమాత్రమే సంఘటితమయినప్పుడు, తక్కిన పారి శ్రామికప్రాంతమంతా సంఘటితమగువరకు, తమ దుకాణములలో వ్యాపా రము జరుగనట్లు తెలివైన నాయకత్వముగల సంఘములు తమకోరికలు సరి దిద్దుకొనును. దురదృష్టవశాత్తు సంఘములు ఈ విధానము అవలంబించుటకు ఎల్లప్పుడునూ తెలివైనవిగా కనపట్టవు.

## సమ్మెలులేకుండుటకు సంఘముల విధానము

సంఘములముఖ్యవృత్తి సమ్మెలు అనుకొనుట చాలాతప్పు. ఏ యితర విధముచేనైనా, సంఘము గుర్తింపుపొంది, సహేతువైన న్యాయమైన షర తులు లభించునప్పుడు పెద్దతరగతిసమ్మెను ఏపటిష్ఠమైన సంఘముకూడా తలపెట్టదు. సమ్మెలద్వారాపొందే నష్టములు, కష్టములు, హృదయ వేద నలు, కార్మికులకు బాగా తెలుసును. అనేకసార్లు కార్మికనాయకులు జైళ్ళకు రైల్వే రవాణా అవడంజరిగి, సమ్మెదారులపై జరిగిన నిజమైన నేరములకు శిక్ష లేకుండా పోవడంజరిగింది. న్యాయసమ్మతమైన సమ్మెలు నడిపిననాయకులు శిక్షింపబడిన విషయమే యిచ్చట ప్రస్తావించబడింది. అలజడి, హింస చేయడంవల్ల జైళ్ళకువెళ్ళిన కార్మికప్రతినిధులు మరొక తరగతిలోనికి వచ్చుదురు. వారిగురించి అలజడిగురించిన ప్రత్యేకఅధ్యా యములో ప్రస్తావించబడును. ఎన్నిసంవత్సరములకైనా ఉద్యోగములు దొరకకుండా విఫలమైనసమ్మెలు నడిపిన కార్మికనాయకులను నల్లజాబి తాలో చేర్చబడిరికూడా. (టాఫ్ట్ హార్లేపట్టము యీ నల్లజాబితాలో చేర్చడం అన్యాయమైన పద్ధతిఅని నిషేధించినది). పికెటులైన్లమీద కాల్చ బడిన నాయకులకు కార్మికులు శ్మశానములలో గోరీల కట్టించవలసివచ్చె డిది. ఇటువంటి కార్మికమృతవీరులు ఆమెరికాపౌరులలో అందమైన

పుష్పములవంటి వారుకూడా కలరు. గ్రంథకర్తలకు తెలిసినంతవరకు వారు తమ స్వార్థరహితతకు, ధైర్యమునకు, ఆదర్శములకు వ్యక్తిగతముగా ప్రసిద్ధి కెక్కిరి. దక్షిణదేశములో నేతపరిశ్రమలందు, కొల్లరెడులో బొగ్గుగను లందు, అరకన్సాస్ తదితర రాష్ట్రములలో భాగస్వాములైన పంటదారు లందు కాలిఫోర్నియాలో వలసకార్మికులందు, దేశములో యితర ప్రాంత ములు, పరిశ్రమలందు ఒత్తిడిపరిస్థితులు ఏర్పడి మరోమార్గము లేనప్పుడు, ఈ నాయకులు సమ్మెలు నడిపించిరి.

పదింటిలో తొమ్మిది వరకుజరిగిన ఉమ్మడి బేరం ఒడంబడికలు సమ్మె లేకుండానే సంప్రదింపులద్వారా జరిగియున్నసంగతి పరిశీలిస్తే కార్మికులకు సమ్మె లేకుండా ఒడంబడికలు చేసుకోవాలని ఎంతకోరిక ఉన్నదో తెలియు చున్నది.

# 6. సంఘముల బాధ్యత

ఈవిషయముక్రింద, కార్మికసంఘాలు యజమానులతో ఒడంబడికలు నిలుపుకొనుటను గురించి, అలజడి, లీనీకరణకు సంబంధించిన సమస్యలను గురించి, కార్మికసంఘములు వివిధముగా క్రమశిక్షితము లగుటనుగురించి, చెప్పుదాము.

## ఒడంబడికలు నిలుపుకొనుట

యజమానులతో ఒడంబడికలు నిలుపుకొనవని, బాధ్యతాయుతముగా ప్రవర్తించవని, సంఘములమీద ఒక అపవాదు, అపనమ్మకము కూడా యున్నవి. సంఘములమీద యిటువంటి నేరములు మోపుట న్యాయము కాదని, స్పష్టంగా నిజంచూపిన నిష్పాక్షికపరిశీలకులు ఒప్పుకుందురు. అధికారములగూర్చి వివాదములు, అలజడులు ఉండే కొన్నిపరిస్థితులు తప్పిస్తే కార్మికసంఘాలు, తమ ఒడంబడికలకు కట్టుబడినట్లు ఉత్సాహ్

మైన రికార్డులు కనిపించును. సంఘములు ఒక్కొకసారి తమ ఒడంబడికలు అతిక్రమించినవి. అప్పుడు వారిరికార్డు, యజమానులరికార్డు ఒకదానితో మరొక్కటి ఏమంతతీసిపోవు. కారణం, యజమానులుకూడా అప్పుడప్పుడు ఒడంబడికలు అతిక్రమించినవారే. 1924 లో ఉదాహరణకు అమెరికా యునైటెడ్ గనికార్మికులతో జరిగిన 'జాక్సన్‌విల్లీ' ఒడంబడిక వలన, ఆనాటి ఆర్థికపరిస్థితి కారణంచే ఒడంబడికలు సాధారణంగా ఉల్లంఘించబడినవి. అమెరికాలో ప్రముఖమైన కుటుంబాలతో కూడిన కంపెనీలతో పాటు, ఉత్తర గనియజమానులతో ఒడంబడికషరతులు తప్పించుకొనుట జరిగినది. అయినా, సాధారణంగా నియమానుసారంగా సంఘాల, యజమానులు, తమ ఒడంబడికలు పాటించారు.

కొత్తసంఘములు ప్రథమదశలలో గజిబిజిగాఉన్నను, సంఘములు క్రమముగా తమసభ్యులకు విద్యగఱపి, క్రమశిక్షితులను చేయుటవల్ల, వారు ఒడంబడికల షరతులను పాటించుచున్నట్లు కార్మికచరిత్ర చెప్పుచునేయున్నది. ఉదాహరణము, యమాల్గమేటెడ్ క్లోదింగ్ వర్కర్సు, అంతర్జాతీయ స్త్రీదుస్తుల పనివారలసంఘము చెప్పకోవచ్చును. ఇందులో మొదట సంఘటితమవుతున్నప్పుడు, అనధికారముగా పనులుమానివేయు పద్ధతులు కార్మికులచే మాన్పించుటలో కొంతకష్టము కలిగినది. ఈకష్టమును త్వరలో వారు తొలగించగలిగిరి. చాలాకాలమునుంచి ఫిర్యాదులన్నీ, సక్రమఫిర్యాదు యంత్రాంగముద్వారా, నిష్పాక్షిక అధ్యక్షులుద్వారా, ఉత్పత్తికి భంగముకలగకుండా నిర్వహింపబడుచున్నవి. వారందరు క్రమముగా సక్రమమైన పద్ధతులను అవలంబించి, ఒడంబడికలను విధేయతతో పాటించుటలో స్థిరపడిరి.

### ప్రథమదశలలో సరిదిద్దుబాటులు చాలాకష్టతరమైనవి.

సంఘములు వ్యాప్తిచెందుతున్నప్పుడు సంఘటితరూప సంబంధములలో యజమానులు, కార్మికులు మొట్టమొదటిసారిగా కలుసుకుంటున్న పరిస్థితులలో, సరిదిద్దుబాటులు బాధాయుతమైనవిగా చికాకులతోకూడి, చాలాకాలముసాగును. ఆర్థికలేక న్యాయబద్ధమైన ఒత్తిడివల, యజమానులు సణుగుకుంటూ, సంఘములను గుర్తించవలసివచ్చినప్పుడు ఇదిఎక్కువగా కనిపించును. సాధారణంగా అన్నిపరిశ్రమలలోఉన్నట్లు సంఘతత్వమును

చివరివరకు యజమానులు ప్రతిఘటించినప్పుడు, వారిమధ్య ఏర్పడిన స్పర్థలు, శత్రుత్వములు సమసిపోవుటకు చాలాకాలముపట్టును. యజమానులు సహృదయులై సంఘతత్వమును స్వీకరించినపుడు, ప్రథమదశలలోనే సంఘసంబంధములు స్నేహసమ్మతముగాయుండును. యునైటెడ్ స్టేట్సుకార్పొరేషను, స్టీల్ వర్కర్సు ఆర్గనైజింగుకమిటీలమధ్య సంబంధములు ఈ స్నేహమునకు ముఖ్యమైన నిదర్శనము. ఈకేసులో జాన్. యల్. లూయీస్; అప్పటి సి. ఐ. ఓ. అధ్యక్షుడు, మరియు యు. యస్. స్టీల్ డైరక్టర్సుబోర్డు అధ్యక్షుడైన మైరన్ టైలర్ మధ్య మూడు నెలలు సంప్రదింపులు జరిగాక, సంఘటితకార్మికులపై చిర కాలపు ప్రతిఘటనను హఠాత్తుగా సహకారముగా కార్పొరేషను మార్చివేసినది. 1937 మార్చిలో స్టీల్ వర్కర్సు ఆర్గనైజింగ్ కమిటీ తమఉద్యోగులు తరఫున బేరమాడే కర్తగా గుర్తించినది. 8 గంటల పనిచేయుకాలము నిర్ణయించి 10 వ శాతమువరకు వేతనములు హెచ్చించినది. తెలివనేదివుంటే, కొంచెంజ్ఞానమున్న ఏయజమానిఅయినా ఈ విధంగా నెలలతరబడి కొట్లాట, నిపుణత లేమి, యంత్రాగారమునుంచి తొలగించుకొనగలడు.

క్రొత్తగాసంఘములు ఏర్పడిన చాలాకేసులలో, సంఘటితకార్మికులతో యజమానులు ఎలా మసులుకోవాలో అనుభవము లేకపోవుటకు, సంఘసభ్యులఆఫీసరుకు అనుభవములేమికి కొంత ఊరకొనవలసివచ్చును. పారిశ్రామికఉద్యోగులలోంచి హఠాత్తుగా కార్మికప్రతినిధులు ముందుకు వచ్చి, మితిమీరినబాధ్యతల బరువులతో, యితర యంత్రాగారములలో సంఘములు ఏర్పరచే పనులలో నిమగ్నులయి, ఒడంబడికలు జరిగిన వ్యాపారసంస్థలలో సరైనదిద్దుబాటులు చేయుటకు అవసరమైనకాలము వినియోగించకపోవటం, మనకు ఎక్కువ ఆశ్చర్యం కలించనక్కరేదు. ఉన్నతిమైన సంఘనాయకులకు విజ్ఞప్తిచేసినచో, చిన్నచిన్నచికాకులు తగ్గించుకుని వ్యాపారవిషయములలో శ్రద్ధతీసుకోవడంలో కొంతసహాయకారి కాగలదు. స్థానికసంఘఆఫీసరతో ప్రత్యక్షసంబంధములు కల్పించుకునే చికాకులేకుండా, మూడవపార్టీయొక్క మంచితనముతో ఒక్కొక్కసారి యిది సాధించవచ్చును. ఆపరిస్థితులలో కార్మికసంఘముయొక్క పూర్వచరిత తెలుసుకుని యజమాన్యము ఎవరో ఓర్పు వహించవలసియున్నది. సంఘముతో ఏర్పడిన నిర్ణీతసంబంధములు వాదములోకిదిగినం

కాలము, సరిదిద్దుబాటుచేసే యంత్రాంగము పనిచేయుచున్నదని, ఒడం బడికలు నమ్మవచ్చని, సాధారణంగా సంతృప్తికరమైన సంబంధము దైవి కంగా ఉండునని చరిత్ర చెప్పుచున్నది. సంఘముతో సంబంధములు పెంచుకొనే ప్రథమదశలలో ఇరుపక్షములయందు ఓర్పు, సహనభావం, పరిస్థితిని చక్కదిద్ది న్యాయముగా సంచరించుటలో ఒకరినొకరు అర్థము చేసుకొనుటలో, ఎక్కువ దోహదముచేయును. అంతర్జాతీయసంస్థల యొక్క స్థానికసంఘాలు, అనధికారసమ్మెలు, ఒక్కొక్కప్పుడు బాగా స్థిరపడిన సంఘములలోకూడా జరుగును. దానివలన యజమానుల వ్యాపా రమునకు, సంఘప్రతిపత్తికికూడా దెబ్బతగులును.

## లీనీకరణ, అలజడి.

సంఘములలో తరుచుగా నిండా అలజడిదారులున్నారని నేరము మోప బడుచున్నది. నిజముగా పరిశీలిస్తే కార్మికులఅలజడి ఒక్క కార్మికసంఘము యొక్క సమస్యకాదు. అమెరికాదేశముయొక్క సమస్యలో ఒకభాగము.

న్యూయార్కులోని సిటీక్లబ్ కు సంబంధించిన ఒకకమిటీ, కార్మికసంఘ ములలోని అయోగ్యతగురించి ఒకమంచి, విస్తారమైన పరిశీలనచేసినది. పౌరవ్యవహారములలో చాలాసంవత్సరములనుంచి తనయోగ్యతకు ఎక్కువ ఖ్యాతి గడించిన ఆసంస్థ. సిటీక్లబ్ నివేదిక అనుబంధములో చెప్పబడిన పెద్దఅలజడులలో, కట్టడవృత్తులు, సినీమాఅపరేటర్లు, చిత్రకారులు, ఇనుప పనివాళ్ళు, గుంపుకాపరులు, పక్షులు, చేపలు, తోళ్ళబజారులందు, లారీల పనియందు, ఎలక్ట్రికల్ అమర్చుటలందు, హోటల్సులోనూ, లోఉన్న లంచగొండితనముకు సంబంధించియున్నవి.

ఈనివేదికలో యింకా చెప్పబడినది. ఇటువంటి అలజడి కార్మికసం ఘములకు విచిత్రముకాదు. మనఆర్థిక, రాజకీయ, వ్యాపారజీవితమునకు సంబంధించిన మామూలుసమస్యయొక్క భాగమే.

“కార్మికఅలజడి” అంటే అలజడిదారులు కార్మికసంఘములను ఉప యోగించుకొని, యజమానులవద్దనుంచి, సంఘసభ్యులవద్దనుంచి, లేదా యిద్దరినుంచి లంచములు తీసుకుందురు. అలజడిదారుడు సంఘములు ఆఫీసరు కావచ్చును. లేదా సంఘముబయట పనిచేస్తూ తన ఏజెంట్లద్వారా, భయస్థు లైన సంఘముఆఫీసర్లపైని ఒత్తిడిలు కలుగజేసెడివాడు కావచ్చు.

సిటీక్లబ్ నివేదికలో యింకాయిలావుంది. యజమాని ముందునుంచికాని, వెనుకనుంచికాని యిచ్చుసహకారముతో ఈకార్మికఅలజడిదారుడు తన శక్తివంతమైన పదవి నిలబెట్టుకొనును. కారణము యజమాని అలజడిదారుడికి లంచమిచ్చి మానముగా ఉండుటయే సులభముగా ఎంచుకొనును. ఆఖర్చు కొనుగోలుదారుమీద రుద్దగలనని, లేదా మరోపరిశ్రమపై పడవేయవచ్చునని లేదా ఆదాయపుపన్ను విషయంలో ఓవర్ హెడ్‌కు యిరికించవచ్చని అతని అభిప్రాయము. యజమాని యీఅలజడివల్ల స్వయముగా లాభముపొందుననుట దానిని విశదపరుచును. ఎక్కువకాలము పనిచేసినందుకు వేతనమిచ్చుట, సంఘసభ్యులు, సంఘసభ్యులు కానివారితో కాని, వారుచేసిన వస్తువులపైగాని, పనిచేయకుండు నియమము మొదలైనవాటిని పాటించుకుండుటకు సంఘంఆఫీసరుకు కొంతకాలమునకు ధనమిచ్చుటయే యజమానికి చాలా లాభదాయకము. ఉమ్మడిబేరమువలన కార్మికుల పని చేయుపరిస్థితులు బాగుచేయుట, అలజడి లంచముకంటె ఎక్కువఖర్చు అగునని యజమాని నమ్ముచుండవచ్చును.

అవినీతికరమైన కార్మికనాయకుల కుట్రవల, ప్రజలు ఒక్కొక్కసారి బలవంతముగా, ఆనగరంలోని రాజకీయనాయకుడు పొందియుండు ఒకటిగాని లేక ఒకటికంటె ఎక్కువగాని వ్యాపారసంస్థలనుంచి, కొనవలసియుండును. మధ్యపశ్చిమనగరంనుంచి ఒకమతాచార్యుడు యిటువంటిపరిస్థితి వర్ణించెను. ఆయన క్రొత్తచర్చికట్టిస్తూ, సంఘములోని సభ్యులను పనికినియమించెను. ఏవిధమైన కార్మికఫిర్యాదులు లేకుండా ఒకసమ్మె సాగించబడింది. ఆచర్చి ఎక్కడనుంచో సిమెంటు తెప్పించుకొనుచున్నది. అగిమాని, ఆనగరంలో ఒక పెద్ద పేరుపొందిన రాజకీయవేత్త అధికారములో ఉన్న సిమెంటుమిల్లులనుంచి సిమెంటు తెప్పించడం ప్రారంభించగానే, సమ్మెమాని వేయబడినది.

అందరినీ అదుపులో ఉంచడానికి, సంఘసమావేశములలో తమనాయకత్వమును ప్రతిఘటించువారిని తమువిధానములపై ఆక్షేపణ తెలిపేవారిని, సంఘంయొక్క నిధులకు తగినలెక్కలు చూపమని నిర్దేశించేవారిని, సభలనుంచి బయటికిగెంటి, కొట్టుటకు, కొందరు బలవంతులైన వలంటీర్ల దండునుకూడా కొందరు అనినీతికరమైన నాయకులు వాడుదురు.

తూర్పుతీరమందు ఎక్కువ సభ్యత్వముకలిగిన అంతర్జాతీయ లాంగ్ షోర్ మన్సు అసోసియేషన్ ఒక్కటే, ఎ. యఫ్. యల్. తన పెద్దచరిత్రలో బహిష్కరించిన ఒకసంఘము. 50 వ దశాబ్దం మొదటిదశలలో ఈ అసోసియేషను ఆఫీసర్లపై న్యూయార్కు రాష్ట్ర క్రైమ్‌కమిషన్ అనేక నేరములుమోపినది. యజమానులవద్దనుంచి లంచములు, బహుమతులు పొందుచున్నారని, నేరస్థులని ఋజువుకాబడినవారని ఆఫీసర్లుగా వేతనములిచ్చుచున్నారని, ఉద్యోగులను ఎన్నుకున్నాక వారిని తిరిగిపంపివేసే విధానము అవలంబించే అధికారులను పదవిలోఉండునట్లు చేస్తున్నారని, ప్రజాస్వామ్యపద్ధతులుకాని రీతుల్లో ప్రవర్తించి తమ అధికారము నిలబెట్టుకుంటున్నారని ఆరోపించబడిన నేరములు, ఎ. యఫ్. యల్. కార్యవర్గము అంతర్జాతీయ లాంగ్ షోర్ మెను అసోసియేషనుకు యీవిధముగా వ్రాసినది. "న్యూయార్కునగరంయొక్క నేటిప్రాంతంలో అరాచకములకు, నేరములకు విచారము వెలిబుచ్చుచున్నాము. యజమానులవద్దనుంచి లంచములు, బహుమతులు తీసుకొనుట తక్షణము మానవలెను. ఉద్యోగులను తిరిగి యింటికిపంపించు చెడ్డఅలవాటులుమాని, సరైన ఉద్యోగదానపద్ధతులు, న్యాయసమ్మతమైన కూలిపద్ధతులు ప్రోత్సహించవలెను. నేరస్థులుగా పరిగణింపబడిన ఆఫీసర్లను ఉద్యోగములనుంచి తొలగించవలెను. ఎ. యఫ్. యల్. గుర్తించిన ప్రజాస్వామ్యపద్ధతులు అమలులోకి రావలెను. ఎ. యఫ్. యల్. తో మీసంబంధములు, కోరునదిఏమనగా ప్రజాస్వామ్యఆశయములు, నిర్దుష్టమైన స్వతంత్రమైన వృత్తిసంఘోద్యమము మీసంస్థలో తక్షణము నెలకొల్పవలెను. నేరము, అవినీతి, మోసము, అలజడి, లంచగొండితనము, తక్షణము తొలగించవలెను."

ఈ ఆదేశములలో కొన్నిటిని అమలుజరుపుతున్నామని సంఘము ఎ. యఫ్. యల్. కు సమాధానమిచ్చినది. కాని 1953, సెప్టెంబరులో జరిగిన ఎ. యఫ్. యల్. సదస్సునందు, కార్యవర్గము యిచ్చిన నివేదికలో అంతర్జాతీయలాంగ్ షోర్ మెను అసోసియేషను తన స్థానిక, అంతర్జాతీయ వ్యవహారములలో ప్రజాస్వామ్యపద్ధతులు స్థాపించుటలో విఫలమైనదనియు, అందుకు సంబంధించిన కార్మికులకందరికి న్యాయసమ్మతమైన అవసరములు ఆసక్తులు రక్షించుటకు అవసరమైన బాధ్యతాయుత సంపూర్ణ పరి

పాలన వాగ్దానము చేయలేకపోయినదనియు విశదీకరించబడినది. ఈ అసోసియేషన్ అనుబంధపత్రమును ఉపసంహరించుకోవలసినదని ఆ సదస్సును కార్యవర్గము కోరినది. ఈ ప్రతిపాదన అత్యధికవోటుతో విజయవంతముగా ఆమోదించబడినది.

ఎ. యఫ్. యల్. నుంచి అనుబంధము లేకపోయినంతమాత్రాన ఐ. యల్. ఏ. నశించిపోలేదు. ఈసంఘము బహిష్కరింపబడినాక జరిగిన రెండుఎన్నికలలో వోటుచేసేవారిలో కొద్ది అధికవర్గము తమవోటు, బ్రదర్‌హుడ్ ఆఫ్ లాంగ్‌షోర్‌మెనుకు బదులు ఐ. యల్. ఎ. కే వేయుచుండిరి. ఐ. యల్. ఎ. బహిష్కరింపబడినాక, బ్రదర్‌హుడ్ ఆఫ్ లాంగ్‌షోర్‌మన్ ఏర్పడినది. 1956 లో, టీమ్‌స్టర్సు అంతర్జాతీయ సంస్థకు సంబంధించిన పశ్చిమస్థానిక సంఘములు 400,000 డాలర్లఅప్పు, ఆర్థిక యిబ్బందులలోఉన్న ఐ. యల్. ఎ. కి యిచ్చి సాయముచేయాలని సంకల్పించినవికాని అధ్యక్షుడు మీనీ దానిపై నిరసనతెలిపాక, యీఅప్పు ఉపసంహరించబడినది. ఈలోపుగా క్రొత్తగాఏర్పడిన ఎ. యఫ్. యల్. సి. ఐ. ఓ. సంఘము, లాంగ్‌షోర్‌మెన్ అనుబంధముకై పోటీపడుచునే యున్నది.

## లంచగొండితనము — సంక్షేమధనములు

సంఘసంక్షేమధనములు ఎక్కువస్కేలుమీద అభివృద్ధిచేయడం ప్రారంభమైనప్పటినుంచి క్రొత్తరకం అవినీతి, లంచగొండితనము ప్రబలినవి. కొంతమందిఆఫీసర్లు తమధనమునకు, వసూళ్ళు, కమిషన్లు, జీతములు, సంక్షేమనిధుల నిర్వహణంలో, స్థాపనలోపొందుచూ, మరీ ధనికులగుచున్నారని నేరములు మోపబడినవి. చాలవిషయములలో, ఇన్సూరెన్సుకంపెనీ ప్రతినిధులు, కమిషన్లుచేర్చి, తదితరవిధముల, సంఘసభ్యులకు లంచములిచ్చి, సంఘవ్యాపారము తమసంస్థలకు తెచ్చుకొనిరి. 1955 లో ఒక సెనేటుఉపసంఘము లాండ్రీవర్కర్సుయూనియన్ ధనములన్నీ పరిశోధించి, సంక్షేమనిధులలో ఒక మిలియనుడాలర్లను దోపిడిచేసినట్లు, ఇన్సూరెన్సు, సంఘముయజమానుల ప్రతినిధులపై నేరము మోపబడినది. నిధినుంచి ప్రీమియములు ఒక ఇన్సూరెన్సు ఏజెంటు, సంఘంఆఫీసరు కలిసియున్నారని, ఆఫీసరు అన్యాయముగా ఈవిధంగా సంపాదించినసొమ్ముతో

ఉన్న బ్యాంకు ఎక్కౌంటులో 573,000 డాలర్లుఉన్నట్లు తేలినదని ఆకమిటీ కనుగొనెను.

ఈనిధులు నిర్వహించుటలో అవలంబించబడిన అవినీతిపద్ధతులు హృదయవిదారకముగాయున్నవి. అందుకే ఎ. యఫ్. యల్. మరియు సి. ఐ. ఓ. 50వ దశాబ్దము ప్రథమసంవత్సరములలో నైతికసాధనసమితి (ఎథికల్ ప్రాక్టీసెస్ కమిటీ) ని నియమించి, ఈ అవినీతిఅలవాట్లు తుడిచివేయప్రయత్నించిరి. మొట్టమొదటి ఎ. యఫ్. యల్. సి. ఐ. ఓ. సదస్సులో ఒకతీర్మానము ఆమోదించబడినది. అందులో "అన్ని సంక్షేమ నిధులు దానికి సంబంధించిన కార్మికుల లాభముకొరకే ధర్మాదాయముగా వాడవలెను. వాటినిర్వహణలో అత్యున్నతమైన నైతికప్రమాణములు అవలంబించవలెను. నిధులనిర్వహణవిషయంలో అవినీతికరమైన ధనలాభములు పొందకూడదని, బయటి ఇన్సూరెన్సుఏజన్సీలలో అనుమానకరమైన వ్యక్తిగతసంబంధములు అభివృద్ధిచేయకూడదని లేదా సంఘఆఫీసర్ల ఉద్యోగములు ఊడునని, సంఘఆఫీసర్లు మందలింపబడిరి. తమ ఆర్థికవ్యవహారములకు సంబంధించిన పూర్తిరికార్డు లుంచవలసినదని సంఘములు మందలించబడినవి. ఆర్థికపరిస్థితిగురించి సభ్యులందరూ తెలుసుకునే చేయవలసినదని, సంఘసభ్యత్వముదృష్ట్యా మంచి ఎన్నికచూసి ధననిర్వహణ అప్పచెప్పవలెనని, సరైన ప్రమాణములు నిలబెట్టుటకు, ఏఫిర్యాదునైనా సరిగా విజ్ఞప్తి చేయుటకు అవసరమైనయంత్రాంగము నియమించవలెనని సంఘములు మందలించబడినవి. సంవత్సరనివేదికలు, ఆరోగ్యము, సంక్షేమము, పెన్షన్ నిధులకు సంబంధించిన పూర్తిఆర్థికవివరాలు తెలియజేయుటకు తగిన శాసనచర్యలు తీసుకోవలెనని సదస్సులో నిర్ణయింపబడినది.

## నైతికపద్ధతులపై ఎ. యఫ్. యల్. సి. ఐ. ఓ. కమిటీ.

నైతికపద్ధతులపై ఒకతీర్మానముచేయుచు, ఎ. యఫ్. యల్. సి. ఐ. ఓ. సదస్సు ప్రకటించినది. అపనమ్మకమై లంచముకోరే, అతినీతికరపద్ధతులు అవలంబించే కొద్దిమందివల్ల, పేరున్న అత్యధికభాగమువారు ప్రమాదములకు గురిజేయుచున్నారు. ఈకొద్ది అవినీతిపరులు తమ ధర్మకర్తృత్వమును ఉల్లంఘించి, వృత్తిసంఘఉద్యమమును తమస్వార్థముకొరకు ఉప

యోగించుచు, మన ప్రజాస్వామ్యసంస్థలను నాశనముచేయువర్గములు నిర్మూలించి సంస్థలలక్ష్యములు అభివృద్ధిపర్చుచు, అందరిసంక్షేమముకొరకు పాటుపడే సోదరసంఘముగా ఈ ఉద్యమమును ఎంచుకున్నారు.

1956 జూన్ నెలలో, అనుబంధసంస్థలలో అవినీతి, అలజడి లంచగొండితనములు ఏవిధమైన ఋజువుచూపినను పరిశోధించవలెనని, నైతికసాధన సమితికి సర్వాధికారములు యివ్వబడినవి. 1956 ఆగస్టులో ఎ. యఫ్. యల్. సి. ఐ. ఓ. కార్యవర్గపుకౌన్సిలు, కొన్నిసంఘములలో ఆరోపణగావింపబడిన అవినీతికరమైనపద్ధతులు పరిశోధించవలసినదని ఈకమిటీని ఆదేశించినది. ఎ. యఫ్. యల్. అనుబంధసంస్థలు తమస్థానికసంఘములకు అధికారపత్రములుయిచ్చు విషయంలోకూడా ఒకక్రొత్త నైతిక అలవాట్ల సంపుటి ఆమోదించినది.

## రాజకీయ సంస్కరణ

కార్మికులు తమంతతాము పరిశుద్ధులగుటయేగాక, ఈఅవినీతిపద్ధతులు రూపుమాపుటకు తదితర శక్తివంతమైన విరుగుడులు, రాజకీయసంస్కరణ క్రమమైన శాసనములు, సరైన ప్రభుత్వకమిషనులు, విరామములేని ప్రభుత్వనేరారోపణలు (ప్రాసిక్యూషనులు) చాలాసంవత్సరములనుంచి రాజకీయసంస్థలలో, న్యూయార్కునగరములో అతినీతి, అలజడి, లంచములను ప్రతిఘటించుసంస్థ లిబరల్‌పార్టీయగుట శుభసూచకము. ఈపార్టీ కార్మికసంఘములనుంచి, ముఖ్యముగా సూదివృత్తులసంఘములనుంచి చాలావరకు అండపొందుచున్నది.

## ప్రజాస్వామ్యరీతిలో సంఘములను అదుపులో పెట్టుట

లంచగొండితనము, వృత్తిసంఘములు ప్రజాస్వామ్యముగాలేకుండా నిర్వహించబడడం కలిసిమెలిసి సాగినవి. సంఘములోని ఉత్తమసభ్యులలో ప్రజాస్వామికముగా అదుపుచేయుటకు ముఖ్యసూత్రము, సదస్సులకు సంఘంఆఫీసరు, ప్రతినిధులతో స్వతంత్రమైన ఎన్నికజరుగుటయే. అవినీతికరమైనఆఫీసర్లు సంఘమునుఅణచి, నియంతలుగా అదుపులో పెట్టుకొనుటవలన జాతీయసదస్సులు సంవత్సరాలతరబడి వాయిదాపడినవి. క్రొత్తజాతీయఆఫీసర్లను ఎన్నుకొనుటకు సభ్యత్వమునకు యిందువలన అవ

కాశములభించదు. స్థానిక, జాతీయఆఫీసర్లు నిర్ణీతకాలములో సక్రమముగా ఎన్నికకానిచో, స్థానికసంఘములనుంచి జాతీయసంఘములకు, తర్వాత సదస్సులకు ఫిర్యాదుచేయు హక్కు కూడా లేకుండాపోవును. ఈ ఉల్లంఘించిన ఉద్యోగులు జాతీయసదస్సులవద్ద క్రిడెన్షియల్ కమిటీలను అదుపులో పెట్టుకుని, సాంకేతిక నియమావళి ప్రకారం, శత్రువులు ప్రతినిధులుగా ఎన్నిక కాకుండా తమంతతామే గూడుపుఠాణీద్వారా ఎన్నికపొందగలరు. కొన్నిరాజ్యాంగనియమావళుల, తదితర సూత్రములు, కొంతమంది ఆఫీసర్లకు యితరులను నియమించు అధికారమునిచ్చును. ఈ అధికారము ఒక్కొక్కసారి దుర్వినియోగమగును.

## సంఘములలో ప్రజాస్వామ్య ఎన్నికలు

ఈ కారణములవల్ల సిటీక్లబ్బునివేదిక తగుశాసనములుచేయుటకు సిఫారసు చేసినది.

"సంఘసభ్యులు, సంఘమునకు సరిగా ప్రాతినిత్యమువహించి, శీలము కల్గిన ఆఫీసర్లను ఎన్నికొనేలా ప్రోత్సాహము, వీలు, కలుగజేయవలెను. అటువంటిశాసనములు తయారుచేసేటప్పుడు సంఘమందలి విధానములతో కలుగచేసుకోకుండా చూడవలెను. ఏలన అవి నిర్ణయించువారు సంఘసభ్యులుమాత్రమే. ఇటువంటి శాసనములు పైపద్ధతిలో చేసినచో, ప్రభుత్వ నియమావళికి సంఘమును బద్ధముచేయదు. ముఖ్యముగా అలజడికిసంబంధించిన ప్రతిపాదనలుదృష్ట్యా కానిసంఘముమాత్రము తనంతతాను స్వీయశిక్షణకు బద్ధమైన నియమములు పాటించవలెను. ఈ లక్ష్యముకొరకు, ఉపసంఘము యీక్రింది ప్రతిపాదనలు చేయుచున్నది:—

" సాంవత్సరిక ఎన్నికలు, సంఘములకు అన్వయించు శాసనములన్నీ తమంతతాముగా ఏర్పడిన కార్పొరేషన్ స్థాయికి లేనిసంస్థలు, సంఘములకు అన్వయించునవి, న్యూయార్కులోని జనరల్ అసోసియేషన్సులాంటివి సవరించవలెను. లేదా తగినశాసనములు ఎన్నికలుకోరుచూ అమోదింపబడవలెను. ఆ ఎన్నిక ఒకసదస్సులో రహస్యవోటింగుపద్ధతిలో సంవత్సరమున కొకసారి జరగవలెను. సంఘములో అందరు ఆఫీసర్లు, స్థానిక, జాతీయ, అంతర్జాతీయమైన అందరుప్రతినిధులు ఎన్నికలలో పాల్గొనవలెను. అందరుసభ్యులలో అధికభాగములో అధికభాగకోరము

స్వయంగాకానీ, ఏజెంటుద్వారాగాని ఆమోదముతో కూడినవోటుయిస్తే కాని, ఏ ఆఫీసరు, ఎన్నికైనట్టు నిర్ణయించకూడదు. శాసనములో విధించిన ప్రకారము సంఘముయొక్క అధ్యక్షుడు, ఉపాధ్యక్షులు ఒక నిర్ణీత నోటీసు అందరుసభ్యులకు ఎన్నికలగురించి ఈయవలెను. ఆ నోటీసులో అన్నివిషయములతో పాటు, వివిధఉద్యోగములకున్న జీతములుకూడా జతపర్చవలెను. అట్లుచేయనాడు అది నేరముగా భావించబడును. దానికి శిక్ష సంఘమునకు చెల్లించదగు తగినజుల్మానా: అది సంఘసభ్యులు వసూలుచేయుదురు.”

## నిష్పాక్షిక బోర్డుకు విజ్ఞప్తి.

ఎన్నికలగూర్చి ఏదైనా,ప్రశ్న ఉదయించినప్పుడు దీనిని అతిక్రమించగలిగి, సమాధానమివ్వగలది నిష్పాక్షికబోర్డుమాత్రమేఅని, (ఈ నివేదికలో యింకా సిఫారసు చేయబడినది.) ఆబోర్డు రాష్ట్రస్థాయిలోకాని, లేదా నేషనల్ లేబర్ రిలేషన్సుబోర్డులాగాని ఉండవలెను. అడగగానే ఆ బోర్డు ఒకఆఫీసరు ఎన్నికద్వారా ఒకసంస్థకు ప్రాతినిధ్యము వహిస్తున్నారో లేదో అధికారపత్రముయిచ్చును. ఇదేబోర్డు ఒకసంఘము అధికభాగము ఉద్యోగులకు ప్రాతినిధ్యము వహించుచున్నదా లేదా అనికూడా అధికారపత్రము యివ్వగలిగియుండును.

## సంఘసభ్యుల బహిష్కరణ అధికసంఖ్య ఆమోదము పొందవలెను

నివేదిక సూచించినది యింకా:—బహిష్కరణవిషయంలో ఒక నిర్దిష్ట శాసనముండవలెను. సంఘసభ్యుని తాత్కాలికముగా పనిలోంచి తొలగించినా, బహిష్కరించినా యీ శాసనము అవసరము. జుల్మానాచెల్లించలేదని, మరేయేతరితర కారణములకైనా అది కావచ్చును. సదస్సులో అధికసంఖ్యవోటు చేయనిదే ఒకస్థానికసంస్థను, జాతీయ అంతర్జాతీయసంస్థల నుంచిగాని, జాతీయరూపమునుంచిగాని, బహిష్కరించరాదని ఒక శాసనముకూడా ఉండవలెను.

ఎ. యఫ్. యల్. సి. ఐ. ఓ. రాజ్యాంగచట్టముప్రకారము ఏజాతీయ, అంతర్జాతీయసంఘము సమాఖ్యనుంచి తాత్కాలికముగా తొలగించరాదు. సదస్సులో హాజరైన అధికసంఖ్య ఇష్టపడితేనే అలాజరగవలెను. సద

న్నులో హాజరైనసంఖ్యలో మూడువంతులలో రెండువంతులు ఒప్పుకున్న కాని, అధికారపత్రముకాని, అనుబంధపత్రముకాని రద్దుచేయరాదు.

## సంఘముల ఆర్థిక నివేదికలు

కార్మికసంఘముయొక్క బాధ్యతనుగూర్చి సిటీక్లబ్ నివేదికలో యీవిధముగా యున్నది.

"సంఘములకు అన్వయించు శాసనములు తగురీతిగా సవరించబడవలెను. లేదా తగురీతి శాసనములు ఆమోదింపబడవలెను. ఆశాసనములకు బద్ధమైన ప్రతిసంఘము సాంవత్సరిక ఆర్థిక నివేదికలు తమసభ్యులకు యీయవలెను. సభ్యులలో అధికభాగము కోరినవిధంగా అందులో వివరములు పొందుపరచవలెను. ఆవిధముగా నివేదికలు ఆఫీసర్లు యివ్వనిచో వారు సంఘమువిధించు జుల్మానా చెల్లించవలెను లేదా వారు తొలగింపబడుదురుకూడా."

ప్రస్తుతము చాలవరకు కార్మికసంఘములు ఆఫీసరను ప్రజాస్వామ్య పద్ధతిలో ఎన్నుకొనుచున్నవి. ఆర్థికనివేదికలు అందచ్చుచున్నవి. మొదటి కాలపు సదస్సులవిషయంలో ఒక పెద్ద జాతీయ, అంతర్జాతీయసంఘములకు సంబంధించిన వాతావరణ సదస్సులు ఏర్పాటుచేయుటకగుఖర్చు శక్తి విపరీతముగా ఉండేడిది. అందువలన అభ్యుదయసంఘములు, బాగా నడిచే సంఘముల సభ్యులు యీసదస్సులు రెండు మూడు సంవత్సరముల కొకసారి జరగవచ్చునని వోటుచేసిరి. యునైటెడ్ ఆటోవర్కర్సు తమ సదస్సు జరగని మరొక సంవత్సరములో దేశవ్యాప్తమైన తమసంఘ విద్యామహాసభలు జరుపుదురు.

## సంఘములు కార్పొరేషనుగా ఏర్పడవలెనా?

సంఘములు ఒడంబడికలు నిల్పుకొనుటకు, అలజడి, లంచగొండితనము అనర్థములు వాటినివారణలు — గూర్చి జరిపెనచర్చలలో ఈవిషయములో ఉదయించు ప్రశ్నలకు వివిధజవాబులు యిమిడియున్నవి. అయినా యీ ప్రస్తుతసందర్భంలో తక్కినవిషయములు చ చ్చెద్దాం.

## కార్పొరేషనుగా ఏర్పడని సంఘములపై నష్టందావాలు

అమెరికాలో చాలాసంఘములు ప్రతిపత్తి, తనంతతానుగా ఏర్పడి కార్పొరేషనుకాని సంఘములతో సమానముగాయున్నవి. ఒడంబడికలు

ఉల్లంఘించునప్పుడు, ధనము విషయములో యీ సంఘములు న్యాయరీత్యా ఏవిధమైన బాధ్యత కలిగియుండవని ఆరోపణ చేయబడుచున్నది. ఇది సర్వత్రా నిజముకాదు. చాలారాష్ట్రములలో సంఘములో పనిచేయువారి ఉద్యోగములు ఆధారముగా దావాలు నడపవచ్చును. వారు ధనములకు బాధ్యతాయుతులగుదురు. అటువంటి దావాలు వేయలేని పరిస్థితులందు అటువంటిదావాలు వేయుటకు శాసనములు చేయబడవలెను. తన ఏజెంట్లు చేయు నేరములకు యజమానిపై బాధ్యత నిర్ణయించుట సాధారణముగా కష్టమైనను ఇతర సంస్థలకంటె సంఘముల విషయములో యింతకంటె యీ బాధ్యత నిర్ణయించడం ఎందుకు సులభం కావలెనో తగిన కారణము కనిపించదు.

## బలవంతముగా కార్పొరేషనుచేయుట కోరదగినదా ?

సంఘములను కార్పొరేషనుగా చేయుట కావాలనేవారు ముఖ్యముగా వ్యాపారస్థులు. తమ జీతాలకు బాధ్యతవహించుటకు ఒక ముఖ్యవిషయము గమనించరు. అది, రాష్ట్రముయిచ్చిన ప్రత్యేకహక్కు కార్పొరేషనుగా ఏర్పడుట. అందులోని వారల వ్యక్తిగతబాధ్యత వ్యాపారములో చాలా తక్కువ చేయబడును.

సంఘములు కార్పొరేషనుగా ఏర్పడుటకు సంఘముల ప్రతినిధియొక్క అభ్యంతరములో ముఖ్యకారణము ఏమన, శత్రువులైన యజమానులు దీని వల్ల అన్యాయపూరితంగా లాభంపొందుటకు అవకాశము దొరకగలదు అని. ఇది నిజంగా ప్రమాదమే. యజమానికి ఎవరికైనా డబ్బుపెట్టుకొని వానిని సంఘములో గూఢచారిగా యిరికించి అతనిద్వారా గడబిడ చేయిస్తే ఆగడబిడకు సంఘము పూర్తిగా బాధ్యత వహించవలసి యుండును.

## గ్రేటుబ్రిటనులోను, స్కాండినేవియాలోను కార్పొరేషనుగా ఏర్పడని కార్మికసంఘములు.

గ్రేటుబ్రిటనులో పారిశ్రామిక సంబంధములగూర్చి ప్రెసిడెంట్సు కమిషనుయొక్క నివేదికపరిశీలనలో ప్రకారము, కార్మికసంఘములు కార్పొ

రేషనుగా ఏర్పడలేవు. కాని న్యాయరీత్యా, సంఘములు తమంతతాము రిజిష్టరుచేసుకోవచ్చును. లేదా రిజిస్ట్రేషనుబడులు స్వయంగా అధికార పత్రము పొందవచ్చును.

'దిస్ యీజ్ డెమాక్రసీ' అనే గ్రంథములో మార్క్వీస్ ఛైల్డ్స్, అన్నదేమనగా స్కాండినేవియాదేశములోని వృత్తిసంఘములు ఏవిధము గానూ రిజిష్టరు చేయబడటంలేదు. కార్పొరేషనుగాకూడా ఏర్పడటం లేదు. చట్టముప్రకారము వారిబాధ్యతలగూర్చి ఏవిధమైన ప్రశ్న ఉద యించలేదు. గ్రేటుబ్రిటనులోని యజమానులలో ప్రముఖుడు బి. సీచోమ్‌రౌన్‌ట్రీ, అమెరికాదేశము పర్యటిస్తూ, సంఘములు కార్పొరేష నుగా ఏర్పడాలనే అమెరికనుల ఆసక్తిగూర్చి అందుకు ఏవిధమైన శాసన ములుచేసి పికెంటును ఎదుర్కొనవలెనో అన్నదానిపై యీవిధముగా అనెను. ఈ ప్రశ్నలు తెలివిగా నిర్ణయించవలెననునవి నేను కాదనను. కాని వీటికి అంత ప్రాముఖ్యత యివ్వనక్కర్లేదు. తెలివైనయజమాని వీటితో అంత సతమతముకాడు. పైగా అతను 'ఏమిటీ గడబిడ?' అని అడుగుతాడు. అతను తీవ్రంగా యిందులోని సంగతి పరిశీలించినట్లయితే కార్మికులు న్యాయసమ్మతమైన ఫిర్యాదులు చేసేరని, సమాజమంతా యీ ఫిర్యాదులవల్ల పారిశ్రామిక అశాంతితో బాధపడుచున్నదని గ్రహించ గలడు. ఈఫిర్యాదులను పరిష్కరించుట తెలివైన పనికాని, వీటిని ఏవిధముగా ఎదుర్కొనాలనే యుద్ధవాతావరణము సృష్టించుటకు కృషి చేయడం అనవసరకాలయాపనమాత్రమే."

## సంఘములు కార్పొరేషనులు కానవసరంలేదు.

న్యూయార్కు సిటీక్లబ్ నివేదికనుంచి అనేకవిషయములు యింతవరకు చెప్పబడినవి. ఏలన ఆనివేదిక నిష్పాక్షికముగా, వాస్తవికతలో, బాహ్య పరిశీలనతో చాలా క్షుణ్ణముగా ఉన్నట్లు కనిపించును. ఈ కారణముల వల్లనే ఈక్లబ్ సిఫారసులు మనకు అంగీకారము.

ఇంతకుముందు చెప్పిన కారణములవల్లనే, రిజిస్ట్రేషనుకాని శాసనములు బలవంతముగా కార్పొరేషనులుగా ఏర్పడుటకాని, ఒడంబడిక

ఉల్లంఘించినపుడు సంఘబాధ్యత పెంచుటకై అగత్యము కలిగించు తీవ్రతరసమస్యలేవీ లేవని తెలియుచున్నది. ఇంతకుముందు జలజడి లంచగొండితనముకు నివారణలు చూపినవికాని, శాసనములో మరికొందు రక్షణ లుండవలెనని యీనివేదిక నమ్ముచున్నది.

ఆనివేదికప్రకారము యీవిధముగా యున్నది. చాలాకాలమువరకు ఉండే ప్రతీఒడంబడిక దానికి బద్ధులై యుండవలసిన సంఘసభ్యుల సమక్షమందుంచుట అవసరము. ఉమ్మడిబేరము ఒడంబడికలుకూడా వారి ఆమోదము పొందవలెనన్నది ప్రజాస్వామ్యపద్ధతుల అదుపులో ఉండడమే. పైగా అలజడిదారుల అన్యాయప్రవృత్తులను అరికట్టును. అందువలన ఈ ఉపసంఘము సిఫారసుచేయునదేమన ఒక సంవత్సరమునకుమించి వృత్తి, సంఘఉద్యమముల ఒడంబడికలకు ఏసంఘమైతే బద్ధమై ఉండవలెనో ఆసంఘముయొక్క ఆమోదము పొందవలెను. నిజం పరిశీలిస్తే యిది చాలా సంఘములలో అమలులోఉన్న ఆచారము. సిటీక్లబ్ ఉపసంఘము యింకా యిలా నమ్ముచున్నది. సంఘముచే న్యాయసమ్మతముగా అధికారము పొందిన ప్రతినిధులైన సంఘంఆఫీసర్లతో మాత్రమే యజమానులు సంప్రదింపులు జరుపవలెను. ఒకవ్యక్తి ఒకవ్యాపార కార్పొరేషనులో సంప్రదింపులు జరుపుతున్నపుడు ఆ కార్పొరేషను ఆఫీసరుకు, అలా సంప్రదింపులు జరిపే అధికారము డైరక్టర్సుబోర్డువారు యిచ్చేరని నిర్ధారణ చేసుకొనేబాధ్యత అతనికి ఉన్నట్టే ఇక్కడ యజమానులుకూడా ప్రవర్తించవలెను.

యజమానికనుక నిక్కచ్చిగా సంఘప్రతినిధులుకాని ఆఫీసర్లను గుర్తించుట నిరాకరించినచో అతిడు ప్రజాస్వామ్యపద్ధతులను ప్రోత్సహించి, అలజడి లంచగొండితనములను తొలగించినవాడగును.

## నిర్బంధ పద్ధతులు.

పైవిషయపరిశీలనములేకాక, కొన్నిసంఘముల విషయంలో ఉన్న నియంతృత్వ అలవాటువల్ల చాలా తీవ్రతరసమస్యలు ఏర్పడుచున్నవి. ఈ పద్ధతులు ఏవిధముగానూ, తమన్యాయసమ్మతమైన కోరికలైన ఎక్కువ వేతనములు, తక్కువ పనిచేయుకాలము, భద్రతా కార్మికుల పరిస్థితులు,

వాటికోసం కార్మికులు సంఘటితపడుటకు కాని, సమ్మెచేయుటకు కాని హక్కును తగ్గించవని స్పష్టపరచవచ్చును. కాని కాంగ్రెసు షెర్మన్ చట్టము సవరించి కార్మికులు తమ న్యాయసమ్మతమైన లక్ష్యములకుతప్ప, రాష్ట్రములమధ్య వ్యాపారమునకు ప్రతిబంధకము కాకూడదని అందుకు అనుకూలంగా చట్టము సవరించవలెనని చాలామంది అభిప్రాయపడిరి. కొన్ని సంఘములు నియంతృత్వరీతిలో అధికారము దుర్వినియోగముచేయు ఉదాహరణలు కొన్ని వారు చూపించుదురు. ముఖ్యముగా అటువంటివి టీమ్‌స్టర్సులోనూ కట్టడముల వృత్తులలోనూ, ఉన్నవి. ఉత్పత్తిలో నిపుణతలేని పద్ధతులను రక్షించుట, కృత్రిమమైనవస్తువులను విడనాడుటలో ఏమర్చుట, కొన్ని ఉద్యోగములలో ఒత్తిడిచే అనవసరంగా ఉద్యోగులసంఖ్యను పెంచుట, ఇతర సక్రమమైన కార్మికసంఘములతో యజమానిని బలవంతముగా సంప్రదించకుండా చేయుట, కంట్రాక్టర్లతో, ఇతరవర్తకులతో, కార్మికులకు సంబంధములేని యితరవర్గములతో కుట్రచేసి ధరలను అదుపులో పెట్టుట, లేదా వ్యాపారములో కొన్ని నిర్బంధములు సృష్టించుట, చిన్న స్వతంత్ర వ్యాపారసంస్థలకు వ్యాపారములేకుండా సంఘములు ప్రయత్నించుట వీటి ఫలితము లగును.

ఇటువంటి పద్ధతులు మొత్తముమీద అన్ని కార్మికులసంఘములలో ఉండు లక్షణములు కాదనిమాత్రము మరొక్కసారి ఉద్ఘాటించవచ్చును. కాని ఎక్కడైతే యీలక్షణములుండునో, అక్కడ అవి చాలా తీవ్రమైన అశుభములుగా పరిణమించును. వాటికి తక్షణము నివారణలు ముఖ్యముగా కార్మికులచే చేయించవలెను. అప్పుడే ప్రజలలో తగిన శిక్షణఉండి కార్మికఉద్యమములు అభివృద్ధి చెందును.

ఈవిషయముపై చట్టములసృష్టి చాలా వివాదాస్పదమైనది. షెర్మన్ చట్టము సవరణకు కార్మికులు సర్వసమ్మతమైన ప్రతిఘటన చూపించుటను సంగా అర్థముచేసుకోవలెను. ఇందుకు కారణము చాలా యజమానులు చాలాకాలంనుంచి తీవ్రతరకృషిసల్పి కుట్ర, ఆరోపణలవల్ల, లావాదేవీలవల్ల కార్మికఉద్యమమును విచ్ఛిత్తి చేయవలెనని సంకల్పించిరి.

## 7. "పనిచేసే హక్కు" శాసనములు

కార్మిక ఉద్యమము అభివృద్ధిలో అనేక ప్రాంతములందు, కార్మికసంస్థలను పరిమితముచేయుటకు సంఘసభ్యులుకలరు. కాణమునకుబములు ఎవరైనా దుకాణములో పనిచేయవచ్చునని దానిని ప్రోత్సహించుటకు, కొందరు యజమానులవర్గములు ఉద్యమములు లేవదీసిరి.

మొదటి ప్రపంచసంగ్రామముతర్వాత, కొంతమంది బ్యాంకుయజమానులు, వ్యాపారస్థులు, సంఘటితకార్మికజనంయొక్క పెరిగే బలానికి భయపడి పెరిగిపోతున్న వేతనములన్కొళ్ళు తగ్గించాలని "అమెరికను ప్లాన్" పేరట "ఓపెన్‌షాపు"లను ప్రోత్సహించుటకు ఒకపెద్దఉద్యమమునకు ధనసహాయము చేసిరి.

ఈ ఉద్యమమువలన, తర్వాత మామూలు ఆర్థిక సాంఘిక పరిస్థితుల వలన, 1920 లో ఉన్న నాల్గు మిలియనులసభ్యత్వమునుంచి, 1923 లో మూడు మిలియన్లకు తక్కువగా ఎ. యఫ్. యల్. సభ్యత్వము తగ్గిపోయినది. 1932 నాటి ఆర్థిక ఒత్తిడికాలమువరకు సభ్యత్వము అదేస్థాయిలో ఉండెను. 1933 లో మరీ తగ్గి 2½ మిలియన్లకు ఆసభ్యత్వము తగ్గిపోయినది.

నేషనల్ ఇండస్ట్రియల్ రికవరీఆక్టు సెక్షను 7 (a) ప్రకారము, కార్మికులు సంఘటితపడి, ఉమ్మడిబేరము సాగించుకొనుహక్కు గుర్తింపబడుట వలన, 1935 లో నేషనల్ లేబర్ రిలేషన్సు ఆక్టు ఆమోదింపబడుటవలన, వృత్తిసంఘోద్యమము అనంతముగా అభివృద్ధి చెందినది.

నేషనల్ లేబరు రిలేషన్సుచట్టముక్రింద జరిగిన ఒడంబడికలలో సంఘటిత యంత్రాగారములలోని ఉద్యోగులు సంఘసభ్యులకు ఏర్పాటుజరిగినది. కొన్ని ఒడంబడికలు 'క్లోజ్‌డ్‌షాప్' పద్ధతి అవలంబించినవి. దానిప్రకారము మునుపు గుర్తింపబడిన సంఘములోని సభ్యులనుమాత్రమే ఉద్యోగులుగా చేర్చుకోవలెను. మరికొన్ని ఒడంబడికలప్రకారము "యూనియన్ షాపు" పద్ధతి అవలంబించబడినది. దీనివల్ల యజమానులు సంఘసభ్యులు కానివారినికూడా ఉద్యోగములలో చేర్చుకొనవచ్చును. కాని, వారు నిర్ణీత కాలములో ఏదో యుక్తమైన సంఘములో సభ్యులుగా చేరవలెను.

కొన్ని ఒడంబడికలలో సభ్యత్వము కలిగియుండే నిర్ణయ విభాగము ఒకటి ఉన్నది. యంత్రాగారములలో పనిచేయునప్పుడు, సంఘసభ్యులు తమ సభ్యత్వము నిల్పుకొనవలెననియు, సంఘసభ్యులు కానివారు తమ ఉద్యోగముల నిలుపుకొనుటకు సంఘములలో చేరనక్కర్లేదనియు దీని సారాంశము.

## "యూనియన్ షాపు" ఎన్నికలు

40 వ దశాబ్దంలో యజమానులు "క్లోజ్డ్ షాపు" "యూనియన్ షాపు"ల ఏర్పాటుల నెదుర్కొనిరి. టాఫ్ట్ హార్టీచట్టము అమలులోకి వచ్చినప్పడు, "క్లోజ్డ్ షాపు" సూత్రమును చట్టబద్ధముకాకుండా చేయుటలో కృతార్థులైరి. "యూనియన్ షాపు" ఒడంబడిక జరిగేముందు, ఆయా సంఘవిభాగమునందు రహస్యవోటింగువల్ల, అధికారము యివ్వబడినపుడే అది అమలులోకి రావలెనన్న అభ్యంతరము వారు లేవదీసిరి.

ఆతర్వాత కొన్నిసంవత్సరములు 46000, ఎన్నికలు నేషనల్ లేబరు రిలేషన్సుబోర్డు ఆధ్వర్యంలో జరిగినవి. ఆ ఎన్నికలలో 5,50,000 కార్మికులు "యూనియన్ షాపు", తమ యజమానులమధ్య ఒడంబడికలలో ఉండుటకు అనుకూలముగాను వ్యతిరేకముగాను వోటుచేసిరి. ఈఎన్నికలలో 91 వ శాతమువోట్లు "యూనియన్ షాపు"కు అనుకూలముగా పడినవి. ఇంచుమించు 97 వ శాతము కేసులలో "యూనియన్ షాపు" విభాగము సంప్రదింపులు అధికారయుతముగా అంగీకరింపబడినవి.

ఈ ఎన్నికలు జరుపుటలో మిలియన్లడాలర్లు, చెప్పలేనంత వ్యయప్రయాసలు ఖర్చుయినవి. 1951 లో ఈ విభాగము మంచికంటె ఎక్కువ చెడు చేయుచున్నదని టాఫ్ట్ హార్టీచట్టమునుంచి తొలగించుటకు కాంగ్రెసు నిశ్చయించినది. 1955 లో ఈ శాసనములో యీమార్పు జరిగాక, "యూనియన్ షాపు" "సభ్యత్వం నిలుపుకొనుట" సూత్రములపై అధికసంఖ్య కార్మికులకు ప్రాతినిధ్యము వహించే సంఘముల సంప్రదింపులవలన, 12,000,000 కార్మికులకు ఉద్యోగములు లభించినవి.

## "పనిచేసేహక్కు" శాసనములకు, శాసనసభలో ఉద్యమములు

1947 లో ట్రూమన్ వీటోతో టాఫ్ట్ హార్టీచట్టము అమలులోకి వచ్చాక, శాసనసభలద్వారా "పనిచేసేహక్కు" శాసనములు అమో

దింపజేయుటకు దేశవ్యాప్త అలజడులు రేగినవి. కార్మికుల ఒడంబడిక లలో సంఘభద్రతా విభాగములు శాసనమునుంచి తొలగించవలెనని పాటు పడిరి. కాని టాఫ్టి హార్ట్లేచట్టము ప్రకారము "యూనియన్ షాపు" న్యాయబద్ధము చేయబడినది. మునుపటికాలములో చాలామంది యజ మానులు పిల్లలకు వ్యతిరేకమైన కార్మికశాసనములను వ్యతిరేకించిరి. కార ణము "పిల్లలు పనిచేసేహక్కు"ను వారికివ్వలేదని వారు వాదించిరి. ఈ ఉద్యమములో యజమానులు కార్మికభద్రతా విభాగములను వ్యతిరే కించుటకు కారణము, సంఘటితముకాని కార్మికుడు ఉద్యోగములోచేరే హక్కు కలిగియుండలేదని వారు వాదించిరి. అందువలన ఈ శాసనములు "పనిచేసేహక్కు" శాసనములని పిలువబడుచున్నవి.

పారిశ్రామికముగా వృద్ధిచెందని రాష్ట్రములలో యీ శాసనములు జయప్రదముగా అమలు జరుపబడినవి. అచ్చట సంఘములు సంఘటిత మగుట చాలా కష్టమై వేతనములు, పనిచేసే పరిస్థితులు తక్కువస్థాయిలో ఉండేటట్లు కొత్తపరిశ్రమలను రాష్ట్రములో ప్రవేశించుటను ప్రోత్స హించే గుణము వాటికున్నది.

ఈ శాసనములు అమలుజరిపిన మొట్టమొదటిరాష్ట్రములు, అరిజోనా, అర్కాంసాస్, ఫ్లోరిడా, జార్జియా, అయోవా, నెబ్రాస్కా, నార్త్ కరో లినా, నార్త్ డకోటా, సౌత్ డకోటా, టెన్నెస్సీ, టెక్సాస్, వర్జీనియా. 1952 లో ప్రెసిడెంట్ ఐసెన్‌హోవరు ఎన్నికైనాక అలబామా, లూషి యానా, మిసిసిపి, సౌత్ కెరోలినా, నెవడా, 1952 నుంచి 1954 వరకు 1955 లో యుటాకూడా యీ జాబితాకు చేర్చబడినవి. ఇతరరాష్ట్రము లలో వర్జీనియాశాసనము అనుకరింపబడినది. అందులో యీ విధముగా నున్నది.

"ఏ యజమాని, కార్మికసంఘముమధ్య కూటమి, గాని, ఒడంబడికగాని జరిగి అందు ఆ సంఘమునకు సంబంధించని సభ్యులు పనిచేయుటకు హక్కు నిరాకరింపబడినచో, ఉద్యోగమునకుగాని, ఉద్యోగములో ఉండుటకుగాని, అటువంటి సభ్యత్వము షరతుగా విధించినపుడు లేదా ఏసంఘముగాని సంస్థగాని ఉద్యోగములిచ్చు నియంతృత్వము కలిగి యున్నచో, అట్టి ఒడంబడికకాని, కలయికకాని, ప్రభుత్వవిధానమునకు

వ్యతిరేకమని, న్యాయసమ్మతముకాని కలయికగాను, కుట్రగాను భావింపబడు"నని ప్రకటింపబడినది.

## శాసనములపై విమర్శ

"పనిచేసేహక్కు" అనే ప్రజారంజకమైనపేరు నిజముగా ఒక తప్పు పేరు. కార్మికులకు యీ శాసనములు పనిచేసే హక్కు నిచ్చునవే తప్పు భావము అందరికి కలుగును. కాని ఆ శాసనములు యేలాచేయవు. రాజ్యాంగరీత్యా ఏపనినిచేసే హక్కు యీ శాసనములు యివ్వవు. స్థానిక కంట్రాక్టరువద్దనుంచిగాని, వ్యాపారస్థునివద్దనుంచిగాని, ఒక ఉద్యోగము కోరేహక్కు యివి యివ్వవు. పనిలేనందువల్ల మరి తదితర కారణములవల్ల ఉద్యోగము ఊడిపోయే పరిస్థితినుంచి రక్షణ కార్మికునకు యివ్వవు. అధికసంఖ్య కార్మికులకు ప్రాతినిధ్యము వహించే సంఘము హక్కులతో కలుగజేసుకొనుటయేగాక, తమ పరిశ్రమలోని ముఖ్యమైన పనిచేసే పరిస్థితులు నిర్ణయించుటలో యజమానులహక్కుతో కూడా కలుగజేసుకొనును.

న్యూఆర్లియన్సు ఆర్చిభిషప్, రివరెండు ఫ్రాన్సిస్‌రమ్మెల్, యీశాసనమును ప్రతిఘటించుచో యీ కారణము పేర్కొనెను. "పనిచేసేహక్కు వాగ్దానముచేస్తున్నట్లు నటిస్తూ, ఆహక్కును నిజముగా అది విఫలము చేయును. తత్ఫలితముగా కార్మికులు భద్రత ఉన్నతమైన జీవనప్రమాణము, మానవతాయుత పనిచేసే పరిస్థితులు పోగొట్టుకుందురు....నిత్యమూ మళ్ళీమళ్ళీ ఏర్పడే సాంఘికకొట్లాటకు, అసంతృప్తికి యిది ఆహ్వానించును.

1956 లో, అమెరికారాష్ట్రములలోని డివిజన్ ఆఫ్ లైఫ్ అండ్ వర్కు ఆఫ్ ది నేషనల్ కౌన్సిల్ ఆఫ్ చర్చిస్‌యొక్క కార్యవర్గము యీ శాసనములను ప్రతిఘటించినది. అందుకు కారణములు ఉమ్మడిబేరమును అది పరిమితముచేసినది. "ఉద్యోగము కొనసాగుటకు సంఘసభ్యత్వము ప్రాతిపదికగా ఉండకూడదని శాసనములో తిరస్కరింపవలెననియు, ఉమ్మడిబేరముద్వారా యజమాని కార్మికులమధ్య జరుగు ఒడంబడికలో దీనితీర్పు వదిలివేయవలెననియు, కౌన్సిలు, జనరల్ బోర్డుకొరకై చదివిన ప్రకటనలో ఉన్నది.

అమెరికను హీబ్రూ మతసభల సంఘమునకు సంబంధించిన రబ్బియూనె జె. లిప్‌మన్ కూడా యిటువంటి అభిప్రాయమునే వెలిబుచ్చినారు. "పని

చేసేహక్కు" శాసనములు నిస్సందేహముగా స్వేచ్ఛగా సంఘటిత మగుటకు ప్రతిబంధకముగా ఉమ్మడిబేరముపద్ధతుల్లను పాతిపెట్టుటకు నిర్మించబడినవి. "యూనియన్ షాపు" కు వ్యతిరేకముగా శాసనములు చేయునపుడు, రాష్ట్రములు యజమానులకు అనుకూలముగా చేసినదేమన, వేతనములు, పనిచేసే పరిస్థితులు తక్కువస్థాయిలో ఉండునట్లు సంఘ సభ్యులుకానివారినికూడా ఉద్యోగములోనికి తీసుకొనునట్లు నిశ్చయించ బడినది. "పనిచేసేహక్కు" శాసనము బాగా పారిశ్రామికముగా అభి వృద్ధిచెందిన సంఘములో, సంఘసంస్థలద్వారావచ్చే తప్పనిసరి బలము తప్పించి, వ్యక్తిస్వతంత్రముగా ఒంటరిగా నిలుచుని తన ప్రాతినిధ్యము చెప్పుకొనుటకు హక్కు నివ్వడమే దీనిఉద్దేశము."

మరొకటి నైతికముగా పరిశీలించవలసినది; సంఘసభ్యుడుకాని స్త్రీ గాని పురుషుడుగాని, కార్మికసంఘముల ఒత్తిడివల్ల లభ్యమయిన ఎక్కువ వేతనములు, మెరుగైన పరిస్థితులు స్వీకరించుట తప్పుకాదా? ముఖ్యంగా సంఘమును సభ్యత్వరుసుముతో పోషించ నిరాకరించినప్పుడు తమ బరువు వాటా తోయడానికి నిరాకరించువారికి "పనిచేసేహక్కు శాసనములు" అంటే "పనికిజంకుహక్కు" శాసనములుగా పరిగణింపవచ్చును. సమస్య యొక్క యీ దృక్పథముతో, ఎ. యఫ్. యల్. సి. ఐ. ఒ. ప్రెసిడెంటు జార్జి మీనీ యీమధ్యచేసిన ప్రకటన అర్థముచేసుకోగలము. ఆ ప్రకటన ప్రకారము సంఘసభ్యులు, సంఘసభ్యులుకానివారికి పనిచేసేహక్కును లేకుండాచేయరు — కాని అటువంటి సంఘసభ్యుడు కానివానితోకలిసి పనిచేయుటకు నిరాకరింతుము.

యజమానుల తరగతులనుంచి తన ఉద్యోగమునకువచ్చిన లేబరు కార్య దర్శి, జేమ్సు పి. మిచెల్, "పనిచేసేహక్కు" శాసనములుగురించి తన అభ్యంతరములు యీ విధముగా పేర్కొనెను.

"మొట్టమొదటగా, ఆ శాసనములు ఏ ఉద్యోగములు సృష్టించవు. రెండవది, పనిచేసే స్త్రీ పురుష కార్మికుల స్వాతంత్ర్యముపై అనవసరమైన, కోరదగని పరిమితులు సృష్టించును. యజమానులు ఉమ్మడిగా బేరమాడు కుని, పనిచేసే షరతులకు ఒడంబడిక చేసుకొనుటంలోకూడా ఈ పరిమితులు కల్పించును. మూడవది. సంఘము భద్రతి కూడా పరిమితముచేసి, కార్మిక సంస్థల ప్రాథమికబలమును అవి అణగద్రొక్కును."

1956 లో మే 21 వ తారీఖున, యునైటెడ్ స్టేట్సు సుప్రీంకోర్టు యిచ్చిన తీర్మానంలో "రైలురోడ్డు యూనియన్ షాప్ ఒడంబడిక"లను బహిష్కరించినంతవరకు, నెబ్రాస్కాలో "పనిచేసేహక్కు" శాసనము నిరుపయోగము చేయబడినది. 1951 లో రైల్వేలేబరుచట్టమునకు కాంగ్రెసు ఒక సవరణ ఆమోదించినది. దానిప్రకారము, ఏ రాష్ట్రము యొక్క ఏ శాసనమైనను, యిది "యూనియన్ షాపు" ఒడంబడికల కనుమతించును. యూనియన్ షాపును బహిష్కరించు అధికారము రాష్ట్రమున కున్నను, రాష్ట్రశాసనములు కేంద్రశాసనములకు లొంగియుండవలెనని, రైల్వేలేబరుచట్టమునకు కాంగ్రెసు చేసిన సవరణ, రాష్ట్రశాసనముకాని రాష్ట్రరాజ్యాంగచట్టముకాని నిరుపయోగము చేయలేదని కోర్టు ఏ అభ్యంతరములేకుండా ఏకీభావముతో ఒప్పుకున్నది.

ఈ తీర్పుఫలితముగా, సంఘటిత కార్మికులలో అధికజనము, యీ రైల్వే లేబరుచట్టము సవరణధోరణిలో, టాఫ్ట్ హార్ట్లేచట్టమునకుకూడా సవరణ కావలెనని కోరిరి. వివిధరాష్ట్రములలోని "యూనియన్ షాప్" వ్యతిరేకశాసనములు న్యాయబద్ధముచేయు సెక్షన్ 14 (b) తొలగించవలెననికూడా కోరిరి.

## 8. గ్యారంటీచేయబడిన సాంవత్సరిక వేతనము

క్రిందటి అధ్యాయములో, "యూనియన్ షాపు" గురించి ఒక విభాగము యజమాన్యముతో తాము చేసుకొను ఒడంబడికలో ఉండవలెననే హక్కుకోసం, అటువంటి ప్రియమైన హక్కునష్టమై పోకుండా కార్మికులుజరిపే పోరాటంగురించి వర్ణించబడినది.

## కార్మికుల కు భద్రత లేమి.

కొంతమంది కార్మికులు ఈమధ్యనే మరొక క్రొత్తహక్కుకై పోరాటము సాగించుచుండిరి. ఆహక్కు సాంవత్సరిక వేతనము గ్యారంటీ చేయవలెనని.

అమెరికాదేశములో నేడు సరాసరి పరిశ్రమలలో, పారిశ్రామికనిర్వాహకులు సాధారణముగా ఒక గ్యారంటీ యివ్వబడిన సాంవత్సరిక వేతనము పొందుదురు.

వైట్ కాలర్ కార్మికులలో చాలాభాగము వారమునకు, రెండువారములకు, నెలకు జీతము పుచ్చుకొనుచున్నారు. సాధారణంగా వీరిని పనిరోజుల్లో, ఉత్పత్తికార్మికులనువలె, తీసివేయటంలేదు. పైగా, చాలామంది వేతనములుపొందువారు రోజుకూలికాని, గంటకూలికాని కలిగియుండుటచే వారు, వారమునకు కాని, నెలకుగాని, సంవత్సరమునకుగాని ఎంతసంపాదించుకొగలరో లెక్కకట్టుట కష్టము. 1952 లో అమెరికాదేశములోని నిజమైన కార్మికనాయకులలో ఒకరైన సి. ఐ. ఓ. కి సంబంధించిన ప్రెసిడెంట్ ఫిలిప్ ముర్రే ప్రకటించినవిధంగా "దాని ఫలితము కార్మికులలో పాతుకుపోయిన భద్రతాలేమి" అనేభావము మాత్రమే.

ముర్రే యింకా యిలా అన్నారు. "వారము సంపాదన ఎంతైనా, గంటలవేతనములసొమ్ము ఎంతైనా సరాసరి కార్మికుడు, తన ఉద్యోగము ఎప్పటికైనా ఆఖరగునని భయపడుచున్నాడు. ధరలుపెరిగే యీకాలములో పొదుపుచేయగల కొద్దిమందిలో ఒకరైతే, అటువంటి పొదుపుమీద చివరకు అతను ఆధారపడవలసివచ్చును. అతని కుటుంబాన్ని నిలబెట్టుటకు చాలాతక్కువ ప్రమాణంలో యివ్వబడిన నిరుద్యోగ నష్టపరిహారము అధారము కావలసియున్నది—లేదా ఆఖరికి బ్రతుకుతెరువుకు సహాయముచేయు ఏజన్సీ ధనముమీద ఆధారపడవలసియున్నది.

ఇతర అమెరికను కార్పొరేషనులవలె, ఉక్కుకంపెనీలుకూడా అప్పుడప్పుడు గంట, వేతనములమీద ఆధారపడు కార్మికులు, వారికుటుంబముల నిరుద్యోగమునుగూర్చి, ఏమీ శ్రద్ధచూపటంలేదు. నోటీసు లేకుండానే

యీ కార్మికులు పనిలోంచి తొలగించబడుచున్నారు. లేదా, కొద్దికాలము వార్షింగు ముందుయిచ్చి పనినుంచి తీయుచున్నారు. విశాలదృక్పథంతో పరిశీలిస్తే గంటలమీద పనిచేయుకార్మికుడు తాను రెండవగంటలో పని చేయునో లేదో అతనికే తెలియదనునది సత్యము.

భవిష్యత్తులో ఎప్పుడు తాను సంపాదించగలడో కార్మికునకే తెలియనపుడు, ఒక నిర్ధారణతో అతని బడ్జెటు నిర్మించుకొనుట అతనికేకష్టము. అతనిబిల్లులు ఎప్పుడు చెల్లించుకొనవలెనో అతనికే తెలియదు. కొద్దికొద్ది మొత్తములిచ్చి కొనుక్కునే యీ యుగంలో ఆ కార్మికునిబాధ మరీ విపరీతము. స్టాండర్డ్ కీస్టోన్ కార్పొరేషను అధ్యక్షుడు. హెరాల్డ్ జె. రబెన్‌బర్గ యీ విధముగా అనెను. ఒకగృహము, కారు, ఐస్‌పెట్టె, టెలివిజన్‌సెట్టు, విమానము, సంవత్సరమున కొకసారి ఖర్చుకట్టుదునని కొనుక్కున్నమనిషికి, గంటకొకసారి జీతము తీసుకొను ఒడంబడికపై పనిచేయుట కుదరదు. ఇంటితణఖా కాని, కారు కొనియిచ్చే ఫైనాన్సు కంపెనీ ఒడంబడికగాని, తనబిల్లులు వాయిదావేయుటకు ఏవిధమైన ఒప్పుదల సూచించవు. అతను తనతప్పు ఏమీలేకపోయినా పనిలోంచి తొలగించబడినప్పుడుకూడా అతను డబ్బు చెల్లించడమో, లేదా కారు, యిల్లు వదులుకోవడమో చెయ్యవలసివచ్చును.

## సాంవత్సరిక ఉద్యోగము గ్యారంటీకై 1955 లో కోరికలు

వ్యక్తికి ఎక్కువ భద్రత కలిగించుటకు, తన ఆదాయవ్యయములగూర్చి ప్రణాళికలు వేసుకొనుటకు ఎక్కువ అనువుగా ఆర్థికస్థితిని బలపరచుటకు, పరిశ్రమలలో సాంవత్సరికవేతనము గ్యారంటీచేయవలెనని చాలా కార్మిక సంఘములు వాదించినవి.

1955 లో మోటారు, ఉక్కు, ఎలక్ట్రికల్ సంఘములు కొంత వేతనము గ్యారంటీకై అద్భుతమైన ఉద్యమము నడిపినవి. అప్పుడు వసంతములోను, వేసవిలోనూ వాల్టర్ పి. రూథర్, డేవిడ్ జె. మాక్డొనాల్డు, జేమ్సు బి. కారే, ఆ సంఘములోని తక్కిన అనుచరులైన ఆఫీసర్లు, వారు ఒడంబడిక జరుపుచున్న కార్పొరేషన్లలో ధర్మనిధి ఒకటి ఉంచమని సంప్రదింపులు జరుపసాగిరి. ఉద్యోగులు పనిచేసిన ప్రతిగంటకు ఆ ధర్మనిధిలో కొంత

సొమ్ము యజమానులు ఉంచవలసినదని వారు కోరిరి. పనిలేకపోవడంవల్ల యీ ఉద్యోగు లెవరికైన ఉద్యోగముపోయినచో, వారు యీ సొమ్ము నుంచి 26 మొదలు 52 వారములవరకు సొమ్ము తీసుకుందురు. రాష్ట్రీ మిచ్చు నిరుద్యోగ ఇన్స్యూరెన్సు నష్టపరిహారముతో కల్పినచో ఆ విధముగా ఉద్యోగి తీసుకొనుసొమ్ము అతనివేతనములో 3/5 వంతుకాని, అంతకంటె ఎక్కువగాని అగును.

1955 ఏప్రిల్‌లో సి. ఐ. ఓ. యొక్క "ఇకనామిక్ ఔట్‌లుక్"లో యీ ప్రతిపాదనలయొక్క సాధారణతత్వము, (మరొక పేరుతో వాటికి "అదనముగావచ్చు నిరుద్యోగలాభము"లని పేరు) వీటివెనుకనున్న సారము, స్పష్టముగా విశదీకరింపబడినది.

"సాంవత్సరిక వేతనములో మరియు గ్యారంటీ ఉండాలనడం చాలా ముఖ్యమైన ప్రాధమికవిషయము. నిరుద్యోగమును ఎదుర్కొనేపోరాటములో ఇది ఒక సోపానము. ఇది విప్లవకరముకాదు. కాని కార్పొరేషన్లు సక్రమమైనా, ఉద్యోగములు యిచ్చుటకు వీలుగా ఎక్కువ ఆర్థిక బాధ్యతలు తీసుకోవలెననిమాత్రమే మరొక సహేతుకమైన ప్రతిపాదన.

వారము వారము కార్మికులు స్థిరమైన ఆదాయము కలిగియుండవలెనని మనసంఘములు చెప్పుచున్నవి. ముఖ్యముగా వారు పనిచేయగలిగేశక్తి, యిష్టము ఉన్నప్పుడును వారిని పనినుంచి తొలగించినపుడు, వారి ప్రస్తుత స్థాయిలోని జీవనము కొనసాగించుటకు, కొన్నిధరల తగ్గుదల దృష్టిలో ఉంచుకొని వారికి కొంతసొమ్ముయిచ్చే ఏర్పాటు జరగవలెను."

"పనిదొరకనిచో అటువంటి గ్యారంటీధనం, యిచ్చుకాలము, మొత్తము ఒక సంవత్సరము దాటకుండా కార్మికులయొక్క సర్వీసు, మునపటి ఉద్యోగముమీద ఆధారపడియుండును."

"స్థిరమైన ఉద్యోగములు మాకు కావలెను, సోమరితనముకాదు. ఆయా పరిశ్రమలలో, జరిగినంతవరకు, నిరుద్యోగమును తగ్గించి, స్థిరమైన ఉద్యోగములు ఏర్పరుచునట్లు యజమానులకు ఉత్సాహము యిచ్చునట్లు మా ప్రతిపాదనలు జాగ్రత్తగా పథకీకరించబడినవి.

చాలా ధనవంతములైన కార్పొరేషన్లుకూడా తెలియనంతఖర్చు తీసుకోవని మాకు తెలుసు. ప్రస్తుతము హెచ్చించుజీతములో ఒక నిర్ధిష్టశాత

మున బడుసొమ్ము కార్పొరేషను చెల్లించితీరవలెను. అటువంటిసొమ్ము మీద ఒక నిర్దిష్టమైన సహేతుక పరిమితి ఉండవలెనని మా సూచన. మంచిరోజులలో నిలవఉంచిన రిజర్వుధనము, వ్యాపారము పడిపోయిన రోజులలో గ్యారంటీసొమ్ములు యిచ్చుటకు ఉపకరించును.”

“ఒడంబడికలో ఒప్పందము కుదిరినప్రకారము, ప్రతీకార్మికుడు, పనినుంచి తొలగించబడినాక, ప్రభుత్వఎంప్లాయిమెంటు సర్వీసులో రిజిష్టరు చేసుకోవలెనని, ఏదైనా సరైన ఉద్యోగమిచ్చినపుడు స్వీకరించవలెనని కోరబడినది. సరైనఉద్యోగము అక్కర్లేదని తోసివేయబడిన ఏకార్మికుడు గ్యారంటీవేతనము పొందజాలడు. తనంతతాను కోరితెచ్చుకొనని నిరుద్యోగమునకే రక్షణ యివ్వబడును”

“ఏ కార్మికుడైనా నిరుద్యోగ నష్టపరిహారము పొందుచున్నచో, అంతవరకు, యజమానియిచ్చు గ్యారంటీసొమ్ము తగ్గించబడును. ఇటువంటి ఏర్పాటువల్ల కార్మికులకు రక్షణయిచ్చు నిరుద్యోగ యిన్సూరెన్సుకు యజమాని ప్రతిఘటన తగ్గును”

## యునైటెడ్ మోటారు ఒడంబడికలు

సి. ఐ. ఓ. కి సంబంధించిన యునైటెడ్ ఆటో వర్కర్సుతో యీ ప్రతిపాదనలు ఒడంబడికలలో రూపొందించ ప్రయత్నించిన పెద్దకార్పొరేషన్లు ఫోర్డుమోటారుకంపెనీ; జనరల్ మోటారు కార్పొరేషను. 1955 చివరలోగా, యునైటెడ్ ఆటో వర్కర్సు 180 కంపెనీలతో పైగా యిటువంటి ఒడంబడికలు చేసుకున్నవి.

మరియు, యునైటెడ్ స్టీల్ వర్కర్సు, అంతర్జాతీయ ఎలక్ట్రికల్ వర్కర్సు, నేషనల్ మారిటైమ్ యూనియన్ యిటువంటి ఒడంబడికలపై సంప్రదింపులు జరిపిరి.

ఈ ఒడంబడికలలో కార్పొరేషన్లు నిధికియిచ్చినసొమ్ము మనిషి పనిచేసిన గంటలలో 8వ శాతముండును. మొత్తముసొమ్ము మొత్తము జీతములో 2 లేక 3 శాతము వరకుండును. మొదటి యునైటెడ్ ఆటో వర్కర్సు ప్లానుప్రకారము, ఒః సంవత్సరము సర్వీసుఉన్న కార్మికుడు 26 వారముల వరకు, గ్యారంటీసొమ్ము పొందగలడు. 1955 లో జరిగిన యునైటెడ్ స్టీల్ వర్కర్సు ఒడంబడికలలో, సొమ్ము యివ్వడం 52 వారములవరకు జరగ

వచ్చును. కొత్తకార్మికులుమాత్రము, మూడుసంవత్సరములు సర్వీసు లేనిదే యీ లాభములు పొందలేరు. 1956 వేసవిలో పెద్ద ఉక్కుకంపెనీలతో ఉక్కుకార్మికులు సంప్రదింపులు జరిపిరి. ఆసంప్రదింపులప్రకారము, 52 వారములవరకు సొమ్ము పొందవచ్చును. ఆ సొమ్ము యింటికి తీసుకువెళ్ళే జీతములో 65 శాతంవరకు ఉండును.

## గ్యారంటీవేతనమునకు ప్రతిబంధకములు

గ్యారంటీ సంవత్సరవేతనమునకు చేయబడిన ఉద్యమమును తీవ్రముగా ఖండించడం, ఎక్కువగా పొగడడంకూడా జరిగినది. 1955 లో నేషనల్ అసోసియేషను ఆఫ్ మాన్యుఫేక్చరర్సు, అధ్యక్షుడి ప్రకటనలో, "ఇటువంటి ఒడంబడికలు అమెరికా ఆర్థికస్థితిపై తీవ్రమైన నాశనకరఫలితములు కలుగచేయును. సోషలిస్టు రాష్ట్రమును సృష్టించి, పరిమిత ఆర్థికస్థితిని ఏర్పరచును. 1955 లో నేషనల్ అసోసియేషన్ ఆఫ్ మాన్యుఫాక్చరర్సు పిలిచిన మహాసభలో ఇటువంటి పరిణామమువల్ల చిన్నవ్యాపారములు నాశనమైపోవుననియు, ధరలు పెరిగే ఆర్థికస్థితి ఏర్పడుననియు, ఉద్యోగులు పనిచేయుటను నిరుత్సాహపర్చుననియు, మేనేజర్లను వ్యాపారాభివృద్ధి ప్రణాళికలు ఏర్పరచకుండా చేయుననియు యున్నది" అందరూ భయపడిరి.

## ఫోర్డుకంపెనీ రక్షణవాదము

ఇటువంటి మరి తదితర విమర్శలకు ఫోర్డుమోటారుకంపెనీ ప్రతినిధి ఒకరు యీ ఆరోపణలు నిజము కానివని ముఖ్యముగా యునైటెడ్ ఆటో వర్కర్సు, ఫోర్డుకంపెనీలమధ్య జరిగిన ఒడంబడికలు దృష్టిలో పెట్టుకుని అన్నట్లు అతను యిలా ప్రకటించెను.

"ఫోర్డుకంపెనీ–యునైటెడ్ ఆటో వర్కర్సుకుమధ్య జరిగిన ఒడంబడికలో ఉద్యోగములో పెరుగుదలను నిరుత్సాహపరచి, తక్కువస్థాయి నిరుద్యోగమువైపు పనులను తప్పించేటట్లు ప్రోత్సహించే చెడ్డఅంశములు లేవు. యంత్రాగారములు వ్యాప్తిచేయుటలోకాని, కొత్త కార్యక్రమములు, బజారులు చేపట్టుటలోగాని, కొత్త సాహసములు చేయుటలోగాని యజమాని ఉత్సాహమును ఏవిధముగాను ఒడంబడిక తగ్గించదు. పెట్టుబడిదారులు ఎక్కువ ధనమును వినియోగించడంలోగాని, ప్రస్తుత పెట్టు

బదులనుంచి ధనమును తీసుకొనుటలోగాని, ఏవిధముగానూ వెనుకంజవేయ నీయదు. యజమాన్ని పోటీచేయు పరిస్థితిని ప్రాదుచేయు కారణము, గంటకు అయిదు సెంట్లు వేతనము పెరుగుదల, ఉమ్మడిజీతము ఒడంబడిక కాలములో నిర్ణయించబడి ఏర్పాటైనవిధముగానే యజమానులిచ్చే సొమ్ము కూడా నిర్ణయించబడే ఏర్పాట్లైనవి.”

“ఆర్థికపరిస్థితి మొత్తముచూచినచో, ఈ ప్రణాళిక ధరల పెరుగుదలకు అవకాశమీయదు. ఎందువల్లనంటే యిందులో ఎక్కువ ఉద్యోగము లున్నప్పటి సొమ్ములు, నిధులలో చేర్చబడును. వేతనములు యివ్వని రోజుల్లో, లాభదాయకసొమ్ములు, ఉద్యోగములేని విరామకాలంలో యివ్వబడును. ఈవిషయముమాత్రము మరిచిపోరాదు.”

## ‘సమర్ స్లిటర్సు’ విభజన సిద్ధాంతం

హార్వర్డు విశ్వవిద్యాలయమునకు సంబంధించిన ప్రొఫెసర్ సమర్ స్లిటర్ ఫోర్డు ప్రతినిధి ప్రకటనతో పూర్తిగా ఏకీభవించును. అతని ప్రకటనలో, “ఫోర్డు, జనరల్ మోటార్సు చేసిన ఉమ్మడిబేరముల ఒడంబడికలు చిన్న వ్యాపారస్తుని గాయపరచవు. చిన్నదైనా పెద్దదైనా, ఎక్కువ నిపుణత కల వ్యాపారమునకు లాభము చేకూర్చును.” అనియున్నది. ప్రొఫెసర్ స్లిటర్ ప్రకారము స్వీయపరాక్రమణవృద్ధి యగును, అది కోరదగినఫలితము. అదనంగా యిచ్చు నిరుద్యోగనష్టపరిహారము, ధరల పెరుగుదల ప్రభావము కలిగించినను, ఇటువంటి విమర్శ, ఏ ఏర్పాటులు గురించైనా, విధానముగూర్చిఅయినా, ధరల తగ్గుదల తీవ్రతను తగ్గించుచో, చేయవచ్చునని ఆయన అన్నారు. మొత్తముమీద, అమెరికను ఆర్థికస్థితిలోని చైతన్యవంతమైన ప్రభావములను బలహీనపరచకుండా అదనంగాయిచ్చు నిరుద్యోగనష్టపరిహారము ఎక్కువగా ఉపయోగించుటవలన, బలపడునవనియే తీర్మానింపవచ్చును.

అదనంగాయిచ్చు నిరుద్యోగనష్టపరిహారము పరిశ్రమలో ఏమీ కొత్త సూత్రమును ప్రవేశపెట్టుటలేదని వ్యాపారస్తుడు గుర్తించవలెనని ప్రొఫెసర్ స్లిటర్ భావిస్తున్నాడు. ఆయన యింకా యిలా సూచించెను. “1934 లో విస్కాన్సిన్ రాష్ట్రము పనిలోంచి తీసివేసిన ఉద్యోగులకు ఆదాయము ఏర్పాటుచేయవలెనను క్రొత్తసూత్రము నిర్ణయించినది.

అందుకే నిరుద్యోగ నష్టపరిహారమునకు ఉద్యోగికి ధనమిచ్చే రాష్ట్రవ్యాప్త ప్రణాళిక ఒకటి అది ఏర్పాటుచేసెను. తర్వాత కేంద్రప్రభుత్వము ద్వారా 1935 లో జీతము తీసుకుని జాబితాబట్టి పన్నువేసి నిరుద్యోగ నష్టపరిహార ప్రణాళికలను అమలుజరుపమని కాంగ్రెసు రాష్ట్రములను అక్షరాలా ఆదేశించినది. 1953, 1954 లోని తన ఆర్థికనివేదికలలో అధ్యక్షుడు ఐసెన్ హోవరు సూచించిన రాష్ట్రశాసనములలో లాభముల తక్కువతనమును పూడ్చుటకు ఫోర్డు, జనరల్ మోటార్సు ఒడంబడికలు యత్నించెను.”

హార్వార్డు ఆర్థికవేత్త ప్రకారము ఫోర్డువారి ఒడంబడిక యీవిషయములో చాలాలాభదాయకమనికాదు, కాని అమెరికనుప్రజలు, మామూలు నిరుద్యోగనష్టపరిహారములకు యిది మారుగా ఉంచునదనే, నమ్మకము లోకి దిగజారుదురని. ముఖ్యమైనవిమర్శ. ప్రస్తుతము ప్రభుత్వము నిరుద్యోగ నష్టపరిహారప్రణాళికలు వర్తించు నల్గురుకార్మికులలో ఒక్కనికి మాత్రమే అదనపు నష్టపరిహారలాభము చేరును.

ఈ కార్మికులు, 1955 లో నిరుద్యోగులైనపుడు సరాసరి వారం వేతనములలో 1/3 మాత్రమే స్వీకరించగల్గిరి. కాని 1938 లో 43 శాతము పొందగల్గిరి. ఐసెన్ హోవరు అధ్యక్షుడు యీసొమ్ము అధమము 50 వ శాతమునకు హెచ్చించవలెనని కోరెను.

## సాంవత్సరిక వేతనము చాలదు

వాల్టర్ రూథర్, యునైటెడ్ ఆటోవర్కర్సు ఒడంబడికలు — ముఖ్యంగా చాలాప్రముఖమైన ఒడంబడిక లిప్ చామర్సు కార్పొరేషనతో చేయబడినది—ఒక ప్రత్యేక చారిత్రకసంఘటనఅని, పనిలోంచి తీసివేతలు నిరుద్యోగము మొదలగు రాష్ట్రములు ఎదుర్కొనే ఆర్థిక భద్రత బాగా పెంచుటకు పరిశ్రమ సహాయము చేయవలెననుసూత్రము స్వీకరింపబడినదని, భావించుచున్నారు. ఆయన, సంఘటితకార్మికుల తదితర నాయకులు భావించునదేమనగా, యీ ఒడంబడికలతోపాటు సరైన రాష్ట్రనిరుద్యోగ ఇన్స్యూరెన్సుపద్ధతికూడా ఉండవలెనని, చివరకు గ్యారంటీ సాంవత్సరిక వేతనమునకు ఒక సంపూర్ణప్రణాళిక పరిశ్రమ అవలంబించవలెనని వారి ఉద్దేశ్యం.

## వ్యాపార కార్యవర్గములు, సాంవత్సరిక వేతనముండవలెనందురు

చాలామంది వ్యాపార కార్యవర్గములుకూడా ఇదే దృక్పథముకలిగి యున్నారు. రైల్వే ఎక్స్‌ప్రెస్ ఏజన్సీ ఆపరేషన్సు ఆధీనములోకల్గిన ఉపాధ్యక్షుడు రాబర్టు సి. హిన్‌గన్, అమెరికను మేనేజిమెంటు అసోసియేషను మహాసభలో, మనజీవితకాలములో ఫాక్టరీకార్మికులు సాంవత్సరిక వేతనము పొందగలరని, జ్యోతిషము చెప్పెను. అటువంటి ఏర్పాటులు జరిగినపుడు, కార్మికులు యింకా ఎక్కువబాధ్యతలు వహించవలెను. ఉదాహరణ, ఎక్కువ ఉత్పత్తి; తక్కువగా గైరుహాజరగుట; తక్కువగా పనిమానివేయుట, ఒకఉద్యోగమునుంచి మరొకఉద్యోగమునకు, అలాగే యంత్రాగారమునుంచి,మరొకదానికి సులభముగా బదలీఅగుట మొదలైనవి.

అమెరికా యునైటెడ్ స్టీల్ వర్కర్సుకు పురాతన పరిశోధన డైరక్టరు, మరియు వ్యాపారకార్యవర్గ ఆఫీసరుఅయిన హెరాల్డు జె. రట్టన్‌బర్గు భావించినదేమన "కార్మికులు అనంతంగా ఎక్కువతక్కువలులేని గంట జీతముపద్ధతి సంపాదనతో సంతృప్తిపడుదురని యజమానులు అనుకొనకూడదు. ఏలన వారు సంవత్సరమంతా తమ కుటుంబములకు, తిండి, బట్ట, గుడిసె యివ్వవలెను.

ఇటువంటి ఏర్పాటులకు జరిగిన ఉద్యమము హెచ్చుటకుకారణము కార్మికులుకాదు, గడవుగడువు ప్రణాళికమీద కొనుగోలు ప్రోత్సాహపరిచే అమ్మేవారి ఒత్తిడిలుమాత్రమే. అమెరికనుజీవితములో ఎక్కువ అధికార ముండుటకు కార్మికనాయకులు మంత్రసానులుగా ప్రవర్తించుచున్నారు. సాంవత్సరిక వేతనముకు తండ్రులువంటివారు మిస్టర్ యు. యస్. మార్కెండిసమ్, మిస్టర్ సూప్యపర్ సేల్సుమేను, మిస్టర్ బిగ్ షాట్ అడ్వర్టైజింగ్ ఎక్సర్టు, మిస్టర్ బైనాపేలేటర్ సేల్సుమేను. ఆయన భావించునది "సాంవత్సరిక వేతనము పూర్తిగా గ్యారంటీ యిస్తూవుండే పరిస్థితి త్వరగా పెరుగునని, 1965 ప్రాంతమునాటికి, నేడు గంటకు, సంవత్సరమునకు జీతముపొందు కార్మికులలో చాలామంది సంవత్సరమునకు జీతమువచ్చు ఉమ్మడిజీతము ఒడంబడికల ప్రకారము పనిచేయుదురు. తనవ్యాపారములో, 5 లేక ఎక్కువసంవత్సరములు పనిచేసిన ప్రతీ

ఉద్యోగి సాంవత్సరిక స్టైపండు పొందును. అది కార్మికుని గంటజీతము Bultipted by 2080; వారమునకు 40 గంటలుచొప్పున సంవత్సరము నకు 52 వారములు ప్రాతిపదికగా ఒకఉద్యోగి పనిచేయు గంటలకు సమానము. ఇదే ఏర్పాటులు చివరకు, ఏ ఉద్యోగిమైన సంవత్సరంపైబడి పనిచేసినవారికికూడా వర్తింపజేయును. పైగా కార్మికులనుంచి కొన్ని కన్నసన్నకోరును ఉదాహరణ, సెలవులవిషయంలో, గైరుహాజరువిషయంలో పరిమితకాలమునకుమించి పనిచేయుటలో—దీనివల్ల చాలా వృత్తి సంఘపద్ధతులను తీవ్రముగా మార్చివేయును.

అటువంటి ఒడంబడిక చేసినపుడు, రూటెన్‌బర్గ భావించున దేమన, యజమానుల కార్మికులమధ్య సహకారమునకు ఒక కార్యక్రమము నిర్ణయింపవచ్చును. దీనివల్ల నిపుణత పెరిగి, రద్దీతొలగి, ఉత్పత్తిధరలు తగ్గి, వస్తుగుణము పెరుగును.

పరిమితులు కొంతకాలమే పనిచేస్తూ పూర్తిగా స్థిరత్వముపొందని పరిశ్రమలలో స్థిరపడిన పరిశ్రమలలోకంటె అదనముగాయిచ్చు నిరుద్యోగ నష్టపరిహారము గ్యారంటీ సాంవత్సరిక వేతనము ప్రవేశపెట్టుట చాలా సులభమని ప్రత్యేకము చెప్పనక్కర్లేదు. కొద్దికాలము పనిచేసే నూది పరిశ్రమలలోను సంఘములు, సంవత్సర గ్యారంటీవేతనముద్వారా కాక, కార్మికుని ప్రతిపత్తిలో అభివృద్ధికై వేతనములు పెరుగుదల, ముసలితనపు పెన్షనులు, ఆరోగ్యము, సెలవునిధులుద్వారా తమ అభివృద్ధి సాధించుట చాలా లాభదాయకముగా ఎంచుచున్నారు. అందరు వేతనములు పొందువారు ఒకసాంవత్సరిక వేతనము ఉండవలసిన ఆవశ్యకతపై ఏకీభవించుచున్నారు.

భవిష్యత్తులో, వృత్తిసంఘములు, తమసభ్యులకు అదనముగావచ్చు నిరుద్యోగ నష్టపరిహారము యిప్పించుటకు లేదా అంతకంటె మెరుగైన గ్యారంటీ సాంవత్సరిక వేతనము యిప్పించునపుడు, సంవత్సరపద్ధతిలో పరిశ్రమ ప్రణాళిక వెయ్యగలశక్తి, అందుకు సంబంధించిన కార్పొరేషన్ల పటిష్ఠత, ఆర్థికస్థితియొక్క ఆరోగ్యము, ఆ ప్రణాళికద్వారా ఎంతమంది కార్మికులు లాభము పొందునది, యింకా చాలా తత్సంబంధమైన సత్య

ములు జాగ్రత్తగా పరిశీలించవలసియున్నది. యఫ్. యల్. సి. ఐ. ఓ. ఆర్థికవేత్త డా॥ బోరిస్ షిష్కిన్ ప్రకారము "గ్యారంటీవేతనము ఆఖరి దశ, ఎక్కువ స్థిరత్వము పొందుటకు ఉపకరించదగ్గ ప్రమాదములు అందరూ గుర్తించవలెను. సాంవత్సరిక గ్యారంటీ వేతనములు, ఇతర ఉద్యోగప్రమాణములు, కష్టపడి సంఘము ఆర్జించిన వేతనము, లేదా మరికొన్ని అదేవిలువకలిగిన కన్సెషన్సు పోగొట్టుకునేలామాత్రము, కావాలని సంప్రదించరాదు. అదేవిధముగా, సాంవత్సరికగ్యారంటీవేతనములలో సంఘముయొక్క ఆత్రుత మరొకదానిపై కేంద్రీకరించి ప్రభుత్వ, ప్రైవేటు విధానములుకలుపు అభివృద్ధిచేయు ప్రాథమికసమస్యను దూరమవరాదు. ఆ సమస్యయే ఆర్థికస్థితిలో ఉద్యోగ స్థిరత్వమునిచ్చి చిరకాల అభ్యుదయమునకు దోహదము చేయగలదు.

యీ సమస్యలన్నీ జాగ్రత్తగా పరిశీలించినపిదప, కొన్నిసంఘములు యీ పద్ధతి అవలంబించవచ్చును. మరికొన్ని సంఘములు బహుశా వచ్చే సంవత్సరములలో, ఏదోఒకరకమైన సాంవత్సరికగ్యారంటీవేతనమునకై ప్రయత్నించవచ్చును. అమెరికను కార్మికులలో, ఎన్నో మిలియన్ల, మనస్సులలో, నిత్యమూ మెదలుతూన్న హఠాత్తుగా పనితొలగివేతలు దురదృష్టకరమైన బీదతనము తగ్గించుటకు యీ సాంవత్సరికగ్యారంటీవేతనము ఒక శుభమైన అంశముకాగలదని వారిభావము.

## 9. సంఘ సంక్షేమ నిధులు

"చివరిలాభములు" (Fringe benifits) అనబడు ఉద్యోగము మానునపుడు పెన్షనులు, ఆరోగ్యసేవలకు భత్యములు, సెలవుభత్యములు మొదలైనవి యిచ్చుటకు, ఆరోగ్యము, సంక్షేమము, రిటైరగునపుడు

ఏర్పడు నిధులవిషయములో ఉమ్మడి బేరము సాగించుట మరొక ఆధునిక పరిణామము. రెండవ మహాసంగ్రామముకాలములో, వేతనములలో పెరుగుదల బహిష్కరించినపుడు, లేదా కొద్దివాటికిమాత్రమే పరిమితము చేసినపుడు వేతనముల పెరుగుదలకు బదులు, సంక్షేమధనములు ఏర్పరుచుటకు యజమానులు అంగీకరించిరి.

## నిధులకు న్యాయరీత్యా పునాది

1948 లో జీవితములో సాధారణముగావచ్చు కష్టములు నెదుర్కొనుటలో రక్షణనిచ్చు కార్మికుల భద్రతా కార్యక్రమములు, ఉమ్మడి బేరమునకు సరైన విషయమని కోర్టులు తీర్మానించినపుడు, రిటైరయిన పారిశ్రామిక కార్మికునకు సంఘపెన్షనునిధి ఒకటి ఉండవలెనని నిర్ణయించబడినది. ఉక్కుపరిశ్రమల ఫేక్ట్సు ఫైండింగ్ బోర్డు నివేదిక కార్మికులు యింతకుముందే ప్రకటించినసూత్రములను మద్దతుయిచ్చి అటువంటి నిధులు పెరుగుటకు యింకా ఎక్కువ ప్రోత్సాహము యిచ్చినది. ప్రైవేటు పరిశ్రమలో ఆ రోజునుంచి పెన్షను కార్యక్రమములను ప్రమాణముగా పెట్టుకుని యితర కార్యక్రమములను నడుపుచుండెను. టాఫ్ట్ హార్ట్లేచట్టము ప్రకారము సంక్షేమనిధులు యజమానులు కార్మికులుకలిసి పరిపాలించవలెను.

1955 లో యు. యస్. బ్యూరో ఆఫ్ లేబరు స్టేటిస్టిక్సుకొరకు ఈవన్ కీత్ కోవ్ చేసిన పరిశీలన నివేదిక "సంఘ ఒడంబడికలతో ఆరోగ్యము, ఇన్సూరెన్సు, పెన్షనుప్రణాళికలు" లో చెప్పినదేమన, అధమము 11,290,000 కార్మికులు 1954 లో ఉమ్మడిబేరం ఒడంబడికలలో ఏదో విధముగా ఆరోగ్యము, ఇన్సూరెన్సు, పెన్షనుప్రణాళికలు లాభములు పొందుచున్నారు.

అటువంటి ప్రణాళికలలో 1945 లో ఒక అర్థమిలియను కార్మికులు మాత్రమే లాభములు పొందుచుండిరి.

"ప్రైవేటు ఉద్యోగిలాభముల ప్రణాళికలు" అన్న అంశముపై స్పెషల్ కౌన్సెల్ ఆఫ్ ది న్యూయార్కు స్టేట్ ఇన్సూరెన్సు డిపార్టుమెంటు, నివేదికప్రకారము, యజమానిక్రింద ఉద్యోగులుగానున్న సంఘ

సభ్యులు, యజమానిసంఘములు, లేదా యిద్దరూకలిసి పరిపాలించు ఇన్సూరెన్సు కార్యక్రమములలో పాల్గొన్నవారు 13 మిలియన్లు. పెన్షనునిధుల యొక్క పోగుపడ్డ ఆస్తులఖరీదు యించుమించు 22 నుంచి 25 మిలియను డాలర్లు; సంవత్సరవారీగా యజమానులచే యివ్వబడుసొమ్ము 2.5 నుంచి 3 మిలియను డాలర్లు. 1954 ప్రథమదశల్లో, ఉమ్మడిబేరము ఒడంబడికలలో ఉన్న 70 వ శాతము కార్మికులకు ఇన్సూరెన్సు, ఆరోగ్యము, పెన్షను లాభములలో ఏదోఒకటి దొరకునట్లుగా ఏర్పరచబడినది. కార్మిక యజమానుల సంబంధములలో యజమానులు కార్మికులుకలిసి ఉద్యోగులకు లాభదాయకమైన కార్యక్రమాలు సృష్టించాలని, ప్రస్తుత కార్యక్రమాలు కార్మికయజమానుల ఒడంబడికలలో యిమిడ్చాలనే ఉద్యమము, యుద్ధము తర్వాత ఏర్పడిన ముఖ్యపరిణామములలో ఒకటిగా చెప్పవచ్చును.

## గనికార్మికులు, సూదివృత్తులు, మోటారుకార్మికులు

1948 లో యునైటెడ్ గనికార్మికులలో జరిగిన ఒడంబడికప్రకారము, పరిశ్రమలో 20 సంవత్సరముల సర్వీసు కనీసముఉన్న మట్టితైలగనికార్మికులు, 1946 మే లోపుగా రిటైరుకానిచో, 62 సంవత్సరములవయస్సునకు నెలకు 100 డాలర్ల పెన్షనులు పొందుచున్నారు.

ఈరంగములో నాయకులైన న్యూయార్కులోని అంతర్జాతీయ స్త్రీదుస్తుల కార్మికులు రిటైరుకాగానే నెలకు 50 నుంచి 65 డాలర్లవరకు పొందుచున్నారు. డ్రెస్ మేకర్సు సంయుక్తబోర్డుయొక్క ఒడంబడిక, రిటైరుమెంటునిధి, ఆరోగ్య, సంక్షేమనిధి ఏర్పరుచుచున్నది - రెండవనిధి సంఘసభ్యుల ఆరోగ్యసేవలకు, సెలవులాభములకు, ధనము యిచ్చును.

1955 ఒడంబడికప్రకారము, పన్నులు చెల్లించకముందు తమ ఉద్యోగులు సంపాదించు వారవేతనములలో 8 వ శాతము యీ నిధులకు యజమానులు యిచ్చెదురు. క్లోక్ పరిశ్రమలో మొత్తము వేతనముబిల్లులో 9 వ శాతమువరకు ధనము యివ్వబడుచున్నది.

మోటారు పరిశ్రమలో, యునైటెడ్ ఆటోవర్కర్సు సంప్రదించిన పెన్షను ఒడంబడికలలో యించుమించు 1,100,000 కార్మికులు సహాయము పొందుచున్నారు. 1949 లో రిటైరయ్యాక భద్రతకోసంచేసిన యునైటెడ్

ఆటోవర్కర్సు కార్యక్రమములలోని ప్రాథమికసూత్రములు— మొట్ట మొదటిసారిగా అవలంబించిన వాటిల్లోనివి: పూర్తిగా యజమాని ధన మివ్వవలెను. పరిపూర్ణమైన పునాదిపై లాభములు ధనమునుంచి యివ్వ వలెను; సంఘము యజమానులుకలిసి పాలించవలెను. బేరము చేయబడిన విభాగము లన్నింటిలోఉన్న కార్మికులకు, మునుపటివారి భవిష్యత్తు సర్వీసులయొక్క మొత్తము పరిశీలించి పెన్షనుహక్కులిచ్చుట, వయ స్సులో రిటైరయినపుడు అంగవైకల్యముకలిగినపుడు పెన్షనులిచ్చుట.

ఆరోగ్య భద్రతా కార్యక్రమములనుంచికూడా తనసభ్యులకు, కుటుంబ ములకు, సంఘములు లాభములు సృష్టించును. 1954–55 లో ఆస్పత్రులకు తాత్కాలిక అంగవైకల్యబాధలకు జీవిత యిన్సూరెన్సుకు ఆపరేషన్లమందు లకు, యీ కార్యక్రమములద్వారా మొత్తము కార్మికులు పొందినలాభము 325 మిలియనుడాలర్లు, చాలాకేసులలో అటువంటి ఆరోగ్యరక్షణలో సగముఖర్చుమాత్రమే యజమానులు భరింతురు. డెట్రాయిట్ప్రాంతంలో సంఘము యిదేవిధంగా, రిటైరయిన తన కార్మికులకు వినోద విద్యా విషయకకార్యక్రమములు ఏర్పరుచుచున్నది.

## ప్రభుత్వనిధులకు యిది మారు కాదు

ఉమ్మడిబేరముద్వారా పారిశ్రామికపెన్షనులు తదితర ''చివరి'' లాభ ములు కోరుటద్వారా, ప్రభుత్వపద్ధతులు సరిగాలేనందువల్ల మారుగా వీటిని ప్రోత్సహించుటలేదని, సాంఘికపద్ధతిలో ఎక్కువ భద్రతసృష్టిం చుటకు ఈ కార్యక్రమములు కొనసాగించుచున్నామని కార్మికసంఘము లందరు.

యునైటెడ్ ఆటోవర్కర్సుయొక్క న్యాయవకీలు, లీనార్డు వెస్సరు, యీ విధముగా ప్రకటించెను.

''ఉమ్మడిబేరముద్వారా పెన్షనుపద్ధతులు కావలెనని కోరడంఅంటే, సాంఘికభద్రతకోసం ప్రభుత్వముచేయు కార్యక్రమములలో తక్కువశ్రద్ధ చూపుతున్నట్లుకాదు. అనేకసార్లు ఇంతకుముందే చెప్పినట్లు రిటైరుమెంటు భద్రతకోసం కార్మికులుచేయు కృషిలో రెండు దృక్పథము లున్నవి; ఒకటి శాసనరంగమందు రెండవది; ఉమ్మడిబేరమునందు ప్రజాకార

క్రమము చాలావరకు విఫలమయినాక, ఆ లోపములుమాపి అభివృద్ధిపరుచుటకు ఒక దశాబ్దము జరిపినకృషి తర్వాత కార్మికులభద్రతాసమస్యలు, ఉమ్మడిబేరములలో యిమడ్చబడినది. శాసనరంగమందు యీ ఉద్యమము తగ్గలేదు—ఉమ్మడిబేరగంగమందు జరిపినకృషిఫలితముగా ఆ రంగమందు బలముకలిగి ఎక్కువ విజయము సాధించబడినది.

అధ్యక్షుడు వాల్టర్ పి. రూథర్ యునైటెడ్ ఆటోవర్కర్సుకు సంబంధించినవ్యక్తి ప్రకటనలో యీ విధముగా నున్నది.

“ఉమ్మడిబేరము రంగమందుపొందిన లాభములతోసహా కార్మికుల భద్రతాకార్యక్రమములలో ముఖ్యమైనదిగాఎంచి యింకా ఎక్కువ విశాలమైన జాతీయసాంఘికభద్రతాపద్ధతుల శాసనరంగమందు సాధించుటకు సంఘము తన ఉద్యమమును కొనసాగించినది.

అంతర్జాతీయ స్త్రీదుస్తులకార్మికుల సంఘముయొక్క ఆరోగ్యసంక్షేమనిధుల డైరక్టరు, అడాల్ఫుహెల్డు న్యూయార్కు డ్రెస్సుమేకర్సు గురించి ఆరోగ్యవాహనముల సంఘసైన్యముగురించి తరతరమునకు వ్యాపించిన ఆరోగ్యకేంద్రములగురించి గర్వంగా వ్రాస్తూ “మూడు ప్రైవేటు ఆరోగ్యవర్గములు 60,000 దుస్తులుచేసే కార్మికులకు పుష్కలమైన మందులు, ఆపరేషన్లు తదితర ఆస్పత్రి జాగ్రత్తలు చూపినవి. దీన్నిబట్టి అందరిప్రజలకు సరైన రక్షణయిచ్చుటకు ప్రభుత్వము పూనుకొని దీనిని తీవ్రముగా బలపరుచుటకు ప్రయత్నించవలెను.”

పరిశ్రమలలో చాలాభాగము యీ సంక్షేమనిధులు స్థాపించుటలో అనేక సంకేతిక, సంస్థలసమస్యలు ఉత్పన్నమయినవి. అందులో ఒకటి, లాభములు ఒక్క యజమాని యివ్వవలెనా, లేక కార్మికుడు యజమాని కలిసి యివ్వవలెనా? రెండవది ఆ లాభములు ఎవరు స్వీకరించాలి? అనేక తరగతుల కార్మికులలో యీ సొమ్మును ఏవిధముగా విభజించవలెను?

అనేక నిధులు నడుపబడుతున్నట్లు యవి నీతిగా, నిపుణతలో నడచినపుడు దేశములోని మిలియన్ల కార్మికులు వారి కుటుంబములయొక్క ఆరోగ్యము భద్రత పెంచుటకు పెన్షనులు, ఆరోగ్య తదితర సేవలకు వినియోగింపబడు యీ సంక్షేమనిధులపై చాలవరకు ఆధారపడవచ్చును.

# 10. సంఘము, యజమానులమధ్య సహకారము

గత కొన్ని దశాబ్దములనుంచి కార్మికులను, యజమానులను పరిశీలించిన వారు, వారిద్దరిమధ్య సహకారముగురించి చాలా శ్రద్ధతీసుకొనుచున్నారు. ఎటువంటిబాధ్యతలు యజమానుల కీయవలెను. ఎటువంటి పారిశ్రామిక తీర్పులు యిద్దరూ పంచుకోవలెననుప్రశ్న చాలా కాలమునుంచి ఉత్పన్నమై యున్నది.

వృత్తిసంఘతత్వము ప్రబలినతర్వాత, కార్మికులు చాలాతీర్పులలో పాల్గొన్నారు. అటువంటితీర్పులు మునుపు యజమానులొక్కరే చేయుచుండిరని సర్వవిదితము. ఒక ఒడంబడికను సంప్రదించునపుడు కార్మికులకు ఎంతజీతము యీయవలెను, ఎన్నిగంటలు వారు పనిచేయుదురు, వారి సెలవుదినములకాలము, జీతముతో వారికి దొరకు సెలవు, ఫ్యాక్టరీలలో, దుకాణములలో, ఆఫీసులలో, గనులలో శుభ్రపరిస్థితులు, ఫిర్యాదులనుఏవిధముగా పరిశీలించాలి. ఆరోగ్య, సంక్షేమనిధులకేమి, మరి పరిశ్రమలలో మానవసంబంధములగురించి తదితరవిషయములు, సంఘము యజమానితో సంయుక్తముగా సంప్రదించి నిర్ణయించుచున్నది.

## కార్మికులకు సత్యంతెలుపు అవసరము

కార్మికఉద్యమము పెరిగినకొలది సంఘనాయకులుకూడా కార్మికులు పనిచేయుసంస్థల ఆర్థికపరిస్థితులు తదితరకార్యసమస్యలుగూర్చి తమకు సత్యమైన సమాచారము అందవలసిన అగత్యముందని అనుచున్నారు. అటువంటి సమాచారము తెలియనప్పుడు యాజమాన్యం సమర్థతపై చాల మందికి విశ్వాసము లేకుండాపోవును. అంటే తమ పైఆఫీసరుమీదగాని లేదా పూర్తిసంస్థపైగాని బహుశా మనమందరము ఒక్కొక్కప్పుడు అటువంటి పరిస్థితులే కలిగియుంటిమి. తనకు ఆజ్ఞలిచ్చుమనిషి నిపుణతలేనివాడని తెలిసినప్పుడు ఎవరూ తనలోని చాలామంచిని యివ్వడం సంభవించదు. "మేము సంవత్సరములో పొదుపుచేయుదానికంటె కంపెనీ

ఒక నిమిషంలో ఎక్కువఫోము నిరుపయోగముచేయుచో, మేము అనవసరంగా చావడమెందుకు ? అని కొందరుకార్మికులు గ్రంధకర్తతో అన్నారు.

కొన్నిసమయములలో పెద్దఉద్యోగులు, అంతకంటె పెద్దవారు నిపుణత లేకుండా ఉన్నారు. దానికి మందులేదు. అధ్యక్షుడు బోర్డు డైరక్టర్లు వరకు శిక్షణగాని, కొన్నిసర్దుబాటులుకాని లాభించును. కాని చాలవరకు అన్నివిషయములు నిజంగా తెలియక కార్మికులు అపార్థము చేసుకొందురు. "ఒక పాతయంత్రమును బాగుచేయించుటకు, కొత్తయంత్రముకొను దానికంటె కంపెనీ ఎక్కువ ఖర్చుచేయును. ఇటువంటి మూర్ఖయాజమాన్యాన్ని ఎక్కడా చూడలేదు" అని ఒక యంత్రకార్మికుడు గ్రంధకర్తతో అనెను. తనఅభిప్రాయము కొద్దిమందితో చెప్పి ఊరుకోలేదు. చాలా తీవ్రముగాచెప్పిన ఆవిషయములు, చిన్నగ్రామంలో గోడలుదాటిపోయేంత వేగంగా ఫ్యాక్టరీఅంతటా అవి వ్యాపించిపోయినవి. ఫ్యాక్టరీయొక్క నిజాయితీఅంతా కొంతవరకు దెబ్బతిన్నది.

ఆకంపెనీ మేనేజరుకు అన్నివిషయములు తెలుసునని, ఆశాఖకంతకు క్రొత్తప్లాను, కంపెనీలో క్రొత్తయంత్రములు ఉత్పత్తిపనులు పూర్తి కాగానే తెప్పించదల్చుకున్నాడని, ఆకార్మికుడికి తెలియదు. కార్మికయజమానుల ఉత్పత్తికమిటీలో ఆవిధముగా కార్మికులకు తెలియజేసినపుడు కార్మికుడు ఆశ్చర్యపడిపోయెను. 'ఓ' అలాగా అన్నాడు. ఆ నిమిషంలో యాజమాన్యంగురించి తెలివితెచ్చుకుని తన అభిప్రాయం మార్చుకున్నాడు. అతనికి తదితర ఉద్యోగులకు, అపోహలుఅణగి తమనుంచి మరింతికృషి చూపాలని తెలుసుకున్నారు. తెలియని విమర్శను సహేతుకముగా కార్మికులనుకూడా నిందించలేము. అప్పుడు యంత్రాగారముయొక్క పూర్తి పరిస్థితిని తెల్పుటకు యాజమాన్యము నిశ్చితమైనదని తెలివైన చర్యలు తీసుకోవాలి.

ఇదేసంస్థలో, కార్మికయజమానులకమిటీతో లాభములు వాటాలుగా పంచుకొనడంఉంది. ప్రతిశాఖలో ఒక కార్మికయజమానుల సంయుక్త అధ్యక్షానసడిచే సమాచారసంచిక యివ్వబడుతుంది. అందులో వచ్చిన ఆర్డర్లు, ఉత్పత్తి, వేస్టు మొదలైనవాటి దైనికలెక్కలుకూడా యివ్వబడును.

ఒకసారి ఆ సమాచారసంచిక చదువుతున్న కార్మికుడు ఎదురుగా ఉన్న సూపరింటెండెంటును "కంపెనీ, జీతము లివ్వగలిగినంత సరైన అమ్మకము చేసిందా ?" అని ప్రశ్నలతో నానాఅవస్థపెట్టెను. విషయిములు కాని, లాభములు కాని. కార్మికులలో పంచుగాను కంపెనీకి జీతమునకుసొమ్ము ఎచ్చటనుంచి వచ్చుచున్నదనువిషయము ఏకార్మికుడు పట్టించుకోడు. వేతనములు తక్కువగా ఉన్నప్పుడు, వారికి ఆ వేతనములు స్వర్గమునుంచి గాని, పాతాళమునుంచిగాని ఎక్కడనుంచివచ్చినా ఫర్వాలేదు. వారి మనస్సులో యీ అమ్మకములు, ఆర్డర్లు, ఉత్పత్తి, వారికృషి మొదలైన వేవీ మెదలవు.

నిపుణతకు, ఉత్పత్తిలోనూ, సహకారము కావలసివచ్చినపుడు కంపెనీ విషయములుచెప్పి, తగిన న్యాయమైన వేతనమిచ్చుట ప్రథమకర్తవ్యము. యజమానుల పుస్తకములు కార్మికులుచూచేహక్కు అంతర్జాతీయ స్త్రీ దుస్తుల కార్మికులసంఘమునకు యివ్వబడినది. దానివల్ల ఒడంబడికలలోని అన్నివిషయములు సరిగా జరుగుతున్నట్లు కార్మికులకు తెలియును. రాబర్టు బి. వుల్ఫు నైతవ్యవంతమైన నాయకత్వముక్రింద వాషింగ్టన్, లాంగ్ వ్యూలోని వీయర్ హీజర్ టింబరుకంపెనీయొక్క పల్పు విభాగము ఈ విషయములో ప్రథమచర్యతీసుకొన్నసంస్థ. ఇది యుద్ధపుమధ్యకాలంలో ఒక నిర్ణీతపద్ధతిలో కంపెనీవ్యవహారములన్నీ కార్మికులనుండుఉంచి కంపెనీపనులు విషయంలో బాగునుగురించి సలహాలు అర్థించినది. అభ్యుదయ అంతర్జాతీయ పల్పుబ్రదర్ హుడ్, సల్ఫైట్ మరియు కాగితపుమిల్లు కార్మికులుకలిసి ఒకసహకారసంస్థగా ఏర్పడిరి.

కంపెనీపనిచేయు సమస్యలగూర్చి యజమానులు కార్మికులను తమ విశ్వాసములోనికి తీసుకోలేనందువలన అమెరికా పరిశ్రమలో ఎంతో చెప్పలేనంత వ్యర్థమగుచున్నది. జంతువులనుంచి మనుష్యులను విచక్షణ చేయు మానవసంపత్తికిచెందు సృజనాత్మకబుద్ధి తెలివికి విజ్ఞప్తిచేసినప్పుడు ఉన్నంతఫలితం, ఎంతపర్యవేక్షణఅయినా, ఆజ్ఞలిచ్చినా, వేగంగా పనిచేయని కార్మికులను త్వరితపరిచినా లభించదు. వ్యాపారమునడిపే పనులలోని సత్యములు కార్మికులకు క్షుణ్ణంగా తెలిపినపుడు వారినిజాయితీ నిపుణతకూడా పెరుగును.

## బాల్టిమోర్ ఓహియో దుకాణములు

తమయంత్రాగారములో ఎక్కువ నిపుణతతో పనిచేయడానికి సంఘములు సహాయము చేయవలెనని ఒడంబడికలలో ఒకషరతుకూడా ఉన్నది.

ప్రపంచప్రథమసంగ్రామముతర్వాత అమెరికారాష్ట్రములలో సంఘసహకారము విషయములో చాలా ఆసక్తికలిగించే నూత్నప్రయోగము బి. అండ్ ఓ. ప్లాను అనబడును. 1924లో ఒకసమ్మె జరిగినపిదప అప్పుడు అంతర్జాతీయ యంత్రకార్మికులసంఘము అధ్యక్షుడైన డబ్ల్యు డబ్ల్యు జాన్‌స్టన్ చైతన్యవంతమైన నాయకత్వముక్రింద బాల్టిమోర్ ఓహియో రైల్‌రోడ్డు, ఎ. యఫ్. యల్. వృత్తిసంఘములన్నీకలిసియున్న షాప్‌క్రాఫ్ట్స్ ఆర్గనైజేషనుయొక్క అధ్యక్షుడు డేనియల్ విలార్డు ఒక ఒడంబడికలో చేరెను. అందులో వేతనములు, గంటలు, ఫిర్యాదులు పరిష్కరించుట మొదలగువాటిపై షరతులేగాక, దుకాణములలో నిపుణతపెంచుటకు సంఘసహకారముకూడా ప్రతిపాదించెను. బాల్టిమోర్ ఓహియోరైల్‌రోడ్డుశాఖలలోకూడా యిది అమలుజరుగునట్లు యీప్రణాళిక విస్తరించబడెను. చికాగో అండ్ నార్త వెస్టర్న్ రైలురోడ్డు, కెనెడియన్ నేషనల్ రైలురోడ్డుకూడా యిది అవలంబించెను.

ఒట్టో. యస్. బేయర్ జూనియర్ అనే ఒక సంప్రదింపుల ఇంజనీరు యీ ప్రణాళిక అమలుజరుపుటలో సంఘములకు సహాయముచేయమని నియమించబడెను. ప్రతీజిల్లాకు సంయుక్త సహకారకములు ఏర్పరచబడినవి. ఒక "సహకారకమిటీపద్ధతి" అమలులోకి వచ్చెను. అందులో కార్మికసంఘములు, యజమానుల ప్రతినిధులుఉండి నిత్యమూ జరుగు సమావేశములలో పరస్పరం సహాయముచేసుకొనుభావనతోనేగాని, ఒకర తప్పులు ఒకరు పట్టుకోవాలన్న ఉద్దేశ్యంతోగాక కలిసి ఆర్థికస్థితి అభివృద్ధిచేయుటకు దుకాణము నడుపుటలో యింకా నిపుణత ప్రదర్శించుటకు వివిధసూచనలు చర్చింతురు. ఈ సమావేశములలో చర్చించువిషయములు; వస్తువులు జాగ్రత్తపెట్టి నిల్వఉంచుట, పనిముట్లు సరఫరా, యంత్రములు నడపుట, క్రేన్‌సర్వీసు దుకాణములలో పనులు నియమించుట, విభజన, ఫ్లోటుమీద ప్రయాణీకుల కార్లను బాగుచేయుచర్యలు చిన్నచిన్న తునకల పర్యవేక్షణ, ఉపయోగించదగు వస్తువులను తిరిగివాడే

పద్ధతి, దుకాణముసందలి తదితరచోట్ల వివిధపరతులు మున్నగునవి అన్ని సూచనలు క్షుణ్ణంగా చర్చించబడును. అవలంబించుటకు వీలుకానివి తొలగించబడును. యాజమాన్యమునకు తుదకు సిఫార్సులు చేయబడును.

ఈ ప్రణాళిక కొన్ని సత్ఫలితములు చూపడం మొదలుపెట్టినాక అధ్యక్షుడు విలియమ్ చాలాసంతోషము వ్యక్తపరచెను. నిపుణతతో పనిచేసే బాధ్యతలు నిర్ణీతపద్ధతిలో పంచుకుంటున్న ఉద్యోగులలో పెరిగిన నిజాయితీ అందరిదృష్టికి తీసుకువచ్చెను. ఆయన అన్నారు. "ఇటువంటి ఏర్పాటు తాను చేస్తున్న పనియొక్క ప్రాముఖ్యతను ఉద్ఘాటిస్తుంది. తనపదవితో ఉండే బాధ్యతను గుర్తుకు తెస్తుంది. మంచి మొత్తములో మంచి వేతనములు తనపనిఫలితముగా పొందుతున్నందుకు నమ్మకమైన వ్యక్తిగా తనవిద్యుక్తధర్మము మంచిగా పనిచేయడమని కాకుండా బాధ్యతనర్థంచేసుకుని వ్యక్తిగతంగా మంచిగా పనిచేయడం, నమ్మకమైన పనిచేయడం ముఖ్యమని తెలుస్తుంది. రైలురోడ్డు భద్రతలో మంచిగా నడుచుటలో యాజమాన్యముతో బాధ్యతలు పంచుకున్నట్లు గుర్తించి మంచిగా పనిచేయాలని కార్మికుడు కోరుతాడు."

1956 ఏప్రిల్ 2 వ తారీఖు ఉత్తరంలో బాల్టిమోర్ అండ్ ఓహియో రైలుబోర్డు అధ్యక్షుడు హెచ్. ఇ. సింప్సన్ వే శాఖలోని ట్రాన్సుపోర్టేషను మైన్ టెనెన్సులోను మోటివ్ పవర్ డిపార్టుమెంటులోను, ప్రణాళిక మొదటినుంచి యీ లేఖ తేదీవరకు కోపరేటివ్ షాపుప్లానుయొక్క ఫలితములను క్రోడీకరించెను.

మోటివ్ పవర్ డిపార్టుమెంటులో ఫలితములు యీదిగువ నుదహరించియున్నవి.

1924 మార్చి 5 నుంచి 1956 ఏప్రిల్ ఒకటివరకు కోఆపరేటివ్ కమిటీలలో స్వీకరించి చర్చించబడిన సూచనల సారాంశము:—

| | |
|---|---|
| జరిగిన సమావేశములసంఖ్య | 18,667 |
| హాజరైన యజమానుల ప్రతినిధులసంఖ్య | 81,105 |
| హాజరైన ఉద్యోగుల ప్రతినిధులసంఖ్య | 112,754 |
| స్వీకరింపబడి, చర్చించబడిన సూచనలసంఖ్య | 41,151 |
| అమలుజరిపిన సూచనలసంఖ్య | 35,485 |

| | |
|---|---|
| పరిశీలనలోఉన్నసంఖ్య | 324 |
| ఖర్చున్యాయముకాదని, వాయిదావేయబడినవాటిసంఖ్య | 1,471 |
| అమలుజరుపుట సాధ్యముకాదనీ వదిలివేసినవాటిసంఖ్య | 3,850, |

## రెండవ ప్రపంచ సంగ్రామమునకు పూర్వము

రెండవ ప్రపంచసంగ్రామమునకు పూర్వము ముఖ్యంగా రైలురోడ్డు దుస్తులు, నేత, ముద్రాపకపరిశ్రమలు, యంత్రాలదుకాణములు, కొన్ని ఉక్కుయంత్రాగారములు, రాకీమాంటెన్ బొగ్గుకంపెనీ మరియు టెన్నెస్సీ వేలీ అధారటీలలో సహకారపద్ధతి ప్రయోగములు కొన్నిజరిగినవి. ప్రథమ ప్రపంచసంగ్రామముకాలములో వెస్టింగ్ హౌస్ ఎలక్ట్రిక్ కార్పొరేషను (స్ప్రింగ్ ఫీల్డు) మసాచుసెట్సు, ది డోలర్ జార్విస్ కార్పొరేషను, రాక్ ఐలండు ఆర్సెనాల్ మొదలైనవాటిని తప్పిస్తే చిన్నపారిశ్రామిక భాగములలోనే నిపుణవృత్తులనుంచి వచ్చిన మనుషులతో కూడిన దుకాణములలోనూ యీ ప్రయోగములు కొన్నిసాగినవి.

డొరోథియాడి స్క్వానిడ్జ్ ప్రకారము యాజమాన్య సంఘసహకారమునకు సంబంధించిన చాలాప్రయోగములు, ఎక్కువ ఖర్చుకలిగిన యంత్రాగారములలోగాని, దివాలాప్రమాదములోఉండి పోటీ పరిస్థితులు వరుసగా నెదుర్కొను కంపెనీలలోగాని కనిపించుచుండెను. కొన్ని ప్రయోగములు గుణముపెంచుటకు, మరికొన్ని పని ఏర్పాటులలోని సమస్యలు సాధించుటకు వాడబడినవి. ఖర్చులు తక్కువచేయవలెనని యజమానుల ప్రయత్నము. తనవేతనములు సరిగా పుచ్చుకోవలెనని నిరుద్యోగము తగ్గించవలెనని లేదా యూనియన్ షాపులోకాని సంఘములు ఏర్పరిచిన పరిశ్రమలలోకాని ఉద్యోగములు పెంచవలెనని కార్మికుల ప్రయత్నము" (డొరోథియాడి స్క్వానిట్జ్ లేబరు మేనేజిమెంటు ఇన్ ఎ కామన్ ఎంటర్ ప్రైజ్ పే 146. హార్వర్డు యూనివర్సిటీప్రెస్.)

## రెండవ ప్రపంచ సంగ్రామము కాలములో

యుద్ధములోనెగ్గు ప్రయత్నములో సహాయకారి కావాలని ఉత్పత్తి యొక్క మొత్తము వేగము ముఖ్యంగా పెరగాలని ప్రభుత్వము అనేకవేల సంయుక్త ఉత్పత్తికమిటీలు సంఘటితపరుచుటకు ప్రోత్సహించెను.

యుద్ధము పూర్తికాకముందే తయారీ పరిశ్రమలందు, గనులలోను దాదాపు 40 వ శాతమువరకు కార్మికులు, కార్మికయజమానులకు సహకారపద్ధతులకు సన్నిహితులైరి. కాని అనేకవేల ఆ కమిటీలలో కొన్నివందలు మాత్రమే సరిగా పనిచేసి కార్మికులకు లాభము చేకూర్చెడివి.

ఈ కమిటీలు తమ సమావేశములలో ఫిర్యాదులను పరిశీలించక, యజమానుల సమస్యలే చాలా పరిశీలించి, వాటి తుదినిర్ణయములు యజమానులకు వదిలివేయును. చర్చించబడే కొన్నివిషయములు యీ దిగువ నున్నవి.

1. ఉద్యోగ విభజన, ప్రమాణములు నిర్ణయించుట.
2. పనిముట్లు, తదితర సాధనములు అభివృద్ధిపరచుట.
3. వస్తువులు సరిగా జాగ్రత్తగాచూచి నిల్వవుంచి అందిచ్చుట.
4. సరఫరాలు, వస్తువులు, పొదుపుగావాడుట.
5. దుకాణములోనిశక్తిని, పనిని, సరిగా సమన్వయ పరచుట.
6. దుకాణములలో పని నిర్ణయించి, సమానపరుచుట.
7. పనినేర్చుకొను వారికి శిక్షణనిచ్చుట.
8. కొత్తఉద్యోగులను చేర్చుకొనుట.
9. పనిగుణమును పెంచుట.
10. వేడిచేయుట, వెలుగు, గాలి, భద్రత మొదలగు వాటివిషయంలో దుకాణములు, దుకాణముల యితరప్రాంతములలో పరిస్థితులు మెరుగుపర్చుట.

యుద్ధపరిశ్రమయొక్క ప్రత్యేక స్వభావములవలన, కమిటీలు, జనాభా మార్పులుకూడా గమనించి తత్సంబంధమైన సమస్యలపైకూడా శ్రద్ధ చూపిరి—ఉదాహరణకు కార్మికుల అలసట, విరామము లేకపోవుట, రవానా, గృహనిర్మాణం, రేషనింగ్, ఆహారం పంపకం—మొదలైనవి.

ఈ కమిటీలు రెండు గొప్పనిర్ణయములు చేసినవి. "తమకు తెలిసిన ఉద్యోగ వ్యవహారములు బాగా చేయుమని అడిగినప్పుడు స్థానికముగా సహాయముచేయు కార్మికులు చాలాయంత్రాగారములలో ఉందురనియు, వ్యాపారమునడుపుటలోని సమస్యలు కార్మికులు క్రమక్రమంగా ఎక్కువగా అర్థము చేసుకోవలెననియు పనిదగ్గర, యింటిదగ్గర, కార్మికులబాధలు యాజమాన్యము యింకా ఎక్కువ అర్థము చేసుకోవలెననియు వారి నిర్ణయ

ములు. యుద్ధపరిశ్రమరోజుల్లో త్వరితంగా మార్పులు సంభవించునప్పుడు శాస్త్రీయంగా కలవడం కష్టమైనప్పటికి యీ కమిటీపద్ధతి ఎక్కువ ఉత్పత్తికి దారితీసినదని చాలామంది యజమానులు ప్రకటించిరి.

## జోస్కాన్లన్ ప్రణాళిక

రెండవప్రపంచసంగ్రామమునుంచి కర్మాగారములలో యజమానులు సంఘములుకలిసి ఎన్నో సంయుక్తకమిటీలు, ఎక్కువ స్థిరత్వము నిపుణత పెంపొందించాలని ఏర్పరిచినవి. యిందులో కొన్ని ప్రణాళికలు కార్మికులు యజమానుల సహకారమునకేగాక పెరిగే లాభములు పంచుకొనుటలోకూడా షరతులు నిర్ణయించినవి. ఒకప్పుడు, అమెరికా యునైటెడ్ స్టీల్ వర్కర్సుకు పరిశోధక డైరక్టరుగా పనిచేసినవాడు తర్వాత మసాచుసెట్సు ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ టెక్నాలజీ ఉద్యోగులలో సభ్యుడుగానూఉన్న కీర్తిశేషుడు జోసెఫ్ యన్. స్కాన్లన్ యిందులో చాలా ప్రణాళికలు నడిపించెను.

అమెరికా యునైటెడ్ స్టీల్ వర్కర్సుయొక్క స్థానికసంఘముయొక్క ముందడుగువల్ల మసాచుసెట్సులోని లెపాయింటి మెషీన్ టూల్ కంపెనీలో యిటువంటి స్కాన్లన్ ప్రణాళిక ఒకటిప్రారంభించబడెను. ఈ ప్రణాళిక అమలులోకి రాకముందు స్థానికసంఘము ఒక విఫలమైన సమ్మె చేసెను. యజమానులు కార్మికులలో పనినిబట్టి వేతనముపద్ధతి అమలు జరిపిరి. అందువల్ల ఉద్యోగాలలో పోటీపెరిగి సమూహంపనికి ఎక్కువ వీలు కాలేకపోయినది. స్థానికసంఘంలోని ఫ్రెడ్ జి లీషియర్ యిలా అన్నారు. "ఈపద్ధతివల్ల ప్రతీకార్మికుడు తనసంగతిగురించిమాత్రమే ఆలోచించుకొనవలసివచ్చెను. దెయ్యంలాపనిచేసేవాడికి ఎక్కువలాభము వచ్చెడిది. అందువలన ఉద్యోగులలో చాలా తీవ్రమైన మనస్పర్థలు చెలరేగెను.

లీషియర్ ప్రకారము "చాలాపనివాళ్ళు పనియొక్కగుణముకు ప్రాధాన్యతయిచ్చుటమానిరి. మాలో చాలామంది యంత్రములగుణముతో ఏమీపట్టించుకోలేదు. మేము నిర్మించే పనిముట్లు లెక్కచెయ్యలేదు. చివరకు ఆ వ్యాపారము విజయముతో సంబంధముపెట్టుకోలేదు. ఇది అంతా యజమానులబాధ్యత. తప్పో రైటో యిది అవసరమని వారు

నమ్మని విషయమని మేము నిర్ణయించుకున్నాం. తప్పకుండా యిటువంటి దృక్పథంలో ఉత్పత్తిగుణంమీద కొంత ప్రభావం చూపించింది."

"యజమానులతో సమావేశములు పరిచయములు, ఫిర్యాదులగురించి, వేతనములలో తేడాగురించి సంఘర్షణవిషయములలోమాత్రమే సాధారణముగా యజమానులు ఒక్క అడుగు ముందుకువేయరు. మేముకూడా అంతే."

"యజమానులు ఒక్కసారి ఓడలకు సరకులనెత్తి వాగ్దానముచేసినట్లు వస్తువులు పంపలేకపోతూండేవారు. చాలామంది కొనుగోలుదారులు మరోచోటికిపోయేవారు. దానివల్ల ఉద్యోగాలు తగ్గిపోయేవి. మేమంతా భద్రత స్థిరత్వము లేనివారమైనాము. నిజంగా అందరూ యజమానులతో సహా నష్టపోసాగారు. ఇటువంటి పరిస్థితులు అనంతంగా కొనసాగరాదని సంఘఆఫీసర్లు గుర్తించిరి.

స్కాన్లను ప్రణాళికవిని, అతన్నిచేరి, సంఘంఆఫీసర్లు సహాయము చేయని, యజమానులతో ఒక ఒడంబడిక చేసుకొనిరి. సంఘముతో కలుగ చేసుకొనమని యజమానులు, యజమానులతోకలిసి పనిచేయుదామని కార్మికులు ఒప్పుకొనిరి. కొన్నిసంవత్సరములవరకుఉన్న జీతములపట్టిక, ఖర్చుల రికార్డులు పరిశీలించవలసినదని ఒకసంయుక్తకమిటీ ఏర్పరచబడినది. ఆ పరిశీలనవల్ల, కార్మికులపై ఖర్చుకు, కంపెనీవస్తువుల అమ్మకపు విలువకు ఒక నిష్పత్తి కనుగొనబడినది.

ఎక్కువగా కార్మికులపై ఖర్చుపెట్టకుండా, ఎంత ఉత్పత్తి పెరిగినను ఆ ఉత్పత్తితేడా విలువను, ప్రతినెల కార్మికుల గంటజీతము శాతను ప్రకారము కార్మికులకు యివ్వవలెనని ఒక ఒడంబడిక ఏర్పాటైనది. ఇదే ఇంకొక విధముగా చెప్పాలంటే, పరిశీలనద్వారా కనుగొనబడిన మామూలుకంటె పెరిగిన ఉత్పత్తిలో ఒకశాతమునకు, ఉద్యోగులు తమ వేతనములో ఒకశాతము ఎక్కువపొందుదురు పనినిబట్టి వేతనము నేపద్ధతి, తీసివేయబడెను.

యంత్రాగారము ఏడుశాఖలుగా విభజింపబడెను- ఆఫీసు, ఇంజనీరింగు, కర్మాగారములలో బయట మరి అయిదుశాఖలు—ఇవి ఉత్పత్తికమిటీలు

ఏర్పరచుటకు జరిగిన విభజనలు. ఈకమిటీలలో తమ ప్రతినిధిగా, ఆయా శాఖల తమ పర్యవేక్షకుని నియమించిరి. నెలకు రెండుసారులు ప్రతీ శాఖలో ఆయా కమిటీలు వ్యక్తిగతంగా కలుసుకొనెడివి. ఉద్యోగిచేయు సూచనలు, పర్యవేక్షకుడికి అంగీకారమైనసూచనలు, చర్చించి, ఆయా శాఖల పరిమితిలో అవి అమలు పరుచబడెను. ప్రతీ ఉత్పత్తికమిటీ సభ్యుడు తన తోటివారలలో ఒకరిద్దరిని సమావేశమునకు తీసుకురా వచ్చును. ఈ సూచనలు, ప్రతిపాదనలు ఒక వడపోతసంఘానికి పంపే వారు. ఆ వడపోతసంఘములో కంపెనీకి సంబంధించిన పెద్దఉద్యోగులు, సంఘముకు ప్రతినిధులైనవారు అదే సమానసంఖ్యలో ఉందురు.

వడపోతసంఘముయొక్క మొదటి విద్యుక్తధర్మము మునుపటి నెల రికార్డులు పరిశీలించి, కార్మికులకు బోనసు మొత్తము ప్రకటించుట, అప్పుడు కమిటీ పరిశ్రమసంస్థయొక్క ముందుముందు అభివృద్ధిగురించి చర్చించును. ఆ తర్వాత ఉత్పత్తికమిటీలు యిచ్చిన సూచనలు పరిశీలించును. ఈ సూచనలు అమలు జరుపుట నిర్ణయమయ్యాక, చివరిసారిగా అవి అమలుజరుపు నిర్ణయము, వాటి అనుకూలతలబట్టి, యజమానుల కీయ బడినది.

ప్రణాళికలు అభివృద్ధికి వస్తున్నప్పుడు యజమానులు ఉద్యోగులకు తెలియజేయుచుదురు. తమశాఖకమిటీసభ్యునితో, వ్యర్థవస్తువు తగ్గించుటకు, పనులు యింకా అభివృద్ధిచేయుటకు ఏమన్నా ఆలోచనలుంటే, చర్చించుటకు పూర్తిస్వేచ్ఛ యివ్వబడెను.

ప్రణాళిక మొదటినాల్గుసంవత్సరములందు, 300 ఉద్యోగులు 1050 సూచనలు చేసిరి. ఇందులో 905 ఆమోదించబడి, యజమానులచే అమలు జరుపబడినవి. అందులో 94 తిరస్కరించబడినవి. 51 గురించి ఏమిచర్య తీసుకోవాలో యింకా నిర్ణయించబడలేదు.

"1951 లో మిస్టర్ లీషియర్ యీ విధంగా ప్రకటించెను" యీ సహకారప్రయత్నముయొక్క పర్యవసానము ఉత్పత్తి పెంచుట ఖర్చులు తగ్గించుట అయినది. గంటజీతములకు చేర్చబడిన బోనసు శాతములోనే యీలాభము ప్రతిబింబించబడినది. ఈలాభము 1 శాతమునుంచి 37 శాతము వరకు యున్నది. 1956 లో సరాసరిశాతము యించుమించుగా 17%"

1947 నుంచి 1951 వరకు ఆఫీసుఉద్యోగులతో పాటు, అమ్మకవ్యవహారముల విభాగమువరకు, సంఘసభ్యులు 60 శాతమునుంచి 100 శాతము వరకు పెరిగిరి. ఫిర్యాదులుకూడా ఆమధ్యకాలములో తగ్గిపోయినవి. 10 నుంచి 15 వరకు ఉండేఫిర్యాదులు, ఆ నాల్గుసంవత్సరముల కాలములో 5 మాత్రమేయుండెను. మధ్యవర్తిత్వమునకుపోకముందే అన్నీ పరిష్కరించబడెను. ఇరుపక్షములు, ఒకసమస్య ఉత్పన్నంకాగానే న్యాయముగా సమానత్వంతో పరిష్కరించాలనే ఆత్రుత చూపించుటవల్లనే ఈ పరిస్థితులలో మెరుగుకు మార్పువచ్చినది.

మిస్టర్ లీషియర్ అన్నారు. "సంఘసమావేశములకు హాజరీ బాగా ఉండెడిది. ప్రణాళిక అమలుకాలములో కొత్తచర్చలు వచ్చెడివి. ముఖ్యముగా వ్యాపారముయొక్క సమస్యలు, యీసమస్యలపై తీసుకొనే చర్యలు గురించి.

ఈప్రణాళికద్వారా ఆర్థికలాభములువచ్చినను, అవి అంతప్రాముఖ్యము కాదని లీషియర్ అభిప్రాయం. ఆయనన్నారు.

"'లపాయింటి'లోని జనం ఒకరినిగురించి మరొకరు ఆలోచించి, పరస్పరసహాయము చేసుకొనుచున్నారు. అందువల్ల అందరూ లాభము పొందవచ్చని వారు గుర్తించారు. యువజనులు ముసలివారికి సాయముచేయుచుండిరి. ముసలివారు, వారివిద్యలో రహస్యములు అనుభవములు యువజనులకు నేర్పుచుండిరి. స్థానికసంఘములో బలము, పటిష్ఠత, తత్ఫలితముగా పెరిగినది.

"మునుపు మేమున్నచోటికి మళ్ళీ మేము వెళ్ళదల్చుకోలేదు. యంత్రపనిముట్ల పరిశ్రమలో ఏయితరకంపెనీ యించుమించు సరాసరి గంటవేతనముల కంటె ఎక్కువ కాకపోయినా సమానముగానే మాకంపెనీలోకూడా యిచ్చుచున్నట్లు సంఘ ఒడంబడిక సదుపాయముచేయుచున్నది. వేతనములు, గంటలు పనిచేసే పరిస్థితులవిషయంలో మా ఒడంబడిక అన్నిరకముల ప్రమాణయుతషరతులు కలిగియున్నది. ఏ విధమైన నిర్బంధములు లేకుండా మాకు యూనియన్ షాపు వున్నది. ఒక పెన్షను ప్రణాళిక ఉన్నది. పరిశ్రమలో మేము యింటికి తీసుకుపోయేజీతము బహుశా చాలా పెద్దమొత్తము. గత నాల్గుసంవత్సరములలో ఉమ్మడిబేరముతో

యీ ప్రణాళిక ఏ విధముగానూ కలుగజేసుకోలేదు. అసలు అటువంటి దేదైనాఉంటే అది సహాయకారిగానే జరిగినది."

లీషియర్ యింక్సా యిలా అన్నారు. "ఎక్కువగుణముకల్గిన ఉత్పత్తి పెంచుటకు వస్తువుల సరఫరా సకాలములో జరుగుటకు కంపెనీకి ఎంతో సాయము చేసితిమి. పోయినకొనుగోలుదారులు తిరిగివచ్చిరి. క్రొత్తవారు కూడా లభించిరి. దీనికంతకు కారణము, మేమంతా జీవనోపాధిపొందే సంయుక్తచర్యలో ఆత్మగౌరవముకలిసి సమానహోదాపొందిన భాగస్వాములుగా గుర్తించి కలిసిపనిచేయటం నిజంగా నేర్చుకొన్నాము." తుదకు లీషియర్ అన్నారు. ఈ స్కాన్లన్ ప్రణాళికగాని, మరి ఏదిగాని, ఉత్పత్తి పెంచుటవిషయంలో కార్మికులకు, యజమానులకు పనిచేయాలనే హృదయపూర్వక నిశ్చయముంటేగాని, ఏమీ పనిచేయదు. పరస్పరగౌరవము, మంచివిశ్వాసము, వారందరి హృదయాలలోఉంటేగాని యిది వీలుపడదు.

## పారిశ్రామిక ఇంజనీరింగులో సహకారము

యంత్రాగారములకు నిపుణులనుపంపి, వ్యర్థవస్తువు తగ్గించడంలో, సలహాలు అందిచ్చి, మనిషిశక్తి, యంత్రములు ఎక్కువగా ఉపయోగించు విషయంలో తమ సూచన లందించి, అందువలనే ఉద్యోగులకు సంఘ వేతనములిచ్చి, యింకా తదితరలాభములు సమకూర్చడంద్వారా, కొన్నిసంఘముల యజమానులు యింకా నిపుణతతో పనిచేయువిషయంలో ఎక్కువ సాయముచేసినవి.

ఈ రంగములో అమాల్గమేటెడ్ క్లోథింగ్ వర్కర్సు ఆఫ్ అమెరికా అంతర్జాతీయ స్త్రీదుస్తులు పనివారలసంఘము, నాయకులలో కొందరు 1925 లో అమాల్గమేటెడ్ క్లోథింగ్ వర్కర్సు యూనియన్ పక్షాన కార్మిక యజమానులమధ్య సహకారపద్ధతిలో మొదటిచర్య జరిగినది. ఆసంవత్సరములో చికాగోలోని హార్టు, స్కాఫ్నరు, మార్క్సు కొత్తసూట్లు తయారీవిధానసమస్యలు ముఖ్యంగా తక్కువధరగల బజారులతో పోటీ పడునవి కనుగొనవలసివచ్చినది అంటే ఉత్పత్తిధరలలో బాగా తగ్గుదల దుకాణముల పునర్నిర్మాణము, కార్మికులను తగ్గించు యంత్రముల ప్రవేశము, పనిబట్టి తక్కువరేట్లు యిచ్చుపద్ధతి వీటివలనకల్గును.

మగవారిదుస్తుల పరిశ్రమలో నిర్మాణాత్మకమైన సంఘసంబంధములు నిర్మించుటలో ప్రారంభకులైన ఈ కంపెనీ తనకార్మికులలాభములలో ఎక్కువ ఆసక్తిచూపి, యిటువంటి తీవ్రమైనమార్పులు తెచ్చుటకు వెను కంజవేసినది. ఈసమస్యఅంతా సంఘముముందు ఉంచినది. సంఘము, కంపెనీకలిసి ఒక సమన్వయదృక్పథము అవలంబించిరి. పునర్నిర్మాణ ప్రతిపాదనలు, కంపెనీఖర్చులు యిద్దరూ పరిశీలించిరి. ప్రయోగాత్మక దుకాణము ఏర్పరుచుటలో సహకరించిరి. చిరకాలంనుంచిఉన్న సంఘ సంప్రదాయములకు తగుగౌరవముచూపి వాటిని అంగీకరించిరి. పూర్తిపని కల్పిస్తూ ఉత్పత్తిపెరిగేలా పనిబట్టియిచ్చే రేట్లు తగ్గించుటకు అంగీకరించిరి.

కంపెనీకిజరిగిన యితర పాదుపులో ముఖ్యమైనది, సంఘఆఫీసర్లు, కార్మికులలో క్రమశిక్షణ నెలకొల్పి, ఒప్పందమైన ప్రమాణములు, గుణము నిలబెట్టేబాధ్యత తీసుకొనిరి. దీనివలన గుణమును పర్యవేక్షించి ఇన్స్పెక్టరను కంపెనీ తగ్గించినది. బజారు అంతటిలో సంఘం అవలం బించిన అటువంటివిధానములవలన, హార్టు, స్కాఫ్నర్, మార్క్సులలోనే గాక యితరకంపెనీలలోకూడా జయప్రదమైనఫలితములు కనిపించినవి. సంఘములుగా ఏర్పడినసంస్థలలో వ్యాపారాభివృద్ధికి, సంఘసభ్యుల ఆదాయ ములు, ప్రమాణములు అభివృద్ధిచేయుటలోనూ, యీ విధానము చాలా తోడ్పడినది. కొన్నిచోట్ల అవసరములుఉన్న యజమానులకు సంఘములు అప్పులుకూడా యిచ్చినవి. బ్యాంకులనుంచి యింకా ఎక్కువ అప్పుపుట్టే టట్లు పటుత్వమైనసంస్థలకు సహాయము చేసినవి.

1956 మార్చిలో నేతకార్మికులసంఘము, బ్రూక్సైడ్ మిల్లు (నాక్స్విల్లి) టెన్నిస్సీతో ఒక ఒప్పందమునకు వచ్చెను. దానిప్రకారము ఒక ఆరు సంవత్సరములు జయప్రదముగా నిర్వహింపబడినతర్వాత వేతనములో యివ్వబడిన 5% తగ్గింపు క్రమముగా పూడ్చబడును. కంపెనీ, సంఘము చేసిన సంయుక్తప్రకటనలో తనఅభ్యుదయ కార్యక్రమములు కొన సాగించుటకు యీ ప్రత్యేకసదుపాయము కల్గించామని చెప్పబడినది. తదితర నేతకంపెనీలతో పోటీచేసి పరిస్థితులు కల్పించుటకు యీ అభ్యు దయకార్యక్రమము పూర్తిగావలెనని గుర్తించి యీ సదుపాయము చేయ బడినది.

## సంఘం ఇంజనీరింగు శాఖ

అంతర్జాతీయ స్త్రీదుస్తుల కార్మికులసంఘము, ఎక్కువ నిపుణతకు సంఘ సహకారమిచ్చిన సంఘములలో అగ్రస్థానము వహించుచున్నది. 1941 లో యీ సంఘము యజమానుల ఇంజనీరింగు విభాగమొకటి ప్రత్యేకంగా స్థాపించెను. దీనిడైరెక్టరు విలియమ్ గోమ్‌బెర్గు. అందులో పని చేయువారు ఆర్గురు ఇంజనీర్లు. ఈశాఖయొక్క హెడ్ క్వార్టర్సుఆఫీసులో కదలికకాలము పరిశీలించి కదిపే పరిశోధనశాల ఒకటిఉన్నది. ఆపరిశోధనశాలలోఅన్నిహంగులుకల్గిన పెద్దపెట్టెతో, సినీకమేరాలు, ప్రొజెక్టర్లు, సింక్ కౌంటర్సు, స్టాప్ వాచీలు, డ్రాఫ్టింగ్ బోర్డు, టైమ్‌ట్రావెల్ టేపు, స్కేట్లు, టైప్రిపాడ్సుకూడా ఉన్నవి.

సంఘముతో ఒడంబడికలున్న యజమానులకు యీశాఖ ఉచితముగా పనిచేయును. రంగములో తక్షణము పనిచేయుటకు, స్థానికసంఘం ఆఫీసరు, యజమానులు కోరినచో తక్షణము అంగీకరించును. దానివల్ల సంప్రదింపులలో పనిబట్టి రేట్లుయిచ్చు సమస్యల పరిష్కారంలో ప్రతిష్టంభనలు తొలగించవచ్చును. ప్రతీదుస్తులశాఖలో కార్మికవ్యాపారముల గూర్చి ప్రమాణాత్మకవివరాలుకల్గిన ఒకగ్రంథాలయముకూడా అది నెలకొల్పినది.

ఒక కర్మాగారమువద్ద ఆ యింజనీర్లవర్గమురాగానే ఆశాఖతో పని చేయుటకు యజమానులు ఒకనిని, సంఘము షాప్ కమిటీనుంచి మరొకనిని నియమించును. తగిన చార్టుప్రకారం, దుకాణముయొక్క మొత్తము ఉత్పత్తిగురించి, షెడ్యూలు, రవానా, పోస్టుచేయుట మొదలైనవి పరిశీలించి సరిగా విభజింపబడును. క్రొత్త ఎక్కువ ఉపయోగకరమైన చర్యలు రూపొందినాక యజమానుల ప్రతినిధి సంఘముల ప్రతినిధికి తగు శిక్షణ ఆ పద్ధతిలో యిచ్చుదురు. ఆ సంఘం ఇంజనీర్లు వెళ్ళాక ఆపద్ధతులు దుకాణములో అమలుజరుపబడును. సాధారణముగా సంప్రదించుపద్ధతి ప్రకారము, ఆశాఖ ఇంజనీర్లు అప్పుడప్పుడువచ్చి దానిని పరీక్షించుదురు. యంత్రాగారము మేనేజరుకు, స్థానికసంఘంమేనేజరుకు ఇంజనీరింగుశాఖ నివేదిక కాపీలు యివ్వబడును.

చాలా కేసులలో, సమ్మెలు లాకౌట్లు కలిగించే కొన్ని సమస్యలకు నిర్మాణాత్మకమైన పరిష్కారములు పరిశోధించబడెను. కార్మికుల సంపాదన వృద్ధిపరుస్తూ, యజమానికి సంతృప్తికరమైనలాభములుయిచ్చే కొన్ని వ్యాపారపద్ధతులు కొన్ని బాగుచేయబడెను.

మునుపటి డైరెక్టరు డా॥ విలియమ్ గోంబెర్గు యీవిధముగా అనెను. "సమాచారములు సేకరించుటలో శాస్త్రీయముగా ఉండుట, మాకోరికల విషయంలో కంపెనీతో న్యాయముగా ఉండుట మాలక్ష్యము, బాతును చంపి, గ్రుడ్లుపొందుట చాలాకష్టము."

## ఉక్కుపరిశ్రమలో సహకారము

ఫిలిప్ ముర్రేనాయకత్వములో ఉక్కుకార్మికుల నిర్వాహకకమిటీ తన ప్రథమదశలలో సంయుక్తపరిశోధనద్వారా, ఉత్పత్తి నిపుణత పెంచు పద్ధతులద్వారా కార్మిక, యజమానుల సహకారము పెంపొందించుటకు సిద్ధపడెను. అప్పుడు ఒడంబడికలోఉన్న అన్నికంపెనీల అన్నిస్థానిక సంఘములకు, సంఘము "ఉత్పత్తిసమస్యలు" అనే ఒక చిన్నపుస్తకము పంపెనది.

కంపెనీ అనుకూలతచూపినచోట్ల తన పరిశోధకకమిటీద్వారా ఉత్పత్తి ఖర్చులు, వ్యాపారపద్ధతులు, వ్యర్థవస్తువు ఎక్కువ ఉత్పత్తికలిగించుటకు వీలైనపద్ధతులు, సంయుక్తముగా పరిశోధించుటకు యజమానులతో సంఘము చేతులుకలిపెను. చాలా ఉక్కుమిల్లులలో చెప్పదగిన విజయము ఈప్రణాళికద్వారా కనిపించినది. "ది డైనమిక్సు ఆఫ్ ఇండస్ట్రియల్ డెమోక్రసీ" అనే గ్రంథములో అప్పుడు సంఘములోని ఆఫీసర్లు క్లింటన్ యస్. గోల్డన్ మరియు హెరాల్డు జె రట్టెన్‌బర్గు, దీనికి సంబంధించిన అమలులో కనిపించు ఫలితములు వర్ణించిరి. ఈప్రణాళిక అవలంబించినప్పుడు దివాలాకు సిద్ధముగాఉన్న "కేంద్ర ఉక్కుకంపెనీ"ని ఒక ఉదాహరణగా పేర్కొనబడినది. సంఘపరిశోధకకమిటీసలహావల్ల నియోబ్రో సున్నంబకాలు మూతలేని అగ్నికొలిమిలలో గులకసున్నము వాడబడుచున్నది. ఒకవారము ప్రయోగములతర్వాత టన్నుకు మూడుగాలన్ల ఆయిలు తగ్గునట్లు ఫలితములు కనిపెంచినవి. సున్నంఖర్చుమాత్రము అంతే

ఉండినది. కారణము ఎక్కువగుణము కల్గినచున్నము వాడబడుచున్నది. సంవత్సరమునకు ఆయిలు ఖర్చులోనే 6,800 డాలర్ల పొదుపు చేయబడెను.

"యూనియన్ షాపు" కానివాటిల్లో ఉద్యోగులనుంచివచ్చే సలహాలను నగదు బహుమతులుయిచ్చే దానికంటె పూర్తిగా గుర్తింపబడిన సంఘము పనిచేసేటప్పుడు ఉత్పత్తిఖర్చులుతగ్గి నిపుణత పెరుగునని యీ గ్రంథ కర్తలు సూచించుచున్నారు. "యూనియన్ షాపు"లో సంఘము, యజమానుల సహకారమువల్ల లభించిన పొదుపుసొమ్ము, యజమానులు, కార్మికులు పంచుగొందురనేదే మొట్టమొదటి విభేదము. ఏమార్పువచ్చినా ఎవరూ తన ఉద్యోగము పోగొట్టుకోరనే ప్రాథమికఅంశమే, ముందుగా ఒప్పుకోబడును. దీనిని సాధించుటకు మార్గము; తక్కినశాఖలలో కొందరి ఉద్యోగులకు తిరిగి శిక్షణయిచ్చుట; మందముగాఉన్నదానిని దాటు కుంటూ సహజమైన ఉత్పత్తిని పొందుటకు ప్రయత్నించుట, మార్పుల వల్ల ఉద్యోగములుపోయిన వారిబదులు వారిని మళ్ళీ పనిలోనికి తీసు కొనుదాకా క్రొత్త ఉద్యోగులను పనిలోకి తీసుకొనకుండుట. కొత్తగా చేసిన బాగు, మార్పులవల్ల ఉద్యోగులవర్గమునకు ఏవిధముగానూ హాని కలగ కుండుటయే దీనిఅర్థము. అందువల్ల వారు సహకరించుటకు వెనుకంజ వేయరు. లేకపోతే ఇటువంటి రక్షణలులేనిచోట యూనియన్ షాపు కానిచోట ప్రజాభిప్రాయం ఉద్యోగుని చాలా అనుఖవంతునిగా చేయును. అందువల్ల తోటిఉద్యోగులు పనిలోంచిపోవుదురనేభావం అత నికి కల్గితే, అది అతని మనస్సును పట్టివేయును.

ఎ. యఫ్. యల్. సి. ఐ. ఓ సంస్థలు సమాఖ్యగా ఏర్పడకముందు; కార్పొరేషను ఎకౌంట్సు పరిశీలించుటలోనూ ఎక్కువ కౌశలము కార్మికులలో కలుగచేయుటయందు చాలావిభాగములలో నలభైకిపైగా యింజనీర్లు, నిపుణులు అమెరికా లేబరు సమాఖ్యలో ఉండెడివారు.

## ప్రత్యేక కమిటీలద్వారా ఫిర్యాదుల పరిశీలన

కార్మికుల యజమానులుమధ్య సహకారము వర్గసమావేశములలో సం యుక్త ఉత్పత్తికమిటీలద్వారా విజయవంతమగుటకు ప్రథమషరతు ఏమన ఉత్పత్తి, క్రియలలో వారు పూర్తిగా శ్రద్ధవహించవలెను. వేతనముల మీద, పనిచేసే పరిస్థితులగురించివచ్చిన ఫిర్యాదులు, జరుపుసంప్రదింపులు

కంపెనీ, సంఘముల ఫిర్యాదు, సంప్రదింపులకమిటీకి సూచించవలెను. ఈ రెండుకమిటీలలో సభ్యులు ఒకరైనను ఫర్వాలేదు. ఈమానసిక వ్యవధ ములు రెండు కలిపివేయకూడదు. ఫిర్యాదులు, పంశీలన, సంప్రదింపులు జరుగుకాలములో, తనపక్షమునకు ఏది న్యాయమో, అది పొందుటకు కంపెనీ, సంఘము ప్రతినిధులు దానిపై శ్రద్ధవహింతురు. నిజంగా దీని వలననే సంఘటితకార్మికులు, యజమానులు, ఒడంబడిక కాలములో వివాదా స్పదవిషయములు వచ్చినపుడు కలుసుకొనుటయే చేయుచో మృతసమ యంలో చనిపోయినవాని ఆస్తివిషయములు చర్చించుటకు చేరే దూరపు బంధువులవలెఉండి కలిసిపనిచేయునట్లు కనిపించుచుందురు. కంపెనీ, సంఘ సమావేశములు తరుచుగాజరిపి ప్రేతకర్మచేయించువానివలెకాక, ముందు గానే పురోగమిస్తూంటే పూర్తిపారిశ్రామికపద్ధతులలో నూతన చైతన్యం తెలివి కల్గించుచో పరిశ్రమ చచ్చిపోయినదానిమోస్తరు తయారు కాదు.

## కార్మిక నాయకత్వములో పోకడలు

సంఘనాయకత్వములో ఉత్తమతరగతి పరిణామములో, సంఘములు, యజమానులమధ్య సహకారసంబంధములు, సహాయకారియగును. సంఘము లను తప్పించి తిరుగుటకు యజమానులు ప్రయత్నించుచో సంఘనాయకులు అనుమానాలు పెంపొందించుకుని యజమానులకు చాలాకష్టము కలిగించు దురు. లేకపోతే నిత్యమైన సహకారసంబంధములు పరిశ్రమ ఏర్పాటు చేసుకుని సంయుక్తశాస్త్రీయపరిశోధనద్వారా చర్చలద్వారా సమస్యలు పరిష్కరించుకోగల్గినపుడు ఆపరిస్థితియే కార్మికనాయకులలో మార్పు తెచ్చి వారిని వాస్తవికంగా సహేతుకంగా సరిదిద్దుబాటులతోను ప్రవర్తించేలా చేయగలదు.

## ప్రజాస్వామ్య విశిష్టత

అమెరికా యునైటెడ్ ఉక్కుకార్మికుల ఉపాధ్యక్షుడు క్లిన్టన్ యస్. గోల్డెను సంఘ, యజమానులు సహకారముగురించి యీవిధముగా ప్రకటించెను. "యీ సాహసవ్యాపారములలో సంబంధించి పాల్గొనే వారందరిలో పరస్పరగౌరవం, విశ్వాసము, భద్రతకలుగు వాతావరణమే సృష్టించి నియంతృత్వపద్ధతిలో తీర్పులునిచ్చుదానికంటె ఆ రంగములోని

యజమానుల, కార్మికుల మానవశక్తులన్నీ ఉపయోగించగల్గునదియే శ్రేష్ఠము. ఉత్తేజము మానసప్రకోపము కలిగించు తన "ది న్యూ సొసైటీ" అనే గ్రంథములో పీటర్ డ్రకర్ యీ విధముగా సూచించెను. "మన పటి ఉత్పత్తి పద్ధతు లన్నింటికంటె నిజంగా ఎక్కువ ఉత్పత్తి నిపుణత ఉండాలంటే ఈ సాహసవ్యాపారములో ప్రతీసభ్యుని సహకారం, ముం దంజ, శక్తియుక్తులు ముఖ్యంగా ఉండాలి. మానవశక్తులు అన్నింటికంటె పెద్దఆస్తి. దానినే సాధారణంగా తక్కువగా వాడెదరు."

ప్రజాస్వామ్యపారిశ్రామికసమాజం పురోగమించుటకు ఇటువంటి సహ కారంతో నిజమైన విశిష్ఠతవున్నది. కార్మికులలో యిది మానవప్రతిష్ఠ పెంపొందింపచేయును.

క్లింటన్ గోల్డెన్ చెప్పినట్లు యజమానుల కార్మికుల సహకారముక్రింద "తనకు మంచిజీతము, వ్యక్తిగత సంతృప్తియిచ్చుపనులు కార్యక్రమములో పూర్తిగాచేరి పనిచేసి లీనమయ్యేభావన వ్యక్తిగతంగా కార్మికుడు పొంద గల్గును. తనపైఉన్న ఏదో మహత్తర అవతారశక్తికి లోబడి ఉన్నామనే భావనలుదులు సమాన ప్రతిపత్తితో, సర్వసాధారణ కార్యక్రమములలో తనంతతానైనా, భావగర్భితమైన వాటాదారుడిగాఉన్నచో కార్మికులు చాలా సంతోషించుదురు.

## సంప్రదింపుల, తీర్పులుచేయుట – కలిసి నిర్ణయించుట

సంయుక్తకమిటీ చాలవరకు తమ స్వభావములో సంప్రదింపులకు సలహా లకు ఉపయోగించును. ఉత్పత్తిరీతి, మొత్తము వస్తువును ఏవిధంగా అమ్మవలెను, సంస్థను ఆర్థికముగా ఏవిధంగా సాయముచేయవలెను మొద లైనవాటిపై నిర్ణయములు యాజమాన్యమునకే వదిలివేయబడును. ఈకార్మిక యజమానసంఘములు తీర్పులిచ్చే కమిటీలుగా వ్యవహరించే కాలం వస్తుందా ?

రూర్సు భారీపరిశ్రమకు యుద్ధానంతర జర్మనీలో కలిసి నిర్ణయించు శాసనములుచేయు ప్రణాళికలో యజమానులలో సమానహోదా, శక్తి కలిగిన పరిశ్రమ పరిపాలకసంఘములలో కార్మిక ప్రతినిధులుకూడా కూర్చుందురు.

1951 లో జరిగిన సి. ఐ. ఓ. సదస్సులో కలిసి నిర్ణయించుట అనే భావమునకు సానుభూతికరమైన ఆదరణతో కూడిన తీర్మానము చేయబడినది. దానిలో యీవిధముగా ఉన్నది.

"ప్రజాస్వామ్యపద్ధతిలో కలిసి నిర్ణయించు దృక్పధములోనికి తీసుకు రావలసిన పారిశ్రామిక విధానాలు ఏవన కొనుగోలుశక్తిని రక్షించుటకు ధరల పెరుగుదలనుంచి రక్షించుకొనుటకు, స్థిరమైన ధరపరిమితులు; ఉత్పత్తి స్థాయిలమీద, పెట్టుబడి మొత్తములరేట్లు, స్వభావము, సాంకేతిక మార్పులలో రేటు, స్వభావము, పారిశ్రామిక యంత్రముల పరిమాణము, స్థలము, సహజశక్తులను సంరక్షించి అభివృద్ధిపరచుట మొదలగు వాటిపై సరైన తీర్పులు."

ఈ తీర్మానము ప్రతిపాదించి ఆమోదించమని కోరుతూ, కీర్తిశేషుడైన సి. ఐ. ఓ. అధ్యక్షుడు ఫిలిప్ ముర్రే యీవిధముగా అనెను.

"ఈ ప్రణాళిక జర్మనీలో అమలు పరచబడిన ప్రణాళికతో సరిగా చేయవలెనని ఉన్నది గాని. అమెరికాపరిశ్రమను సోషలిజంపద్ధతిలో యిది నడిపించదు. రేపు దృష్టిలో పెట్టుకుని మనభావములలో కొంత నూత్నమైన దృక్పధప్రదర్శన ఉండవలసిన కాలమాసన్నమైనదని నా నమ్మకము."

"బిజినెస్ వీక్" అనే పత్రిక యీ తీర్మానమును విమర్శచేసినది. అందులో "యిది సోషలిజం కాకపోయినా, పెట్టుబడిదారీ విధానము మాత్రము తప్పకుండాకాదు. ఇందులోని సారము, యజమానిమాత్రమే యీ సాహసవ్యాపారము నడిపించువాడని."

దీనికి సమాధానంగా కార్మికసంపాదకుడు, ఆర్థికవేత్త అయిన జె. బి. యస్. హార్డుమన్ యిలా అనెను.

"ఫిలిప్ ముర్రే సూచించినప్రకారము అమలుజరిగినచో అంటే అమెరికను కార్మికప్రతినిధులు యజమానుల పాలకసంఘములలో యజమానులతో సమానహక్కులతో కూర్చున్నచో—మునుపు మనకు తెలిసినట్లు పెట్టుబడిదారీవిధానము అదేవిధంగా ఉండదు. మన తండ్రులకాలము వాటి పెట్టుబడిదారీవిధానమువలెనే నేటి పెట్టుబడిదారీవిధానమున్నదా?

మార్పులేకుండా యిప్పుడున్న మానవులు చేసుకున్న ఏర్పాటు కలకాలము ఉండిపోతుంది. ఈ తరములో భౌతిక వాస్తవికతలలోను, ఆ వాస్తవికతలు ఏర్పరచు మానవసంబంధములలోను జరిగేమార్పులలో త్వరగా ఆశ్చర్యకరంగా సరిదిద్దుకుంటున్నట్లు అధమం కనిపిస్తోంది.”

అభ్యుదయ పరిశ్రమవ్యవహారాల్లో సంయుక్తసంప్రదింపులు, సంయుక్త నిర్ణయాలు విషయంలో యింకా ఏ యితరచర్యలు చేయబడునో ప్రజాస్వామ్యసాంఘిక అభివృద్ధి పరిశీలించే ప్రతీవిద్యార్థి జాగ్రత్తగా చూచుటకు వేచియుండును.

# 11 లాభముల వాటాలు

ఒకసంస్థలో యజమాని కార్మికునిమధ్య వాటాదారుతనం భావన పెంపొందించుటకు పరిశ్రమలో ఎక్కువవాటాఫలితములు కార్మికులకు వాగ్దానము చేయుటకు సూచించినమార్గములలో ఒకటి లాభములు పంచుకొనుట. ఈ ప్రణాళికప్రకారము యజమాని తన ఉద్యోగులకు మామూలు జీతములిచ్చుటయేగాక తన వ్యాపారలాభములలో కొంత వాటాకూడా పంచిపెట్టును.

## వాటాలపంపకం విభజన

ప్రస్తుతంవరకు చాలామంది ఆర్థికవేత్తలు, వ్యాపారస్థులు లాభాలు వాటాగా పంచుకొనుపద్ధతి ప్రోత్సహించినను కొన్ని జయప్రదమైన ప్రయోగములు జరిగినను సాధారణముగా సంఘటితకార్మికులు తమకు భవిష్యత్తులో దొరికేలాభములుగూర్చి సందేహము వెలిబుచ్చుచున్నారు.

మొదట లాభాలు పంచుకొనేవిషయంలో చాలావరకు ఎక్కువ విఫలతయే. మొన్నమొన్నటివరకు ఉన్నట్లు చెప్పబడుచున్నది. గ్రేటుబ్రిటనులో ఇటువంటి ఏర్పాట్లు పరిశీలనవల్ల 1936 వరకు స్థాపింపబడిన 679

ప్రణాళికలలో, 395 తక్కువగాకుండా వదిలివేయబడినవి. మరి 18 ప్రణాళికలు, ఆయా సంస్థలు మరొకదానిలో కలిసిపోవుటచే పనిచేయుట మానివేసినవి. మరొకమాటలో చెప్పాలంటే 60వ శాతము అదృశ్యమయినవి. 1936 వరకు ఉన్నాయని భావించబడుతున్న 193 ప్రణాళికలలో ఆసమానిక అంతవరకు అవి మానివేయబడినవి.

రెండవది సంఘములకు కార్మికుల విధేయతను బలహీనపర్చుటకు తగిన వేతనము లేమిచే యీ లాభాలలో మారుగా మధ్య పెట్టుటకు అభివృద్ధికరమైన తక్కువ అభివృద్ధికున్న కాలములలో యజమానులచే సరైన నిర్ణీత పద్ధతిలో సొమ్ము లిప్పించు స్థిరమైన పెన్షనుపద్ధతి లేనందువల్ల కొంతమంది యజమానులు, యీ లాభాలవాటా అనుపద్ధతి ప్రవేశపెట్టిరని చెప్పుదురు. రెండవ ప్రపంచసంగ్రామకాలములో లాభాలవాటాపద్ధతి అమలు జరుపుటకు ముఖ్యకారణము. ఎక్కువలాభాలపన్నులు, ఎక్కువ ఆదాయ పన్నులు చెల్లించునది లేకుండా తాముకు తిరిగే కోరిక చాలా విషయములలో జరుగుననిపించును.

మూడవది. సంవత్సరాలు గడిచినకొలది తమ జీతములలో యీ లాభాలు అంత ఎక్కువలాభదాయకముగా లేవని వృత్తిసంఘములు ఎన్నో అనుచున్నవి. 1943 లో, 33 కంపెనీలలో 202 సంవత్సరముల లాభాల పంపకపద్ధతులు పరిశీలించిన అనుభూతితో స్టీవర్టు కూపర్ యీ విధముగా ప్రకటించిరి. "ఈ కంపెనీలలో కార్మికుల భత్యములు మొత్తము జీతములలో 2.2 శాతముమాత్రమే ఉన్నదని చివరకు మిగిలేలాభములో 6.8 శాతముమాత్రమే అని అందురు."

నాల్గవది. కార్మికునికి స్థిరమైన ఆధాయము యీ లాభాలవాటా ప్రణాళికలు యివ్వలేకపోయినవని చాలామంది శ్రామికసంఘములు విమర్శచేసినవి. ఎక్కువలాభాలవల్ల కార్మికులు ఎక్కువ ఆదాయము పొందినప్పుడు యీ ఆదాయము కొనసాగుననే ఉద్దేశ్యంతో వచ్చేసంవత్సరము తమ వ్యయమును అందుకు అనుగుణముగా తయారుచేసుకొందురు. లాభాలు తగ్గిపోగానే కార్మికులు నిప్పులో జారినట్లు బాధపడుదురు. అయితే సరైనవిద్య, పరిపక్వవిజ్ఞానము ఉన్నచో వారి స్వీయ ఆర్థిక వ్యవహారములు, యిటువంటి అభ్యంతరముకు తప్పించగలవని ఒకవిధముగా వాదించవచ్చును.

## ఈ మంధ్య పరిణామములు

40 వ దశాబ్దము ఆఖరిరోజుల్లో 50 వ దశాబ్దం మొదటిరోజుల్లో కౌన్సిల్ ఆఫ్ ప్రోఫిట్ షేరింగ్ ఇండస్ట్రీస్, పరిశ్రమలో లాభాల వాటాలు పంపకము ప్రోత్సహించెడిది. ఈసంస్థ స్వేచ్ఛావ్యాపారం అనే అమెరికనుపద్ధతిని సంరక్షించుటకు లాభాలపంపకము ముఖ్యసాధనంగా ఉపయోగించుటకు సహాయపడే ముఖ్యసంస్థ. ఈసంస్థ లాభాల పంపకము యీ విధముగా నిర్వచించినది "మామూలుగా యిచ్చే మంచి జీతముకాక, ప్రత్యేకంగా తక్షణంకాని తర్వాతగాని యిచ్చుసొమ్ములు ముఖ్యంగా వ్యక్తిగతకీయ వర్గకార్యములమీద ఆధారపడక పరిశ్రమ అభివృద్ధి మొత్తముమీద ఆధారపడి యజమాని ఉద్యోగులకు సొమ్ము యిచ్చుపద్ధతి."

కౌన్సిలు నివేదికప్రకారము 1953 లో తన సభ్యత్వములో చేరినవి 625 కంపెనీలు. 4 బిలియనుల డాలర్లపైగా సాంవత్సరిక వ్యాపారము చేయు 700,000 ఉద్యోగులకు ఆ కంపెనీలు ప్రాతినిధ్యం వహించుచున్నవి. సంఘటితకార్మికులలో ఇంచుమించు 40 వ శాతము కంపెనీలకు సంబంధము లున్నవి. 1952 లో కౌన్సిలుసభ్యులు ఉద్యోగులతో పంచుకొన్నవాటాలసొమ్ము 1,25,000,000 డాలర్లు. 20 వ శాతమునకు కొంచెము తక్కువగా సరాసరి శాతమైన 5 నుంచి 100 శాతమువరకు యీ సొమ్ముఅంచనా 8 వ శాతమునుంచి 100 శాతమువరకు వేతనములు ఎక్కువగుటయే, లాభాల పంపకమన్నఅర్థము. మొత్తములాభాల వాటాలు పంచుకొను కంపెనీలు 1953 లో 12,000 లకు పైగా పెరిగినది. ఎనిమిదిసంవత్సరములకుముందో ఆసంఖ్య 728. యీ లాభాల పంపకమువల్ల సాధారణముగావచ్చు ఫలితములు యివి; నిపుణతపెరుగుట, గైరుహాజరులోను, కార్మికులమార్పుల్లో తగ్గుదల, పనిముట్లసముదాయములో ఎక్కువజాగ్రత్త చాలా కొద్దిగా ఉండడంకాని అసలు సమ్మెలు లేకపోవడం అల్లరిచేయించువారి పేరుప్రతిష్ఠలు లేకపోవుట పెట్టుబడిదారులకు యింకా ఎక్కువఆదాయము, పన్నులలో తగ్గింపు — ఇందులో పంచుకొన్నవాటాలు తగ్గించబడియేఉండును. తక్కువ అభివృద్ధికల రోజుల్లో యీ ప్రణాళికలు ఏమగునో అన్న సంగతి చెప్పలేము.

## విజయమునకు పరిస్థితులు

వార్టన్‌స్కూల్ ఆఫ్ ఫైనాన్సుయొక్క పూర్వపు డీన్, కేలేబ్ కే స్మిత్ శాల్టర్‌ట్సన్ లాభాలపంపకముగురించి యీ విధముగా అనెను.

దానిమీద ఆధారపడాలంటే ఒంటిగాతీసుకుంటే యీ ప్రణాళిక చాలా బలహీనమైనది. సాహసవ్యాపారక్రియలలో పరస్పరస్నేహము పెంచి లాభాలపంపకము, దాన్నిగుర్తించుననియు యింకా ఎక్కువ ప్రాధమికబాధ్యతలు తప్పించుకొనే ప్రణాళికగామాత్రం అనుమానింప బడినట్లు ఒక్క ఉద్యోగుల విధానమును తయారుచేయుటకుతప్ప మరొకవిధంగా దీన్ని సిఫారసు చేయుట కాదు.”

అంతర్జాతీయ కార్మిక కార్యాలయానికి సంబంధించిన మిస్టర్ వర సింహన్ డా॥ శాల్టర్‌ట్సన్‌తో ఏకీభవించుచున్నారు. అటువంటి ప్రణాళికలు విజయము కావాలంటే ఎన్నో ముఖ్యఅంశములు ఉండవలెనని తన అభిప్రాయము వెలిబుచ్చినారు.

ఆ అంశము లివి:—

(1) కార్మిక యజమానుల సహకారము, పరస్పరనమ్మిక, విశ్వాసము యొక్క రికార్డులు, లాభాల పంపకప్రణాళిక ప్రవేశపెట్టవలెన్చు కున్న యజమానులు యీ ప్రణాళికవివరాలు పూర్తిగా ఆకళించుకుని తన ఉద్యోగులతో నిత్యమూ సంప్రదించి సహకరించి అవసరమైతే ఉద్యోగులు ఎన్నుకున్న ప్రతినిధులకు కంపెనీ రికార్డులు చూపెంచ డానికి సిద్ధంగా ఉండవలెను. కన్నత్ యం. దాంప్సన్ చెప్పినట్లు కంపెనీ చివరిఅధ్యాయములో ఒకభాగము ఉద్యోగులకు యిచ్చుటకు సృష్టించు యంత్రాంగమే ఈ లాభాలపంపకం కార్యక్రమంలో ఒక భాగము. ఈ సంప్రదింపుల పద్ధతులలో సహకార నిర్ణయాలు, భావాలను స్వేచ్ఛగా చర్చించుట, కంపెనీఉత్పత్తి సంయుక్తంగా పరిశీలించుట, ఆర్థికసమస్యలు, లాభాలవాటాలు పంపకంలో గుండెకాయ వంటివి.

నిజంగా స్థిరమైన కార్మికకార్యకలాపాలలో లాభాలపంపకము మొదటి కలాపముగా ప్రవేశపెట్టుట కష్టము.”

(2) రెండవది పరిశ్రమలో వేతనములకు సమానముగాను, ఎక్కువగాను కూడ సంస్థ వేతనములు యిచ్చుట ఈ విజయానికి ముఖ్యము. ధరలు, జీవనపరిస్థితులు ఖర్చు పెరుగుతున్నపుడు న్యాయంగా వేతనములు సరిదిద్దుటలో అంగీకార దృక్పథముకూడా ఉండాలి.

(3) మూడవది కార్మికుల ఉద్యోగంఖర్చులో చాలాతక్కువ కేటు లాభాలు నిత్యం పొందడం చెప్పకోదగ్గ మొత్తమైన బోనసు యివ్వగలిగే పెద్దలాభాలు ఉండాలి.

(4) నాల్గవది మంచి యాజమాన్యముకూడా అవసరం.

(5) చివరకు ఈ ప్రణాళిక విజయవంతంకావాలంటే "ఈ ప్రణాళిక సూత్రములు వివరాలగురించి ఉద్యోగికి విద్య యిప్పించే నిత్యప్రణాళిక ఈ ప్రణాళికావివరాలు ఆర్థిక, సాంకేతిక, అమ్మకం, కొనుగోలువంటి వాటితో యజమానుల సమస్యలపై ఆధారపడిన ప్రాథమికసూత్రములు కలిగియుండవలెను."

స్థిరమైన మంచిసూత్రములకు సన్నిహితముగునట్టి లాభాలపంపకము మీద నిజాయితీ ప్రయోగములు చాలా ఆసక్తితో చూడవలెను. ఇవి సానుభూతికరమైన జాగ్రత్త పరిశీలనకు అర్హము.

# 12 ప్రజాస్వామ్య యజమానత్వము

పరిశ్రమలో ప్రజాస్వామ్యపురోగమనంలో తరువాతభాగము యజమానత్వములోపాల్గొని పెరిగేహక్కులు బాధ్యతపొందుట, చిన్నవ్యాపారములు, కుటుంబవ్యవసాయము వ్యక్తిగతముగా యజమానత్వము వహించుటయేగాక, పారిశ్రామిక యజమానత్వము వ్యాపింపచేయుట మూడు పద్ధతులున్నవి. ఇవి క్లుప్తంగా యిక్కడ చర్చించుదాము.

## ప్రైవేటు పరిశ్రమలో, మూలధనము యజమానత్వము

ప్రైవేటు పరిశ్రమలో ఉద్యోగులు మూలధనము యజమానత్వము వహించుట ఒకటియున్నది. ఉద్యోగుల మూలధనము యజమానత్వము

అనునది కొన్ని కార్పొరేషన్లలోఉన్నను, అది అంత విశిష్టముకాదు. ఉద్యోగుల యెజమానత్వము సాధారణంగా చాలా కొద్దిశాతము. ఉద్యోగులందరుకలిసి మూలధనముకల్గి వోటుచేయగలిగినను కంపెనీ పాలన లోను, యజమానత్వములోను వారిమాట చెలామణి కాదు.

ఇటువంటి ఉద్యోగుల మూలధన యజమానత్వము, ప్రణాళికలుకలిసి కార్పొరేషనుయొక్క మూలధన యజమానుల సమావేశ మొకటి గ్రంథ కర్తలలో ఒకరు స్వయంగా చూశారు. తమ క్రొత్తహోదాకు గర్వస్తూ ఉద్యోగులు కంపెనీవ్యవహారములలో తమమాట చెలామణి అగునటుండ వలెనని నిర్ణయించుకొనిరి. 500 వోట్లు యివ్వగల 500 వాటాలు ఉద్యోగులు కలిగియుండిరి. న్యూయార్కునుంచి ఒకవ్యక్తివచ్చి తనతరఫున రానివారితరఫున 10,000 వాటాలకు ప్రాతినిథ్యం వహించి, వోటుచేసి గెలిచినపుడు ఉద్యోగులకు యీ దాడి చాలా విచిత్రమనిపించెను.

20 వ దశాబ్దంలో ఉద్యోగుల మూలధన యజమానత్వము విషయముపై చాలా ఆసక్తి కనపరచబడినది. పెద్దకార్పొరేషనుగాఉండే అమెరికను టెలిఫోను, మరి టెలిగ్రాఫ్‌కంపెనీ, ఈస్టుమన్ కోడక్‌కంపెనీ స్టాండర్డుఆయిల్, యు. యస్. స్టీల్, తదితర రైలురోడ్లు, బ్యాంకులు మొదలైనవి, ఉద్యోగులు మూలధనము కొనేపద్ధతి ప్రోత్సాహించిరి.

"యునైటెడ్ స్టేట్సులో ప్రస్తుత ఆర్థికవిప్లవం" అనే గ్రంథంలో హార్వర్డుకు సంబంధించిన ప్రొఫెసర్ థామస్ యన్. కార్వర్, ఉద్యోగులు, కొనుగోలుదారులు క్రమక్రమాభివృద్ధిగాపొందే మూలధన యజమానత్వముద్వారా పారిశ్రామిక వాతావరణంలో ఒక విప్లవకరమైన మార్పు రాగలదని సూచించెను. ఈ పద్ధతిలో చాలామంది యజమానులకు విప్లవము కనిపించలేదు. కార్మికులను ఎక్కువగా కష్టపడి పనిచేయించుటకు, ఎక్కువగా ఉత్పత్తి చేయించుటకు, వారిలో ఎక్కువగా పెట్టుబడి దారీ విధానదృక్పథము కలిగించుటకు, సంఘములలో వారు తక్కువగా చేరునట్లు, యిది ఉపకరించునని వారి అభిప్రాయము. 30 వ దశాబ్దం లోని ధరలు తిగ్గుదల. కార్మికుల మూలధన యజమానత్వము తుడిచివేసి నది. కార్యనర్గమునుంచి చివరదాకా, చాలామంది ఉద్యోగులు యీ ప్రణాళికను విమర్శించిరి. తాము పనిచేస్తున్నసంస్థలో ఏదైనా తప్పు

జరిగినచో తమ ఉద్యోగములుపోయి, తమ ఆదాయమందలి పొదుపుకూడా పోవునని వారు భయపడిరి.

మూలధనములలో కార్మికులు చాలా పెట్టుబడి పెట్టుకొనుచున్నారు. పరస్పర నిధులలోకాని తదితర సంస్థలలోకాని తమసొమ్ము పెట్టుబడి పెట్టుటకు వారు యిష్టపడుచున్నారు. 20 వ దశాబ్దంలో ఉద్యోగుల మూలధనం యజమానత్వమునకు ప్రోత్సాహము క్రమముగా తగ్గిపోయినది. పెద్దకార్పొరేటు విభాగములలో తమసొమ్ములు పెట్టుబడిపెట్టి ప్రముఖమైనస్థానం సంపాదించటానికి కొన్నిసంఘములు ప్రయత్నించిన ఉదాహరణలుకూడాకలవు. ఇటువంటి పెట్టుబడి సంఘములు క్రమముగా తప్పించుకొనిపోయినవి.

## స్వపరిపాలిత పారిశ్రామిక శాలలు

స్వపరిపాలితపారిశ్రామికశాలలు అని, లేదా నిర్మాత సహకారసంస్థలు అని పేరున నడవబడుచు, పూర్తిగాగాని, లేదా ఎక్కువగాగాని కార్మికులచే యజమానత్వముకలిగిన చిన్నవ్యాపారములు అమెరికారాష్ట్రములలో, గ్రేటుబ్రిటను, ఫ్రాన్సు మరియు తదితర ప్రదేశములలో అక్కడ కూడ కనిపించును. ఈమధ్య సంవత్సరములలో సమ్మెకాలములలో, సమ్మెదారులకు పనికల్పించే ఉద్దేశ్యంతో, దుస్తులుకుట్టుట, టోపీలు తయారుచేయుట, మొదలగు పరిశ్రమలలో ఇటువంటివి ఉద్భవించినవి.

ఇంగ్లండులోను, యీ దేశంలోను ఒక వందసంవత్సరములవరకు నిర్మాతల సహకారసంస్థలచరిత్ర పరిశీలిస్తే అటువంటి ప్రయోగాలలో చాలా ఎక్కువ నైతిక దృక్పథం కనిపిస్తుంది. వీటి అపజయములకు కారణములు దురూహ్యముకావు. ఈ దుకాణములు అమ్మకముకొరకే వస్తువులు తయారుచేయుటవలన, అవి ఉద్యోగులకోసమని కేటాయించబడకపోవుట వలన, రవానా భరించేవన్నీ వీరూ వసూలు చేయ ప్రారంభించిరి. స్థాపకులువలె, క్రొత్తసభ్యులు, దుకాణం నిర్వహణలో ప్రజాస్వామ్యపద్ధతిలో పాల్గొనేహక్కులు పొందకుండిరి. ప్రస్తుత పద్ధతులలో మార్పులేకుండా, క్రొత్త పరిశోధనలు నిరుత్సాహపరుచుచుండిరి. ఈ స్వపరిపాలిత పారిశ్రామికశాలలో ఫోర్‌మనుకు, లేదా మేనేజరుకు, ఉద్యోగులకుమధ్య ఉన్న

సంబంధములు ముఖ్యంగా మేనేజరు నిత్యమూ వారికి ఆజ్ఞలిచ్చి పనులు చేయించుటద్వారా — ఒక కమిటీలోగాని, సర్వసభ్యసమావేశములోగాని చిత్రముగా ఉండును. అచ్చట ఉద్యోగులు అతన్ని నియమించుదురు. అతనికి ఆజ్ఞ లిచ్చెదురు. తమకోరికలు చెల్లించనిచో మేనేజరును బర్తరఫు చేయు అధికారముకూడా వారికి కలదు. ఇది చాలా అసంభవమైన, అసహజమైన విషయముగా గోచరించును కన్స్యూమర్సు కోఆపరేటివ్ మూవ్మెంటు (రచయిత సిడ్నివెబ్ లాంగ్మన్సు కంపెనీ 1921, p. 463) యింకా వ్యాప్తిచెందుటకు యీ పారిశ్రామికశాలలకు తగినంత పెట్టుబడి సంపాదించుట చాలాకష్టమయ్యెను. ముసలితనమువల్లకాని తదితర కారణములవల్లకాని మొదటి ఉద్యోగులు రాజీనామాయిచ్చినపుడు చాలా నిదర్శనములలో, వారి మూలధనము ఇతరులఆస్తి అయిపోయెడిది. ఈ సహకారసంస్థ మామూలులాభాలు పంచుకునే సాహసవ్యాపారసంస్థగా చివరకు మారిపోయెడిది.

కొనుగోలుదారుల సహకారము అనే పద్ధతిగురించి యీ అధ్యాయములో మరోచోట చర్చించుదము. నిర్మాత సహకారసంస్థలలోఉన్న లోపములు లేకుండా కొనుగోలుసహకారసంస్థలు పనిచేసినట్లు చరిత్ర చెప్పుచున్నది. కొనుగోలుదారుల పంపకమందు, కొనుగోలుదారుల సహకారసంస్థలు యజమానత్వమువహించు ఫ్యాక్టరీలయొక్క ఉత్పత్తియందు ఆశ్చర్యకరమైన విజయము కనిపించినది. అన్నితరగతులు లాభము పంచుకొనునట్టి సహకార ఆర్థిక వ్యవస్థకు సంబంధించిన ఒక వేదాంతము దీనివలన రూపొందినది.

## ప్రభుత్వ యజమానత్వము

ప్రజాస్వామ్య యజమానత్వముయొక్క రెండవఅంశము ప్రభుత్వ యజమానత్వములో ఉన్నది. అంటే స్థానికపరిపాలన, ప్రాంతీయ లేదా కేంద్రరాష్ట్రపరిపాలనకు సంబంధించినవి. ఉమ్మడిగా యజమానత్వము కల్గిన సాహసవ్యాపారము లన్నిటిలోనూ, రాజకీయ విభాగములో యిమిడిన వారందరు ప్రభుత్వయజమానత్వముక్రింద కొంత యజమానులుగా భావింపబడుదురు.

## ప్రభుత్వ సాహసవ్యాపారముల పురోగమనము

పోటీలలో లాభాలు పంచుకోగలిగే పరిశ్రమ ఏ ప్రాథమిక వ్యాపారాలలో కొనసాగదో అటువంటివాటిలో ప్రజలకు పరిపూర్ణమైన సేవచేయుటకు ప్రజాస్వామ్యదేశాలలో బయట ఈ దినములలోనూ ప్రభుత్వయజమానత్వము క్రమక్రమముగా పెరిగినది. అమెరికారాష్ట్రములలో ప్రభుత్వ యజమానత్వముక్రింద నడుచు పెద్దసంస్థలు; పోస్టాఫీసులు; ప్రజలరోడ్లు; నీటిసరఫరా; కాల్వలు: నదీమార్గములు; విమానకేంద్రములు; వంతెనలు; మిలిటరీపోలీసు, నిప్పుఆర్పేశాఖలు; విద్య, ప్రజారోగ్యము వృద్ధిచేయుటకు, ప్రభుత్వపాఠశాలలు, ఆస్పత్రులు, క్లినిక్కుకూడా ఏర్పాటుచేసి నడిపించబడుచున్నవి. ఎన్నో ప్రభుత్వపార్కులు, ఆటశాలలు, అమెరికా విరామసదుపాయములకు వన్నె చేకూర్చినవి. దేశముయొక్క సాంస్కృతిక ప్రమాణములు వృద్ధిచేయుటకు ప్రభుత్వగ్రంథాలయములు, మ్యూజియములు, కళాప్రదర్శనసంస్థలు ప్రోత్సహించబడినవి. మన గృహజీవితాన్ని బాగుచేయుటకు చెత్తగుడిసెలను పరిశుభ్రపరుచుట, నగరములను ఒక పద్ధతిలో ప్రణాళికగా రూపొందించుట, ప్రజాగృహనిర్మాణము కూడా ప్రారంభించి అభివృద్ధి చేయబడినవి.

మన సహజశక్తులను అభివృద్ధిచేయుటకు అడవులను పెంచుట, మట్టిని బాగుచేయుట, వరదల నాపుట, చేలకు కాల్వలద్వారా నీరు సప్లై చేయుట, నావికాయానము, విద్యుచ్ఛక్తిని పెంపొందించుట మొదలగు ప్రభుత్వ వ్యాపారములు విరివిగా చేయబడుచున్నవి. నిరుద్యోగము, అనారోగ్యము, ముసలితనము, ప్రమాదములు మొదలగువాటి సమయములలో అవసరాలనుంచి రక్షించుటకు ప్రభుత్వ ఇన్స్యూరెన్సు సంస్థలను నిర్మించితిమి. మనసాంఘిక పరిస్థితులలోని లోపములనుంచిగాని లేదా తోటివారి సంఘవిరుద్ధపద్ధతులనుంచిగాని పారిశ్రామిక కార్మికులను, వ్యవసాయదారులను, కొనుగోలుదారులను, పెట్టుబడిదారులను, వ్యాపారస్థులను రక్షించుటకు, పెద్దనిరుద్యోగసమస్యలకాలమున కష్టములనుంచి రక్షించి సాయము చేయుటకు ఆర్థికసంబంధమైన ప్రభుత్వసంస్థలు ఎన్నో స్థాపించితిమి.

1902 లో మిలిటరీకిసంబంధించని ప్రభుత్వఆస్తులు లెక్కపెడితే మొత్తమువిలువ నాల్గు బిలియనుడాలర్లకు తక్కువలేదు. 1946 లో యీ ఆస్తులే 50 బిలియనుడాలర్ల విలువ కలిగియుండెను. ఈ శతాబ్దము మధ్య భాగము కాలమునకు 8 మందిలో ప్రతిఒకడు యునైటెడ్ రాష్ట్రములలో ఉద్యోగముపొందినవాడు, ప్రభుత్వఉద్యోగి. దేశం ఆస్తులలో 5 డాలర్లలో ప్రతిఒక్కడాలరు ప్రభుత్వరోడ్లు, వీధులు, మిలిటరీ, నావికాఆస్తి వస్తువులు తప్పించినా ప్రభుత్వఆస్తిగా యుండెను.

మనచుట్టూఉన్న సాంఘిక దురవ్యాయములు తగ్గించుటకు, తొలగించుటకు, రాకుండుటకు, ప్రభుత్వముయొక్క శక్తులు, సదుపాయములు క్రమక్రమముగా ఎక్కువగా వాడుచున్నాము. మునుపటి యుద్ధకార్యదర్శి హెన్రీ యల్. స్టిమ్సన్ ప్రకటించినట్లు పోలీసుసంస్థను ఒక తప్పనిసరి చెడుసంస్థగా కాకుండా దేశాభివృద్ధికి, సాంఘికాభివృద్ధికి ముఖ్యావసరమైన అనుకూలమైనసంస్థగా ప్రభుత్వమును నేడు పరిగణించుచున్నది.

## సంఘటితకార్మికులు, ప్రభుత్వసేవాసంస్థలు

స్థానిక, రాష్ట్ర, దేశప్రభుత్వములు సంక్షేమకార్యక్రమముల అభివృద్ధిలో సంఘటితకార్మిక ఉద్యమమునకు ఎంతో సంబంధమున్నది. ప్రజలకువిద్య, ఆరోగ్యము, గృహనిర్మాణము, మొక్కలను సంరక్షించుట విద్యుచ్ఛక్తి, సాంఘికభద్రత తదితర ప్రభుత్వసేవలగురించి ఎ. యఫ్. యల్ సి. ఐ. ఓ. రూపొందించిన శాసనములు కార్యక్రమములలో తీవ్రమైన విజ్ఞప్తులున్నవి.

గ్రేటుబ్రిటనులో దేశముయొక్క టెలిఫోను, టెలిగ్రాఫు, రేడియో, విద్యుచ్ఛక్తిలో ఎక్కువభాగము లైట్ల పరిశ్రమలో ఎక్కువభాగములకు స్థానిక, కేంద్రప్రభుత్వములు యజమానులుగాఉండి నిర్వహించుచుండెను. 1946 - 1951 కాలములో లేబరుప్రభుత్వము పరిపాలించునపుడు బ్యాంకు ఆఫ్ ఇంగ్లండు, గనులు, రైలురోడ్లు, దేశములోరవాణా, గ్యాసుపరిశ్రమ, దేశాంతరముల తంతులు, విమానయానము, అణుశక్తి, ఇనుము, ఉక్కుపరిశ్రమలలో పెద్దసంస్థలు, జాతీయము చేయబడినవి. ప్రజలకు ఉచితముగా ఆరోగ్యసేవ, మందుల పంపిణీ జరిగేసంస్థలు పెక్కులు ఏర్పరచబడినవి.

ప్రైవేటు నియంతృత్వముయొక్క దుష్ప్రయోజనములనుంచి ఆర్థిక వ్యర్థమునుంచి తదితరలోపములనుంచి ప్రజలను రక్షించుటకు ఎచ్చట వ్యాప్తి అవసరమైతే అచ్చట గ్రేటుబ్రిటనులోని సంఘటితకార్మిక ఉద్యమము ప్రభుత్వయజమానత్వ నిర్వహణ ఎక్కువగా తనలక్ష్యముగా ఎంచుకొన్నది.

## ప్రభుత్వ యజమానత్వముయొక్క విజయములు

ఇంతకుముందు సూచించినవిధంగా ప్రభుత్వవ్యాపారములలో అమెరికారాష్ట్రములలో జరిగిన పరిణామములు, పబ్లిక్ వర్క్సుయొక్కల సంరక్షణ, సాంఘికభద్రత, విద్య, ఆరోగ్యము, ఆటలు మొదలైన రంగములలో కావలసిన సేవాశక్తులు సరఫరా చేసినవి.

ప్రభుత్వము, పరిశ్రమ, కొనుగోలు ప్రజలమీద ప్రైవేటు నియంతృత్వము; పెద్దకార్పొరేషన్ల అధికారమును అవి చాలావరకు తగ్గించినవి. మన ఆర్థికజీవితములో కొన్ని నిర్ణీతవిభాగములలో సమాజముయొక్క అదుపుశక్తిని పెంచినవి.

పారిశ్రామిక యాజమాన్యమునందు చాలామంది జనాభాకు విలువైన శిక్షణ యిచ్చుటకు అవకాశ మేర్పడినది. ప్రజలక్షేమందృష్ట్యా నే ధనము సంపాదించుటకుగాకుండా పరిశ్రమను, అందులోని స్త్రీపురుషు లందరూ ఏవిధముగా నడిపించగలరో అనేకసార్లు ప్రదర్శించబడినది.

పెట్టుబడివసూళ్ళుతగ్గించి పోటీవల్లఏర్పడి వ్యర్థములు తొలగించి అటువంటిసేవల ఖరీదులు వారు తగ్గించిరి. ముఖ్యముగా విద్యుచ్ఛక్తి యిందుకు నిదర్శనము. ఈ సేవలయొక్క ఉపయోగము వ్యాప్తిచేయుటకు వారు ఉపక్రమించిరి.

రాష్ట్రములలో వర్తక వ్యాపారములు అభివృద్ధిచేయుటకు యీ ప్రభుత్వ సేవలు చాలా ఉపకరించినవి.

దుష్టమైన దోపిడీవిధానములనుంచి కార్మికులను యీ ప్రభుత్వసంస్థలు రక్షించినవి. కొన్ని దుష్టసాంఘిక పారిశ్రామిక, ఆర్థిక ఆచారములనుంచి కొనుగోలుదారులు పెట్టుబడిదారులు బలికాకుండా యివి రక్షించినవి.

## ప్రభుత్వ యజమానత్వము సమస్యలు

వృత్తిసంఘముల కార్యక్రమములు సంఘటితశక్తులను, ప్రభుత్వసంస్థలు పరిమితముచేసేయనే నెపంమీద కొంతమంది సంఘతిర్పివాదులు ప్రభుత్వ

యజమానత్వము వ్యాపింపచేయుటకు వ్యతిరేకించిరి. ప్రభుత్వవ్యాపారము లలో, ప్రజాసంస్థలతో కార్మికులు క్రమక్రమాభివృద్ధితో సంఘటితపడు చున్నారు. చాలా ప్రైవేటుసంస్థలలోకంటె ఇక్కడ యజమానులదృక్పథము కార్మికులపై ఎక్కువ ఉదారముగానూ, విచక్షణాశక్తితో కూడిఉన్నది.

ఇరవైరెండుసంవత్సరాలు టి. వి. ఏ. అధికారులలో ఒకరైన గార్డన్ ఆర్. క్లాప్. 1956 జనవరిలో న్యూయార్కు చాప్టర్ అఫ్ ది లీగ్ ఫర్ ఇండస్ట్రియల్ డెమోక్రసీ సమావేశంలో యీ క్రిందివిధముగా ప్రకటించారు.

"టి. వి. ఏ మొట్టమొదటిసారిగా సంఘటితపరిచినపుడు రాష్ట్రము యొక్క పరిపాలనాధికారమును ఉమ్మడిబేరము నణగద్రొక్కునసే భావముతో చాలమంది ఉమ్మడిబేరములోని యజమానుల నమ్మకమును వ్యతిరేకించిరి.. ప్రభుత్వఉద్యోగులు మొదటితరగతి పౌరులుగా ఉండ వలెనని టి. వి. ఏ. పరిపాలకుల ఉద్దేశము. చాలాకొద్దిసంవత్సరముల లోనే ఆనకట్టలు నిర్మించే వారిలోని ఉద్యోగులు పూర్తిగా వారంతట వారే సంఘములుగా ఏర్పడిరి. ఎ. యఫ్. యల్. లోని 15 సంఘములు నిర్మించిన కేంద్రసంఘముతో యజమానులు ఒక ఒప్పందము చేసుకొనిరి."

"తమంతతామే సంప్రదించుకున్న వేతనములుపొంది రెండవ ప్రపంచ యుద్ధకాలంలో మనసైన్యము క్రొత్తరికార్డులు సృష్టించి ఆనకట్టలఖర్చులు ఎంతో తగ్గునట్లు ఉత్కృష్టంగా పనిచేసిరి."

"రాబోయే చాలాకాలమువరకు వారుకట్టిన టి. వి. ఏ. నిర్మాణము లలో, వారు అదుపులోపెట్టిన వరదలలో, వారు విద్యుచ్ఛక్తి సృష్టించిన విద్యుచ్ఛక్తిశాలలో వారినిర్మాణములు సేవచేసే సమాజములలో వారి రికార్డులు ప్రతిబింబించుచున్నవి.

ఇరవైసంవత్సరములలో టి. వి. ఏ. ఇరవై ఆనకట్టలు కట్టినది. ఏడు పెద్ద ఆవిరియంత్రాగారాలు కట్టినది. అందులో రెండు ప్రపంచంలోకల్లా పెద్దవి. ఈ దినంలో ఒక పెద్ద కేంద్రీకృత ఉపయోగకరమైనపద్ధతి టి. వి. ఏ. పద్ధతియే."

సమాజంలో ఏ గొప్పవ్యక్తివలెకాని లేదా ఏ పెద్ద అధికారివలెకాని ప్రతీఉద్యోగి ప్రోజెక్టులలాభములలో తానుకూడా భాగస్వామి అని యజ

మానులు గుర్తించకపోతే నా అభిప్రాయంలో టి. వి. ఏ. ఇంత కొత్త రికార్డు చూపగలిగినది కాదు.

"మన పారిశ్రామిక సంఘములలో సమాజములలో ప్రజాస్వామ్యమునకు మరొకమార్గమున్నదని తమ మనస్సులలో ప్రజలకు ఒకభావన ఉన్నట్లు సందేహములున్నచో ఘర్షణలు జరుగుతున్నను కార్మికుల బాధ్యతల రికార్డు వారి ఒప్పందములు అమలుజరిపే కార్మికులబాధ్యత అవి తొలగించవలెను. ప్రైవేటుఅయినా ప్రభుత్వమునకు సంబంధించినదైనా మన పారిశ్రామిక వ్యాపారములలో ప్రజాస్వామ్య సంబంధముల నిపుణతను వారి రికార్డులలోభాగముగా కనుక లేకుండా చేసినచో సహేతుకమైన ఖర్చులలో సహేతుకమైన నిపుణతతో ఎన్ని ఆనకట్టలు నిర్మించినా అది టి. వి. ఏ. కు చాలా నిరుత్సాహకరమైన రికార్డు అయ్యేడిది."

టి. వి. ఏ. బోర్డు ఉద్యోగులయొక్క ప్రవర్తనతో టి. వి. ఏ. సంఘములు తమ సంతృప్తి ప్రకటించినవి. ఈ విజయవంతమైన కార్యక్రమమును బలహీనపర్చుటకు ఎ. యఫ్. యల్. సి. ఐ. ఓ. చూపించిన వ్యతిరేకతకు కారణము. టి. వి. ఏ. కార్యక్రమములవలన ప్రజలు అనేక విధములుగా లాభములు పొందుటవలననేకాక, ప్రపంచవిఖ్యాతిచెందిన ఈ ప్రభుత్వ అధికారసంస్థలో పనిచేసిన, వరుసగా కమిషనర్లచే నడపబడిన ప్రజాస్వామ్య పూర్వకమైన, విజ్ఞానవంతమైన కార్మిక యజమానుల సంబంధములు ముఖ్యము. తనపనులలో ప్రభుత్వరీతిలో నడపబడు వ్యాపారము వీలుఇట్టి అనుకూలముకాదని. అభ్యుదయ విరోధియని సాక్ష్యాధారముగా ఆరోపింతురు. అభ్యుదయముపొందని వ్యాపారముగా ప్రోత్సాహించును సాధారణముగా పేర్కొందురు. కాన్సాస్ యూనివర్సిటీయొక్క ప్రొఫెసర్ ఎడ్విన్ ఓ స్టీన్; యీ ఆరోపణ పరిశీలించి ఈ విధముగా అనెను. "సాంకేతికమార్పులలో కార్మికుల ఉత్పత్తి యీ పోస్టలుపద్ధతిలోనిది. పరిశీలిస్తే ప్రైవేటువ్యాపారములలో కనిపించు అభ్యుదయముతో యిక్కడి పురోగమనముకూడా కొంత సమానముగానే పోల్చవచ్చును. కొత్తపద్ధతుల పరిశోధన ప్రోత్సహింపబడినది. కార్పొరేటు వ్యాపారసంస్థలోకాని కనిపించు పరిణామములు నూత్నపరిపాలనాపద్ధతులవలన యిక్కడకూడా కనిపించుచున్నవి.

## ప్రభుత్వ కార్పొరేషను

పూర్వముకంటె అనేక సేవలలో ప్రభుత్వయజమానత్వము ఎక్కువ అనుకూలముగా అందుబాటులో ఉండేటందులకు యిచ్చటను, విదేశముల లోనూ, ప్రభుత్వవ్యాపారరంగములో ప్రభుత్వకార్పొరేషను చాలా ఎక్కువగా అభివృద్ధిపొందినది. మొదటి ప్రపంచయుద్ధకాలములో, అమెరికారాష్ట్రములలో మొదటి ప్రభుత్వకార్పొరేషన్లవర్గము కనిపించి నది—ఉదాహరణకు, అమెరికారాష్ట్రముల షిప్పింగ్ బోర్డు ఎమర్జెన్సీ ఫ్లీట్, యుద్ధఫైనాన్సు కార్పొరేషను; చెప్పుకొనవచ్చును. యుద్ధము ముగిసినాక, దేశీయకాల్వల కార్పొరేషను ది టి. వి. ఏ. న్యూయార్కు పోర్టు అథారిటీ అనేకనగర గృహనిర్మాణ అధికారులు, వారి కున్న అటువంటి కార్పొరేషన్లు ఉద్భవించినవి.

ప్రైవేటు స్టాక్ కంపెనీవలె ప్రభుత్వకార్పొరేషను నిర్మాణముకూడా ఉండును. నగర, రాష్ట్ర, కేంద్రప్రభుత్వములు యజమానత్వముపొందిన స్టాకులను, బాండ్లను యిచ్చును. తన ఆదాయములోనుంచి ఈ బాండు అధి కారముపొందును. దానికి వచ్చినరీతిని చెల్లించేపద్ధతి అవలంబించబడును.

ఈ కార్పొరేషను డైరక్టర్లు, అమెరికారాష్ట్రముల అధ్యక్షునిచేగాని, తదితర పరిపాలకాధిపతిచేగాని నియమింపబడుదురు. దాని మేనేజర్లును డైరక్టర్లు నియమింతురు. ఈ మేనేజర్లు కొన్నిసంవత్సరముల నిర్ణీతకాలము వరకు నియమింపబడినను, వారు నిపుణతతో తాము విధ్యుక్తధర్మము నిర్వర్తించువరకు, వారు పదవిలో ఉండాలన్నంతవరకు వారు ఉండ వచ్చును.

కూలికి పనివారిని నియమించుట, ఉద్యోగులకు వేతనములిచ్చుట, వ్యయము, కార్పొరేషను ఉద్దేశ్యములు పరిమితిలో నూత్నప్రణాళికలు ప్రవేశపెట్టుట మొదలగువాటివిషయములో రాష్ట్రముయొక్క వివిధ శాఖలపై విధించబడు రాజకీయనియమములు ఈ కార్పొరేషనుకు వర్తింపక స్వేచ్ఛగా నడుచును. ప్రజాసేవలక్ష్యముతోపాటు, అనేకరంగము లలో విలువైన, చైతన్యవంతమైన, సామాజికఅభివృద్ధికి అనుకూల వాతా వరణము యిందులో కనిపించును.

## ప్రజాస్వామ్యము : ప్రజా యజమానత్వము

టి. వి. ఏ. వంటి చాలా ప్రజాకార్పొరేషన్లు అంతర్విభాగరాజ్యతంత్రమును కోరక స్థానికసంస్థలపైన ఎక్కువ అధికారము కేంద్రీకరించక, అధికార వికేంద్రీకరణను అమలుజరుపుటకు ప్రయత్నించుచున్నారు. టి. వి. ఏ. సంస్థ విద్యుచ్ఛక్తిని సృష్టించి సరఫరాచేయును గాని, యించుమించు 97 మ్యునిసిపల్ సంస్థలు, అర్థశతము సహకార సంస్థలు, కొనుగోలుదారులకు ఖరీదుకు ఆవిద్యుచ్ఛక్తి సరఫరాచేసే ఏర్పాటు చేయుచున్నవి. చాలా శక్తివంతంగా తాను ఏపనులు చేయగలదో ఆపనులే అంతా ప్రజాఏజన్సీ చేయుచున్నది. కార్మికులలో అవినీతి, నిపుణతలేమి లేకుండాఉండుటకు శాస్త్రీయమైన మానవత్వముతో కూడిన విధానంతో, ఉదారమైన ఉమ్మడిబేరం, ఒప్పందంతో, కొనుగోలు ప్రజలతో తరుచు సంప్రదింపులు జరుపుతూ, ఈ ప్రజాకార్పొరేషన్లు వర్తించును.

ప్రజాకార్పొరేషను, ప్రభుత్వముయొక్క తదితర మామూలుశాఖలు కూడా, తమ నిపుణత, పురోభివృద్ధి, ప్రజాస్వామ్యము, సాంఘికలక్ష్యము, సమాజములోవిలువ మొదలైనవాటికొరకు ప్రభుత్వము, ప్రజాభిప్రాయము ఆదరణ, పౌరుల కార్యములు నడిపించే వ్యక్తుల సాంఘికరాజకీయ దృక్పథములపై ఆధారపడియున్నవి.

పరిపాలనాపద్ధతులు ఏమైనను ప్రజాసంస్థలకు వ్యతిరేకమైన ప్రతిఘాతమైన ప్రభుత్వము ప్రజాసంస్థను, శాసనరీత్యా, పరిపాలనారీతులద్వారా, ఆర్థికకుట్రలద్వారా, ప్రజలకు ఏవిధముగాను సేవచేయలేకుండా దాని శక్తిని పరిమితముగాని నాశముగానిచేయ ప్రయత్నించును. ప్రభుత్వ ఉద్యోగులు ప్రజాస్వామ్యమున కనుగుణమైన భావప్రకటనను, కార్మిక వ్యతిరేకమైన ప్రభుత్వము నాశముచేయుటగాని, అడ్డంకులు కలిగించుటగానిచేయును. ఫాసిస్టుకాని, కమ్యూనిస్టుగాని ఏ యితరరాజకీయ నియంతృత్వవిధానముగాని, ప్రభుత్వవ్యాపారమును తన నియంతృత్వఅధికారము పెంచుకొనుటకు, వ్యతిరేకతను అణచుటకు జనాభాను పటాలముగా మార్చుటకు ఉపయోగించును.

ప్రజాయజమానత్వము ప్రతిఫలితముగా ప్రజలందరిలాభమునకు పని చేయవలయుచో ప్రజాస్వామ్యజీవితపద్ధతులలో నమ్మకమున్నవారిచే ప్రజాస్వామ్యరీతిలో ప్రభుత్వమునడుపుట, ప్రజాపరిశ్రమలు ప్రజాస్వామ్య రీతిలో నడుపబడుట, చివరిలక్ష్యము. దేశప్రభుత్వము ఔన్నత్యము కాన వ్యక్తిత్వము పెంపొందించుట, ప్రజలసుఖము, సంక్షేమము పెంచుట చాలాముఖ్యము.

భవిష్యత్తులోనూ ప్రస్తుతము ప్రజాపరిశ్రమరంగంలో ప్రజాస్వామ్య భావన కలుగునట్లు చేయుటయే కార్మికులకర్తవ్యములలో ఒకటి. మనం పురోగమిస్తున్న ఆర్థికవ్యవస్థలో ప్రజారంగమునకు వ్యక్తిగతరంగమునకు; ప్రజారంగమునకు, సహకారరంగమునకుమధ్యనుండు సాపేక్షమైన సంబంధములు లాభములయొక్క విలువలు, కార్మికులు అమెరికను ప్రజలు సరిగా నిర్ణయించవలెను.

## భవిష్యత్తు

సాంఘికసేవ, సాంఘిక ఇన్సూరెన్సు ప్రజోపయోగములు, సహజ ప్రకృతిశక్తులు, ఆర్థికసహాయము మరియు తదితర ప్రజాభివృద్ధికర రంగములు, ముఖ్యముగా పూర్తిగా ఉద్యోగములిచ్చి సంపూర్ణ ఆర్థికవ్యవస్థ వ్యాప్తికి దోహదమిచ్చునట్టివి మొదలైనవాటిలో ప్రజాయజమానత్వము కొద్దో గొప్పో వ్యాప్తిచేయుటకు, పైనచెప్పినవిధంగా నేటికార్మికులు కంకణం కట్టుకొనిరి. ఈ లక్ష్యములు గ్యారంటీచేయుటద్వారా ముఖ్యముగా నియంతృత్వంకలిసి కొంత నియంతృత్వవిధానం కలిగియున్న పరిశ్రమలలో ఏమిజరుగునో ప్రస్తుతము చెప్పుట కష్టసాధ్యము.

## కొనుగోలుదారుల సహకారము

ప్రజాస్వామ్య యజమానత్వములో వాల్లభరూపము కొనుగోలుదారుల సహకారము. అన్నితరగతులు ఆర్థికవ్యవస్థలోని వ్యక్తులకు ఈ పద్ధతి యిష్టమే. ముఖ్యంగా వ్యవసాయదారులకు, పారిశ్రామికకార్మికులకు మానవత్వమంత విశాలమైన ఒకబంధనము మనఅందరి ఆర్థికసంబంధమైన సంఘర్షణాపూరిత వ్యవస్థలయందు ఒక ఆర్థిక బంధనకూడా ఉన్నదని తెలుసుకొనుట చాలా ఆహ్లాదకరము. తరగతులుగా, దేశములుగా ఏ

యితర ఆర్థిక స్వరూపములు మనలను విడగొట్టినను, మనమందరము కొను గోలుదారులమే. కొనుగోలుదారులుగా మనందరికి సమానమైన ఆర్థిక అవసరములు కొన్ని ఉన్నవి. కొనుగోలుదారుల సహకారమునకు యివి ప్రాతిపదిక సిద్ధాంతము.

వస్తువులు తయారుచేయువారు, విక్రయసహకారసంస్థలు, కొనుగోలు సహకారసంస్థలకు భేదమున్నది. విక్రయసహకారసంస్థలు ముఖ్యంగా వ్యవసాయదారులు తమవస్తువులకు ఎక్కువధరలు లభించుకొనునట్లు చాలా ఉపయోగకరముగా ఉన్నను విశాలమైన దృక్పథము, లక్ష్యములు కొనుగోలుదారుల సహకారమందలి సిద్ధాంతములుకలిగిఉన్నట్లు లేవు. ఈ దేశములో కొనుగోలుదారుల సహకారసంస్థలు అభివృద్ధిచేయుటలో అమెరికను వ్యవసాయదారులవర్గములు చాలావరకు నాయకత్వము వహించినవి.

1844 లో ఇంగ్లండులోని రాక్‌డేల్‌లో యిరవైఎనిమిదిమంది స్త్రీపురుషకార్మికులు మొదటిసారిగా సహకార నిలవ గిడ్డంగు ఒకటి ప్రారంభించడంతో అభ్యుదయకొనుగోలుదారుల సహకారము ఉదయించినది. అమెరికారాష్ట్రములతో కలిపి ప్రపంచమంతట 75 నుంచి 80 మిలియనుల సభ్యులు సహకారసంస్థలలో కనిపించునంతవరకు ప్రథమదశనుంచి అనేక దేశములలోని వ్యవసాయదారులు కార్మికుల అండదండలతో పెరిగి పెద్దదైనది.

వివిధదేశములలో సహకారసంస్థ ఉద్యమములలో పంపకము తయారీ కూడా చాలావరకు యిమిడిఉన్నది. ఇందులో అనేకరకముల వస్తువులు సేవలు ఉన్నవి; ఉదా: తేయాకు, కాఫీవిత్తులుఅమ్మ వ్యవసాయయంత్రము, గింజలు, ఆహారములు, ఎరువులు, దుస్తులు, ఫర్నీచరు, మేత, రవాణా, బొగ్గు, సీసము, గ్యాసు, నూనె, మోటారుచక్రములు, గ్రామీణ విద్యుచ్ఛక్తి, అరువుసంఘములు, బ్యాంకులు, రొట్టెతయారీలు, పాలు పంపకము, మందులిచ్చుట, ఇన్స్యూరెన్సు, గృహనిర్మాణము, గోరీసహకారసంస్థలు మొదలైనవి "ఉయ్యాలనుంచి శ్మశానము" వరకున్న మానవ అవసరములు యివి సరఫరాచేయును.

50 వ దశాబ్దం మధ్యభాగంలో అమెరికారాష్ట్రంలో సుమారు 16,000 ఆరామసంఘములు ఉండెను. వీటిలో సభ్యులు సుమారు 7¼ మిలియనుల సభ్యులు. 2¼ బిలియనుడాలర్లకుపైగా వీటికి ఆస్తి వుండెను. 1¼ బిలియను డాలర్లు అవి అప్పులుకూడా కలిగియుండెను. అనేకవందల ఇన్సూరెన్సు సహకారసంస్థలుకూడా ఉండెను. ఇందులో పెద్దవి పదింటిలో 8 బిలియనుల పాలసీదారులు ఉండిరి. పాలుకొనే సహకారసంస్థలు 3300 వుండెను. ఇవి వ్యవసాయదారుల కుటుంబాలకు గ్యాసొలైను, ఎరువులు, మేత, స్వయంగాతిరిగే యంత్రసామగ్రి మొదలైనవి సరఫరా చేసెను. ఇవి చిల్లర, గుత్త అమ్మకములలో 2¼ బిలియను డాలర్ల వ్యాపారము చేసినవి. కాని ఒకవెయ్యి పైగాఉన్న సహకారగిడ్డంగులు సంవత్సరమునకు ఒకవంద మిలియనుడాలర్ల వ్యాపారముకంటె హెచ్చుచేయలేకపోయినవి.

గృహనిర్మాణము, ఆరోగ్యము, విద్యార్థులసహకారసంస్థలు క్రమక్రమముగా సంఖ్యతో పెరుగుచున్నవి. విక్రయసహకారసంస్థలవిషయంలో రెండుమూడు వ్యవసాయకుటుంబాలు, ఒకటిగాని ఎక్కువ వాటితోగాని సంబంధము కలిగియున్నవి. అవి 7200 యూనిట్లలో 4,100,000 సభ్యత్వము కలిగియున్నవి. 1954 లో వడ్లగింజలు, పాలవస్తువులు, కూరగాయలు, పండు తదితర వ్యవసాయ వస్తువుల విక్రయం తయారీలలో 9 బిలియనుడాలర్లుపైగా మొత్తము వ్యాపారము చేసినవి.

## కొనుగోలుదారు యజమానత్వంలో పరిశ్రమ

కొనుగోలుదారుల సహకారమును, కొనుగోలుదారులు యజమానత్వము వహించు పరిశ్రమగా నిర్వచించవచ్చును. ఇది నేలమీదనుంచి పైకి పెరుగును. కొనుగోలుదారుల ఒకవర్గము సహకారవ్యాపారము నడుచుటకు ఒకకూటమిగా ఏర్పడుదురు. బహుశా ఒక గిడ్డంగిని ఏర్పరుచుకొందురు. మూలధనమునుంచి ఒకటిగాని, అంతకంటె ఎక్కువగాని వాటాలు ప్రతీ సభ్యుడు కొనును. వాటా సాధారణంగా 5 కాని లేదా పదికాని డాలర్ల ఖరీదుండును. డైరక్టర్లమండలి ఒకటి ఎన్నికకాబడును. ఒక మేనేజరును నియమింతురు. ఒకవ్యాపారస్థలమును అద్దెకు తీసుకుందురు. కొన్నివస్తువులతోకూడిన మూలధనము కొందురు. అవసరమైనవిధంగా సేవలందిస్తూ సహకారవ్యవస్థద్వారా వచ్చినలాభములు పంచుకుంటూ అందరినీ సభ్యు

లుగా చేర్చుకుందురు. తరువాత సహకార గుత్త వ్యాపారసంస్థలు, యీ సహకార చిల్లర వ్యాపారసంస్థలు స్థాపించును. ఇవి గుత్తధరమునకే వస్తువులు సరఫరాచేయును. కొనుగోలుదారులకు యింకా పొదుపుచేయు నిమిత్తము యీగుత్తసహకారసంస్థలు తయారీవ్యాపారములు ప్రారంభించును. గ్రేట్బ్రిటను స్కాండినేవియన్ దేశములలో తయారీవిధానము చాలా పెద్దగా విజృంభించినది. ఇందులో అనేకవస్తువులు తయారగుచున్నవి. అమెరికారాష్ట్రములలో గుత్తకొనుగోలుదారులు, సహకార సంస్థలు, నూనె నుయ్యినుంచి కొనుగోలుదారునకు అందునట్లు పెట్రోలియంవస్తువులు ఎరువులు, సీసము, గ్రీజు, రంగు తయారీ తదితరవ్యాపారములుకూడా ప్రారంభించినవి.

## రాక్ డేల్ సూత్రములు

రాక్ డేల్ కొనుగోలుదారుల సహకారసూత్రములలో నాల్గు ప్రాతిపదికలు ముఖ్యము. సాధారణంగా కార్పొరేషనులో మూలధనము ప్రతీవాటాకు ఒకవోటు వుండునట్లుగాక ప్రతీసభ్యుడికి ఒకవోటు మాత్రమే ఉన్నచో ఆర్థిక ప్రజాస్వామ్యము తప్పక లభించును. ఆస్తి యొక్క విలువకంటె వ్యక్తియొక్క విలువకు తన ఆర్థిక పరిణామపద్ధతులలో సహకారసంస్థవిధానము ఎక్కువ ప్రాముఖ్యతయిచ్చును. రెండవది పెట్టుబడిపెట్టిన ధనమునీద చాలా పరిమితమైనవడ్డీ యివ్వబడుము. మూడవది సభ్యులు మొత్తముకొన్న కొనుగోలుబట్టి వ్యాపారములో ఎక్కువ సంపాదనగాని, లాభములుగాని, విరాళములు రూపంలో లేదా డెవడిండ్లువలె వారికి వాపసుచేయబడును. నాల్గవది సభ్యత్వముకు అందరికీ ప్రవేశమున్నది. తరగతి, రంగు, జాతి, పరిస్థితి విభేదములులేక సభ్యులైన ప్రతీవ్యక్తికి యీలాభములు అందును. ఇందులో విజయంపొందుటకు మంచి నిర్వహణశక్తి కలిగిన యజమానులుండవలయునని అనుభవము వల్ల తెలియుచున్నది. కొనుగోలుదారుల సహకారము విషయంలో కార్మికులకు ముఖ్యమైన కొన్ని యిష్టములు యిక్కడ సూచించుటకు సంఘటితకార్మికుల సహకారవ్యవస్థలకుండు సంబంధములలోని సమస్యలు తెలియచేయుటకు వీలగును.

## వేతనములు, ధరలు

ఊరికే వేతనములు పెంచుటవలన తనఆర్థికసంక్షేమము బాగుపడదని కార్మికులు తెలుసుకున్నారు, తెలుసుకొనుచున్నారుకూడ. సాధారణముగా జరుగునట్లు ధరలుకూడా పెరుగుచున్నచో కార్మికుల పరిస్థితి ఎక్కడ ప్రారంభించనదో అక్కడేవుండును. ఇంక కొనుగోలుదారుల పరిస్థితిగురించి ప్రత్యేకము చెప్పనక్కర్లేదు.

గ్రేటుబ్రిటను, స్కాండినేవియ తదితరదేశములలో ధరలు తక్కువ స్థాయిలో ఉంచబడినప్పుడే కార్మికుల కుటుంబములకు ఎక్కువ ఆర్థిక సంక్షేమము ఫలించునని ఇంతకుముందే సంఘటితకార్మికులు తెలుసుకొనిరి.

ఈ కొనుగోలుదారుల సహకారవ్యవస్థలో చాలావరకు యీ సూత్రము అమలు జరపగల అవకాశము వారికి కనిపించినది. అమెరికాదేశములో ఎ. యఫ్. యల్. సి. ఐ. ఓ. రైలురోడ్డు బ్రదర్‌హుడ్సు యీ సహకారఉద్యమమును చాలాబాగా బలపరిచినవి. ఎ. యఫ్. యల్ సి. ఐ. ఓ. రాజ్యాంగచట్టసమావేశమునందు రెండవసారి ఆమోదించబడిన తీర్మానము, క్రొత్తసమాఖ్య అన్ని సత్యమైన సహకారసంస్థలకు పూర్తి అండయిచ్చుచున్నది. చాలా ఆసక్తి కలిగించువిషయము. ఆతీర్మానములో ఈవిధముగా ఉన్నది "వేతనములు, జీతములు, కొనుగోలు శక్తిని, కొనుగోలుదారుల సహకారసంస్థలు అభివృద్ధి పరిచినవి. మంచి గుణముగల వస్తువులను తయారుచేయించుచున్నవి. మన ఆర్థిక వ్యవస్థలో నియంత్రిత్వశక్తులను నిరోధిస్తూ మంచిశక్తితో యుద్ధము చేయుగల్గినది. ప్రజాక్షేమమును అభివృద్ధిచేయుటకు తదితరవర్గములతో సంయుక్తముగా సంఘటితకార్మికులు కలిసి పనిచేయుటకు చాలా ఉత్కృష్టఅవకాశము కలిగించినవి. ఈతీర్మానములో అరువు, గృహనిర్మాణము, ఆరోగ్యము, ఇన్సూరెన్సు సహకారసంస్థలవిషయంలో ప్రత్యేకశ్రద్ధ చూపబడినది. 1956 లో ఎ. యఫ్. యల్. సి. ఐ. ఓ. కార్యవర్గము కలుసుకొని పెన్షను, సంక్షేమనిలవలు ఎక్కువగా మధ్యతరగతికుటుంబాల గృహనిర్మాణపథకాలలో పెట్టుబడి పెట్టవలసినదని అందరికీ ప్రత్యేకముగా కోరనది.

## సహకార విజయములు.

ఇదివరకు చెప్పినవిధంగా పురాతనంగా, సహకారఉద్యమము మధ్య వర్తుల లాభములు తగ్గించి, ఏకస్వతంత్రవ్యాపారమును బలహీనపరిచి చిన్న, నిపుణతలేని ప్రైవేటుసంస్థల పంపిణీవిధానంలో వ్యర్థవస్తువులను తొలగించి చాలామంది జీవనఖర్చులను తగ్గించగల్గినది. ఈ ఉద్యమము వలన దానిలోని ఉద్యోగులకు పరిస్థితులు మెరుగయ్యెను. అటువంటి మెరుగుపరిస్థితులకై కార్మికులుసల్పిన పోరాటములలో తరుచు ఈ ఉద్యమము సాయము చేసినది. తన కొనుగోలుదారు సభ్యులకు పరిశ్రమలో ప్రజాస్వామ్యముగూర్చి చక్కటిపాఠములు యివ్వగల్గినది. సాంఘిక, ఆర్థికరంగములలో ఫలవంతమైన విద్యావిషయకమైన పనిచేసినది. అందరికీ సేవచేయుటమే ప్రధానలక్ష్యంగా, అధికారము, లాభము కొద్దిమందికీ అనే ధోరణివదిలి దేశముయొక్క ఎల్లలుదాటి శాంతియుతసహకార సమాజమును వ్యాప్తిచేయుటకు యీ ఉద్యమము పునాదులు వేసినది.

## ఆర్థిక ప్రజాస్వామ్యము

సహకారఉద్యమము ఆర్థిక మరియు ప్రపంచశాంతి సాధించుటకు అవలంబించు పద్ధతులుకూడా యీ లక్ష్యమువలెనే చాలా ప్రధానమైనవి. ఒత్తిడి, దాడి, నియంతృత్వరూపంలో ఏపక్షమువారు ప్రయోగించినా దానిమీద ఆధారపడినపుడు చివరకు అనుకున్నలక్ష్యములే ఫలించవు. పైనుంచి చివరవరకు రాజకీయ లేదా పారిశ్రామిక ఏకచ్ఛత్రాధిపత్యము వలన కొనుగోలుదారుల సహకారము సాధించబడదు. క్రిందనుంచిపైకి ప్రజలు తమంతతాము ప్రజాస్వామ్యరీతిలో నిర్మించుకోవలసిన ఉద్యమము యిది. తమ వ్యాపారములో నిజమైన యజమానత్వము నిర్వహణలో తగువాటా కలిగియుండే ప్రాథమిక అవకాశములు యిది కలిగించును, అమెరికా దేశములోకూడా యిటువంటి అవకాశములు చాలామందిప్రజలకు ఉన్నట్లులేదు. తనమీదతానే ఆధారపడి తనంతతానే ముందుకుపోవు అమెరికనుపద్ధతులు అవలంబించుటకు కొన్ని ప్రత్యేక అవకాశములు యిది కల్గించును.

## ప్రజలమీద సహకారము ప్రభావము

ఆర్థికపరిస్థితులమీద, ప్రజలమీద, చాలా ముఖ్యమైన ఫలితములు సహకారము కలిగించుటకు కారణము, యివి చాలావరకు ప్రజాస్వామ్య బద్ధము. శక్తిలోనూ, తీర్పులలోను, బాధ్యతలలోనూ అభివృద్ధికల్గించి, నైతికముగా, విజ్ఞానవంతముగా ప్రతీవాడు పెరుగుటకు సహాయముచేసి తీర్పులుచేయుబాధ్యత ప్రజాస్వామ్యము. ఒకవర్గములోని ప్రతీవ్యక్తిమీద వేయును. కొనుగోలుదారుల సహకారము ఆర్థిక ప్రజాస్వామ్యము. ఇందులో తమ వ్యాపారములలోని లాభములు, నష్టములు, బాధ్యతలు ప్రతీసభ్యుడు పంచుకొనును. ఇందువలన ఇది వ్యాపారమును వ్యక్తిని కూడా అభివృద్ధిచేయును.

అభ్యుదయ సామాజిక ఉత్పత్తికి ప్రజలమీద ప్రయోగింపబడే సహకారానికి ఎంతో తేడావున్నది. ఒక గొప్ప మోటారు తయారీమనిషి యీ విధముగాఅనెను. "కార్మికుల భుజస్కంధములమీదిబాధ్యత తొలగించి బరువును యంత్రములమీదవేయుట, కార్మికుల మనస్సులలోని బరువునుతీసి దానిని కార్యాలయములో ఉంచుట, నేటి ఆధునిక యజమానుల కర్తవ్యము. కార్మికులు మానవులుగా ఉండుటకు ఏమిచేయవలెను?

సహకారవ్యవస్థలో దీనికి ఎదురు ఫలితములుకలిగిన ఒక ఉదాహరణ కలదు. బొగ్గుగనులలో ఒకడైరక్టర్సుబోర్డు సమావేశమునకు గ్రంథకర్తలలో ఒకరు హాజరైనపుడు యిది జరిగినది. ఆబోర్డులోఉన్న కొంతిమంది గని కార్మికులను గనియజమానులు హేతువాదములేదని బాధ్యతలు తెలియువని నిందించినట్లు ఈగ్రంథకర్తకు తెలిసెను. అటువంటి గనికార్మికులే సహకారసంఘయజమానత్వము బాధ్యత వారికిచ్చినప్పుడు మంచి వ్యాపారస్థునికి తీసిపోకుండా వ్యాపారసమస్యలన్నీ వాస్తవికదృష్టితో, తెలివితేటలుగా పరిష్కరించసాగిరని తెలుసుకొనుట కొంత ఆసక్తి కలిగించును. ఇతరవిషయములతోపాటు ఒకకార్మికుడు కాళలములేకుండా పనిచేయుచున్నాడన్నవిషయముకూడా వారు చర్చించిరి. ఒకనెల వార్షింగు అతనికి యిచ్చుటకు వారందరు వోటుచేసిరి. వారు అతనికి వీలయినంత సహాయముకూడా చేతుమని, అప్పటికీ అతను కనుక బాగుపడనిచో అతన్ని పనినుంచి తొలగింతుమని వారుఅనిరి.

బాధ్యతాయుతమైన పారిశ్రామిక కార్మికులను పెంపొందించేమార్గము ఒకటే. వారికి బాధ్యతకలిగిన ఏదైనాఒకటి యివ్వవలెను. అలాగే పారిశ్రామిక అశాంతిని కూకటివేళ్ళతో తొలగించుటకు మంచిమార్గము. సామాన్యప్రజలకు ఎక్కువ యజమానత్వము, అధికారము యిచ్చుటయే నని మనము పరిశోధించకల్గుచున్నాము.

## కార్మిక కొనుగోలుదారుల సహకారసంస్థలు

అమెరికాదేశములో కొనుగోలుదారుల సహకారము చాలాబాగా అభివృద్ధిచెందించినగౌరవము వ్యవసాయదారులకే దక్కును. అయినా అమెరికారాష్ట్రములలో కార్మికులతోకూడిన సహకారసంస్థలు చాలా పురాతనమైనవి. ఫిన్సు, బోహీమియన్లు, విస్కాన్సిన్, ఓహియో, మసాచుసెట్సు, ఇల్లినోయిస్ తదితరప్రాంతములలో యివి కనిపించును.

వీటిలో చాలావాటిలో కార్మికులకు, వ్యవసాయదారులకు చాలా దగ్గరసంబంధములున్నవి. వాకేగాన్, ఇల్లినోయిస్‌లలో కోఆపరేటివ్ ట్రేడింగ్ ఇన్‌కార్పొరేటెడ్‌లో చాలామంచి పారిశ్రామిక కార్మికులు కల్గిన నగరసహకారసంస్థ, ఆసంస్థకు పాలు సరఫరాచేయు అరవైమంది వ్యవసాయదారుల సభ్యులకుకూడా డైరక్టర్సుబోర్డులో సభ్యత్వము, సభ్యుల కార్యక్రమములకమిటీలో ఒకస్థానము యివ్వబడినవి. కార్మికులు, వ్యవసాయదారులు, వాటాదారులుగా కలిసివున్న ఆసహకారసంస్థకు అమ్మకమైన పాలమీద ప్రతీ సహకారసంస్థ పాలుతయారీమనిషి లాభములు పొందును.

ఈ పురాతనసంస్థలేకాక చాలాక్రొత్తసహకారసంస్థలుకూడా ఈమధ్య సంవత్సరములలో ఇతరకార్మికవర్గములతోపాటు ఉదయించినవి. వీటిలో చాలా విశిష్టమైనవి గృహనిర్మాణ సహకారసంస్థలు.

## న్యూయార్కులో గృహనిర్మాణాభివృద్ధి

బ్రోన్క్సులో 1927 లో ప్రసిద్ధమైన అమాల్గమేటెడ్ అభివృద్ధిపథకములు నిర్మాణమైనపుడు అమాల్గమేటెడ్ క్లోథింగ్‌వర్కర్సు దీనికి దారితీసినవి. మన్‌హట్టన్ పల్లపుభాగములో ఆతర్వాతనే ఈసంఘమే అమాల్గమేటెడ్ డ్వెల్లింగ్స్, మరియు హిల్‌మన్ గృహములు ప్రారంభించినది. ఈమూడుసహకారసంస్థలు ఎ. ఇ. కాజన్ నాయకత్వములో సంఘటితపడి

4135 కుటుంబాలు ఉండగలిగినట్లు గృహనిర్మాణము సాగించినవి. 1955 లో ఇంటర్నేషనల్ బ్రదర్ హుడ్ ఆఫ్ ఎలక్ట్రికల్ వర్కర్సు యొక్క లోకల్ ≠ 3 నాల్గుగృహనిర్మాణాభివృద్ధిపథకములు పూర్తిచేసినవి. ఫ్లషింగ్, లాంగ్ ఐలండులలో 2226 కుటుంబాలు నివసించగల్గునట్లుగా గృహములు నిర్మించబడెను. గృహనిర్మాణపథకం ఎలక్ట్చెస్టరు అని పిలవబడును. 1955 లో ధరల తగ్గుదలకోజాలలో, అంతర్జాతీయ స్త్రీదుస్తుల కార్మికులసంఘము ఒక "సహకారగ్రామము"ను ఏర్పాటు చేసినది. 20 మిలియను డాలర్లను ఖర్చుచేసి 1668 కుటుంబాలు ఉండునట్లుగాచేసిన చాలా ఆకర్షణీయమైన సహకార గృహసంస్థ అది. హిల్‌మన్ గృహములకు దగ్గరగా ఈస్ట్ నదికి పైభాగంగాచూస్తూ నగరములోని దుర్గంధమైన గుడిసెలుతగ్గించి వాటికిమారుగా యివి నిలిచియున్నవి. ఒక గది 625 డాలర్లచొప్పున సరాసరి పెట్టుబడిగా ప్రతీకుటుంబము సభ్యత్వము కావలసిన యివ్వవలసివున్నది. నెలకు గదికి సరాసరి అద్దె 17 డాలర్లు. న్యూయార్కులోని "ప్రైవేటువ్యాపారము" పేర కట్టబడిన గృహములఅద్దెతో పోల్చిన యిది చాలా సమంజసముగా కనిపించును.

1951 లో న్యూయార్కునగరములో 80,000 కుటుంబములు గృహనిర్మాణ సహకారసంస్థలలో నివసించినవి. ఇటువంటిసమాజములకు తదితర సహకారసేవలు సహజముగా చేయవచ్చును. సహకార ఆహార సరఫరాబజారులు, సహకార అరువుసంఘములు, సహకార శిశువిద్యాశాలలు యీ సమాజములకు సహాయము చేసినవి. సంఘముల పెన్షన్ సంక్షేమనిధులద్వారా చాలావరకు ఆర్థికసహాయము పొందునట్లు కార్మికవర్గములు అనేక ఇతర గృహనిర్మాణ సహకారపథకములు తయారుచేసుకొన్నవి.

## అక్రాన్‌లో సహకార సాహస వ్యాపారములు

సంఘటితకార్మికులచేతనే నిర్మింపబడి నిర్వహింపబడిన సహకారసంస్థలలో ప్రముఖమైన ఉదాహరణగా అక్రాన్, ఓహియోలలోఉన్నవాటిని పేర్కొనవచ్చును. యునైటెడ్ రబ్బరుకార్మికులు తదితరసంఘముల యొక్క పటుత్వమైన కృషిఫలితంగా యిది నిర్మింపబడినది. 1952 మేలో ఒక పెద్ద సహకార షాపింగ్ కేంద్రమొకటి సభ్యులు ప్రారంభించిరి.

అందులో ఆహారములబజారు, ఫలహారశాల, ఒకమందులదుకాణము మరియు దుస్తులు, లాండ్రీ, విస్త్రీ, నగలు, పనిముట్లశాఖలు కూడా కలవు. ముందుభాగములో సహకారసంస్థ సేవాస్టేషనుఒకటి ఏర్పరచబడినది. ఆప్రాంతములోని స్థానికసంఘములు, ఆక్రాన్‌సహకార్యసంస్థల సంయుక్త కృషివలన కండ్లపరీక్షలుచేసి కళ్ళద్దములు సభ్యులకు కుటుంబములకు యివ్వగల కేంద్రముకూడా ఒకటిఏర్పరచబడినది. 1955 లో నగరములో మరొకభాగములో మరొక సహకార సూపర్‌మార్కెటు ఏర్పాటు చేయ బడినది. ఆసంవత్సరములోనే ఈసంస్థయొక్క మొత్తము అమ్మకములవిలువ దాదాపు 2,700,000 డాలర్లు.

సంఘటితకార్మికుల కోరికలలో శ్రద్ధుడైన యజమాని ఒక్కొక్కసారి అంటాడు. "కార్మికులు తమంతతాము వ్యాపారము నడిపించిన తెలు స్తుంది. అటువంటివ్యాపారము త్వరలోనే విఫలమాతుంది." అని రాక్ డేల్ సూత్రములు అవలంబించి, నిపుణతతో కూడిన యాజమాన్యములోకి అంతర్గతరాజకీయముల చొప్పించకుండా ఉన్నప్పుడు సాధారణకార్మికులు వ్యవసాయదారులు కలిసి అవకాశమిస్తే వ్యాపారమును జయప్రదముగా నడపగలరని సహకారఉద్యమము చరిత్ర చెప్పుచున్నది.

## పరపతిసంఘములు

ఈదేశములో సహకార పరపతిఉద్యమము త్వరగా పెరుగుచున్నది. పరపతిసంఘములు లేదా పిల్లబ్యాంకులు సభ్యులచే ఏర్పరచబడి పాలించ బడునప్పుడు చాలాతక్కువ వడ్డీకి అప్పులుయిచ్చును. ఇటువంటిఅప్పులు కార్మికులు బ్యాంకులనుంచి తెచ్చుకొనలేరు. అందువలన అప్పుయిచ్చు కంపెనీలకు చాలా హెచ్చువడ్డీ చెల్లించవలసియుండును. పరపతిసంఘ ములు అప్పుడప్పుడు కొనుటవలనకల్గు ఖర్చులుకూడా తగ్గించును. పొదు పుగా ఉండుటకు అవి అవకాశము కల్పించి తమ సాహసవ్యాపారముల నేకమునకు డబ్బు సర్దుబాటుచేయుగలశక్తి వారికిచ్చును. కార్మికునియొక్క ఆత్మగౌరవభావన, ఆర్థికస్వయంసమృద్ధిభావన యివి అభివృద్ధిచేయును. (యింకా ఎక్కువ సమాచారమునకు క్రెడిట్ యూనియన్ నేషనల్ ఎసోసియేషన్ మాడిసన్ విస్కాన్సిన్‌కు వ్రాయవలెను.)

## సహకారసంస్థలతో సంఘముల సంబంధములు

సహకారసంస్థలు, సంఘటిత కార్మికుల సంబంధములనే అనేక సమస్యలు ఇవి. అవి కార్మికులసంఘములను సహకారసంస్థలు గుర్తించుట, తమ ఉద్యోగులకు, సంఘ వేతనములు, నిర్ణీత కాలములు అన్వయింపచేయుట వీలైనచోట్ల సహకారసంస్థల సంఘముద్రగల వస్తువులు వాడుట, కార్మిక సంఘములు సహకారసంస్థలవిషయంలో న్యాయముగా సంచరించుట మొదలైనవి. చాలాసహకారసంస్థలు ఈసమస్యలు చాలా సుఖకరముగా పరిష్కరించినవి. ఈ రెండు ఉద్యమముల నాయకులు ఈ సమస్యాపరిష్కారములు జాగ్రత్తగా పరిశీలించి స్నేహపూర్వకముగా చర్చించదగును. విదేశములలోను, సంఘటిత కార్మిక సంఘసభ్యులు సహకారఉద్యమమును నిర్మించుటకు సహాయపడిన ఈదేశములోని వివిధప్రాంతములలోను చాలాసంతృప్తికరమైన పరిష్కారములు లభించినవని, ఈసమస్యలకు సంబంధించిన సంఘతత్వవాదులు గ్రహించగలరు. (యింకా ఎక్కువ సమాచారమునకు జేమ్సు మేయర్సు వ్రాసిన "లేబర్ కోఆపరేటివ్సు" కోఆపరేటివ్ లీగ్ ఆఫ్ యు. యస్. ఏ. 343, సౌత్ డీర్‌బోర్న్ స్ట్రీట్ చికాగో 4 ఇల్లినోయిస్) చూడుడు.

## కొనుగోలుదారుడైన కార్మికుని రక్షణసంఘముద్ర

సంఘము విధించిన షరతులక్రింద తయారైన వస్తువులను కొనుటకు ప్రోత్సహించుటకు సంఘటిత కార్మికులు సంఘముద్ర అను ఒకసాధనను ఏర్పరచిరి. ఆముద్ర తయారైనవస్తువునకు అంటించబడును లేదా సంఘము దుకాణములో కిటికీలో అది ప్రదర్శించబడును. నిజం చెప్పాలంటే మంచి కార్మికపరిస్థితులలో తయారైన వస్తువులు, గుణము, ధర, దృష్ట్యా అంత మంచి కొనుగోలువస్తువులుగా ఉండవు. ఇది సాధారణముగా సంఘటిత కార్మికులతప్పుఅని చెప్పలేము. ఎందువల్లనంటే వాడేవస్తువుల గుణమును నిర్ణయించి ధరలను స్థిరపరుచువారు యజమానులే. సంఘముద్రలు తదితరముగా దుర్వినియోగము చేయబడిన ఉదాహరణలున్నను, వస్తువులు న్యాయమైన కార్మికపరిస్థితులలో చేయబడినవని, చెడ్డపరిస్థితులలో తక్కువ జీతము యివ్వబడిన కార్మికులు తయారుచేసినవికావని ఒకేఒక గ్యారంటీ సాధారణంగా దీనివలన లభ్యమగును.

చిల్లర వ్యాపారము, ఆహారవస్తువులు పరిశీలించునపుడు ఉదాహరణకు సంఘము తయారుచేయుపిండి పొందుటసాధ్యము. కొన్ని పండ్లరసం తీయు యంత్రములు, ఇతరతయారీయంత్రాగారములుకూడా స్థాపించబడినవి. కాని వ్యవసాయకార్మికుల సంఘములు చాలా కొద్దిగాను, చిన్నవిగాను ఉన్నవి. సాధారణపరిస్థితులుకూడాలేని ప్రమాణములలో, జీవన పరిస్థితులలో వలసకార్మికులు, బాలకార్మికులు పండించుపంటలు ఎక్కువగా యివి చక్కెరబీట్లు, పీస్, (బొటానీలు), బీన్సు, టమాటాలు, ఉల్లిపాయలు, ద్రాక్ష, లెట్యూస్‌కంద, దినుసుతోటకూర, నిమ్మ, దబ్బపండ్లు, ఎండుద్రాక్ష మొదలైనవి.

ఇంకా ఎక్కువ విశాలముగా అమెరికాకార్మికులు సంఘటితబడవలెను. కనీసవేతనములు పెంచుచు, అధికపని చేయుకాలము తగ్గించుచు పరిశ్రమలందు, వ్యవసాయమునందు, బాలకార్మికులు పనిచేయుట నిర్మూలించుచు యింకా ఎక్కువగా రాష్ట్రకేంద్రశాసనములు చేయబడవలెను. అప్పుడే అమెరికను కొనుగోలుదారులు సంతృప్తికరమైన మనస్సుతో కొనితినగలరు.

## ముగింపు

ప్రజాస్వామ్యముయొక్క రక్షణసూత్రము, రాజకీయజీవితములోనే కాక, కార్మికసంబంధములందు, ఆర్థికపద్ధతులందుకూడా వ్యాప్తరూపము పొందుననుట నిజము.

ఇందలి మూలసూత్రము మళ్ళీ యిచ్చట ప్రకటించినచో సామాన్యులు ఈ ఆర్థికవ్యాపారముయొక్క యజమానత్వము నిర్వహణలో ఎంతవరకు పాల్గొంటున్నారన్నది పరిశ్రమలో ప్రజాస్వామ్యమునకు చివరిపరీక్ష. ప్రధానముగా అందరిసేవకొరకు కొంతమందిలాభము, గౌరవముకొరకు మాత్రమేకాక పరిశ్రమనడుపబడుచున్నదన్న గ్యారంటీకి అదే ముఖ్యము.

159

# 13 పౌరులుగా,.కార్మికులపాత్ర

తనసభ్యుల జీవనప్రమాణములు పెంచుటలో శ్రామికసంఘ ఉద్యమము చాలా సాధించినదని చాలామంది ఒప్పుకుందురు; కాని దేశము మొత్తము మీద ఆవృతమైన సమస్యల పరిష్కారము కార్మికులపాత్ర ఏమిటని చాలామంది ప్రశ్నింతురు.

సంఘములో తమసభ్యుల ఆర్థికప్రమాణములు హెచ్చించినపుడల్లా (ప్రస్తుతము యీసభ్యులు పారిశ్రామిక కార్మికతరగతిలో మూడవవంతును, తమ కుటుంబములతో సహా దేశప్రజలలో చాలా పెద్దతక్కువసంఖ్యగానూ ఉందురు.) మంచి పరిస్థితులకోసం, సంఘటిత కార్మికులలో కూడా కోరిక పెరుగుచున్నది. పరోక్షముగాగాని, ప్రత్యక్షముగాగాని, యీపరిస్థితి దేశముయొక్క ఆర్థికవ్యవస్థపై ఒకవిధమైన చురుకుప్రభావము కలిగించుచున్నది. నిజమైన ప్రజాస్వామ్యసమాజమునకు అవసరమైన ప్రాతిపదిక అయినటువంటిది—కార్మికులలో ఆత్మగౌరవము, మానవ హోదా పెంపొందించు భావనమీద అమితమైన ప్రభావము ఈకార్మికుల జీవనప్రమాణములు పెంచుటకుచేయు ఉమ్మడిచర్యవలన కల్గుచున్నది సర్వవిదితము. పురాతనకాలములో కార్మికులను వారిపనిచేయుశక్తిని, తదితరవస్తువులవలె కొని అమ్మగలిగే వస్తువుగా పరిగణింపబడుచుండెను. తదితరమానవులవలె దేశములోని కార్మికులకుకూడా అవసరములు, పెద్దకోరికలుకూడా ఉండునని సంఘములు ఉద్ఘాటించినవి. స్వతంత్రప్రజాస్వామ్య సమాజములో ఎక్కువ పరపతి కావలెననియేకాని ఒక్క ఎక్కువ వేతనముమాత్రము కావలెననుట లక్ష్యముకాదు.

## పౌరసత్వము నేర్చుకొనుటకు సంఘములు పాఠశాల

పౌరసత్వమునకు, కార్మికోద్యమము ఒకపెద్ద శిక్షణశాలగా తయారయినది. ప్రపంచమునకు, దేశమునకు సంబంధించిన విషయములలో తమ లక్ష్యములు చర్చించి తమ ప్రభావము యింకా పెద్దదైన సాంఘికఅంశము

లపై ప్రసరించునట్లుండుటకు, సంఘటితపడని కార్మికులవలెకాక, సంఘములకు ఒక అవకాశము లభించినది. ప్రజాసమస్యలు, చర్చించుటకు, వివిధరకములుగ సంఘసమావేశములు చర్యావేదిక లయ్యెను. అన్ని ప్రజాస్వామ్యసంస్థలలో, పద్ధతులలో కనిపించు బలహీనతలు, బలములు యీసంఘసమావేశములు, మహాసభలలోకూడా కనిపించుననుట నిజమైనను, మన ప్రజాస్వామ్యప్రభుత్వ స్వరూపమును రక్షించుటకు కార్మికోద్యమము ఒక పెద్దశక్తిగా ఏర్పడునని చెప్పవచ్చును. ఈనిర్దుష్ట అభిప్రాయమునకు యీక్రిందికారణములుగలవు.

## కార్మికుల సమాజ కార్యక్రమములు

సమాజ సాంఘిక ఏజన్సీలకు సంఘటితకార్మికులు పెద్దనిధులు పోగుచేయుటయే, గత కొన్నిసంవత్సరములలో విశిష్టమైన పరిణామము. 1955 లో ఎ. యఫ్. యల్. మహాసభలో జార్జి మీనీ ప్రకటించిన దేమన 5,51,000 మంది సభ్యులు తమంతతామే ఆరోగ్యము, సంక్షేమము, వినోదముచేయు ఏజన్సీల కమిటీలలో కార్యవర్గమండలులలో అమెరికారాష్ట్రములలో సేవచేయుచున్నారు. సి. ఐ. ఓ. యొక్క అఖరి మహాసభలో వాల్టర్ రూథర్‌కూడా, సి. ఐ. ఓ. సంఘసభ్యులకూడా యిటువంటి కార్యక్రమములు జరుపుచున్నారని చెప్పెను. సమాజకోశాగారములకు మూడవవంతుసొమ్ము సంఘటితకార్మికులద్వారా వచ్చుచున్నది.

ఈమధ్యనే వెలువడిన ఎ. యఫ్. యల్. కార్యవర్గనివేదిక ఒకటి ప్రకటించిన ప్రకారము "సమాజాభివృద్ధికై గుడిసెలు తొలగించి, మంచి గృహనిర్మాణపథకములు నిర్వహించి నిండైన పట్టణాభివృద్ధిపథకములు వేసి రోడ్లు, వంతెనలరవాణాను ఆధునికముగాచేసి తదితర పౌరకార్యక్రమములుద్వారా అనేకసమాజములలో కార్మికులసంఘములు తమ ప్రయత్నములు ఎన్నోచేసినవి. విద్యావిషయిక అవకాశములుకూడా బాగుపరచుటకు వారు నిత్యమూ కృషిచేసిరి."

వందసమాజములలోఉన్న సి. ఐ. ఓ. సంఘముయొక్క 25,000 సంఘ సలహాదారులగురించి వాల్టర్ రూథర్ చెబుతూ యీవిధముగా అనెను. ముసలివారికి సమాజకార్యక్రమములు ఏర్పరచుటలోను, పౌరరక్షణ, బాల్యనేరములు, మద్యపానము తగ్గించుట, సమ్మెదారుల కుటుంబములకు

ఆహారములు సరఫరాచేయుట మొదలైనవి వారు చేయుచుండిరి. వారి సమాజసంబంధశాఖద్వారా, డాక్టర్ జి. రూధర్ ఆధ్వర్యంలో, చర్చిలో, విద్యావిషయంలో, పౌర, వ్యవసాయ, యౌవన, నిపుణుల ఇతరసంఘములలో కార్మికుల నర్థముచేసుకొనునట్లుచేయుటలో సి. ఐ. ఓ. తీరుబడి లేకుండా పనిచేసినది.

ఎ. యఫ్. యల్; సి. ఐ. ఓ. రాజ్యాంగచట్టము సమాజసేవాకమిటీని ఒకటి సృష్టించినది. దానివలన స్థానికకమిటీల వ్యవహారములలో సభ్యులు అనుబంధసంఘములు ఎక్కువగా పాల్గొనునట్లు, అటువంటి సమాజముల లోని సాంఘిక ఏజన్సీలతో నిండైన సంబంధములు పెంపొందింపచేయుటకు ఎక్కువ ప్రోత్సాహము యివ్వబడినది. మొట్టమొదటి ఎ యఫ్. యల్; సి. ఐ. ఓ. రాజ్యాంగబద్ధసభలకు యీకమిటీయొక్క అండదండలుండుటయే గాక అవి దేశ, అంతర్జాతీయసంఘములలో రాష్ట్ర, నగర, కేంద్రసంఘములలో పూర్తికాలము పనిచేయు ఉద్యోగులను ఏర్పరిచి సమాజసేవశాఖలను సృష్టించెనని ప్రకటించినది. ఆమహాసభ ప్రకటనలో అన్ని స్థానిక సంఘములు, సమాజసేవాకమిటీలు స్థాపించవలెననికూడా ఉన్నది.

ఎ. యఫ్. యల్; సి. ఐ. ఓ. సమాజసేవాకమిటీ అధ్యక్షుడు, కమ్యూనిస్టు కేషనువర్కర్సు అధ్యక్షుడు అయిన జోసెఫ్ ఎ. బెయిర్ను దరిద్రముతో బ్రతుకుతున్న ప్రజలందరివైపు ప్రతినిధులదృష్టి మరల్చి యీవిధముగా అనెను. "కమ్యూనిజం అనే పెద్దసమస్యనుగురించి ఆలోచిస్తూ దెబ్బలాడుకోవడం చాలాచిన్నతనంగా ఉంటుంది. ముఖ్యంగా మనపొరుగువారిని, మనయింటివెనుకవారిని, మనదేశములో వారినే మనం మర్చిపోతూ దెబ్బలాడుకోవడం హాస్యాస్పదం."

1956 లో క్రొత్త ఎ. యఫ్. యల్; సి. ఐ. ఓ. కార్యవర్గకౌన్సిలు తన మొట్టమొదటి సమావేశంలో సంఘసభ్యునికి, సమాజమునకు ఉండవలసిన పరస్పరబాధ్యతనుగురించి ఒక విశిష్టమైన ప్రకటనచేసినది. బెయిర్ను అధ్యక్షుడిమాటలలో "ఆ ప్రకటన ఒంటరిగా విడిపోవడం, తరగతిపోరాటమును వ్యతిరేకించును. ఎ. యఫ్. యల్; సి. ఐ. ఓ. సభ్యులు సహకారము, లీనీకరణ, ప్రథమతరగతిపౌరత్వము అందరికీ యింకా మంచిసమాజం కలిగేలా కృషిచేయవలెనని ఆప్రకటనలో సూచించబడినది."

అందులో యీ విధముగా ఉన్నది.

1. మొట్టమొదటగా పౌరులు: "తనసమాజములో సంఘసభ్యుడు మొట్టమొదటి పౌరుడు."

2. సమాజబాధ్యత: "తనసమాజమునకు సంఘసభ్యుడికి ఒకబాధ్యత కలదు. తనసమాజము, నివసించుట, పనిచేయుటకు, పిల్లలను అభివృద్ధి చేయుటకు అనువైన మంచిస్థలముగా తయారుచేయుటలో అతను తన తోటి పౌరులతో సహకరించవలెను. సమాజమంతకు వినోదసేవా కార్యక్రమములు, సంక్షేమము, తగినంత ఆరోగ్యము ఉందవలసిన అగత్యము గురించి అతడు సహాయపడవలెను."

3. ఆరోగ్యము, సంక్షేమము: "ఉద్యోగము ఒక్కటేగాక, తమసభ్యుల, కుటుంబముల, ఆరోగ్యము, సంక్షేమముకూడా చూచుట సంఘముల బాధ్యత. ఈబాధ్యతఅంటే సమ్మె, నిరుద్యోగము, నాశకరనష్టము కలిగిన అత్యవసర పరిస్థితులలోనేగాక, ఆ ఉద్యోగిఅయిన సభ్యుడి వ్యక్తిగత, కుటుంబసమస్యలుకూడా పరిష్కరించుట" అనిఅర్థము.

4. సాంఘికావసరములు: తనపౌరులకు, సమాజము ఒకబాధ్యత కలిగియున్నది. తమకున్న ఆధారములలో తగినంతగా తమసాంఘికావసరములు కుటుంబములు, వ్యక్తులు, తీర్చుకోలేరుకనుక, సమాజముసాయం చేయవలెను.

5. సాంఘిక సేవాఏజన్సీలు: ఉన్నసాంఘికసేవా ఏజన్సీలకు సహాయము చేసి వాటిలో పాల్గొనుటయేకాని, తమరుతాము ప్రత్యక్షముగా సాంఘికసేవ ఏజన్సీలు స్థాపించకూడదని, సంఘములు ఒకనిర్ణయము చేసుకున్నవి. అందరప్రజలకు సాంఘిక ఏజన్సీలు, వారిచ్చే సదుపాయములు సేవచేసినంతగానే, సంఘటితకార్మికుల స్త్రీపురుషులకుకూడా వారు సేవచేయుదురు.

6. ప్రభుత్వబాధ్యత: ఆరోగ్యము, సంక్షేమమునకు సంబంధించిన అన్ని అవసరములు ప్రజలకు తీర్చవలసిన ప్రాథమికబాధ్యత ప్రభుత్వమునకున్నది.

7. తమంతతామే పనిచేయు ఏజన్సీలు: సమాజముయొక్క సాంఘికావసరములు తీర్చుటలో తమంతతామే పూనుకొని ఏర్పడిన సేవాఏజ

స్సీలు వారిచ్చు సదుపాయములు ఒక ప్రముఖస్థానము వహించును. తమంతతాము స్వయముగాచేయు సాంఘికసేవారంగములోని పెద్ద బాధ్యతలు, శీలనిర్మాణము, బాలలకు సరైన ఉపదేశములు, కుటుంబ మునకు సలహాలు, యువకార్యక్రమములు, ప్రయోగములు చేయుట పరిశోధన మొదలైనవి.

8. సహకారము: సాంఘికసేవలయొక్క గుణము, మొత్తము, అభివృద్ధి చేయుటలో సమాజవర్గములకు సహకారమందిచ్చి ఉన్నఆరోగ్యము, సంక్షేమముయొక్క సేవలు, వాటిని వాడుకొనే విధానములగురించి సంఘసభ్యులకు తెలియజెప్పుట మొదలగునవి సంఘటితకార్మికుల బాధ్యతలు.

9. విచక్షణలేకుండుట: "జాతి, రంగు, పుట్టినదేశము మొదలైనవాటిని ఆలోచించకుండా అవసరముయొక్క కారణము లెక్కచేయకుండా అవసరాన్నిబట్టీ ఏవిధంగా వీలైతే ఆవిధంగా సహాయము అందివ్వ వలెను."

10. నివారణ: "సాంఘికరోగములు కుదుర్చుటకంటె సాంఘిక సమస్యలు ఉత్పన్నంకాకుండా నివారించుటే శ్రేష్ఠము."

1956 మార్చిలో సమాజఏజన్సీలు, సేవానిరతికి సంఘటితకార్మికులు ఎన్నుకున్న దాదాపు 150 మంది పూర్తి ఉద్యోగులు, ఎ. యఫ్. యల్; సి. ఐ. ఓ. సమాజ సేవాకమిటీ మహాసభల ప్రథమసమావేశమునకు హాజరయి, కార్మికఉద్యమను కార్యక్రమములు, సాంఘికఏజన్సీల కార్యక్రమములలో లీనీకరణచేయుటకు తోడ్పడిరి.

ఎ. యఫ్. యల్; సి. ఐ. ఓ. కార్యదర్శి మరియు కోశాధికారిఅయిన విలియమ్ యఫ్. స్కినిట్జ్లర్ హాజరైన వారితో యీవిధముగా అనెను. "వృత్తిసంఘోద్యమమును బలవంతాన జొన్పిన, సంకుచితమార్గము ఈ వాడులేదు. ఒక్కవేతనములేకాక, కార్మికులు చూచుకోవలసినసంగతులు యింకా చాలాఉన్నవి." జోసెఫ్ ఎ. బెయిర్న్, సమాజసేవాకమిటీ అధ్యక్షుడు; యీవిధముగా అనెను.

"సంఘములు, సమాజములతో ఎంతవరకు కలిసిపోగలవో అన్న దానిపై వృత్తిసంఘోద్యమముయొక్క విజయము ముందుముందు ఆధారపడి యున్నది."

ఆకమిటీ డైరెక్టరు లియో ఎ. పెర్లిస్ యీవిధముగా ప్రకటించెను. "కార్మికులకు ప్రజలతో ఎక్కువసంబంధము ఎందుకన, వారు మానవులు. వారు సంఘసభ్యు లవడంచేగాని, కార్మికులు ప్రజలకొరకు పాటుపడవలె ననిగాని, ముఖ్యోద్దేశ్యము కాదు."

ఇంకా మంచి సమాజములు నిర్మించుటలో సహాయపడుటకు ఎ. యఫ్. యల్; సి. ఐ. ఓ. నిత్యమూ పనిచేయుకమిటీలు చాలా ఏర్పాటుచేసినది. వాటిలో ముఖ్యమైనవి విద్య, గృహనిర్మాణమునకు సంబంధించినవి. నిజంగా ఆవిధంగా రాజ్యాంగబద్ధంగా సృష్టింపబడిన కమిటీలు, సరిగా పనిచేస్తే ఉత్తమ సమాజ నిర్మాణములకు చాలా దోహదము చేయును.

## సాంఘిక శాసనములు

ఇతరవిధములుగా దేశప్రజలకు సంఘటితకార్మికులు సేవచేసిరి. స్థానిక, రాష్ట్రదేశస్థాయిలోని సంఘసమావేశములలో ఆమోదింపబడిన తీర్మానములద్వారా ప్రతిపాదించబడిన శాసనముల విషయంలో తమ ప్రతినిధుల ద్వారా చర్చింపచేయించి పంపించుటవలన, శాసనసభలలోని ప్రతినిధులపై తమప్రభావమువలన చాలా స్వతంత్రమై, మానవతతో కూడిన శాసనములు పెరుగుటకు కార్మికులు చాలాముఖ్యకారణము. అభ్యుదయకారకులతో చేతులుకలిపి ఉచితప్రభుత్వపాఠశాలలు, తప్పనకు జైలుశిక్ష రద్దుచేయుట, అందరిపౌరులకు వోటుహక్కునిచ్చుట మొదలగువాటిపై పోరాటము సాగించుటవలన 19 వ శతాబ్దం మొదటిభాగమునుంచి కార్మికులచరిత్ర చాలా ఆకర్షణీయంగావుంది.

ఈమధ్యసంవత్సరములలో శాసనముల పట్టికలో చేరుటకు కార్మికులు తోడ్పడినశాసనములు, చాలాపరిశ్రమలలోపిల్లలచే పనిచేయించుట మాన్పించుట, చాలా ఎక్కువకాలము పనిచేయకుండా స్త్రీకార్మికులకు రక్షణ, కనీసవేతనము, ఉమ్మడిబేరము, కార్మికుల నష్టపరిహారము, ముసలితనం పెన్షనులు, నిరుద్యోగ ఇన్సూరెన్సు, చెత్తగుడిసెలనిర్మూలన, పౌరహక్కులరక్షణ, ప్రజాక్షేమంకోసం తదితరసాంఘికశాసనములు మొదలైనవి.

సంఘటిత కార్మికుల విజయములువలె, సంఘటితముకాని కార్మికులు శాసనసంస్కరణలు, కార్మికులకుగాని, ప్రజలకుగాని సాధించుటలో తీసుకున్న ప్రత్యక్షచర్యలేమీలేవు. సంఘటిత కార్మికులు చాలా ఎక్కువగా తరగతిభావన కలిగియున్నారన్న ఆరోపణకు సమాధానము, సంఘటితముకాని కార్మికులలో అసలు ఏభావన, చైతన్యములేదని చెప్పవచ్చును. ఉద్యోగులు ఫిర్యాదులుచేసి ప్రణాళికలు, కంపెనీసంఘములు ప్రజావ్యవహారములలో అంతప్రశంసనీయమైన ప్రభావము కలిగిలేవు. చాలా విషయములలో, పౌరులసంస్థలైన ది నేషనల్ చైల్డ్ లేబరుకమిటీ, ది నేషనల్ కన్స్యూమర్సులీగ్, కార్మికశాసనములకు అమెరికను ఎసోసియేషను, సాంఘికభద్రతకు అమెరికను ఎసోసియేషను, ప్రజాస్వామ్యచర్యలకై నిలబడిన అమెరికనులసంఘము, నేషనల్ హౌసింగ్ కాన్ఫరెన్సు, ది కోఆపరేటివ్ లీగ్ ఆఫ్. యు. యస్. ఏ, చర్చిసంస్థలు, తదితరములు, సాంఘికసంస్కరణలు సంపాదించుటలో చాలా గట్టిపని చేసినవి. దురదృష్టవశాత్తు, ఏవోకొన్నితప్ప, యజమానుల సంఘములున్నూ, రికార్డుల ప్రకారం, వీటికి చాలావరకు వ్యతిరేకత ప్రదర్శించినవి.

## రాజకీయఅనుబంధములు

రాజకీయరంగములో, పెద్దకార్మికసంస్థలవిధాన మేమన, ఏరాజకీయ పక్షముతోగాని సంబంధముపెట్టుకోరాదని, తమంతతాము ఏదీ కార్మిక పార్టీ ఒకటిస్థాపించరాదని, కాని వోటింగుసమయమందు కార్మికుల స్నేహితులకు జయముకల్గించి, కార్మికశత్రువులకు అపజయము కలిగించుటయే. ఈ ఉద్దేశ్యముతో శాసనసభ ప్రతినిధులవోటింగు రికార్డులు పరిశీలించబడును. ఏపార్టీకిసంబంధించినా వ్యక్తిగతముగా అటువంటివారిని ఎన్నుకొనుటలో వారు ఏకాభిప్రాయము వెలడించిరి.

ఇంతకుముందేచెప్పినవిధంగా సంతృప్తికరమైన ఫలితములు దొరకనిచో కార్మికులు ఎప్పటికైనా మరొకపార్టీ స్థాపించగలరనేభయము రాజకీయవేత్తల్లోఉన్నా, కార్మికులు యీ పద్ధతిలో చాలా సాధించిరి. ఇటువంటి భయమునకు ప్రాతిపదిక లేదనకుండాఉండుటకు సెనేటర్ లా ఫాలెటీ ప్రోగ్రెసివ్‌సభ్యుడు ఎ. యఫ్. యల్. కార్యవర్గకౌన్సిలు, రైలురోడ్డు బ్రదర్ హుడ్సుప్రకటనలు, 1935 కు ముందు జరిగిన ఎ. యఫ్. యల్.

మహాసభ అధ్యక్షుడు విలియమ్ గ్రీన్, ఆసమయములో లేబరుపార్టీ ఏర్పడుటకు వ్యతిరేకించుచు 1924 లో చేసిన ప్రకటనలు ఋజావుచేయుచున్నవి. వారు యింకా యిలా అన్నారు. "ఏ పక్షమునకు చెందనిపార్టీ రాజకీయచర్యద్వారా కాకుండా పార్టీద్వారానే తమహక్కులు యిష్టములు ఎక్కువగా సాధించవచ్చని కార్మికులుకనుక తమ అభిప్రాయము స్పష్టముగా వ్యక్తపరిచిన, ఈసమాఖ్య స్వతంత్రమైన రాజకీయచర్యకు పూనుకుని స్వతంత్రమైన లేబరుపార్టీగా ఏర్పడగలదు." నేషనల్ ఎసోసియేషన్ ఆఫ్ మాన్యుఫాక్చరర్సువారు తయారుచేసిన లేబరు కార్యక్రమముకు వ్యతిరేకముగా దాడిచేసి చర్చించునపుడు, పనిచేసేహక్కు శాసనములు బలపరుచునప్పుడు, ఎ. యఫ్. యల్; సి. ఐ. ఓ. అధ్యక్షుడు జార్జి మీనీ యిటువంటిఅభిప్రాయమునే వ్యక్తపరిచెను. "నేషనల్ ఎసోసియేషన్ ఆఫ్ మాన్యుఫాక్చరర్సుయొక్క సిద్ధాంతములు, సంఘములకు వోటుహక్కులేకుండాచేయుచో దానిజవాబు స్పష్టము. మన హక్కులు రక్షించుకొనుటకు సంఘములుగా మనము వ్యవహరించనిచో లేబరుపార్టీని స్థాపించుటతప్ప, మరొకజవాబులేదు."

గ్రేటుబ్రిటను, న్యూజీలాండు, స్కాండినేవియన్ దేశములు, బెల్జియం, హాలెండు, ఫ్రాన్సు, ఆస్ట్రేలియా, చాలా త్వరగానే కార్మికసంక్షేమమున అభివృద్ధిచెందినవి. కొన్నివిషయములలో అమెరికారాష్ట్రములలోకంటె ఎక్కువ పురోభివృద్ధి కనిపించెను. ఈదేశములలో చాలాశక్తివంతమైన లేబరు, మరియు, సహకారఉద్యమములు ఉండుటయేకాక చాలాశక్తివంతమైన సాంఘికప్రజాస్వామ్యవాదులు, సోషలిస్టులు, కార్మికులు, వ్యవసాయకార్మికులు, గల పార్టీలుకూడాఉన్నవి. ఇవి కొన్నిదేశములలో ప్రభుత్వములే ఏర్పరిచినవి. 1956 ప్రథమభాగములో, యూరోపులోని యీపార్టీలు డెన్మార్కు, నార్వే, స్వీడనుప్రభుత్వములనే అదుపాజ్ఞలలో పెట్టుకున్నవి. బెల్జియం, ఫిన్లండు, ఫ్రాన్సు, హాలెండుదేశములలోని మిశ్రమప్రభుత్వములకు నాయకత్వము వహించినవి. ఆస్ట్రియా, ఇటలీ, స్విట్జర్లండు, మంత్రివర్గములలో పాల్గొన్నవి. జర్మనీ, గ్రేటుబ్రిటనులలో ముఖ్యవ్యతిరేకపక్షములుగా వ్యవహరించినవి. ఆస్ట్రేలియా, జపాను, న్యూజీలాండుదేశములలో ముఖ్యమైన వ్యతిరేకపక్షములుగా ఏర్పడినవి.

ఇశ్రేల్, బర్మా ప్రభుత్వములలో ప్రముఖవ్యక్తులయ్యేను. జమైకా, సస్కాచవాన్, కెనడా, ప్రభుత్వములు ఏర్పరిచినవి. భారతదేశములో సోషలిస్టు పార్టీ దేశములో చాలా ప్రభావముకలది. కాని నెహ్రూనాయకత్వంలో కాంగ్రెసుపార్టీ, సోషలిస్టు కార్మికవిధానములు కలిగియున్నట్లు గర్వపడుచున్నది.

అమెరికాశాస్త్రములలో, తనరాజకీయకార్యక్రమము అన్నిటిని పెద్ద రాజకీయపార్టీలలోనే కార్మికోద్యమము పరిమితము చేసుకున్నది. ఎ. యఫ్. యల్; సి. ఐ. ఓలు కలియకముందు రెండుసంస్థలు, విడివిడిగా కమిటీలు ఏర్పరిచి, రాజకీయపార్టీ కార్యక్రమములు కొనసాగించినవి. ఎ. యఫ్. యల్. కమిటీపేరు, లేబర్సు లీగ్ ఫర్ పొలిటికల్ ఎడ్యుకేషన్; సి. ఐ. ఓ. కమిటీపేరు పొలిటికల్ యాక్షన్‌కమిటీ. ఈకమిటీలు వోటర్లకు అభ్యర్థుల రికార్డులు, ఆయావోటింగు ఉద్యమాల మంచిచెడులు వివరించెడివి. కార్మికుల రాజకీయానుభవములుగూర్చి పత్రికలు ప్రకటించినవి. ఎన్నికదినములనాడు, ఎక్కువచదువురానివారివోట్లు వోటుచేయబడునట్లు కృషిచేసెడివి. నగర, రాష్ట్ర, దేశములలో ఎక్కువమంది లిబరల్ అభ్యర్థులు పదవిలోకి వచ్చునట్లు బాధ్యత వహించుమని ఆ రెండు సంస్థలుకూడా ప్రకటించినది. సంఘటితకార్మికుల స్వీయవిరాళాలవల్లనే యీకమిటీలు పనిచేసెడివి.

ఎ. యఫ్. యల్; సి. ఐ. ఓ. సమాఖ్య ఏర్పడినాక ఈకమిటీలు అదృశ్యమైనవి. ప్రత్యేకమైన నిత్యమూ పనిచేసే, కమిటీ అఫ్ పొలిటికల్ ఎడ్యుకేషను ఒకటి ఏర్పడినది. ఈకమిటీ సంపూర్ణమైన రాజకీయవిద్య కార్మికులకు తెలియజేయుటకు, తమ పౌరహక్కులు, బాధ్యతలు సంపూర్ణముగా అనుభవించునట్లు వారిని ప్రోత్సహించుటకు యీకమిటీ ఉద్దేశించబడినది.

ఎ. యఫ్. యల్; సి ఐ. ఓ. యొక్క మొట్టమొదటి రాజ్యాంగ మహాసభయందు తీర్మానాలకమిటీ, కార్మికులు కొనసాగించగల కొంత శాసనముల వివరములు సేకరించి యీవిధముగా ప్రకటించినది "ఈ విజయము లున్నను, తనసంస్థను అభివృద్ధిచేసుకొనుటకు కార్మికుల న్యాయసమ్మతమైన కృషిని కొన్నికొద్దివైనా బలవత్తరమైన ప్రతిఘాతవ్యాపార

వర్గములు వ్యతిరేకించుచుండెను. సంఘటిత కార్మికుల రాజకీయ కార్య క్రమములు వ్యాప్తిగావలెననియు, సమాఖ్య సభ్యులభార్యలు, సోదరీమణులు కూతుండ్రు మొదలైనవారిలో సంఘముయొక్క స్త్రీ సభ్యురాండ్రలో రాజకీయవిద్య చెప్పుట ఎక్కువగా జరగవలెననియు ఈకమిటీ కోరినది.

ఏదోఒక రాజకీయపార్టీకి కార్మికుల అనుబంధము కలిగియుండుట విష యంలో చర్చలేకుండా మహాసభలో కమిటీతీర్మానము యీ క్రిందివిధ ముగా ఆమోదింపబడినది:—

"సంఘటిత కార్మికుల సంప్రదాయక విధానమైనటువంటిది. ఏవిధమైన యితరవర్గములతో అనుబంధములు పెంచుకొనకుండుట, ఏపార్టీకి అను బంధమున్నా, సముచితమైన తగిన అభ్యర్థులను బలపరుచుట మున్నగునవి మేము పునరుద్ఘాటిస్తున్నాము. మాసంస్థవలె అదే ఆశయములు లక్ష్యములు కలిసిన ఏయితరసంస్థతోనైనా వీలైనచోట్ల మేము సహకరించుదుము కాని, మేము ఏయితరసంస్థను కబళించము; ఏయితరవర్గముతో ఏవిధముగానూ పూర్తిగా లీనీకరణపొందము"

ఈసంవత్సరములలో అసలుచర్యలో డెమోక్రాటిక్ అభ్యర్థులకే కార్మికుల అండదండలు లభించినవి. ప్రతిఘాతవ్యక్తులనుకునే డెమో క్రాటిక్ అభ్యర్థులకు యీసంస్థ తమ అండదండలు తిరస్కరించినది. అధ్యక్షుడిపదవికి చాలామంది కార్మికనాయకులు డెమోక్రాటిక్ అభ్యర్థినే బలపరిచిరి. కాని 1952 వరకు ఎ యఫ్ యల్ మహాసభ ఎవరినీ అధ్య క్షునిగా అభ్యర్థిత్వమువిషయంలో బలపరచలేదు. చివరకు 1952 లోనే అడ్లాయ్ స్టీవెన్సన్‌కు అధ్యక్షపదవివిషయంలో తమ కార్యాలయంద్వారా తమ సహాయము ప్రకటించిరి. 1956 లో ఎ. యఫ్. యల్; సి ఐ ఓ. జనరల్‌బోర్డు స్టీవెన్సనును, కెఫావర్‌ను అధ్యక్ష ఉపాధ్యక్షపదవులకు బలపరిచిరి.

ఈ సంవత్సరములలో చాలా వృత్తిసంఘోద్యమములు స్థానిక కార్మిక, వ్యవసాయకార్మిక, సోషలిస్టుపార్టీల అభ్యర్థులను బలపరిచినవి. నూది వృత్తులు, న్యూయార్కురాష్ట్రంలోని తదితర బలవత్తరమైన అభ్యుదయ సంఘములు, లిబరల్‌పార్టీ అభ్యర్థులను బలపరిచినవి. లిబరల్‌పార్టీ చాలా అభ్యుదయకరమైనపార్టీ. ఇది డెమోక్రాటిక్, రిపబ్లికన్‌పార్టీల అభ్యర్థ

లను బలపరచుటయేకాక స్వతంత్ర అభ్యర్థులనుకూడా బలపరచుపార్టీ. మిన్నెసోటాలో, వ్యవసాయకార్మిక లేబరుపార్టీ డెమోక్రాటిక్ పార్టీతో కలిసి, డెమోక్రాటిక్ ఫార్మర్ లేబరుపార్టీ తయారవకముందు సంఘటిత కార్మికులు వ్యవసాయ – కార్మికపార్టీనే బలపరచెడివారు. మిల్వాకీ, విస్కాన్సిన్, బ్రిడ్జిపోర్టు, కానెక్టికట్, రీడింగ్, పెన్సిల్వేనియా లలో స్థానిక కార్మికవర్గములు ఈశతాబ్దము మొదటినుంచి చాలా ఎన్నికలలో మేయరుపదవికి సోషలిస్టు అభ్యర్థులను బలపరిచినవి.

## ఎ. యఫ్. యల్; సి. ఐ. ఓ. శాసనముల కార్యక్రమం

ఉన్నతస్థాయిలో ఉద్యోగము లిచ్చునట్లు జీవనప్రమాణము నిత్యమూ అభివృద్ధిపరచునట్లు కృషిచేస్తూ 1956 ఫిబ్రవరిలో ఎ. యఫ్. యల్; సి. ఐ. ఓ. కార్యవర్గకౌన్సిలు ఉమ్మడిబేర ఒప్పందములద్వారా లాభములుపొందే ప్రణాళికలేకాక ఈక్రింద చెప్పబడిన ఎనిమిది అంశముల శాసనకార్యక్రమములుకూడా బలపరిచినది.

1. పన్నులు: కేంద్రపన్నులనిర్మాణము అందరికీ సమానముగా ఉండునట్లు పన్నుల పునఃపరిశీలన నిమ్నమధ్యతరగతి ఆదాయములుగల కుటుంబములపై పన్నులుతగ్గించి, కొనుగోలుశక్తి ప్రాతిపదికను విస్తృతము చేయుట.
2. కష్టములకు గురియైన ప్రాంతములు: ఆర్థికముగా కష్టములకు గురయైన సమాజములకు పునరావాసముచేసి కేంద్రప్రభుత్వము సహాయము లభించునట్లు ఒక విస్తృతమైన అమలుజరుపదగు ప్రణాళికను తయారు చేయుట.
3. కనీసవేతనము:
4. విద్య: స్కూళ్ళు యింకా ఎక్కువగా స్థాపించుటను, కేంద్ర సహాయము తగినంతగా సంపాదించుట, దీనితోపాటు తదితర విద్యా విషయిక కార్యక్రమములు.
5. నిర్మాణకార్యక్రమము: రాష్ట్ర, కేంద్ర, రోడ్డు, భవననిర్మాణము లలో విస్తృతపథకము, ఆస్పత్రుల నిర్మాణమును పెంచుట.
6. గృహనిర్మాణము: కేంద్రగృహనిర్మాణ, నగర పునరభివృద్ధిప్రణాళికలు; నగరకేంద్రములలో జనములకు పునరావాసము కల్పించుట, సంవత్సరమునకు రెండు మిలియనుల క్రొత్తగృహనిర్మాణముల విభాగ

ములు నిర్మించుట, మధ్యతరగతి ఆదాయముగలవారి గృహనిర్మాణము ప్రైవేటు సహకారపద్ధతులలో జరుగునపుడు అక్కర పరపతి లభించు షరతులు చాలాసులభముగా దొరకుమార్గములు సృష్టించుట, ప్రస్తుత నిమ్నస్థాయినుంచి తక్కువ ఆదాయముగల కుటుంబములకు ప్రభుత్వగృహములలో చాలా ఎక్కువ నిర్మాణము: మొదలైనవి.

7. పరపతివిధానములు: పరిపాలకుల పరపతివిధానములు, గట్టిగా నుంచకుండా సడలించుట.

8. వ్యవసాయకార్యక్రమములు: వ్యవసాయకుటుంబముల ఆదాయములు పెంచి న్యాయము చేకూర్చుట, వ్యవసాయపద్ధతులు ఎక్కువగా కనిపించేటట్లు ప్రోత్సహించుట, కల ఒక కేంద్రవ్యవసాయక కార్యక్రమము. ఎ. యఫ్. యల్; సి. ఐ. ఓ. రాజ్యాంగమహాసభలకు హాజరైన ప్రతినిధులు, నేషనల్ హెల్తు ఇన్సూరెన్సు కావాలని గట్టిగాకోరిరి. ముసలి తనపు పెన్షనులు బలపరిచిరి. నిరుద్యోగ నష్టపరిహారము ఉండవలెననిరి. ప్రజలయొక్క సహకారవిధానముయొక్క శక్తులు విస్తృతముచేయుట, ప్రజలయొక్క సహజమూలాధారములు జాగ్రత్తపరుచుట, ప్రజాస్వామ్య అంతర్జాతీయ విధానము అవలంబించుటకూడా వీరుకోరిరి.

## యంత్రముల స్వతశ్చలనశక్తిపై కార్మికుల దృక్పథం

ఈమధ్య సంవత్సరములలో బాగా చర్చించబడే పారిశ్రామిక పరిణామములలో ఒకటి యంత్రముల స్వతశ్చలనశక్తి. చాలామంది దృష్టిలో యీ స్వతశ్చలనశక్తి రెండవ పారిశ్రామికవిప్లవము తీసుకువచ్చినదని అందురు. మనుష్యుల, జంతువుల శరీరకశక్తులకుబదులు యంత్రములువాడుట పారిశ్రామికవిప్లవములో మొదటిభాగము. యంత్రములను అదుపులోపెట్టుట, మానవుల నిర్ణీతకార్యములు బదులు విద్యుచ్ఛక్తిసాధనములు చాలా పరిశ్రమలలో స్వతశ్చలనశక్తియంత్రములకు యిచ్చుచున్నవి. కార్యాలయములలోనేగాక కర్మాగారములలోకూడా స్వతశ్చలనశక్తియంత్రములపై ప్రయోగింపపడుచున్నది.

క్లీవ్‌లాండు ఓహియోయంత్రాగారములో స్వతశ్చలనశక్తిగలయంత్రములు పనిచేసే ఒక ఇంజనుబ్లాక్ శాఖకలిగియున్న ఫోర్డుమోటారుకంపెనీ

ప్రతినిధి యిలా అన్నారు. "ప్రత్యక్ష కార్మిక శత్రువు లనబడేవాటిపై 25 గాని 30 శాతముగాని తగ్గించవచ్చునని మా అనుభవము చెప్పుచున్నది."

అమెరికాకార్మికోద్యమము నాయకులు ఈయంత్ర స్వతశ్చలనశక్తి స్వాగతమిచ్చిరి. "దీని ఉత్పత్తిలాభములు, విసిగెత్తించే ఒకేపని కల్గించే పద్ధతినుంచి దొరికేస్వేచ్ఛ యిందులో వున్నాయని ప్రశంసించిరి." ఎ. యఫ్. యల్; సి. ఐ. ఓ. ఉపాధ్యక్షుడు వాల్టర్ పి. రూథర్ యిలా ప్రకటించెను.

"దరిద్రము, ఆకలి, రోగము, మౌఢ్యము తదితర మానవశత్రువులను జయించి పుష్కలంగా పనిముట్లు కల్గడం, అమెరికా నాగరికచరిత్రలో యిది ప్రప్రథమము. అమెరికాకార్మికోద్యమము సరైననాయకత్వమును సృష్టించుట వారి కర్తవ్యము. తద్వారా ఆర్థిక లోటుబాట్లు పంచుకొనుటలో బాధపడేకంటే, స్వతంత్రవ్యక్తులు, ఆర్థిక పుష్కలత్వము సృష్టించి పంచుకునే ఉత్కృష్టఅవకాశములో క్రొత్తసహకారపద్ధతులు కనుగొనవలెను."

1955 శరదృతువులో సంయుక్త కాంగ్రెషనల్ కమిటీముందు మిస్టర్ రూథర్ యీ విధముగా ప్రకటించెను. "ఈక్రొత్త సాంకేతికపరిణామములద్వారా వారమునకు నాల్గురోజులు పనిచేసే కాలము, ఎక్కువ సెలవు కాలములు, త్వరగా రిటైరుఅయ్యే అవకాశములు ఎక్కువగా వీలగును."

కొద్దికాలమువచ్చుకష్టములు క్రమముగా తొలగించి ప్రభుత్వము, కార్మికులు, పరిశ్రమ అవసరమైన ఆర్థిక సాంఘిక సర్దుబాటులు చేసుకొనవలెనని ఆయన వక్కాణించిరి. పైగా యీక్రిందివిధముగా ఆయన ఉద్ఘాటించెను.

1. కార్మికులకు తిరిగిశిక్షణయిచ్చుట: స్కూళ్ళల్లో యంత్రముల స్వతశ్చలనశక్తిఉన్న (కర్మాగారములలో), కార్మికులకు కొంతశిక్షణ యివ్వవలెను. వారు యీక్రొత్తవిధానముగల యంత్రములనడిపేశక్తి పొందవలెను. ఇందుకయ్యేఖర్చుకు యజమానులు బాధ్యత వహించవలెను.
2. సమాజములను మరొకచోట పునరావాసముచేయుట: నష్టపడిన ప్రాంతములకు ప్రత్యేకసహాయ మివ్వవలెను. కర్మాగారములు మూసి

వేయుటచే, కొన్ని వేల కార్మికులను, అనేక సమాజములను, సరైన ప్రాంతములలో పునరావాసము చేయవచ్చును.

3. తక్కువపనిగల వారము: క్రొత్త సాంకేతికపద్ధతుల సాయంతో వారమునకు తక్కువరోజులపని తీసుకుని, అమెరికనుప్రజలకు ఉత్పత్తిఫలితములు ఎక్కువగా యిచ్చుట.

4. సాంఘిక సేవలు విస్తృతముచేయుట : రూథర్ చెప్పినప్రకారము, యంత్రముల స్వతశ్చలనశక్తివలన లభ్యమగు ముఖ్యలాభములలో మనము స్వాగతమివ్వవలసినది; ఆరోగ్యము, గృహనిర్మాణము, స్కూళ్ళు, పంతెనలు, సహజశక్తులు తదితర ప్రజాసేవారంగములలోని సాంఘిక లోపములు సర్దుబాటు చేసుకొనుటకు మనకు యిదియిచ్చు అవకాశమే."

5. కొనుగోలుదారు కొనుగోలుశక్తి: ఎక్కువవేతనములద్వారా సాంవత్సరిక గ్యారంటీవేతనములద్వారా, కనీసవేతనముల పెరుగుదలవలన, న్యాయమైనకేంద్రము పన్నుశాసనాలద్వారా కొనుగోలుశక్తిని హెచ్చించుట.

6. చిన్నవ్యాపారములకు సాయము: క్రొత్త ఆర్థికవ్యవస్థమార్పులో దెబ్బతిను చిన్నవ్యాపారములకు ఆర్థికసహాయము చేయవలెను.

7. ధరవిధానము: ఉత్పత్తి పెరుగుదలవలనవచ్చులాభములు కొనుగోలుదారులకు యివ్వకుండా ఉన్న పెద్దపలుకుబడిగల కార్పొరేషన్లమీద ప్రజలదృష్టి తీవ్రముగా పడుచున్నది.

8. త్వరగా రిటైరగుట: సాంఘిక భద్రతాచట్టముప్రకారము 65 నుంచి 60 సంవత్సరములకు పెన్షనుపొందు వయస్సు తగ్గించుట.

1956 వ వసంతఋతువులో యునైటెడ్ ఆటో మొబైల్ వర్కర్సునకు సంబంధించిన విక్టర్ జి. రూథర్ పారిస్‌లోని ఒక సమావేశమునకు అధ్యక్షత వహించెను. ఆ సమావేశమునకు పదకొండుదేశములనుంచి ఫోర్డు జనరల్ మోటారుయంత్రాగారములవారి కార్మికప్రతినిధులు హాజరైరి. స్వతశ్చలనశక్తిగల యంత్రములు యుగముముందుకు పురోగమించు యీ సమయములో ప్రజాస్వామ్యదేశములో పనిచేయు పరిస్థితులలో తేడాలు ఏవిధముగా తగ్గించవచ్చునని వారు పరిశీలించిరి. ఈ యంత్రాగారములలో ప్రపంచవ్యాప్తచర్యలు తీసుకొని సహాయముచేయుటకు ఒక కొన్ని

అను యీ సమావేశము ఏర్పరిచినది. అంతర్జాతీయ కార్మిక సమావేశములో యంత్రముల స్వతశ్చలనశక్తి ప్రభావముమీద మొట్టమొదటగా జరిగినచర్య యిదియే.

## 14. పౌరహక్కులు - జాతిసమానత్వము

కార్మికుల సందేశము చెప్పుటకు, తమ సాహిత్యము ప్రచురించి, పంచుటకు, శాంతియుతముగా సమావేశమగుటకు సంఘములుగా ఏర్పడుటకు ఉమ్మడిబేరములు చేసుకొనుటకు, పికెటింగుచేయుటకు, సమ్మెను ఏర్పాటుచేసుకొనుటకు, తమసభ్యులకు స్వతంత్రము కావలెనని దేశములో అనేక ప్రాంతములలో చరిత్రఅంతటా కార్మికోద్యమము నిత్యమూ పోరాటము సాగించవలసివచ్చినది. ఈ స్వతంత్రసముపార్జనలో చాలా ముఖ్యమైన పోరాటములలో కార్మికోద్యమము గెల్చినను, ఈనాడు దేశములో కొన్నిప్రాంతములలో ముఖ్యంగా దక్షిణాన శాంతియుతకార్మిక కార్యక్రమములకు అభ్యంతరములున్నవి. సంఘసభ్యులు అరెస్టుచేయబడుచున్నారు. పైగా వారినికొట్టి వారి రికార్డులు పాడుచేసి యింటినుంచి గెంటివేయబడుచున్నారు. తమ రాజ్యాంగబద్ధమైనహక్కులు కోరినందుకు వారిని నివాసస్థలంనుంచికూడా పంపివేయుచున్నారు.

### ప్రాథమికహక్కులపై పరిమితులు

50 వ దశాబ్దం మధ్యభాగంలో అమెరికాలోని నేతకార్మికులు ఈ విధముగా ఫిర్యాదుచేసిరి. "ఎల్కిన్, నార్తు కెరోలినానగరంలోఉన్న ఒక తయారీకంపెనీ గదిలోపలజరుగు సమావేశములన్నీ తన అదుపులో పెట్టుకున్నదనీ ఈ ప్రదేశములలో చొరబడి న్యాయసమ్మతమైన సంఘటితకార్యక్రమములు నడుపుటకు సంఘమునకు అనుజ్ఞ యివ్వలేదని ఫిర్యాదు. ఈకంపెనీ, సంఘముపై సానుభూతిచూపించే కార్మికులను భయ

పెట్టి ఒత్తిడి చేయుచున్నదని అందుకు అనుచితమైనపద్ధతులు అవలంబించుచున్నదని నుడి. 1954-55 నివేదికలో అమెరికను సివిల్ లిబర్టీస్ సంఘము యీవిధముగా ప్రకటించెను. "శాంతియుతముగా కలుసుకొను హక్కుతో కలుగచేసుకొనుచున్నదన్న ఆరోపణలుచేసిన చాలాకేసులలో యిది ఒకటిమాత్రమే. 'పనిచేసేహక్కు' శాసనములుగల రాష్ట్రములలోని కార్మికచరిత్రప్రకారము, సంఘములకు హాల్లు అద్దెకుయివ్వక పోవడం, సంఘసాహిత్యము ఎవ్వరికీ పంచనివ్వకపోవడం, మామూలుగా కనిపిస్తున్నది. ఇవి ఆ శాసనముల మొదటి సవరణప్రకారము ఉల్లంఘన అయినా లెక్కచేయటంలేదు."

## జాతి సంబంధములు

ఈమధ్యసంవత్సరములలో సంఘటితకార్మికులు, నీగ్రోలు తదితర చిన్నవర్గములు విషయంలో విచక్షణాసమస్యగురించి ఎక్కువశ్రద్ధ చూపించిరి. పుట్టుక ఏదైనా అందరికీ సమానహక్కులు ఉండవలెనని, కార్మిక నాయకులు పదేపదే ఉద్ఘాటించిన రికార్డులు స్పష్టముగా ఉన్నవి.

ఎ. యఫ్ యల్; సి. ఐ. ఓ. రాజ్యాంగచట్టముప్రకారము దాని లక్ష్యములలో ప్రముఖముగా కనిపించునది—"సంఘముల సంఘటితకార్యక్రమములలోని లాభములన్నీ సమానముగా అందరుకార్మికులు, జాతి, రంగు, తెగ, పుట్టుకదేశము, పూర్వీకులవంశము మొదలైన విచక్షణ లేకుండా అనుభవింతురు." ఎ. యఫ్. యల్; సి ఐ. ఓ. రాజ్యాంగ చట్టముప్రకారము ఏర్పడిన పదిహేనుకమిటీలలో ఒకదానికి ఈరాజ్యాంగ చట్టములో పేర్కొనిన జాతివిచక్షణారాహిత్యసూత్రము పటుత్వంగా త్వరగా అమలుజరుపుటకు కార్యవర్గకౌన్సిలుకు పూర్తిసహాయముచేయు బాధ్యత విధ్యుక్తధర్మము యివ్వబడినది.

మొట్టమొదటి రాజ్యాంగమహాసభలందు ఎ యఫ్. యల్; సి. ఐ. ఓ. పౌరహక్కులతీర్మానమును ఆమోదించినది. కేంద్రము న్యాయసమ్మతమైన ఉద్యోగములిచ్చేపద్ధతుల శాసనమును అమోదించవలయునని, జాతి, రంగు, తెగ, పుట్టినదేశము మొదలైన విచక్షణలేకుండా ఉండవలెనని అటువంటి కేంద్రశాసనములు లేనిచోట, రాష్ట్రశాసనము ఉండవలెనని అందులో ఉండెను. "పౌరహక్కులశాసనములకు నాందిగా సెనేటు నియ

మాపళికూడా అయిష్టపడే తక్కువవర్గమువలన కాంగ్రెసు పురోభివృద్ధి దెబ్బతినకుండా ఉండేవిధంగా మార్చవలెనని ఆమహాసభ కోరినది. ఆమహాసభ ప్రకటనప్రకారము నియమము 22. మార్చవలెనని, సెనేటర్లు అధిక సంఖ్యలో పాల్గొని చర్చను పరిమితముచేసి ముగించుటకు పోటీచేసేలా అనుమతి యివ్వవలెనని దానిసారాంశము.”

పౌరహక్కులతీర్మానములో యీవిధముగాఉన్నది. “ఎ. యఫ్. యల్; సి. ఐ. ఓ. ల అనుబంధసంఘములు తాము సంప్రదించు ఒప్పందములలో యీ విచక్షణారాహిత్య విభాగములు యిముడ్చవలెను. ప్రభుత్వమునకు పనిచేయుకంట్రాక్టర్లు తమ ఒడంబడికలలో యీ విచక్షణారాహిత్యవిభాగములు అమలుజరిగేలా చూడవలెను. విభజనలేని సంయుక్త విద్యాపద్ధతిని సృష్టించే శాంతియుత పటుత్వపరిస్థితిని కలుగజేస్తూ అన్నిసమాజములలోని స్వతంత్రశక్తులతో కలిసి పనిచేయవలసినదని తన అనుబంధసంఘములను అది కోరినది.

అదేవిధంగా యింకా తీర్మానములో యీ విధంగా కోరబడినది. “కేంద్రనేరములకు విచారణలేకుండా తీర్పులిచ్చుట, వోటింగుముందు తలపన్ను చెల్లించేపద్ధతిని రద్దుచేయుట, అన్నికుటుంబములతోపాటు, తక్కువసంఖ్యగలవారి కుటుంబములకు సమానపద్ధతిలో కేంద్రసహాయము ద్వారా కట్టబడినయిండ్లు పంపిణీచేయుట మున్నగువాటిగురించి కాంగ్రెసు శాసనములు చేయవలెను.”

1956 లో ఎ. యఫ్. యల్; సి. ఐ. ఓ. కార్యవర్గకౌన్సిలు ముందు ప్రకటనలో ఎ. యఫ్. యల్; సి ఐ ఓ. పౌరహక్కులకమిటీ అధ్యక్షుడు జేమ్సు బి. కేరీ, బోరిస్ షిష్కిన్ డైరక్టరు, వైట్ సిటిజన్సుకౌన్సిలు నాయకులు స్వతంత్రముగా సంఘములు స్థాపించుకుని ఎ. యఫ్. యల్; సి. ఐ. ఓ. కు అనుబంధములనుంచి సభ్యత్వము రద్దుచేయుచున్న ప్రయత్నములగురించి నివేదించిరి. ఈకౌన్సిలులు, ప్రజానాయకుల్లో అమెరికా సుప్రీంకోర్టుచేసిన విడదీయకూడదనేతీర్పును అమలుపరుచుటకు ఏర్పాటు చేయబడినవని, స్వతంత్రప్రపంచములో తమనాయకత్వము, అమెరికా దేశములలో స్వగృహసంబంధమైన తాత్వికబలము ఆస్వాదించుచున్నవని ప్రకటించబడెను.

నిర్ణయములు చేసుకుని ప్రవర్తించుసంఘములమీద ఆధారపడవచ్చునని మిస్టర్ కేరీ అభిప్రాయము. మనదేశములోని అన్నిజాతీయజీవిత విభాగములలోను స్వతంత్రము, పౌరహక్కులు వ్యాప్తిచేయుటకు మన సమాజములో ఒక ఐక్య ప్రజాస్వామ్య కార్మికోద్యమమే ఒక గొప్ప శక్తి కాగలదని ఆయన విశ్వాసము. తన సంయుక్తసంస్థకు, 1955 లో ఎ. యఫ్. యల్; సి. ఐ. ఓ. మహాసభ కార్యవర్గకౌన్సిలుకు యిద్దరు నీగ్రో ఉపాధ్యక్షులను ఎన్నుకొన్నది. వారు స్లీపింగ్ కార్ పోర్టర్సు బ్రదర్‌హుడ్ యొక్క ప్రెసిడెంటు ఎ. ఫిలిప్ రాండోల్ఫ్, మరియు యునైటెడ్ ట్రాన్స్‌పోర్టుసర్వీసు ఉద్యోగుల అధ్యక్షుడు విలియర్డ్ యస్. టౌన్‌సెండు.

ఈమధ్యసంవత్సరములలో దక్షిణరాష్ట్రములలో వేఱుచేయబడిన కార్మికసంఘసమావేశములు జరుపుటకు వ్యతిరేకముగా కార్మిక ఉద్యమము ఉద్యోగులు ఒక ఉద్యమము లేవదీసిరి. జాతికారణముగా సభ్యులను వేఱుచేయుటకూడా వారు వ్యతిరేకించిరి. దక్షిణములో సంఘటిత పరుచునపుడు యునైటెడ్ గనికార్మికులు అందరినీ కలుపుకొనుటలో ఒక మంచి ఉదాహరణచూపిరి అయినా కార్మికోద్యమములో యింకా ఎంతోపని చేయవలసియున్నది. మొదటితరగతి సభ్యత్వమునుంచి కొన్ని సంఘములు యింకా నీగ్రోలను బాహాటముగా క్రూరముగా దూరము చేయుచున్నారు. ఇప్పటిరోజుల్లోకూడా ఏదో కొన్ని తరగతులలో యింకా అటువంటి బహిష్కరణ ఉన్నప్పటికీ విచక్షణను రూపుమాపుటకు కార్మికోద్యమము చాలా పురోగమించినదని అందుకు సంఘటిత కృషి సల్పుచున్నదని చెప్పవచ్చును.

# 15. స్త్రీలు - శ్రామికసంఘములు

ఈశతాబ్దము మొదటిభాగములో ఒకస్త్రీ వోటుహక్కు కావాలన్నప్పుడు, లేదా పరిశ్రమలో చేరుతానన్నప్పుడు ఆమె కుటుంబము

లోని మగవాళ్లు సర్వసాధారణమైన నుడివంటి 'స్త్రీస్థానము గృహము లోనే' అని ఎదురయ్యేవారు.

## సంఘసభ్యత్వములో పెరుగుదల

ఆరోజులనుంచి రాజకీయములలో పరిశ్రమలో స్త్రీస్థానము గురించిన సాంఘికదృక్పథములలో విప్లవము వచ్చెను. ప్రతీరాజకీయఉద్యమములో ప్రస్తుతము స్త్రీ చాలా చైతన్యవంతముగా పనిచేయుచు వోటుహక్కు కలిగియున్నది. 1900 లో 5 మిలియనుల సభ్యత్వసంఖ్యనుంచి 1955 లో 19 మిలియనుల సభ్యత్వసంఖ్యవరకు పరిశ్రమలలో స్త్రీలసంఖ్య పెరిగి పోయినది. మొత్తము పనిచేసేశక్తులలో 18 నుంచి 30 శాతమువరకు వారి నిష్పత్తికూడా పెరిగినది.

సంఘటితకార్మికులలో స్త్రీలవిషయంలో 30 వ దశాబ్దము మధ్యభాగములో యించుమించు మూడుమిలియనుల స్త్రీలు అంటే అంతర్జాతీయ సంఘసభ్యులలో ఆరవవంతు స్త్రీలే. ఇరవైరెండు అంతర్జాతీయసంఘము లందు మొత్తము సభ్యత్వములో సగముపైగా స్త్రీలు సంఘఉద్యమములో మొత్తముసంఖ్యలో మూడవవంతు వారుపూరించిరి. మూడు అంతర్జాతీయ సంఘములలో ప్రతీపదింటిలో 8 లేక తొమ్మిదిమంది స్త్రీసభ్యులే. ఎక్కువమంది స్త్రీసభ్యులుకల్గిన ప్రభుత్వసంఘములో ముఖ్యమైనవి, సూది వృత్తులుకలిగిన పరిశ్రమలు, సేవాపరిశ్రమలు, విద్యుచ్ఛక్తి పరికరముల తయారీపరిశ్రమలు, నేత పరిశ్రమలు, పరిశ్రమలలో సమాచారములంపు శాఖలు, అంతర్జాతీయ స్త్రీదుస్తుల కార్మికులసంఘములో నల్గురిలో ముగ్గురు స్త్రీలు.

## సంఘటితకార్మికులలో స్త్రీలప్రత్యేక సమస్యలు

సాధారణసంఘములవలెనే చాలామంది స్త్రీసభ్యులుకల్గిన సంఘముల సమస్యలు, పద్ధతులు, విధానములుకూడా ఒకటేఅయిఉన్నవి. అయినా కొన్ని ప్రత్యేక విశిష్టమైన అంశములు, సమస్యలుకూడా చెప్పకతప్పదు.

స్త్రీలను సంఘటితపర్చుట, పురుషులను సంఘటితపర్చుటకంటె కష్టమని సాధారణముగా అందురు. తల్లితండ్రులతో యింట్లో నివసించే అవివాహితస్త్రీలు, తమఖర్చులకు, యింటిఖర్చులకు కొంతివేతనములు సంపా

దించుకున్నను, తమను పోషించుకొనుటకు పూర్తి బాధ్యత వహించుట లేదు. పైగా తమబట్టలు తాము కొనుక్కొని, కాస్త సినీమాలకు వెళ్ళి కాలక్షేపముచేయుటతోనే వారు సంతృప్తిపడుచున్నారు. యజమానులు యీ స్త్రీల మానసికతత్వమునుంచి లాభముపొందనెంచి వారికి ప్రమాణమునకు తగ్గినవేతనములు యిచ్చెదరు. తత్ఫలితముగా వేతనములమీదనే ఆధారపడే స్త్రీలు, యింటిమీద ఆధారపడే, యీపడుచుల వేతనములపై సృష్టించే హీనకరపరిస్థితివలన చాలా బాధపడుదురు.

చాలా యౌవన స్త్రీ కార్మికులలో ముఖ్యముగా తమఉద్యోగము తాత్కాలికమే అన్న సాధారణభావనకూడా నిస్సందేహముగా కలదు. త్వరలో వారు పెండ్లిచేసుకుని ఉద్యోగము వదలివేయుటకై వేచియుం దురు. మెరుగుపరిస్థితులకై సంస్థలో కృషిచేసే ఆసక్తి అటువంటి భావన కల్గిన స్త్రీలలో చాలా తగ్గిపోవును. 1939 లో అమెరికా పరిశ్రమలో ఉద్యోగములోఉన్న మొత్తము 10½ మిలియనుల స్త్రీలలో 46 శాతము స్త్రీలు పెండ్లిఅయినవారు, వితంతువులు లేదా విడాకులు యిచ్చుకున్న వారు అని వారు తెలుసుకున్నప్పుడు వారినిర్లక్ష్యము కొంత అదృశ్య మగును. ఒంటరిగాఉన్నను, పెండ్లిఅయినను, సంఘముల ఏర్పాటుద్వారా పరిశ్రమలోని పరిస్థితులు మెరుగుచేయుటలో వ్యక్తిగతత్యాగము స్త్రీ కార్మి కులకుకూడా కావలెనన్నది నిజము.

యునైటెడ్ స్టేట్సుడిపార్టుమెంటు ఆఫ్ లేబరుయొక్క వుమెన్సుబ్యూరో అది అనేకవేతనదారులైన స్త్రీలను పరిశీలించినమీదట ఏభైవదశాబ్దపు మధ్యభాగములో యీవిధముగా ప్రకటించెను. "చాలామంది స్త్రీలు ఏదో సూదిడబ్బుకొరకే పనిచేయుదురనేనుడి ఈ ఆధునిక ఆర్థికవ్యవస్థలో పాత బడిన సిద్ధాంతమైపోయినది. పరీక్షించబడిన నివేదికలవలన తెలియున దేమనగా తరుచు సగముగాని, సగముపైనగాని అన్నిరకముల వృత్తులలో పనిచేసే స్త్రీలు చాలావరకు తమమీద ఆధారపడి వారికొరకై పనిచేయు చున్నామని భావింతురు. తమంతతాము పోషించుకొనుటకూడా వారిభావన ఉపాధ్యాయినులను పరిశీలించగా సగంనుంచి ⅔ వరకు తమమీద ఆధార పడే వారికొరకే వారు పనిచేయుచుండిరి.

1950 లో వుమెన్సుబ్యూరో వృత్తిసంఘముల స్త్రీ వేతనదారులను పరిశీలించుటలో తెలిసినదేమన "సగమునుంచి ¾ వరకు పూర్తిగాగాని, కొంతగాని తమనుతాము పోషించుకునేవారిలో తమతోపాటు మరొకనిని పోషింమవారే; మరి చాలామంది ఒకనికంటె ఎక్కువమందిని పోషించువారే."

పురుషకార్మికులకంటె చాలాతక్కువ నిష్పత్తిలో స్త్రీకార్మికులు సంఘసభ్యులు, చాలాతక్కువసంఖ్యలో స్త్రీలు పనిచేయుటకు బలమైన కారణములు ఒక్కరెండ్లి మనస్తత్వమొక్కటేకాదు. మొట్టమొదటగా పురుషులు నిర్వహించే సంఘోద్యమములో నిర్వహణశక్తికల్గిన స్త్రీలపై తక్కువ శ్రద్ధచూపబడినదనుట బహుశా మరొకకారణము కావచ్చును. ఈకృషిలో చాలాతక్కువ స్త్రీనిర్వాహకులు వాడుకొనబడిరి.

అనేకసంవత్సరములు, నిపుణతవృత్తులలోనే, చిన్నపరిశ్రమలలోనే సంఘములు ఏర్పరచవలెనని సంప్రదాయబద్ధమైన ఒక ఉద్ఘాటన ఉన్నది. నిపుణతతక్కువైన, నిపుణతలేని పరిశ్రమలలో అనేకమంది స్త్రీకార్మికులు ఉద్యోగములుపొందుట ప్రారంభంకాగానే వీరందరిని నిర్లక్ష్యముచేసినట్లయినది. పైప్రయత్నమువలన నిపుణతఉన్న కార్మికులను, లేనివారిని సి ఐ ఓ. ఆధ్వర్యంలో పారిశ్రామికసంఘములు ఏర్పడుట ప్రారంభంకాగానే ఆదృశ్యములో పూర్తిమార్పు కనిపించినది. అదీగాక మునుపుచెప్పిన విధంగా కొన్ని పాతవృత్తిసంఘములు, తమసభ్యత్వప్రాతిపదిక విశాలము చేయుచున్నవి. కొన్నిసంవత్సరములక్రితము గ్రంధకర్తలలో ఒకరికి వస్త్రంగిసంఘములో సభ్యురాలైన ఒక యౌవనకార్మికురాలుని కలుసుకొనుట చాలా ఆశ్చర్యము కలిగించెను. ఆసంఘము ఆ రంపపుమిల్లులోని కార్మికులనందరినేగాక కార్యాలయములోని ఉద్యోగులనుకూడా సంఘములో చేర్చుకొనెను.

ఈ నూత్నపోకడలు సంఘములలో స్త్రీసభ్యత్వము ఎక్కువగునట్లు ఫలించినవి. ఈసంఖ్య యింకా ఎక్కువపెరగగలదు. కొన్నిపురాతన చిన్నపనిసంఘములలో స్త్రీలు తమహక్కులకై యింకా పోరాటము సాగించవలసియున్నది. ఏలన మునుపు కొన్నిసంఘములు తమ సభ్యత్వమునుంచి రాజ్యాంగముప్రకారం స్త్రీలను బహిష్కరించినవి. సమానమైన పనికి సమానవేతనము యిప్పించేరక్షణ స్త్రీలకు యివ్వడం మానివేసినవి,

## సంఘటితపరచుటలో కష్టమైనవృత్తులు

స్త్రీకార్మికులలో సంఘముల్లోగా ఏర్పడినవారిలో చాలాతక్కువ శాతము ఉండుటకు పెద్దకారణము చాలామందిస్త్రీలు పరిశ్రమలలో ఉద్యోగములు పొందుటయు వాటిస్వభావముచే అపరిశ్రమను సంఘటిత పరుచుట చాలాకష్టమైపోవుటయు అని చెప్పవచ్చును. ఉదాహరణకు 1950 లెక్కలప్రకారము ఇంటిపనులయందు వ్యక్తిగతసేవలకు నియమించ బడినస్త్రీలే లాభకరమైన ఉద్యోగములు పొందినవారిలో 23 వ శాత ముగా ఉండిరి. చాలాస్థలములలో తక్కువప్రమాణములోఉన్నా, ఈ రంగములో సంఘములఏర్పాటు చాలాతక్కువస్థాయిలో స్త్రీపురుషుల మధ్య ఎక్కువ పురోగమనం జరగలేదు. గృహఉద్యోగములలో ప్రమా ణములు లేకపోవుట, వ్యక్తిగత గృహములలో అనేకమంది విభజింపబడి పనిచేయుట, గృహకార్మికులు వర్గములుగా కలుసుకునే అవకాశములు లేకుండుట అందులకుకారణము నియమితమైన గంటలకాలముపని కలిసి కునే సహజస్థలములేవు—యింకా చాలాహెచ్చయిన కార్మికులపని— వీటివలవ ఈరంగములో సంఘములు ఏర్పరుచుట చాలాకష్టమైపోయినది. గృహపనులలో యజమానులను విద్యావంతులుగా చేయుటలోను, గృహ పనులకు సంబంధించినసమస్యలగురించి గృహకార్మికులకు తెలియచెప్పుట లును, వై. డబ్ల్యు సి. ఏ. విశిష్టమైనకృషి చేసినది.

గుమాస్తాఉద్యోగములలోను, కార్యాలయపనులందు చాలామందిస్త్రీలు ఉద్యోగములు పొందియుండిరి. ఈరంగములో సంఘములు చాలా పురోగ మనము చేసినను స్త్రీపురుషకార్మికులలో సంఘములు ఏర్పరచడంలో యిది చాలాకష్టమైనవృత్తి అని చెప్పవచ్చును.

సంఘముల కార్యక్రమములలో విద్యావిషయిక, సాంస్కృతిక, వినోద కార్యక్రమములలో స్త్రీలు చాలావరకు తమశక్తులు ధారపోసిరి. చాలా తక్కువచోట్ల తప్ప సంఘం ఆఫీసర్లపదవులలో వారిసంఖ్యకు తగినట్లు వారికి ప్రాతినిధ్యము లభించలేదు. 1955 లో 175,000 స్త్రీకార్మికులు కల్గిన యునైటెడ్ ఆటోవర్కర్సు, ప్రత్యేకశ్రద్ధ చూపవలసిన స్త్రీకార్మి కుల సమస్యలు కొన్ని పరిష్కరించుటకు సంఘటిత సేవాచర్చలు అవసర మని గుర్తించిరి. అందువలన ఆసంఘము స్త్రీలశాఖ ఒకటి ఏర్పాటు చేసినది.

ఈశాఖ స్థాపనవిషయంలో యునైటెడ్ ఆటోమొబైల్ వర్కర్ అనే పత్రిక యీవిధంగా ప్రకటించింది (Jan 1955.)

రెండవ ప్రపంచమహాయుద్ధమునందు చాలాబరువైన శారీరకశ్రమతప్ప యంత్రాగారములలో తక్కినపనులన్నీకూడా యునైటెడ్ ఆటోమొబైల్ వర్కర్సు పనిచేయగలవని ఋజువైనది. స్థానికసంఘంఆఫీసర్లుగాను, బేర మాడే కమిటీలోనిపదవులు స్త్రీలువహించగలరని ఋజువైనది. యునైటెడ్ ఆటోమొబైల్ స్థానికసంఘములలో 700 మంది స్త్రీలకుపైగా నాయకత్వము వహించుచున్నారు.

సంఘవాదుల కుటుంబములలోని స్త్రీలు, స్త్రీసహాయసంఘములలో చేరి చాలావిలువైన సహాయము ఉద్యమమునకు చేసిరి. సంఘముయొక్క సాంఘికకార్యక్రమములలో యీ స్త్రీసహాయసంఘములు ఎంతో చైతన్యవంతమైనపాత్ర వహించినవి. సమ్మెదారులకు భోజనం తయారుచేయుటలోను, క్లిష్టపరిస్థితులలో నైతికబలము పెంపొందించి సమ్మెసమయములలోను ప్రత్యేకంగా వారు సాయముచేసిరి.

సంఘముయొక్క రాజకీయఉద్యమములలో క్రమక్రమముగా స్త్రీలు యింకా చైతన్యవంతముగా పనిచేయుచున్నారు. 1955 లో ఎ. యఫ్. యల్; సి. ఐ. ఓ. మహాసభయొక్క తీర్మానాలకమిటీ కార్యదర్శి, గూబెన్ జి. సోడర్‌స్ట్రోమ్ సమర్పించిన నివేదిక ప్రకటించినప్రకారము "పెరుగుతున్న యీ రాజకీయ కార్యక్రమములలో మనవృత్తి సంఘసభ్యుల భార్యలు, చెల్లెండ్రు, కూతుర్లుకూడా పాల్గొనుచున్నారు. అన్నిస్థాయిల రాజకీయకార్యక్రమములలో సేవచేస్తూ అన్నిపదవులలో మంచి ప్రభుత్వస్థాపనకు కృషిజరుపుచున్నారు. టెలిఫోను బ్రిగేడ్సుగా ఏర్పడి గృహములలో కాఫీలు సరఫరాచేసి తమగుమాస్తాపని శక్తులు ధారపోసి తమకోరుగువారిని వోటు అడగటంలో సాయంచేసి అవసరమైతే ఎన్నికలపోల్సువద్దకూడా పనివారలుగాఉండి స్త్రీలంతా సేవ చేయుటకు ఎంతో నాయకత్వము వహించిరి. తమ ముఖ్యలక్ష్యమును చేయుటకు, సంఘములోఉన్న తమ్ముళ్ళు, భర్తలతో కలిసి నిర్వాహణఉద్యమములలోకూడా వారి అనుభవము పెరిగినకొలదీ వారుసాయంచేయుచున్నారు

ఆ రిపోర్టుఅనంతరము మహాసభ సర్వాంగీకారముతో ఒకతీర్మానము ఆమోదించెను. రాజకీయవిద్య గురించిన కమిటీని ఆదేశిస్తూ ఆ అదృశ్య ములో సంస్థయొక్క రాజకీయచర్య కార్యక్రమములోని కుటుంబంవోట్లు లీనీకరించునట్లు తన కార్యక్రమము బలపరచవలెనని" ఉన్నది.

ఎంతకొద్దియైనను సంఘఉద్యమములో స్త్రీలు నిర్వహించినపాత్రవర్ణన వారు ఈరంగములో యిచ్చినబలము, భావోద్రేకము ఎట్లూపొందినది స్పష్టముగా చెప్పకపోయినచో చాలా అసంపూర్ణముగా ఉండును. సమ్మె దారులభార్యలు తమవిషయములో తమపిల్లలవిషయంలో విపరీతమైన దారిద్ర్యము, ఆకలి భరించే ఓరిమి, త్యాగము చూపగలిగే అత్యద్భుతమైన శక్తి, మగసంఘములకు స్త్రీసహాయసంఘముల అండదండలు, కష్టసుఖము లలో సంఘసభ్యులైన యౌవనస్త్రీల సంతోషముతోకూడిన ధైర్యము, ప్రోత్సాహము, ఏ లెక్కలు తెలియజేయలేనివిధంగా 'రొట్టె, పువ్వుల' కొరకు కార్మికులుచేసిన పోరాటకష్టములు చాలాతగ్గించగల్గినవి. సంవత్స రములు జరిగినకొలది కార్మిక ఉద్యమములో దేశముయొక్క ఆర్థిక, సాంఘిక, రాజకీయజీవితములో స్త్రీలు పాల్గొనడం చాలా అధికము కాక తప్పదు.

## 16. కార్మికులు - విద్య

కార్మికఉద్యమము ఒక్క ఆహారసంపాదనలోనే ఆసక్తికలిగిలేదు. ఎక్కువవేతనములు, జీవనప్రమాణాలలో పెరుగుదల కావాలని ఉద్య మము కోరింది; కారణము కార్మికకుటుంబాలకు, కార్మికులకు అటు వంటి ఆదాయవృద్ధివలన హెచ్చువిద్యావిషయిక, సాంస్కృతిక అవకాశ ములు లభించును. మానవతాహోదా హెచ్చుస్థాయిలో కార్మికునిలో పెంపొందేభావన కలుగును. మానవుని ఆత్మాభివృద్ధికి అది తోడ్పడును.

## సంఘటితకార్మికులు - కళాశాలపద్ధతి

తనసభ్యులకు విద్యావిషయక అవకాశములు ఎక్కువ కల్పించుటకు అమెరికను కార్మికఉద్యమము మొదటినుంచి పబ్లిక్ స్కూలు చదువు ప్రపంచమంతటా ఒకటేవుండాలని వాదించుచున్నది. 1829,30 లలో ఫిలడెల్ఫియాలోని వర్కింగ్ మెన్సుపార్టీ కోరినచర్యల జాబితాలో, విరాళములు లేకుండా ప్రభుత్వవిద్య అత్యవసరమని మొట్టమొదట ఉద్ఘాటించబడెను. పార్టీ యీవిధంగా ప్రకటించినది. "ప్రజానీకం మూఢులైనకొలదీ దుష్పరిపాలన అరాచకము ప్రారంభమగునని విషాదసత్యం చరిత్ర అంతా ఘోషిస్తోంది. వారిహక్కులు, స్వేచ్ఛలు, బానిసత్వములోకి మారిపోవును. వారి నిస్సహాయస్థితిని, అరాచకప్రవృత్తి ఎప్పుడూ దుర్వినియోగము చేయుటకు వెనుకంజవేయదు. తమ స్వతంత్రసంస్థలను రక్షించుకొనుటకు కామన్ వెల్తులో అందరి పిల్లలకు రిపబ్లికన్ విద్య లభించేటందుకు దేశీయ నిర్బంధములనుంచి విదేశీయదాడులనుంచి ప్రమాదములు లేకుండా తమహక్కులు సంరక్షించుకొనుటకు ఉత్పత్తిచేసే తరగతులన్నీ ఐక్యముకావలెను." (మెకానిక్సు ఫ్రీప్రెస్ April 17, 1830. జాన్ ఆర్ కామన్సు అండ్ అదర్సు, అమెరికారాష్ట్రములలో కార్మికచరిత్ర, (మాక్మిలన్ 1926, సంపుటి 1, పేజీలు 227-228).

విశ్వవిద్యాలయాలు, కాలేజీలు, హైస్కూల్సు, పబ్లిక్ స్కూల్సులో ఆనాటినుంచి నేటివరకు విద్యావిషయిక అవకాశములు ఎక్కువకావలెనని కార్మికఉద్యమము దేశముయొక్క అటువంటి శక్తులన్నింటికీ ముందుగానే వుంటున్నది. దేశంలోని సామాన్యప్రజానీకానికి ఎక్కువ విద్యావిషయిక అవకాశములు కలిగించే ఆగత్యముకోరుతూ ఈక్రిందితీర్మానమును ఎ. యఫ్. యల్; సి ఐ. ఓ. రాజ్యాంగప్రథమసమావేశము తీర్మానించుట ఈసంప్రదాయబద్ధమైయున్నది.

"అమెరికను కార్మికఉద్యమము స్థాపింపబడినప్పటినుంచి పబ్లిక్ స్కూలుపద్ధతి అభివృద్ధికై అది పోరాడినది. ప్రతీబాలుడు; యువకుడు ప్రాథమిక పనిముట్లునిగురించి తెలుసుకొనునట్లును, మానవత్వరీతులగురించికూడా తెలుసుకొనునట్లు; లలితకళలు, స్వతంత్రకళలు అర్థంచేసుకొనునట్లు, శారీరకశ్రమ నిపుణతతో కొంతభాగము ప్రజాస్వామ్యప్రభుత్వ

ములలో తన విద్యార్థి ధర్మాలు, హక్కులు, బాధ్యతలు అవగాహన చేసుకొనునట్లు ఒకవిద్యా కార్యక్రమము కావలెననికూడా పోరాడినది."

"అందువలన ఎ. యఫ్. యల్; సి. ఐ. ఓ. యీనూత్రములను తిరిగి బలపరచుచున్నది. తగిన చక్కని నిర్మాణముగల స్కూళ్ళను సృష్టించి కార్యక్రమముద్వారా యివి అమలు జరుపవలెను. ప్రజాస్వామ్య పద్ధతులద్వారా పరిపాలింపబడే స్కూళ్ళపద్ధతి; లోపములు సరిదిద్దుకొనే రాష్ట్రవ్యాప్తమైన తప్పనిసరి హాజరీ, ప్రాథమిక మధ్యమ హైస్కూళ్లలో పిల్లలకు ఉచితముగా పాఠ్యపుస్తకము లిచ్చుపద్ధతి; తనవ్యక్తిత్వము సంపూర్ణముగా అభివృద్ధి చేసుకునేలాగ ప్రతీబాలునికి వైవిధ్యంగలిగిన పాఠాలు ప్రతీవిద్యార్థిపై ఉపాధ్యాయుడు శ్రద్ధవహించగల్గునంత చిన్నక్లాసులు; ఎ. యఫ్. యల్; సి. ఐ. ఓ. కు అనుబంధమైన శక్తివంతమైన ఉపాధ్యాయులసంఘము; క్రమశిక్షణ, అనుభవంవలన సాంఘిక నైతికబాధ్యతలు హెచ్చుగాగలిగిన ప్రవీణులైన ఉపాధ్యాయులను స్కూళ్లలో నియమించుట మొదలైనవి కావాలని గట్టిగా ఉద్ఘాటిస్తూ తీర్మానించడమైనది."

ఈవిద్యావిషయిక లక్ష్యాలు సాధించటానికి ఎ. యఫ్. యల్; సి. ఐ ఓ. ప్రతినిధులు దేశమంతటా పనిచేయుటకూడా సంప్రదాయబద్ధమైయున్నది.

## పనిచేయుటద్వారా విద్యనేర్చుకొనుట

పబ్లిక్ స్కూలువిద్యమీద ఒత్తిడిచేసే కాకుండా తన కార్మికోద్యమంలో పనిచేసిన నాయకుల విద్యాభివృద్ధిద్వారాకూడా సమాజమునకు సభ్యులకు కార్మికఉద్యమము విద్యవిషయంలో ఎక్కువచేసినది. వేలకువేలసభ్యులు విద్యలేకుండా సంఘములలో ప్రవేశించిరి. కాని వారికోరిక సంఘమును సేవచేయవలెననిమాత్రమే. ఆ సేవాపరిస్థితులలో వారు తమతమ సభ్యులు పనిచేయు పరిస్థితులు పరిశీలించి పరిశ్రమ సమస్యలు అర్థం చేసుకోవలసివచ్చెడిది. ఉపన్యాసాలద్వారా, వార్తాపత్రికలద్వారా కార్మికులకు కార్మికోద్యమము సందేశము అందించవలసివచ్చెడిది. సమావేశములు ఏర్పరిచి నిర్వహించడం, పార్లమెంటరీ న్యాయవిధానం అర్థం చేసుకోవడం, పెద్ద సమ్మెలలో సహాయంచేయడం, లాభములు, వేతనములు, ఉత్పత్తి,

ఉద్యోగ పరిస్థితులు, జీవనవ్యయము, మొదలగువాటి గురించి కొంత ప్రాథమిక విజ్ఞానం పొందడం, ఒడంబడికలకై సంప్రదింపులు జరపడం, సంశ్లిష్టమైన కార్యాలయ మంత్రాంగము పరిపాలించుట, దేశములోని తదితర ప్రాంతములు, తదితర దేశములుకూడా పర్యటించుట, కార్మికులకు, ప్రజలకు సంబంధించినంతవరకు, దేశ, విదేశ విధానములను అర్థముచేసుకొనుట, శాసన సభలలో కార్మిక ప్రతినిధులుగా వ్యవహరించుట; ఎన్నో సమాజ కార్యక్రమములలో పాల్గొనుటకూడా చేయవలసి వచ్చెడిది. ఈవిధముగా కర్తధర్మము నిర్వహించుటలో, సీసపు పోతవాడు, రొట్టెలు తయారుచేయువాడు, వడ్రంగి, సూదులు తయారుచేయువాడు, మెకానిక్. గని కార్మికుడు, మోటారు వర్కరు, తదితర కార్మికులు విశాలమై చైతన్యవంతమైన విలువైనవిద్యను నేర్చుకొని, ప్రతిఫలముగా సమాజములోని పౌరులకు విద్య గరపుటలో ప్రతిభావంతమైన గురుతుల్యులైపోయిరి.

## కార్మికుల విద్యా కార్యక్రమములు.

మంచి పబ్లికు స్కూలు విద్యకొరకు చిత్రాలద్వారా విజ్ఞానము నేర్చుకొను అవకాశము సభ్యులకు, ఆఫీసర్లకు యివ్వడమే యీ సమస్యలకు పూర్తి జవాబు కాదని చాలా కాలముక్రితమే అమెరికను కార్మిక ఉద్యమము తెలుసుకున్నది. మొదటి ప్రపంచ మహా సంగ్రామమునుంచి, తమ సభ్యులను నిర్ణీత పద్ధతులలో అభివృద్ధిపరచుటకు, ఎన్నో సంఘములు విద్యాశాఖలు, నిర్వహించినవి. ఈ శాఖలు, యీక్రింద చెప్పిన పనులు చేసినవి.

1. తగినంత ప్రాథమిక విద్య లేకుండా నాయకస్థానములు వహించిన వారికి తగినంతగా వ్రాయడం, చదవడం, మాట్లాడడం నేర్పుట.
2. కార్మిక ఉద్యమము చరిత్ర, దానిపనులు, వారికి సంబంధించిన సంఘముయొక్క వివరాలు, సంఘ నాయకుల, వాదుల, హక్కులు బాధ్యతలు, అర్థముచేసుకొనుటలో సభ్యులకు కొంత విజ్ఞానమందిచ్చుట.
3. ఇంకా ఉన్నతమైన జీవనప్రమాణములు, పొందే పోరాటంలో నిశ్చిత లక్ష్యములు చేరుటకు సంఘమునకు సహాయము చేయుట.

4. పదవులకోసం ఆశించి పదవులు పొందేవారికి, సంఘముయొక్క విద్యుక్త ధర్మములలో తగిన శిక్షణ యిచ్చుట.
5. నేటి ఆర్థిక, సాంఘిక, అంతర్జాతీయ సమస్యలు బాగా అర్థము చేసుకొనునట్లు చేయుట, ఈ సమస్యలు ప్రజాస్వామ్యరీతిలో పరిష్కరించు మార్గములు కలుగచేయుట.
6. శారీరక, మానసిక, కళాత్మక, సాంస్కృతిక పద్ధతులలో వ్యక్తిగత కార్మికవాదుని అభివృద్ధిపరచుటలోని అవకాశములు కలుగచేయుట, మానవ సంబంధములర్థముచేసుకొను రంగములో, అతని జీవితము సంపన్నత పొందునట్లు చేయుట, తత్ఫలితముగా సంఘమునకున్న విధేయత పెంపొందింపచేయుట, మొదలగువాటికై అవకాశములు సృష్టించుట.
7. విశాల సమాజములో కార్మికుల గురించి సానుభూతికరమైన దృక్పథము పెంపొందించుట.

## దుస్తులు తయారుచేయు కార్మికులలో

ప్రతిభావంతమైన విద్యా కార్యక్రమము అభివృద్ధిచేసిన ప్రథమ అంతర్జాతీయ సంస్థ అంతర్జాతీయ స్త్రీ దుస్తుల కార్మికుల సంఘమే. సుమారు నలభై సంవత్సరాల కార్యక్రమము తర్వాత, డైరక్టరు, మార్క్ స్టార్, కార్యదర్శి ఫానియా కొహన్ అతివిధేయతకలిసిన నాయకత్వమువలన, ఈపని చాలావిధములుగా పటిష్టముగానడుచుచున్నది.

కార్మిక సమస్యలు, కళలు, వృత్తులు, ఇంగ్లీషు, మానసికశాస్త్రము, ఆరోగ్యము, ప్రస్తుత విషయాలు, పార్లమెంటరీ న్యాయవిధానము, మున్నగువాటిపై సంఘము అనేక క్లాసులు నడుపును. వ్యాయామము గురించి సలహాలిచ్చుటయే కాక నాటకము, నృత్యము, సంగీతముల విషయమైకూడా క్లాసులు నడుపును. ఆఫీసర్లకు కావలయు విద్యాప్రతమలిచ్చు క్లాసులు, నడుపును. అనేకమైన సాంఘిక సమావేశములు, ఆసక్తి కలిగించే ప్రదేశములకు అనేకసార్లు పర్యటనలుకూడా యిది ఏర్పాటు చేయును. వేసవి వారాంత కళాశాలలుకూడా నిర్వహించును. ఉపన్యాసములిప్పించును. రేడియోద్వారా ప్రసారములు వినిపించును, ఫిల్ములు పంచిపెట్టి పాఠములు నేర్చుకొను సహాయము కూడా చేయును. సమకాలికసంఘట

నలగూర్చి వర్ణచర్చలు జరిపించును. "విత్ దీజ్ హేండ్సు" అనే పెద్దసిల్ము ప్రపంచమంతా చూపించుటకు "పిన్సు అండ్ నీడిల్సు" సంఘము, సంగీత ప్రదర్శనలుకూడా యిస్తూ ప్రయత్నించుచున్నది. పదకొండు భాషలలో తర్జుమా అయ్యిన ఈఫిల్ము అందరూ చూచిరి. నాల్గు ఖండములలో అనేక మిలియనుల స్త్రీ పురుషులు ఈఫిల్మును చూచి ఆనందించిరి.

అంతర్జాతీయ స్త్రీ దుస్తుల పనివారి సంఘము ఒక విద్యాశాఖలో పని చేయు ఉద్యోగులను పౌర విద్యావిషయిక, వ్యాపారసంబంధ, మహాసభలకుకూడా పంపుచున్నారు. విదేశములనుంచి ఆ సభలకువచ్చు ప్రతినిధి వర్గాలకు అమెరికను కార్మిక ఉద్యమముగూర్చి వివరించుటకు వారిని పంపించుచున్నారు.

సంఘముయొక్క స్థానిక సంస్థలు సంగీత కచేరీలు ఏర్పరచి కళావస్తువులు ప్రదర్శించి, వృత్తులు నేర్పి, ఆర్థిక, సాంస్కృతిక ఆరోగ్య సమస్యలపై సలహాలిచ్చి, యింకా చాలా కార్యక్రమములలోనిమగ్నమైయుందురు.

విద్యా విషయిక కమిటీ చైర్మను జూలియస్ హోచ్‌మన్, 1951-53లో వెలువడిన ఆశాఖ నివేదికలో యీవిధముగా సూచించెను. "సంఘము వలెనే విద్యాకార్యక్రమములుకూడా మార్పుకు సంసిద్ధులౌవలెను, సృజనాత్మకముగా యుండవలెను. క్రొత్త పద్ధతులు అవలంబించవలెను." ఆ నివేదికలో యింకా యీవిధముగా ప్రకటింపబడియున్నది. "ఈమధ్య సంవత్సరములలో చాలాక్లాసులు, రేడియో, టెలివిజనులు వచ్చినతర్వాత, తీవ్రముగా పరిశీలించుటలో చాలా నిరుత్సాహము కనపరచుచున్నవి." అందులో యింకా. "సినీమాలు, రేడియో, విద్యావిషయంలో, సలహాసేవా విధానమును, ఛెక్ లేడీస్ శిక్షణ నిచ్చుటలో ఎక్కువ కేంద్రీకరణకు, ఎక్కువ వాడవలెనని, బహుజనాభిప్రాయము చెప్పుచున్నది. అంతర్జాతీయ స్త్రీ దుస్తుల కార్మికుల సంఘములో మూడువంతులలో రెండువంతులు పూర్తిగా స్త్రీలే. సభ్యులను సరిగా నిర్వహించి, పురోభివృద్ధి చేయగలుదులకు, ఆసంస్థయొక్క ఉన్నత సంప్రదాయములగురించి చెప్పువారిలో స్త్రీలే ముఖ్యులు. విద్యా కార్యక్రమములకు, పారిశ్రామిక రాజకీయ కార్యక్రమమునకు, సన్నిహిత సహకారము ఎత్యమూ బాగా కావలెను. గృహ నిర్మాణములో, ఆరోగ్యవిషయములలో యీసంస్థయొక్క విస్తృత

కార్యక్రమములు ఆరోగ్యము, విద్య, సాంఘిక, వినోద కార్యక్రమముల విస్తృతికే తోడ్పడుచున్నవి. తమ సాంఘిక అవగాహనలో అభ్యుదయ, క్రమశిక్షిత అభివృద్ధి, సభ్యులు పొందువట్లు క్లాసులు నడిపించబడినవి.

విద్యాశాఖయొక్క 1956 నివేదికలో, నిర్ణీతవారం క్లాసులు బదులు, ఉపన్యాసములు, పర్యటనలు విద్యా సమావేశములు, మొదలగు వివిధ ప్రణాళికలు, ఉండుట మంచిదని సూచింపబడినది. సంఘము ప్రవేశపెట్టిన విద్యాశాలలు, స్థానిక కాలేజీలు, విశ్వ విద్యాలయాల సహాయముతో నడుపబడినట్టివి, పేరుప్రఖ్యాతులతో, సంఖ్యలో యీమధ్య ఎక్కువగా పెరిగినవి.

## మోటారు కార్మికులలో

చాలా చిన్న వయసుకలిగిన యునైటెడ్ ఆటోమొబైల్ వర్కర్సు సంఘముయొక్క విద్యాశాఖ, బ్రెండన్, సెక్స్టన్ యొక్క తెలివైన నిర్వహణలో, మెరుగు పరిస్థితుల విషయంలో ప్రస్తుత సంఘం కోరికలు మిలియనుల వివిధ రకాల సభ్యులలో అర్థమయేటట్లు కృషి జరిగినది. ఉద్యోగము గ్యారంటీయిచ్చే ప్రణాళిక గురించి 1955లో జరిపిన సంప్రదింపుల ఒడంబడికలో తాము కోరుటకు నాయకులు నిశ్చయించినపుడు, యీప్రణాళికను విపులముగా తెలియజేయుట, చర్చించుట తన ప్రథమ బాధ్యతగా ఎంచి, సంఘ ఉద్యోగులలో, స్థానిక సంఘనాయకులలో, ప్రాంతీయవిద్యాశాఖ డైరక్టర్లలో, తదితర అగ్రస్థానములోని కార్మికులలో, స్పీకర్సు ద్వారా, వర్గచర్చలద్వారా, కరపత్రములద్వారా, పెద్ద నోటీసులద్వారా, విద్యాశాఖ తక్షణము ఒక ప్రచార ఉద్యమము ప్రారంభించినది. ఈ విషయంగురించి సమాజ నాయకులకు యీశాఖ అనంతమైన సాహిత్యము కూడా అందిచ్చినది. చిన్న పరిశీలక వర్గములలో, వేసవి స్కూళ్ళలో పెద్ద జాతీయ విద్యా మహాసభలలో, ఈ ప్రణాళిక వివరాలు చర్చించబడి, నిర్ణయించబడినవి.

1953-54 సంవత్సరములలో, ది యునైటెడ్ ఆటోమొబైల్ వర్కర్సు సంఘం వివిధకార్మికసమస్యలనుగూర్చి 1¾ మిలియను కరపత్రములు అమ్మినది. 34 వేసవి స్కూళ్ళు నడిపించినది; 500 వారాంత పాఠశాలలు నిర్వ

హించినది. వివిధ విషయములగురించి స్థానిక సంఘము ప్రతిపాదించిన క్లాసులు కొన్నివేలు నడిపించినది.

## వినోదము.

యునైటెడ్ ఆటోమొబైల్ కార్మికులలో పనిచేయుకాలము తగ్గి, విరామకాలము పెరిగినకొలదీ, 1937లో సంఘము ఒక వినోదశాఖ కూడా ఏర్పరచినది. ఈశాఖ తన సంఘసభ్యులకు, వారికుటుంబములకు వినోదము కల్గించుటకు కృషిచేయును. ఇందులో ఏవిధమైన జాతివిచక్షణలేకుండును. తన సభ్యులలో యింకా ఎక్కువ ఐక్యత పెంపొందించుట, సమాజముతో సంఘమును యింకా దగ్గరగా చేర్చుట, ప్రతీ పరిశ్రమలోని అందరు అమెరికను కార్మికులకొరకు, సహకారసంఘ యజమానులు వినోదకార్యక్రమములు జరుగునట్లు కృషిచేయుట ఈవినోదశాఖ లక్ష్యములు. అప్పటినుంచి అంతర్జాతీయ సంస్థ, దాని స్థానికసంఘములు, అన్నిరకముల వ్యాయామ, సాంఘిక, సాంస్కృతిక కార్యక్రమములలో వినోదకార్యక్రమములు విస్తృతము చేసెను. ఈరంగములో 3000 యునైటెడ్ ఆటోమొబైల్ కార్మికులు ముఖ్యంగా ఏభైయవపడిలో ఉన్నవారు, వలంటీరుపనిచేయుచుండిరి.

ది అమాల్గమేటెడ్ మీట్ కట్టర్సు, సెంటు లూయీలో, తదితర కేంద్రములలోని టీమ్‌స్టర్సు, ఆకర్షణీయమైన వేసవి క్యాంపులతో, నాటక కళాత్మక కార్యక్రమములతో సూదివృత్తి కార్మిక సంఘములు, తమకుటుంబముల, సభ్యుల విరామకాలములో సేవాపథకములు నిర్వహించుటలో చాలా ఎక్కువ శ్రద్ధ చూపుచున్నారు.

## అనేక సంఘముల విద్యా కార్యక్రమములు.

చైతన్యవంతమైన విద్యాకార్యక్రమము నడిపే తదితర సంఘములు, ది మెకనిష్టు; అమాల్గమేటెడ్ క్లోదింగ్ వర్కర్సు; కెమికల్ వర్కర్సు; కమ్యూనికేషన్ వర్కర్సు; ఎలక్ట్రికల్ వర్కర్సు; స్టేట్, కౌంటీ, మరియు మ్యునిసిపల్ వర్కర్సు; టెక్స్టైల్ వర్కర్సు; రబ్బరు వర్కర్సు; ది అమాల్గమేటెడ్ మీట్ కటర్సు; స్టీల్ వర్కర్సు; పల్పు పేపరుమిల్లు వర్కర్సు; మున్నగువారు, సాధారణ విద్యావిషయిక కార్యక్రమములు, నడిపించ

బడుటయేగాక, పెద్ద సంఘముల వివిధ సంశ్లిష్ట సమస్యలు పరిష్కారంలో అన్నిలక్షణములు కలిగి ప్రవర్తించే భవిష్యత్తు ఆఫీసర్లకు విద్యే నిచ్చుటలో కూడా చాలా శ్రద్ధ చూపబడినది.

సమాఖ్యం కాకముందు, సి. ఐ. ఓ. తో సంయుక్తంగా నిర్వహించిన విద్యాపాఠశాలలు చాలావిజయవంతమైనవని అమెరికా టెక్ట్సైల్ వర్కర్సు సంఘము నివేదించుచున్నది. ఖర్చుసంగతి అటుంచి, ఇతర సంఘములలోని తమసభ్యులు అనుభవాన్ని వృద్ధిచేసి, టెక్స్టైల్ వర్కర్సు సమస్యలు యితర సంఘసభ్యులు అర్థముచేసుకొనునట్లు కృషి జరిగినది. పల్పు, సల్ఫైట్ పేపరు మిల్లు వర్కర్సు, విద్యా సమావేశములలో ప్రాథమిక ఉపాధ్యాయులు, మొదలగువారిని తమకు పాఠములు చెప్పుటకు వినియోగించిరి, కాని అమాల్గమేటెడ్ మీట్ కటర్సు, అంతర్జాతీయసంస్థ, తన ఉద్యోగులైన సభ్యులకే రూజ్వెల్ట్ కాలేజి, తదితర ప్రాంతములలో, చర్చానాయకులుగా, శిక్షణ యిచ్చెడిది. సాయంత్రం పాఠాలు నేర్పడమన్నది అమాల్గమేటెడ్ మీట్ కటర్సు, దృష్టిలో విజయవంతము కాలేదు. వ్యక్తిగత స్థానిక సంఘములకొరకు ఒకరోజు మహాసభలు ఏర్పాటు చేసెడిది.

## ఆఫీసర్ల శిక్షణ.

యునైటెడ్ ఆటోమొబైల్ వర్కర్సుఅనేఒక సంఘములో రాజ్యాంగం ప్రకారము, తమ బాధ్యతలకు తగినట్లు శిక్షణ యిచ్చే విద్యా కార్యక్రమములలో పాల్గొనవలసినదని ఆఫీసర్లను, స్టీవర్డ్సును, కమిటీ సభ్యులను కోరుటకు, స్థానిక సంఘములకు అధికారము కూడా యివ్వబడినది. యునైటెడ్ ఆటోమొబైల్ వర్కర్సుయొక్క ఒక స్థానిక సంస్థ తన స్థానిక నాయకులకు, సరాసరి 14 గంటల శిక్షణ, ఉమ్మడిబేరము, మానసిక తత్వశాస్త్రము కాలము పరిశీలించుట, తమంతతామే పనిచేయు యంత్రాల వివరాలు కార్మిక, ఆర్థిక వ్యవస్థ, రాజకీయ శాస్త్రము మున్నగువాటిపై యిచ్చినది. మరొక సంఘములో ఇరవైనాలుగు గంటల కార్యక్రమములు కావలసి వచ్చెను. సంప్రదాయబద్ధంగా వచ్చు సంఘవిషయములేకాక, చర్చానాయకత్వము, విద్యాపద్ధతులు, మానవసంబంధములలోని ముఖ్యవివరములు గూర్చి కూడా. శిక్షణ యివ్వబడినది. 1950లో, అంతర్జాతీయ స్త్రీదుస్తుల

కార్మికసంఘమ్ము తన సంఘ కేంద్ర ఆఫీసు ప్రాంతంలో ఒక సంవత్సర శిక్షణ ఏర్పాటుచేసినది. సంఘములో ఆఫీసర్లు కావాలనుకొన్నవారికే ఆ శిక్షణ.కీ.శే. డా. ఆర్థర్ ఎల్డర్ దానికి మొదటి డైరెక్టరు.

## ఏ. యఫ్. యల్.– సి. ఐ. ఓ విద్యాశాఖ.

20వ దశాబ్దం మొదటికాలంనుంచి, సమాఖ్య ఏర్పడేవరకు, ఏ. యఫ్. యల్. వ్యక్తిగతిసంఘముల విద్యా కార్యక్రమములకు ఏ. యఫ్. యల్. వర్కర్సు విద్యా బ్యూరోయొక్క సహాయము లభించెడిది. 1939నుంచి 1955వరకు, సి. ఐ. ఓ. సంఘములు, సి. ఐ. ఓ విద్యాశాఖ సహాయము బడయుచుండెను. ఈరెండు సంస్థలు సమాఖ్యగా ఏర్పడినపుడు, యీ విద్యాశాఖలుకూడా కలిసిపోయి, ఏ. యఫ్. యల్., సి. ఐ. ఓ శాఖగా ఏర్పడెను.

ఐక్య కార్మిక ఉద్యమమంతటా విద్యాశాఖా కార్యక్రమములు, యీ శాఖ సమన్వయపరచి, ప్రోత్సహించును. కార్మికవిద్యగురించి, యీ శాఖ సమాచార మందించు నిలయమువలె పనిచేయును. రాష్ట్ర, స్థానిక, దేశ కార్యక్రమములగురించి, యిదిపథకములు వేసి, సలహాలిచ్చును. ప్రజా సంబంధముల కార్యక్రమములు పెంపొందించును. పబ్లిక్ స్కూలు పాఠములో యిముడ్చబడిన సంఘటిత కార్మికులగూర్చి పాఠ్య కార్యక్రమములుపొందు టలో సహాయపడును. ప్రభుత్వ గ్రంథాలయములకు, సంఘటిత కార్మికుల మధ్య సహకారము వృద్ధిచేయును. సంఘము, ప్రజల సమావేశములకు స్పీకర్సు ఏర్పాటుచేసి, రేడియో టెలివిజన్ కార్యక్రమములు యిచ్చు టలో సహాయపడును. ఒక ఫిల్ము గ్రంథాలయముకూడా నిర్వహించును. కార్మిక విద్యా కార్యక్రమములు విశ్వవిద్యాలయములలో జరుగునప్పుడు సహకార మందిచ్చును. కార్మిక సమస్యలగురించి కరపత్రములు, కార్మికులగూర్చి, వారికి సంబంధించిన ఫిల్ములగూర్చి గ్రంథముల వివరణపట్టి ప్రచురించును. ఇదివార్తా లేఖలుకూడా పంపును.

## తదితర కార్మిక విద్యా వర్గములు.

సంఘములకు బయట అనేక స్వతంత్రసంస్థలు కార్మికులపై సాను భూతికలిగి, కార్మికులవిద్యావిషయంలో ఎంతో సేవచేసినవి.

అనేక కళాశాలలలో కార్మికులకు వేసవిస్కూళ్లు ఏర్పాటుచేసేముఖ్య కేంద్రంగా అమెరికను లేబరు ఎడ్యుకేషన్ సర్వీసు పనిచేసినది. కార్మికుల విద్యా సమస్యలగురించి చర్చించుట కార్మికవిద్యావేత్తలను పిలిపించి సాంవత్సరిక మహాసభలుకూడా యిది జరుపును; ఒక విలువైన లేబరు ఎడ్యుకేషనుగైడు (కార్మిక విద్యాసూచిక)కూడా ప్రచురించును. 50వదశాబ్దం మొదటికాలంలో ఫోర్డుఫౌండేషన్‌నుంచి యువజన విద్యకై ఒక గ్రాంటు యివ్వబడినది, దానివలన, ప్రపంచము, అమెరికా ప్రస్తుతము ఎదుర్కొంటున్న అంతర్జాతీయ సమస్యలగురించి మహాసభలు, సదస్సులు, క్లాసులు, సంఘసభ్యులకు జరుపుటకు అవకాశమున్నది.

1905లో లీగ్ ఆఫ్ ఇండస్ట్రియల్ డెమాక్రసీ ఏర్పాటైనది. ఈ సంస్థ మన ఆర్థిక, రాజకీయ, సాంస్కృతిక జీవితములో ప్రజాస్వామ్యము అభివృద్ధిపరచు విద్య పెంపొందించుటకై అంకితమైనది. కార్మిక ఉద్యమములలో విశేష ప్రచారముకావలసిన సాంఘిక ఆర్థిక సమస్యలగురించి యున్న ఒక కరపత్రము ఆ సంవత్సరములలో అది ప్రచురించినది. పరిశోధక సమాచారము సంఘములకు యిది అందిచ్చును. కార్మిక ఉద్యమముయొక్క అన్ని శాఖలు హాజరగునట్లు సాంఘిక, కార్మిక సమస్యలనుగూర్చి మహాసభలు జరుపును. ఈ దేశములో, పరదేశములలో, కార్మికుల కార్యక్రమములు, విజయములగూర్చి పౌరవర్గములముందు, స్కూళ్లు, కాలేజీలలోను, ఉపన్యాసములు ఏర్పాటుచేయును. లీగ్ ఆఫ్ ఇండస్ట్రియల్ డెమాక్రసీ సంస్థయొక్క విద్యార్థివర్గనాయకులు ఎంతోమంది, తమకళాశాల జీవితములు గడుపుతూకూడా, కార్మిక ఉద్యమమునకు, నిర్వాహకులుగా, పరిశోధకులుగా, విద్యా డైరెక్టర్లుగా సంపాదకులుగా, రచయితలుగా, పరిపాలక, న్యాయ, సాంకేతిక సలహాదారులుగా సేవచేసిరి.

స్పీకర్సు, సాహిత్యము, సాంకేతిక సహాయము, ప్రజా సమూహంలో కార్మికులగురించి తెలియజేయుటలో కార్మిక ఉద్యమమునకు సేవచేసిన యితర సంస్థలు; అమెరికను సివిల్ లిబర్టీస్ యూనియను; అమెరికన్సు ఫర్ డెమాక్రటిక్ యూనియన్; అమెరికను డెమాక్రటిక్ సర్వీస్ పర్ ది యు. యన్., యాంటీ డిఫమేషన్ లీగ్; అసోసియేషన్ ఆఫ్ కేథలిక్ ట్రేడ్

యూనియన్సు; జ్యూయిష్ లేబర్ కమిటీ; లేబరు సర్వీస్ ఆఫ్ ది అమెరికను జూయిష్ కమిటీ; నేషనల్ హౌసింగ్ కాన్ఫరెన్సు; నీగ్రో లేబరు కమిటీ పబ్లిక్ అఫైర్సు ఇన్స్టిట్యూట్, నేషనల్ రిలిజియస్ అండ్ లేబరు ఫౌండేషను; ట్రేడ్ యూనియన్ కమిటీ ఎగెనెస్టు. డిస్క్రిమినేషన్; వర్కర్సు డిఫెన్సు లీగ్;

శ్రామిక సంఘములు, సోషలిస్టులు, న్యూయార్కు నగరంలో సంఘటిత పరిచిన రాండ్ స్కూలు ఆఫ్ సోషల్ సైన్సు ఒక అర్థశతాబ్దముపాటు, కార్మిక, సాంఘిక సమస్యల గురించి పాఠముల కోర్సులు నడిపించినది. న్యూయార్కులో కటోనాలోని బ్రూక్ వుడ్ లేబరు కాలేజి, స్వతంత్రంగా చాలా సంవత్సరాలు సంఘ ఉద్యమానికి సేవచేసింది.

## విశ్వవిద్యాలయములు – కార్మిక విద్య.

**1924** లో మొట్టమొదటగా, కార్మికుల విద్యారంగాలలోకి ప్రవేశించిన అమెరికను విశ్వవిద్యాలయము విస్కాన్సిన్ విశ్వవిద్యాలయము. అప్పటి నుంచి ప్రస్తుతము చాలా ప్రసిద్ధికెక్కిన వేసవి స్కూలును కార్మికులకై నడిపించుచున్నది. కార్మిక వర్గములకు రాష్ట్రవ్యాప్త క్లాసులు ఇది ఈ మధ్య నిర్వహించినది. నేడు, సుమారు ఒక వంద కాలేజీలు విశ్వవిద్యాలయాలు కార్మిక విద్యా కార్యక్రమములు నడిపించుచున్నవి. అయితే కార్మికుల పూర్తి విద్యా సేవా కార్యక్రమము, కార్నెలు, రట్గర్సు, పెన్సిల్వేనియా రాష్ట్రం, రూజ్వెల్టు విశ్వవిద్యాలయం, కాలిఫోర్నియా, చికాగో కాన్నెక్టికట్, ఇలియనోస్, విస్కాన్సిన్, అలబమా* మొదలగు విశ్వవిద్యాలయములలో యివ్వబడుచున్నది.

ఏభయివ దశాబ్దం మొదటి భాగములో, ఒక్క కన్నెటికట్, అలబామా తప్ప, తక్కిన విశ్వవిద్యాలయాలు, యువజనవిద్యకై నిధిసుంచి విరాళములు పొందిరి. అంతర్విశ్వవిద్యాలయ కార్మిక విద్యా కమిటీ ఒకటి సంఘటిత పరిచిరి. మరికొద్ది సంవత్సరములవరకు, ఎ. యఫ్. యల్. సి. ఐ. ఓ. సహకారంతో, ఉద్యమములో వాడబడిన పద్ధతులు, కార్మికుల విద్యయని వస్తువును పరిశోధించి, ప్రయోగాలు చేసిరి.

(*సాయంత్రం పాఠములు చెప్పు శాఖలలో ఆఖరిది.)

కార్మికుల విద్య పురోభివృద్ధిచేయుటలో యింకా సహాయము చేయుటకు అనేక కేంద్రశాసన సభ్యులు కార్మిక విద్యకు ఆర్థిక సహాయము చేయుటకై బిల్లులు ప్రవేశపెట్టిరి. వ్యవసాయ విస్తృత సేవాపథకమును పోలునట్లు కేంద్ర కార్మిక విస్తృతసేవా పథకము ఒకటి స్థాపించుటకు పూనుకొనిరి. ఇప్పటివరకు, ఈ బిల్లులు ఆమోదింపబడలేదు.

కార్మిక విద్యారంగంలో క్రితంతరంలో పురోభివృద్ధి కనిపించిననూ, తమతమ సంఘముల విద్యాసేవ విషయంలో చైతన్యవంతమైన పరిధిలోకి చాలా కొద్దిపాటి సంఘ ఉద్యమమే చొచ్చుకున్నది. ఐక్యకార్మిక ఉద్యమములో కార్మికుల విద్యాభివృద్ధి చాలా ఆసక్తితో పరిశీలించ బడుచున్నది. దానికారణము జాతీయ అంతర్జాతీయ రంగములలో వివిధ దృక్పథములలో ముఖ్యముగా కార్మికుల బాధ్యత ఎక్కువగా పెరుగుచున్నది.

## అంతర్జాతీయ రంగములో కార్మికులు.

ఇతర దేశములలోని తమతోటి కార్మికుల పరిస్థితి గూర్చి అమెరికను కార్మికులు ఎప్పుడు ఆసక్తి కనబరచుచుండిరి. పంధొమ్మిదవ శతాబ్దంలో నిమ్నొన్నతాలుపొందిన మొదటి సంఘములో అనేక నాయకులు పరదేశము లలో శ్రామికసంఘోద్యమ సంస్థలతో అమెరికారాష్ట్రములకు రాకముందు పూర్తిగా లీనమయిపోయి తర్వాత వారితో సన్నిహిత సంబంధములు కలిగి యుండిరి.

## గాంపర్సు; అంతర్జాతీయ కార్మిక సంస్థలు.

ఎ. యఫ్. యల్. యొక్క ప్రథమ అధ్యక్షుడు, సామ్యూల్ గాంపర్సు యూరోపియన్ కార్మిక నాయకులకు వ్రాసెడివారు. 1889లో పారిస్‌లో అంతర్జాతీయ సోషలిస్టు, కాంగ్రెసును రోజుకు 18 గంటల పనికావాలనే అమెరికను కార్మిక ఉద్యమములో బలపరచమని ఆయనకోరెను. ఈ కోరిక వలనే 1890, మే 1, తక్కువ పని వారమునకు ప్రదర్శనలు జరిపే రోజు గాను, తర్వాత ప్రపంచ కార్మికులకు ఆ తేదీ విశ్రాంతి దినముగాను, ప్రత్యేకించుట ఫలించినది.

1893లో, వృత్తి సంఘాల అంతర్జాతీయ కాంగ్రెసు ఒకటి ప్రతిపాదించి చికాగో ప్రపంచ ప్రదర్శనం సందర్భంలో, ప్రపంచములో సంఘటిత మయిన వేతన కార్మికులకు రమ్మని సామ్యూల్ గాంపర్సు ఆహ్వానములు పంపెను. ఈ ప్రతిపాదన చివరకు బ్రిటిషువారు మాత్రమే అంగీకరించిరి. అందువలన ఈ ప్రతిపాదన వదలివేయబడినది.

## ఎ. యఫ్. యల్. మరియు ఐ. యఫ్. టి. యు.

1910 లో, పదిహేడు సంవత్సరాల పిదప, అంతర్జాతీయ శ్రామిక సంఘముల సమాఖ్యలో ఎ. యఫ్. యల్. సభ్యత్వముపొంది, ఆమ్స్టర్‌డామ్ కేంద్రంగా పెట్టుకొని నిర్వహించినది. ప్రపంచ ప్రథమ సంగ్రామము వచ్చినదాక, చాలా చైతన్యవంతంగా పని చేసినది.

యుద్ధము తర్వాత, ఎ. యఫ్, యల్. కు, అంతర్జాతీయ శ్రామిక సంఘములు సమాఖ్యకు (ఐ.యఫ్.టి.యు.) కు ఒక వివాదము చెలరేగినది. ముఖ్యంగా పరిశ్రమలను జాతీయం చేయుటకు, అంతర్జాతీయ సంస్థయొక్క అధికభాగము చేసిన తీర్మానములో, దేశముయొక్క సంస్థలు పాటించ వలెనా లేదా అని 1937 లో ఎ. యఫ్. యల్. సి. ఐ. ఓ. ల మధ్య విభేదాలలు పెరిగాక కాని, ఎ. యఫ్. యల్. ఐ. యఫ్. టి. యు. తో అనుబంధము కాలేదు.

యుద్ధము - ఈ సారి ప్రపంచ ద్వితీయ మహాయుద్ధము కార్మికుల అంత ర్జాతీయ సంస్థను చెదరగొట్టినది. తర్వాత ఒక అత్యవసర అంతర్జాతీయ వృత్తి సంఘముల కౌన్సిలు ఏర్పడినది. 1942 సెప్టెంబరులో, లండనులో సమావేశమయి, తతిమా యుద్ధకాలములలో అంతర్జాతీయ సంఘటిత కార్మికు లకు ముఖ్యమైన ప్రతినిధి సంస్థగా అది వ్యవహరించుటకు నిర్ణయించు కొన్నది.

## ప్రపంచ శ్రామిక సంఘోద్యమ సమాఖ్య.

ఈ లోపుగా, సోవియట్ యూనియనుపై హిట్లరు దండయాత్ర సాగించు కాలములో, కమ్యూనిస్టులు, కమ్యూనిస్టులు కానివారు, అందరు కార్మికులుకలసివుండే ఒక ప్రపంచ శ్రామిక సంఘముల సంస్థ ఉండవలెనని

రష్యా కోరినది. గ్రేటు బ్రిటనులో చాలామంది కార్మిక నాయకుల అభిప్రాయము ప్రకారము రష్యా సంఘములతో సహకారముచేసినచో యుద్ధకృషికి సహాయము జరిగి, తమ స్వతంత్రపోరాటములో హిట్లరు ఆక్రమించిన ప్రాంతాలు సహాయముపొంది, తుదకు యుద్ధము తర్వాత ఒక ఐక్యకార్మిక ఉద్యమము ఉద్భవించునని వారనమ్మిక. వారు మొదట ఒక ఆంగ్లో–సోవియట్ ట్రేడ్ యూనియన్ కమిటీగా ఏర్పడిరి. తర్వాత ఆంగ్లో–అమెరికా ట్రేడ్‌యూనియన్ కమిటీ ఏర్పడినది యుద్ధముచివరభాగంలో, సంఘములు వాదించు శాంతి లక్ష్యములు నిర్వచించుటకు రెండవ కమిటీ ఏర్పడినది.

బ్రిటిష్ సంఘనాయకులు, కమిటీలో చేరుటకు సి. ఐ. ఓ. రైలురోడ్డు బ్రదర్ హుడ్సులకు అనుమతించవలసినదని ఎ. యఫ్. యల్. ని కోరిరి. ఈ కోరిక ఎ. యఫ్. యల్. తిరస్కరించినది. కారణమేమన కార్మికుల అంతర్జాతీయ సంస్థలు ఒక దేశములో ఒక సమాఖ్యనే గుర్తించవలసినదనియు, అంతకుముందే సంఘటితమైయున్న ఎ. యఫ్. యల్. పనే మళ్ళీ సి.ఐ.ఓ. చేయుట ప్రారంభించినదనియు వారివాదన అందువలన సి.ఐ.ఓ. బ్రిటిషు ట్రేడ్సు యూనియన్ కాంగ్రెసు మరొక విస్తృత అంతర్జాతీయ సంస్థ ఏర్పరుచుటకు చర్యలు తీసుకోమని కోరినది.

1943 సంవత్సరంలోనే, నాజీలకు ఎదురుగా రెండవసారి సోవియట్ దేశస్థులు విజృంభణ ప్రారంభించిరి. ఉత్తర ఆఫ్రికాలో మిత్రమండలి జయముపొంది, ఇటలీలో పురోగమించుచుండిరి. మిత్రమండలి విజయము చాలా దగ్గరగా కనిపించినది. చాలా సంఘ వర్గములు యుద్ధము తరువాత ఆర్థిక భద్రత, పరిపూర్ణ ఉద్యోగ పరిస్థితి ఏర్పడే సాంఘికస్థితి ఏర్పడగలదని ఊహించుచుండిరి. ఈ పరిణామములవలన కొంత, ఆంగ్లో సోవియట్ కమిటీలో, సి. ఐ. ఓ లో చర్చలవలన కొంత, అక్టోబరు 1943 లో బ్రిటిషు ట్రేడ్సు యూనియను కాంగ్రెసు, యుద్ధము, శాంతి, సమస్యలు పరిశీలించుటకు ఒక ప్రపంచ శ్రామిక సంఘోద్యమ కాంగ్రెసును పిలుచుటకు నిశ్చయించినది.

ఎ. యఫ్. యల్. ఈ ఆహ్వానమును తిరస్కరించినది; కారణము ఇటువంటి మహాసభ శ్రామిక సంఘముల అంతర్జాతీయ సమాఖ్య ఒక్కటే పిలువ

వలయునని వారి అభిప్రాయము. పైగా ఆ ఆహ్వానములు ద్వంద్వం సంఘము లకు పంపబడినవని, ముఖ్యంగా ఏ. యఫ్. యల్. సోవియట్ సంఘములు పాల్గొనుటను వ్యతిరేకించినవని కారణములుకూడా ఉన్నవి.

ప్రథమ సమావేశమునంతరము, 1945 సెప్టెంబరు 25వ తారీఖున, పారిస్‌లో ఒక మహాసభ జరుపబడెను. దీనికి బ్రిటిషువారు, రష్యన్లు, సి. ఐ ఓ. మూలకారకులు దానికి 56 దేశములనుంచి 250 ప్రతినిధులు హాజరయిరి. ఒక్క ఎ. యఫ్. యల్. మాత్రమే హాజరుకాలేదు. అప్పుడు ట్రేడ్ యూనియన్నుయొక్క ప్రపంచ సమాఖ్య ఏర్పడెను (డబ్లు. యఫ్. టి. యు). 1945, డిసెంబరు 18వ తేదీన, రెండు నెలల తర్వాత, ట్రేడ్ యూనియన్ను అంతర్జాతీయ సమాఖ్యయొక్క జనరల్ కౌన్సిల్ కలుసుకున్నది. అత్యధిక ఓటుతో 25 సంవత్సరాలపాటు ఉన్న ఆమ్స్టర్‌డామ్‌లో ఉన్న అంతర్జాతీయ సంస్థను రద్దుచేయుటకు నిశ్చయింపబడినది.

## డబ్లు. యఫ్. టి. యు. లో సంఘర్షణలు.

మొదటి రెండు సంవత్సరములలో డబ్లు. యఫ్. టి. యు ఎన్ని ఆశయ భేధాలున్నప్పటికీ, ఈ సంస్థ స్థాపించి కమ్యూనిస్టులు, కమ్యూనిస్టేతరుల మధ్య ఒక విధమైన సమానత్వము ఉండునట్లు ప్రమాదములు లేకుంటు నట్లు, ప్రయత్నము చేసినది. సర్ వాల్టర్ సిట్రైన్ మరియు సిడ్నిహిల్ మెన్, పాశ్చాత్యసంఘ తత్వవాదుల పక్షాన కార్యవర్గమునందు మంచి అధికారము కలిగియుండిరి. ఫ్రాన్సు దేశములో, ఇటలీలో కమ్యూనిస్టులు మిశ్రమ ప్రభుత్వములో పనిచేయుచున్నా రన్నివిషయము, సంఘసంస్థలలో కూడా ఒక సమన్వయ దృక్పథము వారు అవలంభించుటకు ఒక ప్రాతిపదిక ఏర్పడినది.

1947 తర్వాత, కమ్యూనిస్టుకోమిన్ ఫారమ్‌సంస్థ; మార్షల్ ప్రణాళికపై మితిమీరిన అభిప్రాయ భేదాలు; అమెరికా రాష్ట్రములు, ఫ్రాన్సు, ఇటలీ, గ్రేటు బ్రిటను, జర్మనీ మరియు తదితరదేశాలలో కమ్యూనిస్టులకు, కమ్యూనిస్టేతరులకు మధ్య తీవ్రమైన పోరాటములు; పాశ్చాత్య యూరపు దేశములో కార్మిక ఉద్యమములలో కమ్యూనిస్టు చొరబడకుండా ఎ.యఫ్.

యల్. మరికొన్ని పాశ్చాత్య సంఘసంస్థల ప్రతినిధులయొక్క నిరంతర పటిష్ఠ కృషి, వృత్తి సెక్రటేరియట్సును, ముఖ్యంగా, అంతర్జాతీయ గని కార్మికుల సమాఖ్య, ట్రాన్సుపోర్టు కార్మికులు, తదితర కార్మిక సంఘముల సెక్రటేరియట్సును, డబ్లు. యఫ్. టి. యు. స్వాధీనపరచుకొను ప్రయత్నము; కమ్యూనిస్టుల ప్రచారానికి డబ్లు. యఫ్. టి. యు. ఒక సాధనంగా ఉపయోగపడుట, మొదలైన వాటివలన, ఆ ప్రపంచ సంస్థలోనే కమ్యూనిస్టులకు, సంస్కార వాదులకు మధ్య, పెద్ద చీలికలు ఏర్పడినవి.

1948 లో డబ్లు. యఫ్. టి. యు. కార్యవర్గకమిటీ, కార్యవర్గబ్యూరో రోమ్‌లో కలుసుకున్నపుడు, సి. ఐ. ఓ. బ్రిటిషు ట్రేడ్ యూనియన్ కాంగ్రెసు ప్రతినిధులు. డబ్లు యఫ్. కార్యదర్శియైన లూయీ సైలంట్‌పై నిందారోపణచేసిరి. తన చర్యలతో పక్షపాతముతో వర్తించుచున్నాడని, పరిపాలకుడుగా తగినవాడు కాడని, డబ్లు. యఫ్. టి. యు. ప్రచురించు సమాచార పత్రికలో, గ్రేటు బ్రిటను, అమెరికా రాష్ట్రముల గురించేతీవ్ర విమర్శలు చేయబడుచున్నవని, తూర్పు జర్మనీ, సోవియట్ యూనియనుల గూర్చి ఏవిధమైన విమర్శలు లేకుండా ఉన్నాయని వారి ఆరోపణలు సి.ఐ.ఓ. పక్షాన మాట్లాడుతూ జేమ్సుకేరే యీ విధంగా అన్నారు. "ఆ సంస్థనుంచి ఉపసంహరించుకునేటంతగా తమసంస్థ డబ్లు. యఫ్ టి. యు. తో అసంతృప్తి చెందినది."

అయినా యీ సమావేశమునందు అటువంటి చీలికలు ఏవీలేకుండా ఉండుటకు కొంత ప్రయత్నం జరిగినది. భవిష్యత్తులో కమ్యూనిస్టు, ప్రచారాన్ని నిరోధించగలదని కొందరు నమ్మేకొన్ని తీర్మానములు వరుసగా ఆ సమావేశములో ఆమోదించబడినవి. అయినా కమ్యూనిస్టేతరులపై కమ్యూనిస్టుల దాడులు యింకా పెరిగిపోయినవి. అక్టోబరు 1948 లో బ్రిటిషు ట్రేడ్ యూనియన్ కాంగ్రెసు జనరల్ కౌన్సిలు, యింక యీ డబ్లు యఫ్. టి. యు. వాస్తవిక ట్రేడ్ యూనియన్ కార్యములపై ఏవిధమైన ఒప్పందమునకు రాదని ఉద్ఘాటిస్తూ, యీ సమాఖ్య తన పనులు యింక చాలించవలసినదని, ప్రతిపాదించెను. ఈ ప్రపంచసంస్థను రూపుమాపుటకు డబ్లు. యఫ్. టి. యు. కనుక, తాము యిచ్చిన పథకములో

అంగీకరించక పోయినచో, తాము సంస్థనుంచి ఉపసంహరించుకొనగలమని ట్రేడ్ యూనియన్ కాంగ్రెసు ప్రకటించినది. ఒక నెల తర్వాత పోర్ట్లండ్లో ఓరెగాన్లలోని సి. ఐ. ఓ కన్వెన్షను,డబ్లు యఫ్.టి యు.ను బలపరచడం మాని, యునైటెడ్ నేషన్సులో అది అధికారయుతంగా యుండవలెనను ప్రతిపాదనను తిరస్కరించినది. పైగా ఏచర్య అవసరమో అటువంటి పరిస్థితిలో అచర్య గైకొనవలసినదని తన కార్యవర్గమునకు అది అధికార మొసగినది.

1949 జనవరిలో, రెండు నెలలతర్వాత, జనవరి 17, 21 తేదీలలో పారిస్లో జరుగు కార్యవర్గ జ్యూరో సమావేశమునకు ముందుగానే, డబ్లు.యఫ్ టి.యు. తాత్కాలికంగా రద్దుకావలెనని ట్రేడ్ యూనియన్ కాంగ్రెసు తరఫున ఆర్థర్ డీకిన్ బ్రిటిషు సంఘాల ప్రతిపాదన ప్రకటించెను. డీకిన్ ఉపన్యాసము తర్వాత, సి. ఐ. ఓ. ప్రకటన ఒకటి జేమ్సుకేరే చదివేను. కమ్యూనిస్టు కోమిన్ఫారంయొక్క ఆజ్ఞలు పరిపాలిస్తూ కాని లేదా పక్షవాతమువచ్చి, ఏచర్యచేయలేని పరిస్థితులలోగాని ఉండేటటు వంటి పరిస్థితికి డబ్లు. యఫ్. టి యు. వచ్చినదని, తమ లక్ష్యాలుసాధించు కొనుటకు యీ సంస్థను కమ్యూనిస్టులు వాడుకొంటున్నారని, కమ్యూనిస్టులు, కమ్యూనిస్టేతరవర్గములు రెండుగా చీలిపోయినవని అందులో ఉన్నది. ఆయన యింకా యిలా ప్రకటించెను "డబ్లు. యఫ్. టి. యు. ఒకశవంకాదని యంకా ఏదోఅని చెప్పడం లాభంలేదు.దానిని భూస్థాపితం చెయ్యాలి."

దీనికి సమాధానంగా, డబ్లు. యఫ్. టి. యు. వచ్చే కాంగ్రెసు వరకు ఈ సంస్థ తాత్కాలికంగా రద్దుకావలెనను ప్రతిపాదన వాయిదావేయవలెనని ప్రతిపాదించబడినది. కాని, ట్రేడ్ యూనియన్ కాంగ్రెసు, సి.ఐ.ఓ. ప్రతినిధులు మాత్రం దీనిని పరిశీలించుటకు అంగీకరించలేదు. దానికిబదులు ప్రతిపాదించబడిన రద్దువిధానము కార్యవర్గ జ్యూరో ఏకీభావంతో అంగీకరించవలసినదని వారుకోరిరి. కార్యవర్గ జ్యూరో యీ కోరికను తిరస్కరించుటవలన డీకిన్, జేమ్సుకేరే, డచ్చి ట్రేడ్ యూనియన్లకు సంబంధించిన కూపర్సు సమావేశమునుంచి వెడలిపోయిరి. అనుకున్న చీలిక చివరకు అవతరించినది.

1949 జూన్ 29 తేదీన మిలాన్‌లో తన రెండవ కాంగ్రెసు డబ్లు.యఫ్. టి. యు. ప్రారంభించినది. అది చాలాసార్లు వాయిదాపడుతూ వచ్చింది. ఫ్రాన్సు, ఇటలీ, సోవియట్ ప్రభావిత దేశాలు, లాటిన్, అమెరికన్ కాన్ఫెడరేషన్ ఆఫ్ లేబరు, ఆసియా, ఆఫ్రికాలలోని రేడికల్ కార్మిక వర్గములకు సంబంధించిన ప్రతినిధులు, యీ కాంగ్రెసుకు హాజరైనారు సి. ఐ. ఓ. ట్రేడ్ యూనియన్ కాంగ్రెసు, చాలా ప్రజాస్వామ్య దేశాల కార్మిక సంఘములు డబ్లు. యఫ్. టి యు. లో యింతకుముందు చాలా ప్రముఖపాత్ర వహించినటువంటివి, 1945 లో, ఆ సంస్థను విడిచిపోయినవి. స్వతంత్ర కార్మిక సంఘములతో కూడిన ఒక క్రొత్త ప్రపంచ సంస్థ ఏర్పరచుటకు అవిఅన్నీ ప్రయత్నం ప్రారంభించినవి.

## డబ్లు. యఫ్. టి. యు. కు వ్యతిరేకంగా ఎ. యఫ్. యల్. కార్యక్రమములు

డబ్లు. యఫ్. టి. యు. లో చీలికలు రాకముందే అనేక సంవత్సరముల వరకు, ఎ. యఫ్. యల్. దానికివ్యతిరేకముగా పటిష్ఠమైన కార్యక్రమము నిర్వహించినది. ఐక్యరాజ్య సమితిలోని ఆర్థిక సాంఘిక కౌన్సిల్లో డబ్లు యఫ్. టి. యు. కు ప్రత్యేక సంప్రదింపుల ప్రతిపత్తి యిచ్చువిషయంలో ఎ. యఫ్. యల్. ఆఫీసర్లు ప్రతిఘటించిరి. అమెరికా రాష్ట్రములయొక్క, తదితర ప్రతినిధులయొక్క సహాయముతో, అటువంటి ప్రతిపత్తి తానే సంపాదించుకొన్నది. ఐక్యరాజ్యసమితి సాంఘిక ఆర్థిక, కౌన్సిలులో డబ్లు. యఫ్. టి. యు. యొక్క విధానము లెన్నింటినో వారు వ్యతిరేకించిరి. జర్మనీ, ఫ్రెంచి, ఇటాలియన్ మరి దదితర సంఘ నాయకులతో కలసి ఒక సమాఖ్య ఏర్పడవలసినదని యూరోపుఖండమునకు తన ప్రతినిధులను ఆ కౌన్సిలు పంపినది; బ్రస్సెల్సులో యూరోపియన్ బ్యూరో ఒకటి ఏర్పరిచినది; అన్ని దేశములలోని స్వతంత్ర కార్మిక ఉద్యమములకు సహాయము, రక్షణయిచ్చుటకు, విదేశములలోని సంయములలోని కమ్యూనిస్టు ప్రభావమును ఎదుర్కొనుటకు, ఒక స్వతంత్ర ట్రేడ్ యూనియన్ కమిటీ ఏర్పరిచినది. 1947 నుంచి, అమెరికాలోను, విదేశములలోను,

స్వతంత్ర ట్రేడ్ యూనియన్సుతో కూడిన ఒక అంతర్జాతీయసంస్థ ఏర్పడ వలెనని అద ఒక అలజడి ప్రారంభించినది.

## స్వతంత్ర శ్రామిక సంఘాల అంతర్జాతీయ సమాఖ్య
## (ఐ. సి. యఫ్. టి. యు.)

డబ్లు. యఫ్. టి. యు. లో చీలికలు రాకముందు, విదేశములలో చాలా కార్మిక సంఘ సమాఖ్యలు ఒక క్రొత్త అంతర్జాతీయ సంస్థ ఏర్పరచుటకు పథకములో వేయుట ప్రారంభించినవి. చీలిక రాగానే, ఒక క్రొత్త అంతర్జాతీయ సంస్థ ఏర్పరచవలసినదని సూచిస్తూ, ఎ.యఫ్ యల్, సి ఐ ఓ. కూడా దీనిలో పాల్గొనవచ్చుననే ఆశకనపరుస్తూ, బ్రిటిషు యూనియన్సుకు చెందిన విన్సెంటు ట్యూసన్, కమ్యూనిస్టేతర ఫ్రెంచి "ఫోర్సు ఓవ్రేరీ" కి సంబంధించిన లియోన్ జామెక్సు, ఎ. యఫ్. యల్ కు సంబంధించిన, విలియమ్ గ్రీనుకు, సి. ఐ ఓ. యొక్క ఫిలిప్ ముర్రేకు లేఖలు వ్రాసిరి.

ఏప్రిల్ నెలలో, ఎ యఫ్. యల్. సి. టి. ఓ. తో ట్యూసన్ ఒక ఒప్పందమునకువచ్చి, జినీవాలో ఒక ప్రథమ సమావేశము ఏర్పరచెను. 1949 లో జూన్ 25, 26 తేదీలలో జరిగిన ఈ సమావేశము ఒక క్రొత్త అంతర్జాతీయ సంస్థ ఏర్పరచవలెనని ఏకాభిప్రాయ వెల్లడించెను. ఒక అంతర్జాతీయ కాంగ్రెసును సమావేశపరుచుటకు, రాజ్యాంగ నియమావళి సిద్ధపరచుటకు ఒక సన్నాహ కమిటీని ఏర్పరిచినది.

1949, డిసెంబరు 9, నవంబరు 28 తేదీలలో లండనులో ఒక మహాసభ ఏర్పరుచుటకు యీ సన్నాహ సంఘము ఆహ్వానములు పంపినది. ఈ ఆహ్వానాన్ని పురస్కరించుకుని, ఆ బ్రిటిషు నగరమునకు 261 మంది ప్రతినిధులు హాజరైరి. ఈ హాజరైన ప్రతినిధులు 53 దేశములలోని 59 సంఘ కేంద్రములనుంచి, 23 ఇదితర సంఘ సంస్థలనుంచి, 48 మిలియను కార్మికుల ప్రాధనిధ్యము వహిస్తున్నంతగా ప్రకటించిరి. ఆ ప్రతినిధులు ఒక రాజ్యాంగ నియమావళి రూపొందించిరి. ఒక పేరు నిర్ణయించిరి. స్వతంత్ర శ్రామిక సంఘముల అంతర్జాతీయ సమాఖ్యఅని, (ఐ. సి. యఫ్. టి. యు.) ఈ సంస్థ ప్రథమ కాంగ్రెసులో మహాసభల తీరును పునర్నిర్మాణము చేసిరి.

రాజ్యాంగ నియమావళి వేదికలోని ప్రకటన ప్రకారము, వ్యక్తి స్వాతంత్ర్యము స్వతంత్ర కార్మికులు, రాజకీయ ప్రజాస్వామ్యము, సంపూర్ణ దేశ స్వాతంత్ర్యమునకు, సర్వాధికారములకు, అన్ని దేశములకు పెక్కు ఉండుట మొదలగువాటిపై అంతర్జాతీయ సంస్థ నిలబడియున్నది. సాంఘిక న్యాయము, పని, యిష్టమువచ్చిన ఉద్యోగము కోరుకొనుట, ఉద్యోగ భద్రత, తమవారి భద్రత, సంఘములద్వారా తమ పారిశ్రామిక, ఆర్థిక సంపదల రక్షణ, శాంతియుత, ప్రజాస్వామ్య పద్ధతుల ప్రకారము ప్రభుత్వం మార్పు, మొదలగు వాటికై అందరివ్యక్తులకు హక్కు ఉన్నదని ఆ నియమావళి ప్రకటించినది. ఉమ్మడిగా బేరమాడుటకు, తమ సభ్యులమంచి అధికారము పొందుటకు సంఘములో స్వతంత్రముగా ఉండవలెనని, అన్ని రూపములలోని నియంతృత్వమును అంతర్జాతీయ సంస్థ ప్రతిఘటించుటకు ప్రతిజ్ఞ వైకొన్నదనియు ఆ సంస్థ తెలిపెను. ఫాసిస్టు, కమ్యూనిస్టు, తదితర నియతృత్వ పరిపాలనలో ఉన్న సంఘములు స్వతంత్ర ప్రజాస్వామ్య సంస్థలు కావని, ఒక అరాచకపు దేశముయొక్క లాభములకు కార్మికులను సంఘటితముగా దోపిడి చేయుటకు ఏర్పడిన ప్రభుత్వసాధనములనియు ప్రకటింపబడినది.

ది ఐ. సి. యఫ్. టి. యు. జాతీయ ఉద్యమమునకు సమన్వయకేంద్రముగను, ప్రపంచమంతా ఉన్నతజీవనప్రమాణములు, ఆర్థికభద్రత, సాంస్కృతికాభివృద్ధి పెంపొందించుటకు కర్తవ్యసాధనముగను తన్నుతాను పరిగణించుకొన్నది. ఆర్థిక ప్రజాస్వామ్యముద్వారా, రాజకీయ ప్రజాస్వామ్యమునకు గట్టిపునాది వేయుటే దానిముఖ్యలక్ష్యము. అంతర్జాతీయ సంబంధములలో, ఉన్నతనుంకముల నెదుర్కొనుచు, అంతర్జాతీయ ఆర్థిక సహకార రంగములో విస్తృతప్రాంతములుసృష్టించుటకు అదిప్రయత్నించుచున్నది. జాతి, రంగు, తెగ, లింగము, మొదలగువాటిపైచూపే విచక్షణ ప్రతీచోట నశించవలెనని అది ఉద్ఘాటించినది. కార్మికులు యుద్ధమునకు ప్రథమంగా బలిఔతారు కనుక, ఆర్థిక సాంఘిక సహకారమునకు సంబంధించిన అన్నిఅంతర్జాతీయ సంస్థలలోను వారు పాల్గొనేహక్కు ఉండాలని అది కోరినది.

కాంగ్రెసు ఆఖరిరోజున, ఐ. సి. యఫ్. టి. యు. ముఖ్యమైన మూడు

లక్ష్యములతో సంచలనం కలిగించే ఒక ఆశయాల కరపత్రము ఆమోదించినది.

రొట్టె:- అందరికీ ఆర్థిక భద్రత మరియు సాంఘిక న్యాయము ఉండాలి.

స్వేచ్ఛ:- ఆర్థిక రాజకీయ ప్రజాస్వామ్యం ద్వారా కావాలి.

శాంతి:- అందరికీ హోదా హక్కు ఉండేలా ఉండాలి.

ముగింపులో ఆ కరపత్ర ప్రకటనలో యీ విధముగా ఉన్నది.

"అన్ని దేశముల, జాతుల, తెగల, కార్మికులారా! స్వతంత్ర ప్రజాస్వామ్య కార్మికుల యీ పెద్ద ఉద్యమములో చేరండి!"

"అంతా కలిసి, మనము, దారిద్ర్యము, దోపిడి, జయించగలము. భద్రత, పుష్కలతి కలిగిన ప్రపంచమును సృష్టించగలము కలిసి మనము నియంతృత్వమును అణగద్రొక్కుడును నశింపచెయగలము. మానవపరపతి, స్వతంత్రము కూడిన ప్రపంచము సృష్టించగలము. కలిసి, మనము యుద్ధము, దాడి శక్తులను ఓడించగలము, న్యాయము, శాంతి కలిగిన ప్రపంచము సృష్టించగలము."

సంస్థగా ఏర్పడినప్పటినుంచి, ఐ. సి. యఫ్ టి. యు. బ్రస్సెల్సు కేంద్రంగా పెట్టుకొని, ఐక్యరాజ్యసమితి సంప్రదింపుల అధికారంతో విశిష్టమైన సేవచేసినది. ప్రపంచములోని అనేక ప్రాంతములకు ప్రచారసంఘములు పంపి. స్వతంత్రసంఘోద్యమములను బలపరచి, కమ్యూనిస్టుల ఆధీనములో ఉన్న కార్మిక సంస్థలను ఎదుర్కొనునట్లు చేసినది. ఇనుపతెర వెనుక బానిస కార్మిక క్యాంపులు లేకుండా పోరాడినది. వలసవిధానమును ప్రతిఘటించినది. ఇదేవిధముగా ఇది ప్రాంతీయ సంస్థలు కొన్ని ఏర్పాటు చేసినది ది ఇంటర్ అమెరికను రీజియనల్ ఆర్గనైజేషను ఆఫ్ వర్కర్సు; (ఒ. ఆర్. ఐ. టి.) యూరోపియను రీజియనల్ ఆర్గనైజేషన్ (ఇ. ఆర్. ఓ.) ఏషియన్ రీజియనల్ ఆర్గనైజేషన్ (ఎ. ఆర్. ఓ.) ఫ్రీ లేబర్ వరల్డు, (స్వతంత్ర కార్మిక ప్రపంచము) ఒక మాసపత్రిక, తదితరములు యిది ప్రచురించును. న్యూయార్కు నగరములో, 20 వెస్టు ఫార్టియత్ వీధిలో, ఫ్రీడమ్ హౌస్‌లో దాని అమెరికను ఆఫీసు కలదు. 1956లో మొదటి రోజుల్లో ఐ. సి. యఫ్. టి. యు. లో 109 అనుబంధసంస్థలు,

75 దేశములనుంచి 55 మిలియనుల సభ్యులకు ప్రాతినిధ్యం వహిస్తూ యున్నవి.

చాలా సంవత్సరములు, అంతర్జాతీయముగా, అంతర్జాతీయ ట్రేడ్ సెక్రటేరియట్సు ద్వారా కార్మికులు సంఘటితమగుచుండిరి. అనగా వృత్తుల బట్టి, అంతర్జాతీయ సంస్థలు ఏర్పడుట ఉదాహరణకు. రవాణాకార్మికులు, దుస్తులకార్మికులు, గనికార్మికులు, ఉపాధ్యాయులు తదితరులు ఐ. సి. యఫ్. టి. యు. తర్వాత దానిని అనుసరిస్తూ, ఈ వృత్తి సెక్రటేరియట్సు చాలావరకు, ఆ సంస్థతో పరస్పర సహకారముకొరకు ఒక సమన్వయ కమిటీ ఏర్పరచినవి. 50వ దశాబ్దం మొదటిభాగములో, ఈ సమన్వయ కమిటీలో 18 సెక్రటేరియట్సు చేరనవి.

## అంతర్జాతీయ కార్మిక సంస్థ (ఐ. యల్. ఓ.)

ప్రపంచ ప్రథమ మహాసంగ్రామము తర్వాత, 1919 నుంచి, అమెరికా రాష్ట్రములలోను తదితర దేశములలోను, ఉన్న సంఘ ఉద్యమములతో సహకరించుచున్న అంతర్జాతీయ సంస్థ, ఐక్యరాజ్యసమితిలో ఒక ప్రత్యేక కర్తృత్వ సంఘములలో ఒకటైన అంతర్జాతీయ కార్మిక సంస్థ.

పేరులో ఉన్నట్లుగా, ఐ. యల్. ఓ. సంఘటిత కార్మికసంఘముల యొక్క అంతర్జాతీయ కర్తృత్వ అధికారి మాత్రముకాదు. 1955 లో 74 దేశముల సభ్యత్వముకలిగిన ప్రభుత్వములతో కూడిన ఒక అధికారయుత మహాసభ అని దీనిననవచ్చును.

విస్తృతమైన పరిశోధనచేయుట, ప్రపంచమంతటా ఉన్న పరివారి పరిస్థితుల లెక్కలు వివరములు ప్రచురించుట, నిరుద్యోగము, బాలకార్మికులు, వేతనములు, భద్రత, ఆరోగ్యము, ప్రమాదాములకు కార్మికుల నష్టపరిహారము, కార్మికులకు సంక్షేమసదుపాయములు, కొనుగోలుదారులకు సహకారము తదితర కార్మిక ఉద్యమములు, సమస్యలు, పరిస్థితులు పరిశీలించియే లెక్కలు తయారుచేయుట, అంతర్జాతీయ కార్మిక సంస్థ విధులు. ఒక సాంవత్సరిక మహాసభ జరిగినపుడు, ప్రతీ ప్రభుత్వసభ్యుడు నల్గురు ప్రతినిధులను పంపవచ్చును. ప్రభుత్వమునుంచి యిద్దరు, కార్మికుల నుంచి ఒకరు (సాధారణముగా సంఘటిత కార్మికుల ప్రతినిధియై యుండ

వలెను. యజమానులనుంచి మరొకరు (సాధారణముగా సంఘటిత యజమానుల ప్రతినిధయై యుండవలెను.) ఈ ప్రతినిధులతోపాటు సాంకేతిక సలహాదారులుకూడా వచ్చుదురు.

నిర్ణీతవిషయములు చర్చింపబడును. ఉదాహరణకు; గనులలో లోపల స్త్రీలు చేయుపనులు; నిరుద్యోగమునకు, ముసలితనమునకు, సాంఘిక భద్రతాశాసనములు, స్కూలునిడిచి ఉద్యోగములో చేరుపిల్లలకు కనీస వయస్సు; వారమునకు 40 గంటలపని, రక్షణ, జీతములో సెలవులు; అభివృద్ధి తక్కువగా ఉన్న దేశములకు సాంకేతిక సహాయము, అణుశక్తిని శాంతియుతముగా వాడుట, వ్యవసాయమునకు కార్మికులు; అంగవైకల్యము కలవారికి అవకాశములు; బలవంతమైన కార్మికతత్వము; మొదలగునవిసంపూర్ణమైనచర్చలతర్వాత, కొన్ని నిర్ణీతశాసనములు దేశములుపాటించవలసినదని కొన్ని డ్రాఫ్టుకన్వెక్షన్స్ కాగితపు సంప్రదాయములు, ఆమోదించబడును.

మహాసభ చర్యలవలన, ఏ దేశము బద్ధమైయుండనక్కర్లేదు. కాని సభ్యత్వమున్న ప్రతీదేశము ఆ కాగితపు సంప్రదాయములు తమ దేశ శాసనములలో యిమడ్చుటకు ప్రయత్నించి, తిరిగి ఒక నివేదిక సమర్పించ గలమని మాత్రము ప్రమాణము తీసుకొనును. అందువలన, ఐ. యల్. ఓ. ద్వారా ఒత్తిడిఉండదు. కాని దానియొక్క కాగితపు సంప్రదాయములు ప్రతీదేశములో జాగ్రత్తగా పరిశీలింపబడును. ప్రమాణములు పెంచుటలో తననైతిక ప్రభావముతో ప్రపంచ ప్రజాభిప్రాయమును మాత్రము సంపాదించబడును.

1955 మార్చి, వరకు. 1919 నుంచి ఆమోదించబడిన 104 కన్వెక్షన్సులతో, 1495 ఆమోదనిర్ణయములు (రేటిఫికేషన్సు) రికార్డుచేయబడినవి. ప్రపంచమంతటా కార్మిక ప్రమాణములపై ఐ. యల్. ఓ. యొక్క విశిష్ట ఫలితములు దీనివలన తెలియుచున్నది. సుంకముల యుద్ధమునకు, వలస తత్వమునకు మారుగా దీని శక్తివంతమైన ఫలితములు ఋజువైనవి. అన్యాయ అధికపోటీలను సరిగాసరిదిద్దుటలోకూడా కొంత కృతకృత్య సాధనమైనది

లీగ్ ఆఫ్ నేషన్సుయొక్క చిట్టచివరగా మిగిలిఉన్న యీ ఐ. యల్. ఓ.

తన హక్కుల రాజ్యాంగ చట్టము ప్రకారము ఒక స్వపరిపాలిత సంస్థ ఇప్పుడు మాత్రము యిది ఐక్యరాజ్యసమితియొక్క ఆర్థిక, సాంఘిక కౌన్సిలుకు అనుబంధమైయున్నది. ఐ. యల్. ఓ. స్థాపనలో అమెరికనులు చాలా ప్రముఖులుగా ఉన్నారు. వెర్సేల్సు శాంతిమహాసభలనాటి ఇంటర్నేషనల్ లేబరు లెజిస్లేషన్ కమిషన్ అధ్యక్షుడుగా, ఎ.యఫ్ యల్ అధ్యక్షుడైన సామ్యూల్ గాంపర్సు ఉన్నప్పుడే, యీ ఐ యల్.ఓ. అన్న అభిప్రాయం ఒకటి ఉద్భవించినది. ఒక ప్రవక్తదూరదృష్టి కలిగిన ప్రొఫెసరు జేమ్సు షాట్‌వేల్ మంచి పరపతికలిగిన ఒక అమెరికను ప్రతినిధి. ఆయన పాల్గొనినను, 1934 వరకు ఐ. యల్. ఓ. లో అమెరికారాష్ట్రములు జేరలేదు. అప్పటినుంచి అమెరికను ప్రతినిధులు యీ అంతర్జాతీయ సంస్థలో చైతన్యవంతమైన కృషిసల్పుచున్నారు.

## అంతర్జాతీయ కార్మిక సంఘముల పరిచయములు.

అమెరికా రాష్ట్రప్రభుత్వముతో సహకారమేగాక, మొదటి, రెండవ ప్రపంచ మహాసంగ్రామములలో యుద్ధమునడుపు ప్రభుత్వ ఏజన్సీలలో అమెరికను కార్మిక ఉద్యమము ప్రాతినిధ్యము వహించినది. 1940 దశాబ్దపు చివరిదశలో, అమెరికను రాయభార కార్యాలయములకు, కార్మిక "ఎట్టాచీస్" (అనుబంధవ్యక్తులు) గా ఈ ఉద్యమము సిఫారసుచేసినది.

మార్షల్ ప్రణాళికను అమలుజరుపుటకు ఎ. యఫ్. యల్. సి. ఐ. ఓ. సంస్థలు అనేకమంది స్త్రీ, పురుష కార్మికులను ప్రభుత్వఏజన్సీలకు సాయము చేయుటకు, సరఫరాచేసినవి. ఎకనామిక్ కో ఆపరేషను ఎడ్మినిస్ట్రేషను, ఫారిన్ ఆపరేషన్సు ఎడ్మినిస్ట్రేషన్, ఇంటరేషనల్ కో ఆపరేషను ఎడ్మినిస్ట్రేషనుద్వారా సహాయము పొందుతోన్న దేశాలలోని ప్రజాస్వామ్య కార్మిక సంస్థలను బలపరచుటకు, నిర్మాణాత్మక పథకములు కమగొనవలసినదని యీ విధముగా నియమించినవారికి అప్పచెప్పబడినది. ప్రభుత్వాను కోరికవలన, చాలామంది స్త్రీ, పురుష కార్మికులు విదేశములకేగి, అప్పుడే ఆరంభమౌతున్న కార్మిక ఉద్యమములకు, అమెరికను కార్మిక సంఘములు ఎలాపనిచేయునదీ తెలుపుచుండెడివారు. ఈ విధంగాచేసిన అంతర్జాతీయ

సహకారముయొక్క ఫలితములు యిప్పుడు అమెరికను కార్మికులు తెలుసుకొని అనుభవించుచున్నారు.

## ఏ. యఫ్. యల్. సి. ఐ. ఓ. విదేశీవిధానము.

ఇతర దేశములలోని కార్మిక సంస్థలతో అనుబంధములద్వారా అంతర్జాతీయ రంగములో కృషిచేయుటయేగాక, అమెరికను విదేశవిధానమును, అభివృద్ధి చేయుటలో అమెరికను కార్మిక ఉద్యమము చాలా ముఖ్యపాత్ర వహించినది.

ఏ. యఫ్. యల్. సి. ఐ. ఓ. యొక్క మొదటి మహాసభలందు, పటిష్ఠమైన అమెరికను ప్రజాస్వామ్య విదేశవిధానమునకు లోపరహితమైన అంతర్జాతీయ కార్మిక సంబంధములకు, దారిచూపు సూత్రములెన్నింటినో ప్రతినిధులందరు ఏకాభిప్రాయముతో బలపరచిరి. అటువంటి ముఖ్య ఉపదేశ సూత్రములుకొన్ని ఈ విధముగా ఉన్నవి.

## లీ నీ క ర ణ వి ధా న ము.

రాజకీయ, ఆర్థిక ప్రజాస్వామ్యమునకు అంతర్జాతీయ లీనీకరణ ప్రణాళిక దానిని బలపరచుట.

## అం త ర్జా తీ య స హా య ం.

అభివృద్ధి ఎక్కువలేనిదినములకు ఆర్థిక, సాంఘిక సాంస్కృతిక సహాయముచేయుట; దానివలన వారి ఆర్థికవ్యవస్థలు బలపరచుట, కమ్యూనిస్టు ప్రభావములు బలహీనపరుచుట;

## వ ల స త త్వ ము.

అన్నిరూపములలో వలసతత్వమును ప్రతిఘటించుట.

## ని య ం తృ త్వ ము.

కమ్యూనిస్టు, ఫాసిస్టు తరగతులుగాని, మరేతరగతిగాని అయిన నియంతృత్వమును ప్రతిఘటించుట.

బలముద్వారా సంప్రదించుట.

మాస్కో దేశముతో సంప్రదింపులు జరుపుటకు ఎప్పుడూ ప్రదేశ ద్వారము మూయకుండా, కమ్యూనిస్టుల దాడినుంచి రక్షించుకొనుటకు, యుద్ధమును నివారించుటకు, రాజకీయ ఐక్యత, ఆర్థిక శక్తి, తగిన మిలిటరీ బలము నిర్మించుకొనుట.

సంధి దత్తులు.

మాస్కోలో బలవంతముగా ఉంచబడిన సంధి దత్తులను వదలివేయు ఉద్యమములను బలపరచుట(సంధికొరకు తాకట్టుగా ఉంచబడిన వ్యక్తులు).

అస్త్ర విసర్జన.

తగినంత అంతర్జాతీయ పర్యవేక్షణ, అదుపు, తనిఖీలద్వారా, అటువంటి అతిక్రమణదారులను శిక్షించుటకు వీలులేని అధికారమిచ్చు శాసన విభాగముల సహాయంతో, చిట్టచివరకు, సమూహిక నాశనముచేయు అణ్వస్త్రములు తదితర నాశకర సాధనములు పూర్తిగా రద్దుచేయుటకు వాగ్దానముచేస్తూ, క్రమముగా అస్త్రవిసర్జన జరుగుకృషిలో అత్యధికముగా ప్రయత్నమును జరుపుట.

పశ్చిమ అర్ధగోళంలో సహకారము.

పశ్చిమ అర్ధగోళంలో దేశములమధ్య సాంస్కృతిక రాజకీయ, ఆర్థిక సంబంధములు విస్తృతము చేయుట.

స్వేచ్ఛాయుత ఎన్నికలు.

విభజించబడి, కొట్లాటలతో అన్నిప్రాంతములలో స్వేచ్ఛాయుత ఎన్నికలు జరిపించుటలో ఐక్యరాజ్యసమితి ఒక విశ్వవిధానము రూపొందించుట.

మధ్యప్రాచ్యము.

మధ్యప్రాచ్యములో ఎదురుదాడిని నిరోధించుటకు గట్టిచర్యలు.

ఐక్యరాజ్యసమితి.

ఐక్యరాజ్యసమితిని, దానియొక్క ప్రత్యేక ఏజన్సీలను బలపరచుట.

### ఇనుప తెర వెనుక సాంస్కృతిక సంబంధములు.

ఇనుప తెర వెనుక ఉన్న ప్రజలతో సాంస్కృతిక సంబంధములు పెంచుకొనుట.

### శ్రామిక సంఘ ప్రతినిధి వర్గాలు.

స్వతంత్ర శ్రామిక సంఘములను బహిష్కరించు ఏదేశముకైనా స్వతంత్ర కార్మిక సంఘముల ప్రతినిధి వర్గములు పంపకుండుట.

### యూరోపియన్ అభివృద్ధిత్వము.

స్వేచ్ఛగా యురోపియన్‌లు లీనీకరణ పొందుటను ప్రోత్సహించుట మిలిటరీ రక్షణ సంస్థగా తనముఖ్యలక్ష్యములు నిరవేర్చుకొనుటకు "నాటో" (NATO) (నార్తు అట్లాంటిక్ ట్రీటీఆర్గనైజేషన్)కు, ఒక కార్యక్రమము ఏర్పరచుట; ఇదేకాక, ఈ సంస్థ మెరుగైన జీవనప్రమాణములు, మానవ హక్కులు, శాంతి, పెరిగేటట్లు ఎక్కువ రాజకీయ ఆర్థిక సహకారము, నిర్వహించగలిగే ప్రముఖ సంస్థగా ఉండవలెను.

### తదితర కార్మిక అంతర్జాతీయ సంస్థలు.

ఐ. సి. యఫ్. టి. యు.ను కార్మిక ప్రాంతీయ సంస్థలను, అంతర్జాతీయ ట్రేడ్ సెక్రటేరియట్సును బలపరచుట

## 18. మతము - కార్మికులు.

తమకు యిష్టమువచ్చిన సంఘములలో చేరేహక్కు కార్మికులకే కాక, యజమానులకు, వ్యవసాయదారులకు, కొనుగోలుదారులకు, తదితరవర్గాలకు కూడా ఉన్నది. అలా చేరే హక్కుతో నైతిక మతసంబంధమైన సూత్రము ఒకటి యిమిడిఉన్నది. సామాన్యమానవుడు తన పరిస్థితులు నిర్ణయించుకొనే హక్కు-దానివలన తన జీవితానికి, స్వేచ్ఛకు, ఆనందానుభవానికి ఎంతో దోహదం కాగలదు - ఇటువంటి ప్రజాస్వామ్యసూత్రము, జీసస్ ఉప

దేశముల, హెబ్రూ ప్రవక్తల సందేశములు, మరి వివిధ మతనమ్మకములుగల మతనాయకుల సూక్తులుమీద ఆధారపడియున్నది. ఏలన వారి నమ్మకములు మానవుని అంతర్గత అనంతమైన విలువ, దేవుని బిడ్డగా గణించును. ఈ నమ్మకమే సామాన్యమానవునిలో అనంతమైన ఆత్మగౌరవము పెంపొందింప చేసెను. ఇది ఎటువంటి రాజకీయ, పారిశ్రామిక నియంతృత్వములోనైనా విరుద్ధముగా నుండును.

చరిత్రను పరిశీలిస్తే, ప్రజాక్షేమమునకు, సాంఘికాభివృద్ధికి, క్రైస్తవ మతము, జ్యూడేయిజము చాలా సేవచేసినవి. వీటికొరకే కార్మిక ఉద్యమము కూడా కృషిచేస్తున్నది. ఈ మతప్రభావము, పురాతన నిర్లక్ష్య క్రైస్తవవిరుద్ధ తత్వమును, బీదవారి బాధలపై కరుణగా మార్చివేసినది. మొట్టమొదటగా చర్చిలు, యూదీయ దేశస్థుల ఆరాధన సమాజములు, స్కూళ్ళు, ఆస్పత్రులు ప్రారంభించి వివిధ ధర్మములు చేసిరి. అవే నేటి అభ్యుదయ సాంఘిక సేవగా మారిపోయినవి. సంఘటిత కార్మికులు, అభ్యుదయపురోగాములైన రాజకీయపార్టీలు, సామాన్యమానవ సముదాయమునకు స్పష్టమైన శాసనములు, ఆర్థిక లాభములు కలుగచేయుటలో చాలా బలవత్తరమైన శక్తులుగా మారనను, అటువంటి ఉద్యమములకు చాలావరకు ఒకవిధమైన ఆదేశము యీ మతబోధలనుంచే లభించినది.

## సంఘం నిర్ణయించిన విధులు.

గత ఏభయిసంవత్సరాలలో, ఆధునిక సాంఘిక విషయములయొక్క నైతిక మతవిశిష్టతగురించి ముఖ్యమైన అధికారయుత ప్రకటనలు కాథలిక్, ప్రొటెస్టంటు, జ్యూయిష్ వర్గములనుంచి వెలువడినవి. వేతనములు, పనిచేయు గంటలు, నిరుద్యోగము సాంఘిక భద్రత, లాభములకోరిక, బాల కార్మికులు, పౌరహక్కులు జాతిసమానత్వము, ప్రజల, వ్యక్తిగత, సహకార విధానములలో పారిశ్రామిక యజమానత్వము, అంతర్జాతీయశాంతి, మొదలైన వాటిగురించి కార్మికులు సంఘటిత మయేహక్కుగూర్చి ప్రకటనలు కూడా వారి బహిరంగ ప్రకటనలలో యిమిడిఉన్నవి. న్యాయము, స్వేచ్ఛ, సోదరత్వము, శాంతి కలిగిన ప్రపంచ అన్వేషణకై కార్మిక ఉద్యమము మత ప్రవక్త మతాదేశములు చాలాపోలికలు కలిగి కృషిచేసినది.

## సాంఘిక చర్య.

మతములోని సాంఘిక సంశ్లిష్ట విషయములను జాగరూకతతో గుర్తించు టనునది, చర్చిలు, యూదుదేశపు ఆరాధన సమాజములయొక్క ఆలోచన, ఆరాధన, కార్యక్రమములను ఇప్పటివరకు ఏ విధముగానూ ప్రభావితము చేయలేదు. ప్రజాస్వామ్యమునకు, సాంఘిక న్యాయమును గురించి ఏ దేశము లలో మతము బహిరంగముగా చెప్పుటకు విఫలమయినదో, ఆ దేశములలో కమ్యూనిజం, నాస్తికత్వము తత్క్షణమే వేళ్ళు నాటుకొన్నవని యిక్కడ సూచించవచ్చును. "తీర్పుఅన్నది దేవునిగృహములో ఆరంభమవవలెను" అదృష్టవశాత్తు, అనేక దేశములలో ముఖ్యముగా అమెరికా, బ్రిటనులతో ఈ మూడు మతములయొక్క, ప్రముఖ మతాచార్యులు, అధికారయుత సంస్థలు, సాంఘిక సమస్యలపై నైతికప్రకటనలు చేయుటయే కాక, సాంఘిక మత సంబంధమైన విద్య, చర్యలుగూర్చి కార్యక్రమములు నడిపించుటలో కూడా నిమగ్నులైరి.

## సమస్య ఉద్భవించినపుడు.

ఒక సమస్య ఉద్భవించినపుడు, ఆ సమస్యపై ప్రసరింపబడినదే, పటిష్ట మైన సాంఘికచర్య. అటువంటి ధైర్యమైనచర్య, పరిశీలనకు క్రైస్తవాలయ ములకు పంపు తీర్మానముల అనేక సంపుటలకంటె, సత్ఫలితములిచ్చును. స్థానిక, దేశరంగములలో క్రైస్తవాలయములు చేసినపనులగూర్చి అనేక ఉదాహరణలు యివ్వవచ్చును. చారిత్రక ఆసక్తికొరకు ఈ ఉదాహరణలు కొన్ని యివ్వబడును. నేటి మారేపరస్థితులదృష్ట్యా ఏవిధముగా మలుచుకో వచ్చునో సూచనావిలువలు అర్థంచేసుకోడానికి ఆ రకరకాల సాంఘిక చర్యలు తెలియజేయవచ్చును.

1923 లో అమెరికాలోని ఫెడరల్ కౌన్సిల్ ఆఫ్ చర్చస్ ఆఫ్ క్రైస్టు (ఇప్పుడు నేషనల్ కౌన్సిల్ ఆఫ్ చర్చస్) నేషనల్ కాథలిక్ వెల్ఫేర్ కాన్ఫరెన్సు; సెంట్రల్ కమిటీ ఆఫ్ అమెరికన్ రబ్బీస్; ఉక్కు-పరిశ్రమలో 12 గంటల పనికాలము రద్దుచేయుటలో విజయవంతమైన పోరాటము సాగించిరి. తక్కిన యితర ప్రయత్నములు వ్యర్థముకాగా, ఈ మూడు

మతసంస్థలయొక్క సంయుక్త ప్రకటన ప్రజాభిప్రాయమును ఈ సమస్యపై మరలించి, దేశములో ఉత్తేజము కలిగించగా, యిది సాధించబడినది.

1929లో సమ్మెలకాలములో, ముప్ఫియవ దశాబ్దం మొదటి ప్రాంతంలో ఈ గ్రంధకర్తలలో ఒకరూ ఫెడరల్ కౌన్సిల్ అఫ్ చర్చస్‌యొక్క పారిశ్రామిక కార్యదర్శి, మేరియన్, నార్తుకరోలినా, హానీపాల్, కొలంబియా, సౌత్ కరోలినాలలో మిల్లు గేట్లవద్ద, తుపాకులతో కాల్చబడిన కార్మికుల దహనక్రియల సందర్భంలో బహిరంగముగా, అనేక కార్మిక నాయకులతో సహా, ఉపన్యాసములిచ్చెను. ఈ సమస్య ఉద్భవించినపుడు కార్మికులు సంఘములుగా ఏర్పడు హక్కుఉన్నదని బహిరంగముగా ప్రకటించెను.

1935 లో, స్వేచ్ఛాయుత హక్కు, సంఘటితమయేహక్కు ఎక్కువగా నిరాకరంచబడినపుడు, 300 కు పైగా మూడు మతముల మతాచార్యులు ఒక కరపత్రప్రకటనలో, పౌరహక్కుల పరిస్థితిని పరిశీలించవలసినదని, ఒక బహిరంగ కరపత్రములో సెనేటును కోరిరి. లాఫాలెటీ సివిల్ లిబర్టీస్ ఇన్వెస్టిగేటింగ్ కమిటీని ఏర్పరచడానికి యీ కరపత్రప్రకటన చాలా ప్రభావము కలుగచేసినది.

అమెరికాలోని ఫెడరల్ కౌన్సిల్ ఆఫ్ చర్చస్ ఆఫ్ క్రైస్టు, నేషనల్ కాథలిక్ వెల్ఫేర్ కాన్ఫరెన్సు, సెంట్రల్ కాన్ఫరెన్సు ఆఫ్ అమెరికన్ రబ్బిస్ యొక్క ఆఫీసర్లు, నేషనల్ లేబరు రిలేషన్సు అక్టును ఆమోదించు విషయంలో బలపరుస్తూ తమ సాక్ష్యములుకూడా యిచ్చిరి.

1930 లో, ధరలతగ్గుదలవలన, నిరుద్యోగమువలన, దేశముచాలా నిస్పృహలో ఉన్నప్పుడు, నేషనల్ కాథలిక్ వెల్ఫేరు కాన్ఫరెన్సు, సెంట్రల్ కాన్ఫరెన్సు ఆఫ్ అమెరికను రబ్బిస్, ఫెడరల్ కౌన్సిల్ ఆఫ్ చర్చస్ ఇన్ అమెరికా ల సాంఘిక చర్యశాఖల సంయుక్త ఆధ్వర్యంలో మూడు రోజులపాటు నిరుద్యోగ నివారణకు ప్రతినిత్యనివారకములు కనుగొనుటకు ఒక జాతీయ మహాసభ ఏర్పాటుచేయబడినది. ఒక బహిరంగ సంయుక్త ప్రకటనలో కేంద్రనిరుద్యోగ సహాయము, పబ్లిక్ వర్క్సు కార్యక్రమములు, మురికిపేటల నిర్మూలన, నిరుద్యోగ ఇన్సూరెన్సు, వృద్ధతనపు

పెన్షనులు, తక్కువ పనికాలముచే జీతము తగ్గించకుండా, ఉద్యోగము వ్యాప్తిచేయుట, ధనము యింకామంచిగా పంపకేముచేయుట, దానిద్వారా కొనుగోలుశక్తి వృద్ధిచేసి, ఉత్పత్తి, వ్యయముల మధ్య సమానత్వము కలిగించుట మొదలైనవి కోరుతూ ఆ మహాసభ తీర్మానించినది. ఈ ప్రకటన బహుళప్రచారము పొందినది. హూవర్ అధ్యక్షుడు దర్శనమిచ్చి విషయము తెలుసుకొనెను. ఆ మహాసభ నాయకులు రేడియో ద్వారాకూడా తర్వాత ఒక విజ్ఞప్తి చేసిరి. ఆ విజ్ఞప్తి ఆ రోజుల్లో గాలిలో మాట్లాడడం వంటిదే అయినా ఆ రోజుల్లో మరికొందరు రేడికల్సు తప్పించి, చాలామంది కార్మిక నాయకులు, భయంకరమైన అవసరముల్లో కేంద్రసహాయము కావాలని కోరుచుండిరి. సంపూర్ణ ఉద్యోగము వాగ్దానముచేయునట్లు యింకాతీవ్రమైన ఆర్థిక పరిణామాలు కావలెనని వారుకోరిరి.

ఈ సమస్యలు ఉద్భవించినపుడు, మతాచార్యులు చేసిన యింకాధైర్యవంతమైన చర్యలను గురించి అనేక ఉదాహరణలివ్వవచ్చును. జాతిన్యాయము గూర్చి సంధికాలంలో, వాటా పంటదారులమధ్య, నిరాశాజనకమైన నిరుద్యోగ పరిస్థితులు ఏర్పడినపుడు,-సమ్మె కాలములో సత్యములు సేకరించి, నివేదించడం — సమ్మెదారుల కుటుంబములకు సహాయముచేయుట — మధ్యవర్తిత్వమునకు పూనుకొనుట — ఉక్కు, మోటారు, బొగ్గు, నేత, తదితర పరిశ్రమలలో సంఘములుగా ఏర్పడుట ఒక పెద్ద సమస్యగాఉన్నపుడు, బహిరంగముగా కార్మికులు సంఘటితపడుటకు నైతిక బలమునిచ్చుట — మొదలగునవి ఉదహరించవచ్చును.

ప్రస్తుతము అందరికీ ఆసక్తికలిగించేది ఒక కాథలిక్ మతగురువు ఫాదర్ జాన్ యం కారిడన్, న్యూయార్కు నీటి ప్రాంతములోని లాంగ్ షోర్ మెన్ సంఘమునందున్న కమ్యూనిస్టు ప్రభావమును ప్రతిఘటించుటలోను, లంచగొండి అలజడితనమును రూపుమాపుటలోను చేసిన పోరాటము. అవినీతికర కార్మికనాయకులను యజమానులను బహిరంగంగా ఖండిస్తూ, సంఘములో పటిష్టమైన చర్యలు జరుపుటకు, నీతికరమైన కార్మిక సభ్యులకు తన స్కూలులో శిక్షణయిచ్చుచూ, బహిరంగముగా సాక్ష్యములిస్తూ, రేడియో ద్వారా ప్రజలకు విజ్ఞప్తులు చేస్తూ పరిశ్రమలోని సమస్యలు పరిష్కరించుటకు

నిర్మాణాత్మక సూచనలుచేస్తూ, యీ మతగురువు, సంఘము, జయమానుల సంస్థల లోపల, బయటకూడా, అందరి పౌరుల మన్ననలు, కృతజ్ఞతలు సంపాదించుకొనెను.

1950, మే 21 తేదీన, వెలువడిన "న్యూ లీడర్" అనే పత్రికలో, లాంగ్ ఐలెండుమీద రిపబ్లిక్ ఏవియేషను కార్పొరేషనువద్ద ఇంటర్ ఫైత్ ఫెలోషిప్పు చర్యలు, బ్రూక్ లిన్ సిటీప్రాంతంలో వివాదములలో తాను చేసిన పనివల్ల చాలా ఖ్యాతినార్జించిన కానన్ ఎ ఎడ్వర్డు శాండరుస్ నాయకత్వంలో లాంగ్ ఐలండుయొక్క లేబరు అండ్ మేనేజ్ మెంటు ఆఫ్ ది ఎపిస్కాపల్ డయోసిస్ కమిషన్ యొక్క చర్యలు, హెన్రీ క్రిస్టమన్ వర్ణించెను. ఆ కమీషను, ఇంటర్ ఫైత్ కమిటీ, మెకనిస్టుల అంతర్జాతీయ సంస్థ సాగిస్తున్న చిరకాలపు సమ్మె విషయంలో మధ్యవర్తిత్వము జరుపుదుమని ముందుకు వచ్చినవి. కాని యిది విఫలమయినది. అయినా ఆహారము, డబ్బు, పుష్కలముగా సేకరించి, సమ్మెదారుల కుటుంబములకు, క్రిస్టియన్ సోషల్ రిలేషన్సుయొక్క డయోసిసాన్ శాఖ సహాయము చేసినది.

పదవ అధ్యాయములో ఉదహరింపబడినట్లు, కొంతమంది కాథలిక్ జూయిష్ నాయకులు, లైఫ్ అండ్ వర్కు ఆఫ్ నేషనల్ కాన్సిల్ ఆఫ్ చర్చ్ స్ శాఖ పనిచేసేహక్కు శాసనముల గురించి యిచ్చిన బహిరంగ ప్రకటనలు, సమయానికి ఆ నాటి తీవ్రసమస్యలపై చేసిన సాంఘిక చర్యలకు ప్రత్యక్షనిదర్శనములు.

## సాంఘిక విద్య మరియు చర్యలు.

మారే పరిస్థితులు, వివిధ సన్నివేశాలు,వివిధ ఉద్ఘాటనలకు, దృక్పధములకు అగత్యము కలిగించును. చాలా ముఖ్యమైన విషయముల ప్రస్తావనవచ్చినపుడు, క్రైస్తవాలయములు జాగరూకతతో నిత్యమూ ప్రవచిస్తూ,సముచితచర్యతో తక్షణము సన్నాహములగుటకు యత్నించవలెను. ఇవే కాకుండా, పరిచయుల కార్యక్రమములు విశాలముగాను,పండితపరిశోధకశక్తి,సాంఘిక విద్య చాలా అవసరము. చాలా సఫలవంతమైన పద్ధతులలో చర్చి కౌన్సిలు ద్వారా కేంద్రకార్మిక సంఘములకు అన్ని యోగ్యతలు గలిగిన సోదర

ప్రతినిధులను నియమించుట, స్థానిక చర్చినుంచి దేశసంస్థలవరకు అన్ని స్థాయీలలో చర్చిబోర్డులలో అన్నియోగ్యతలుగల పురుషులను, స్త్రీలను పదవులలోనుంచుట; కార్మిక ఆదివారము జరుపుట, చర్చి మరియు ఆర్థిక జీవితవారము నడుపుట; పరిశోధన ప్రచురణ కార్యక్రమములు; కాంగ్రెసు వారితో భేటీలుజరిపి శాసన సదస్సులు నడుపుట; సమాచారము, సేకరించి పరిచయాలు వృద్ధిచేసుకొనుటకు యజమానులతో భోజనములు; కార్మిక కేంద్రములకు, కర్మాగారములకు, చర్చిమనుష్యులద్వారా విద్యావిషయిక పర్యటనలు; మురికి పేటలు, మంచి గృహనిర్మాణములు, కొనుగోలుదారుల, వ్యవసాయదారుల సహకార సంస్థలు, టి.వి.ఏ. వంటి ప్రజాయాజమాన్యము కలిగిన సంస్థలు సందర్శించుట; రీజియనల్ లేబర్‌బోర్డు కోర్టులలో హాజరీ, పరిశీలన, తర్వాత సమన్వయము, మధ్యవర్తిత్వపద్ధతులు పరిశీలన; ఆర్థిక సమస్యలపై స్థానిక, జాతీయ మహాసభలు; పనిక్యాంపులు, పరిశీలన పాఠములు, కార్మిక స్కూళ్ళు, స్నేహపూర్వకమైన చర్చ, పరిచయాలకొరకు, అన్ని కోణములనుంచి అందరినీ పిలిపించి అనధికార సమావేశములు; అంతర్మత కార్మిక సహోదరులు భోజనాలు; సదస్సులలో కార్మిక నాయకులను కలుసుకొనుటకు, కార్మిక సమావేశాలు, సభలు; వేదాంతశాస్త్ర విద్యార్థులు పర్యటించుట, చర్చిసభ్యులందరికీ సమాచారములిచ్చుట; మెరుగైన సాంఘిక శాసనములకు ప్రజలబలము; అందరికీ ప్రవేశహక్కు కలిగే చర్చావేదికలు; చర్చిలలో కార్మిక, యజమానుల, వక్తల; వై. యం. సి. యే. లలో, వై. డబ్ల్యు. సి. యే లలో, చర్చిలలో, వినోదకార్యక్రమములు; ప్రపంచ శాంతి, జాతిసమానత్వము, సాంఘిక న్యాయము దృష్ట్యా మతముయొక్క అర్థముచెప్పే బహిరంగ ప్రకటనలు, ప్రార్థనా పాఠములు; మొదలైనవి.

ఈ పైనచెప్పిన విధములలో స్థానిక చర్చికాని, యూదుసమాజపు ఆరాధనాలయములుకాని, చైతన్యవంతముగా యున్నను లేకపోయినను, సాంఘిక దృక్పథముగల సభ్యులు, తమ మతగురువులతో, ఉపదేశములతో యూదీయ దేశపు మతగురువులతో, తమస్థానిక సమావేశములలో పటిష్ఠమైన కార్యక్రమములగురించి సంప్రదించవలెను.

## పరిశ్రమలో మతగురువులు.

పారిశ్రామిక యుగములో మంత్రిత్వమునకు తయారుచేయుటకు ఒక సఫలవంతమైన పద్ధతి "పరిశ్రమలో మతాచార్యులను చేర్చుట" కర్మాగారాలలో ఉద్యోగములలో చేరి, తదితర శారీరకశ్రమపనులు చేసి, సంఘములలో చేరి, సంఘసమావేశములకు హాజరయి, సంపూర్ణముగా కార్మికుల అనుభవములు పొందుటకు ఏవిధమైన ప్రత్యేక రక్షణలు పొందక, ఏ గుర్తింపులేక సామాన్య కార్మికులవలె పనిచేయుటకు, వేసవికాలములో పరిశ్రమలలో పనిచేయుటకు యువమతాచార్యుల వర్గములు కొన్ని కొన్ని సంవత్సరాలు, వరుసగా తమంతతామే సన్నద్ధులైరి. ఈ మతాచార్యవర్గములు వారములో అనేకరాత్రులు వరుసగా కలుసుకొని, తమ అనుభవముల అర్థములు చర్చించుకొని, పారిశ్రామిక సంబంధములపై ఉపన్యసించువారికి జయమానులను, కార్మిక నాయకులను, రాష్ట్ర ఆఫీసర్లను, నీగ్రో నాయకులను, మంత్రులను మొదలైనవారిని, వారి పెంపొందిన సాంఘిక కార్యక్రమముల దృష్ట్యా, యిచ్చు ఉపన్యాసములు వినుటకు ముందుకువచ్చుదురు. కార్మికుడుగా అనుభవించుట అంటే ఏమిటనునది, ఎంతగా విశ్వవిద్యాలయాలలో ఆర్థిక సంబంధములను గురించి చదివినా ఆ విధముగా అర్థముకాదు. పారిశ్రామిక స్థలములలో సమావేశములో బాగా సేవచేసి కార్మికులను అర్థము చేసుకోవాలనుకునే మతాచార్యులకు ఇంతకంటె మంచి సన్నాహములు చేయలేము. కార్మిక ఉద్యమముయొక్క స్వభావము, పనిచేయువారి సమస్యలు అర్థం చేసుకొనుటలో విశాలభావన, లేనటువంటి సభ్యులు కలిగిన మధ్యతరగతి నగరచివరి ప్రజలకు సేవచేయుటకు పూనుకొను మతాచార్యుల విషయంలో కూడా పైనచెప్పినదే వర్తించును.

## పరిచయం చేసుకొనుట.

పరిశ్రమలో పనిచేసి ముఖ్యమైన అనుభవములు పొందడంద్వారా, పైన చెప్పిన సాంఘిక విద్య చర్య మొదలైన వివిధ పద్ధతులుద్వారా, వివిధ వర్గాలనుంచి ఏర్పడిన చర్చ చర్యా వేదికలవంటి చిన్నవిషయములద్వారా, పరిచయంవల్ల ఏమిజరుగునో అన్న భేదము మనం పరిశీలిస్తే చాలా ఆశ్చర్య

కరముగ నుండెను. మా తూర్పునగరములలో తేనె విద్యుక్త ధర్మములలో ఒకటిగా, ఒక కర్మాగారమును సంఘటితపరచుటకు, ఒక యువ కార్మిక నాయకుడుచేసిన ప్రయత్నము ఒక స్పష్టమైన ఉదాహరణ. కొంత కాలము తరువాత, చర్చి ప్రజల సభముందు కార్మిక సమస్యలగురించి ఒక ఉపన్యాసము చివరలో, ఒకయజమాని లేచి, అతని అభిప్రాయములలోని న్యాయము తెలివికి అతనిని అభినందించి యీ విధముగా అనెను. 'నీలాగే అందరు కార్మిక నాయకులుఉంటే వాటిలో ప్రవర్తించుట మాలాంటివారికి కష్టము కాదు' తర్వాత తన ఉద్యోగులను సంఘటితపరచడానికి ఒక విప్లవవాది, బాధ్యతలులేని మూర్ఖుడైన ఒక అమెరికనుకాని అలజడిదారుడు ఏవిధముగా ప్రయత్నించెనో అతను వివరించెను. ఆ యజమానియొక్క ఆశ్చర్యము మితిమీరునట్లు, తానే ఆ విధముగా వర్ణిస్తున్న కార్మికనాయకుడనని, ఆ యువకుడు చెప్పెను. ఇక్కడ ఒక ఐరిష్ మనిషికథ ఒకటి జ్ఞాపకమునకు వచ్చును. "వీధిలో ఒక చెరొనరుకువాడు వచ్చువట్లుచూశాను. అతను నాకు తెలుసునను కున్నాను. అతనుకూడా నేనుఅతనికి తెలిసినట్లు నావైపు చూచెను. కాని మేము యిద్దరము దగ్గరకురాగానే ఒకరికొకరము మాకు తెలియదు." అని ఆ ఐరిష్ మనిషి అనెను.

ఒకరనొకరు తెలుసుకొనక పోవుటవలననే, యజమానులు, కార్మికులు, వ్యవసాయదారులు, జాతివర్గములుమధ్య, చెప్పలేనంత దిగ్భ్రమ ఉండును. ఒక మనిషితో తనకున్న భేదాభిప్రాయములవలన, స్వయంగా కలుసుకొని మాట్లాడడానికి చార్లెస్ లాంబ్ ఒకసారి నిరాకరించెను "అతనిని నేను నిజముగా తెలుసుకొనుటకు ప్రయత్నించుచో, అతనిని యిష్టపడవలసివచ్చే పరిస్థితి ఏర్పడునని నాకు భయముగాఉన్నది." అని లాంబ్ అనెను. అన్ని విషయములలోను, కార్మిక నాయకులందరూ సమానముగా తెలివైన వారని, న్యాయబుద్ధి కలవారని అనటంలేదు. అదేవిధంగా, యజమానులు కాని, తదితర ఆర్థిక వర్గములకు సంబంధించిన సభ్యులుకాని, యీ ఉన్నతలక్షణాలు ప్రదర్శించగలరనికూడా చెప్పలేము. అన్నివర్గముల ప్రతినిధులతో వ్యక్తిగతపరిచయము ఒకరినొకరు అర్థముచేసుకొనుటలో, పరస్పరగౌరవము పెంపొందించుకొనుటలో ఆశ్చర్యకరమైన మంచిపరిణామము ఏర్పడును ఈ మధ్యవర్తిత్వసేవతప్ప, యింతకంటె సముచిత పటిష్ఠపద్ధతి చర్చి వర్గములకు

లేదు. కొందరు వ్యక్తులకు ఒకరినొకరు కలుసుకునేటట్లుచేయు మతాచార్యుడువలెకూడా యిది సాధ్యపడగలదు ”

## ఆధ్యాత్మిక నైతిక సలహాలు.

నిజంగా, శీలనిర్మాణము చర్చిపనులలో చాలా ముఖ్యమైనదిగా యుండును. తదితరవర్గములవలెనే, వ్యక్తిగత శీలము, ధైర్యము, నీతి నిస్వార్థము, ఓరిమి, న్యాయము, తక్కువ హక్కులు కలవారి విషయమై శ్రద్ధ మొదలగునవి పెంపొందించుటలో కార్మిక నాయకులు సంఘసభ్యులు కూడా మతసంబంధమైన ఆధ్యాత్మిక మతాచార్యత్వము పొందవలెను. చర్చి సహకారసంస్థ లేక ఇతరలాభములకోరనిసంస్థ విషయములోనైనా కార్మిక సంఘములోవలెనే, లాభముకోరిక ఒకటే వీలుపడి కనిపించే ప్రభావము కాదని క్రమముగా పరిశోధనవలన తెలియుచున్నది. పరపతికోరిక, పదవి కోరిక - ఈ రెంటివలన, మంచిలక్ష్యమునకు ముందుగా తమకోరిక, పదవి ఉంచుటకు ప్రయత్నించునపుడు ఆ వర్గముయొక్క నైపుణ్యము శాంతి సాధారణముగా వినాశముచేయుచు వ్యక్తిగత మతభావన, గర్వము స్వార్థము లేకుండా సహాయపడి, వర్గములలోవలెనే సంఘములలోకూడా అంతర్గతశాంతిని పెంచును. ముందుచేయుటకు తమకు హక్కులేకుండా, నైతికసలహాలుయిచ్చు పనిమాత్రమే తమముఖ్యకర్తవ్యమని మతాచార్యులు, చర్చిమనుషులు అనుకొనుటకూడా ఉన్నది ‘సహాయము చేయుడానికి ఎవరికి హృదయమున్నదో అతడే విమర్శకూడా చేసేహక్కుపొంది వున్నవాడు’ అని వారు జ్ఞాపకము చేసుకొనవలెను.

సంఘటిత కార్మికుల లోపములు ఊరికే విమర్శించేకంటే, వేతనములు సంపాదించే తమచర్చి సభ్యులను సంఘములలో చేరమని వారితప్పులు తెలిసినను, మతాచార్యులు ముఖ్యముగా కోరవలెను అప్పుడే సంఘములో లోకల స్థాయిలలో నిర్మాణాత్మక, నీతివంతమైన విధానములతో పనిచేయవలెను.

## ప్రపంచము గుర్తింపలేనిది.

చాలామంది మతవర్గములు, వ్యక్తులుకూడా వ్యక్తిగతమతము, సాంఘిక ప్రయోజనముయొక్క సంబంధములు అర్థముచేసుకొనుటలేదు పెద్ద పెద్ద

చెడులను ఖండించకుండా, నీతిలోని చిన్న చిన్న సమస్యలపై వారు తరచు ఉద్ఘాటిస్తుంటారు. అందుచే సంఘసంస్కరణకు సహాయము చేయలేకపోతున్నారు. హిట్లరు, త్రాగడని, సిగరెట్టు పీల్చడని, కొంతమంది జర్మను క్రైస్తవులు అతన్ని మొదటిదినములలో ఆరాధించుటయే. నైతికతీర్పు విషయంలో అసందర్భమైనట్టి దానికి ఒక భయంకరమైన వార్నింగు. జీసస్ చెప్పినట్లు, చిన్న ఈగను కక్కి ఒ ఒంటెను మింగే ప్రమాదము ఎప్పుడూ ఉన్నది. ప్రపంచము చేత గుర్తింపుకోరని మత తత్వవాదులు యింకా ధైర్యముగా చైతన్యవంతముగా పౌరవ్యవహారములందు, సంస్థలలో, (కార్మిక సంఘములు కలుపుకుని) రాజకీయపార్టీలలో, ప్రపంచశాంతి, జాతిసమానత్వముకోరే ఉద్యమములలో, పాల్గొన్నచో, మానవసమాజమునందు, దాన్ని కలుషితము చేయగలుగు లంచగొండితనంవంటి మచ్చలు చాలా కొద్దిగావుండును.

జర్మనీ, తదితర యూరోపు ప్రాంతములలో, కొన్ని క్రైస్తవాలయములు చాలా మితిమీరిన దృష్టికలిగి, నిజమైన కాథలిక్, ప్రొటెస్టంటు, వృత్తి సంఘములే స్థాపించినవి. అమెరికాలో కాథలిక్కులు, ప్రొటెస్టంట్లు, కార్మిక ఉద్యమమును ఈ విధముగా యింకా చీల్చకుండా తెలివిగా తప్పుకున్నవి. పైగా, తమ చర్చి సభ్యులను చైతన్యవంతముగా అందులో పాల్గొనమని చెబుతూ నైతిక ప్రమాణములు పెంచుటకు యిద్దరూకూడా ప్రయత్నించిరి.

కాథలిక్ వృత్తి సంఘవాదుల సంస్థలు, కాథలిక్ కార్మిక స్కూళ్ళుఎన్నో అభివృద్ధి చెందినవి. ముఖ్యంగా స్కూళ్ళు, కాథలిక్కులను, కార్మికచరిత్రలో ప్రజాసభలలో ఉపన్యాసమిచ్చుటలో, పార్లమెంటరీ శాసనవిధానంలో, మంచి సంఘఆచారములు తెలియజేయుటలో మంచి పాఠములు యిచ్చుచుండెడివి. ముఖ్యమైన ఉదాహరణగా న్యూయార్కులోని జేవియర్ కార్మికస్కూలును చెప్పవచ్చును. లోపలినుంచి సంఘ ఉద్యమము ఎలా బలపరచాలా అన్నదానికి హృదయపూర్వకంగా పనిచేయు సంఘవాదులు ఏవిధంగా సహాయపడగలరను పద్ధతులుపై తమ చర్చిలోని సభ్యులనుకూడా, మహాసభను, ఏర్పరచి కొన్ని ప్రొటెస్టంటు చర్చిలు నిర్వహించుచున్నవి. పారిశ్రామిక ప్రాంతములలో అనేక క్రైస్తవాలయములు, కార్మికులకు విద్య,

తదితర కార్మిక కార్యక్రమములు, నిర్వహించుచున్నవి. అందులో, గ్రేస్ కమ్యూనిటీ చర్చి, డెన్వరు; న్యూయార్కులోని లేబరు టెంపుల్; చికాగోలోని ప్రెసిబిటేరియన్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ ఇండస్ట్రియల్ రిలేషన్సు ముఖ్యములు.

మతాచార్యులు, సాధారణ పురుషులు, స్త్రీలు, కార్మిక సమస్యలగురించి తమ మానవ అవగాహన ఋజువుచేసుకొన్నప్పుడు, ప్రజాసామాన్యములో తమ స్వంతనిస్వార్థ, ధైర్యవంతమైన ఆసక్తిని ప్రకటించుకొన్నప్పుడు, ఎప్పుడూ ఆహ్వానింపబడి స్వాగతముపొందిన, కార్మికులకు ప్రతిభావంతమైన సలహాదారులుగా ఉండగల్గుదురు. యజమానుల కార్మికులమధ్య, అటువంటి పరిస్థితులలో, మత నాయకులు నిష్పాక్షికచర్యలయొక్క ఉన్నత ప్రమాణములు పెంచుటలో సాయముచేయగలరు. సహకార కామన్‌వెల్తు, క్రొత్త ప్రపంచవ్యవస్థ లక్ష్యమువైపు శాంతియుతముగా పురోగమించుటకు కార్మిక ఉద్యమమునకు దారిచూపగలరు. కాని ఆ వ్యవస్థలో ప్రజాస్వామ్యము, మతముయొక్క ఆశయములు, మానవుడి విశాలసోదరత్వమునందు సంపూర్ణమైన భావప్రకటన చివరకు పొందవలెను.

KARMIKULA GURINCHI NEEKEMI THELIYUNU ? (Tel.)
(What Do You Know About Labor?)

# కార్మికుల గురించి నీ కేమి తెలియును?

మన దేశభాషల్లో కార్మికుల గురించిన సారస్వతం చాలా తక్కువ. కార్మికుల జీవితం, కార్యకలాపాలు, ఆశయాలు అర్థం చేసుకోటానికి ఇట్టి సారస్వతం ఎంతైనా అవసరం.

వివిధ దేశాల కార్మికుల స్థితిగతులను, జీవితాన్ని కార్మిక సంఘాలను, కార్మికులపట్ల ప్రభుత్వం, ప్రజల వైఖరులను తెలుసుకోవటం, మంచిని గ్రహించడం ఎంతేని అవసరం. ఈ పుస్తకంలో వివరింపబడిన ప్రపంచంలోని ఒక ప్రముఖ ప్రజాస్వామ్యదేశ కార్మికవర్గపు జీవన విధానంనుంచి పాఠకులు ఎంతో గ్రహించగలరు.

ఇంగ్లీషులో మైర్స్ లెయిడ్లర్ వ్రాసిన గ్రంథాని కిది శ్రీ పోతుకూచి సాంబశివరావుగారి సరళానువాదం.

---



పబ్లిషర్సు : అద్దేపల్లి అండ్ కో
సరస్వతీ పవర్ ప్రెస్
రాజమహేంద్రవరము



# మనసు ఫౌండేషన్

## పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | RCHB02P500 |
| పుస్తకం పేరు | [illegible] |
| తారీఖు | 12/03/24 |
| ముందు అట్ట | yes |
| వెనుక అట్ట | yes |
| మొత్తం పేజీలు | 231 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | CP, 221 |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | lakshmi |
| పేజీలు విడదీసినది | lakshmi |
| స్కాన్ చేసినది | Heena |
| పరీక్ష చేసినది | NANDINI |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| స్కాన్ చెయ్యనివి | |
| తప్పులు | NO |
| పరిస్థితి | good |